*Madras University Telugu Series No. 14*

# THE SOUTHERN SCHOOL IN TELUGU LITERATURE

BY

N. VENKATA RAO, M.A.,

(Head of the Department of Telugu)



UNIVERSITY OF MADRAS

1954

మదరాసు విశ్వవిద్యాలయాంధ్ర గ్రంథమాల సం. ౧౪.

# దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము

నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ.

అధ్యక్షుఁడు - తెనుఁగు పరిశోధనశాఖ

ప్రాచ్యవిద్యాసంస్థ




మదరాసు విశ్వవిద్యాలయము

౧౯౫౪

# PREFACE

The present publication entitled "The Southern School in Telugu Literature" is one of the research works undertaken by me in the University. The subject itself is a new field of investigation. The literature which developed in the southern parts where Tamil is the spoken language, *i.e.*, Tanjore, Madura, Pudukottai, Salem and Uraiyur is known as the Southern School in Telugu literature. It includes Mysore also. This school of literature flourished under the patronage of Telugu Nayaks and their subordinates during the 17th and 18th centuries. It is a peculiar phenomenon that even the Maratha rulers of Tanjore have patronised Telugu, which was neither their own language nor that of the people who were under their sway. The present great manuscripts library at Tanjore is known as "The Tanjore Maharaja Serfoji Saraswathi Mahal Library" in the name of the Maratha king, and it contains many works relating to the Tanjore and Madura Nayaks hitherto unknown to the Telugu literary world.

The following observations of well-known South Indian historians, reveal the fact that Telugu literature and culture flourished extensively in those parts:—

"It is a sad contrast to find comparatively little of Tamil literature during the Maratha period, the literature of the bulk of the people. There was a revival of Sanskrit and Telugu, but not of Tamil. The new dynasty continued the Naika legacy and cared as little for Tamil as its predecessors. But Tamil continued to be patronised by Mutts." (The Maratha Rajas of Tanjore—Dr. K. R. Subramanian, M.A., Ph.D., 1928 pp. 84-85)

"The rule of a Telugu dynasty over a Tamil kingdom with such cultural and other benefits to the land, is indeed a most striking and creditable feature, in the history of South India and forms a most pleasing epoch of vigorous and continuous cultural growth." (Prof. C. S. Srinivasachari—Introduction to the work—Nayaks of Tanjore by Vriddhagirisan—page XIV.) Annamalai University Publication.

Many of the works relating to this Southern School are valuable sources for the history of Telugu Nayaks and the Telugu subordinate chiefs under them. Since Telugu is the Court language there are Telugu inscriptions issued by the Nayak kings and their subordinates in the heart of the Tamil land. But none of these were taken into consideration in the histories already published on the subject. In Mysore there are more than three hundred inscriptions in Telugu issued by the Rulers' subordinates. All these throw a great light on the political, social and religious conditions of South India in the 17th and 18th centuries and are worthy of investigation. As a sequal to the present work, I am bringing out another work in English embodying the results of latest researches on the subject, bringing out all the historical data, according to Telugu sources.

Many problems that now confront the Southern historians regarding this period can be easily solved by a thorough investigation of the Southern School. In 1949 I was appointed as an Expert Gommittee Member for selection of Telugu Manuscripts by the Government, both for the Madras Government Oriental Manuscripts Library and Tanjore Saraswathi Mahal Library. This afforded great facilities to complete the work.

I have endeavoured to gather all the necessary information relating to this literature from the available sources and mention was made of all the works and scholars both in the body of the work and in the bibliography

My thanks are due to the Syndicate of the University of Madras for having graciously sanctioned the publication of the work, and to Sri S. Govindarajulu Naidu Garu for having encouraged me to take-up the work as a part of my programme. I have to thank Sri N. S. Sundareswara Rao, Ex-Pandit, Government Oriental Manuscripts Library, Madras, for the assistance rendered to me in the completion of the work.

N VENKATA RAO.

# THE SOUTHERN SCHOOL IN TELUGU LITERATURE

Articles—Reference Books—(English)

1. Cavelly Venkata Ramaswami—Sketches of the Deccan Poets, 1829.
    (1) Kuppanakavi (Andhra Kalidas).
    (2) Govindakavi.
    (3) Mudduranganath.
    (4) Bappana Kavi (Ganapavarapu Venkatakavi Andhra Prayogaratnakaramu).
2. *The Southern School in Telugu Literature*—J. Ramayya Pantulu, B.A., B.L. Journal of the Andhra Historical Research Society, Rajahmundry, Vol II Nos. 3 & 4 pp. 169—177—1928
3. *The Southern School in the History of Telugu Literature*—Chenchiah and Bhujanga Rao—pp. 91—96. *Heritage of India Series*—1930.
4. *The Tanjore Saraswathi Mahala Library and its importance*—P. Lakshmikantam, M. A. Hindu (17-1-1932.)
5. *Introduction to the Descriptive Catalogue of Telugu Manuscripts in the Tanjore Maharaja Serjoji Saraswati Mahal Library*—pp. 1—13. Dr. P. P. S. Sastri—Andhra University Publication—1933.
6. *Telugu Literature under the Naik Kings of Madura and Tanjore*—C. Satyanarayana, M.A., (Research Scholar in the Madras University—1935-36.
7. *Telugu Literature outside the Telugu Country*—K. Ramakrishnaih, M.A. Annals of Oriental Research, University of Madras—Vol V pp. 1—38 pages 1 to 25 dealing with literature—1941.
8. *Telugu Literature under Madura Nayaks*—N. Venkata Rao, M.A. Journal of the Andhra Historical Research Society—Vol. 17 Nos. 1—4 pp. 113—148.

    *Telugu Literature under Pudukkota Rulers*—N. Venkata Rao, M.A Appended to introduction to Khadga Lakshna Siromani—Madras Government Oriental Series 1950.

B

9. *Telugu Literature under Vijaya Raghava Nayaka*— N. Venkata Rao, M.A. Introduction to *Rajagopala-vilasamu* of Chengalva Kalakavi 1951.

10. *Telugu Literature under Mysore Rulers and their Subordinates*—N. Venkata Rao, M.A. Annals of Oriental Research, University of Madras—Vol. X 1952-53—pp. 1-41.

## WORKS

1. Vijayavilasamu—A critique in English by late Dr. C. Narayana Rao, M.A., Ph.D.

*History*—Works consulted.

(1) Sources of Vijayanagar History—S. K. Iyengar—Madras University Publication 1919.

References relating to the works of Southern School (Telugu works).

No. 38. *Rayavachakamu*—pp. 118-129.

| | | |
|---|---|---|
| 85. | *Raghunathabhyudayamu*— 110 lines (Introduction) | pp. 254-266 |
| 86. | *Kammavarivakkana* 108 lines | |
| 87. | *Regarding palaces* 50 ,, | |

Tanjavuri Andhra Rajula Charitra — pp. 327-336.

(2) The Nayaks of Madura—R. Satyanatha Iyer, M.A , L.T. Madras University Publication 1919.

(3) The Marata Rajahs of Tanjore—Late Dr. K. R. Subrahmanian.

(4) The Nayaks of Tanjore—V. Vriddhagirisan, M.A., M.Litt, Annamalai University Historical Series No. 3.

(5) Introduction to Raghunathabhyudayamu and Raghunathanayakabhyudayamu—Dr. N. Venkata Ramanayya, M.A., Ph.D.

(6) The Salem District Gazetteer.

(7) The Trichinopoly District Gazetteer.

# పీఠిక

మదరాసు విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధన సంస్థయందు తెనుఁగుశాఖకు నిర్ణీతమైన ప్రణాళికలో దక్షిణాంధ్రవాఙ్మయ చరిత్ర రచన మొకటి. ఈ వాఙ్మయమునుగూర్చి యిదివరకు కొంత పరిశ్రమ జరిగినను నది వ్యాసరూపములుగను, గ్రంథపీఠికా రూపములుగను నానాముఖముల వికీర్ణమై యసంపూర్ణముగ నున్నది. అట్లున్న వాఙ్మయమునకు సంబంధించిన విషయములనన్నింటిని నేకముఖముగా సమకూర్చి యీ చరిత్రమునకు నొక సమగ్రత్వము నాపాదించుటకై నేనీ పరిశోధనకుఁ గడంగితిని. ఈ గ్రంథమా పరిశోధనాఫలితమే.

ఈ గ్రంథరచనమున నాకుపకరించిన గ్రంథములను, వ్యాసములను తద్రచయితలను గ్రంథసూచికలోను గ్రంథమధ్యమునను, నావశ్యకత కలిగినపుడెల్ల నుదాహరించితిని. నాకంటె ముందుగా దీనినిగూర్చి పరిశ్రమించిన పరిశోధకుల కెల్లరకు నిందుమూలమున నాకృతజ్ఞతను వెల్లడించుచున్నాను.

దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయయుగము కొన్ని ప్రత్యేకలక్షణములను కలిగి యున్నది :

1. రాజకవులు బ్రాహ్మణేతరకవులును హెచ్చుగా వర్ధిల్లుట.
2. కవయిత్రులకు సాహిత్యరంగమున ప్రత్యేకస్థానార్హత కలుగుట.
3. ద్విపద యక్షగాన నాటకశాఖలు వర్ధిల్లుట.
4. వచనవాఙ్మయము సక్రమపరిణామమునందుట
5. సంగీత సాహిత్యసమ్మిళితములగు, గేయపదరచనలు ప్రవర్తిల్లుట.
6. ప్రబంధరచనమున విశృంఖలశృంగార రసభావనా వ్యాప్తి.

7. సాంత్వనకావ్యరచన.

8. నాయకాభ్యుదయరచన.

9. ఉదాహరణ, చారిత్రకమాలికారచనము.

10. శాస్త్రీయగ్రంథములు: నిఘంటు, మల్లుపురాణము, ఖడ్గలక్షణము ప్రాముఖ్యము వహించుట. సాహిత్యముతోపాటు సంగీతమును రాజాదరణపొంది, యా శాస్త్రమునకు సంబంధించిన గ్రంథములు వెలువడుట.

కేవలము సాహిత్యపరిణామ దృష్టినేకాక భాషాపరిణామ దృష్టినికూడ నీ యుగము విశిష్టమైనది. అన్యభాషాపదములు ధారాళముగా కవివ్యవహారములోనికి వచ్చినవి. ఈ యుగమునందలి కవులు వ్యాకరణవిరుద్ధములగు ప్రయోగములను గావించిరనియు, వారు లాక్షణికులుకారనియు కొందఱియభిప్రాయము. కాని శివకవియుగమునందువలె భాషసజీవమై, సహజపరిణామమును సూచించుచున్నది. మఱియు వ్యవహారములోని పలుకుబడులు, జాతీయములు, చమత్కారములునుకలిగి నాఁటిరచనలు భాషావ్యవస్థకు ప్రతిబింబితములై యున్నవి.

ఈ యుగమునందు ప్రవర్తిల్లిన సాహితీసంస్కృతులను సంపూర్ణముగా తెలిసికొనుటకా కాలమునందలి కొన్నిగ్రంథము లింకను ప్రకటితములు కావలసియున్నవి. ప్రకటితములైన వానినిగూర్చి వేఱ్వేరుగా కూలంకషవ్యాసంగము జరుగవలసియున్నది. ఆ నాఁడే యీవాఙ్మయ విశిష్టత, దక్షిణదేశమున వెలసిన ఆంధ్రసంస్కృతి ప్రత్యేకత సమగ్రముగా గోచరింపఁగలవు. విమర్శకులును, భావిపరిశోధకులును నీ కార్యమునకు గడంగుదురేని నాయీయల్పపరిశ్రమ సఫలము కాఁగలదు.

నిడుదవోలు వేంకటరావు.

# విషయసూచిక

# దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము

## అవతారిక

ఆంధ్రవాఙ్మయ చరిత్రమున క్రీ. శ. 1600 నుండి క్రీ. శ. 1775 వరకును వర్ధిల్లిన వాఙ్మయ యుగమును "దక్షిణాంధ్ర వాఙ్మయము" అను పేర వాఙ్మయ చరిత్రకారులు వ్యవహరించుచున్నారు. ఈ యుగముయొక్క స్థానమును, ప్రత్యేకతను నిరూపించుటకు ముందుగా నీ యుగమునకు పూర్వమందు [1] వెలసిన వానినిగూర్చి తెలిసికొనవలసి యున్నది. ఆ యుగములు లివి :

| | | | |
|---|---|---|---|
| 1. నన్నయ పూర్వయుగము | క్రీ. శ. | 800-1000 | తూర్పు చాళుక్యులు. |
| 2. నన్నయ యుగము | ,, | 1000-1100 | |
| 3. శివకవి యుగము | ,, | 1100-1250 | చోళులు. |
| 4. తిక్కన యుగము | ,, | 1250-1330 | కాకతీయులు. |
| 5. ఎఱ్ఱాప్రెగ్గడ యుగము | ,, | 1330-1400 | 1. రెడ్డి రాజ్య స్థాపన. 2. విజయనగర రాజ్యస్థాపన. రెడ్డి రాజుల యుచ్ఛదశ. |
| 6. శ్రీనాథ యుగము | ,, | 1400-1500 | |
| 7. కృష్ణరాయ యుగము | ,, | 1500-1600 | విజయనగర రాజుల యుచ్ఛ్రియదశ. |
| 8. దక్షిణాంధ్ర వాఙ్మయ యుగము | ,, | 1600-1775 | నాయక రాజ పరిపాలన. |

1. చూడుఁడు తెనుఁగు కవుల చరిత్ర. మదరాసు విశ్వవిద్యాలయ ప్రకటితము (1953) పుట 2-4.

పై వానిలో ప్రధానముగా యుగముల పేళ్లన్నియు యుగకర్తలైన ప్రసిద్ధ కవుల నామములతో వెలసినవి. ఒక్క శివకవి యుగమునకు మాత్రము ప్రత్యేకముగ నా కాలమున ప్రచుర ప్రచారమును గాంచిన వీర శైవమత వాఙ్మయమును ననుసరించి యీ నామకరణము చేయ బడినది. మత వాఙ్మయముల ననుసరించి కవుల పేర నా యుగ మెట్లు వ్యవహరింపబడినదో, ఆ రీతిగనే, వాఙ్మయము వర్ధిల్లిన ప్రదేశములను బట్టి యీ యుగము "దక్షిణాంధ్ర వాఙ్మయము" అని వ్యవహరింప బడినది. దేశకాలపాత్రము లనియెడి యుపాధులలో మిగిలిన యుగ ములు పాత్రల ననుసరించి ప్రాధాన్యత బడయగా నీ దక్షిణాంధ్ర యుగము దేశము ననుసరించి ప్రత్యేక ప్రాధాన్యతం బడసినది. ఏల ననగా నింతకుముందు వెలసిన వాఙ్మయమంతయును శ్రీశైల కాళే శ్వర దాక్షారామముల మధ్యస్థమగు నాంధ్ర దేశముననే వెలసినది. ఇది తెలుఁగుభాష మాతృభాష గాఁగల తెలుఁగు దేశము. దీనికి దక్షి ణపు సరిహద్దు నేటి కర్నూలు మండలమున గల శ్రీశైల క్షేత్రము. దీనికి దగ్గఱగ దక్షిణ పశ్చిమభాగమున కర్ణాటప్రాంతమగు మైసూరును, దక్షిణ ప్రాంతమున ద్రావిడ దేశము లేక తమిళదేశమును గలవు. ఇది దక్షిణ భాగమునకుఁ జివరనున్న కన్యాకుమారి వఱకును వ్యాపించి యున్నది. ఇచ్చటిభాష తమిళము లేక యరవభాష. ఈ భాగము ననే, బహు ప్రాచీనకాలమునుండి ద్రవిడ నాగరికతకు జన్మస్థానము లైన, పాండ్య చోళ రాజ్యములు వర్ధిల్లినవి. అందు చోళ రాజ్యము నకు తంజావూరును, పాండ్య రాజ్యమునకు మధురయును ముఖ్య పట్ట ణములు. ఈ రెండు రాజధానులే కాక పుదుక్కోట, తురయూరు, సేలము, తిరునల్వేలి మొదలగు ప్రదేశములన్నియు నీ ద్రావిడ దేశము నకు సంబంధించినవే. కేవలము తమిళము మాతృభాష గాఁగల యీ ప్రదేశములలోనే గాక మైసూరు మొదలగు కన్నడ ప్రాంతములలో కూడ క్రీ. శ. పదునేడవ శతాబ్ది ప్రారంభము నుండియు వర్ధిల్లిన తెనుఁగు వాఙ్మయమునకే "దక్షిణాంధ్ర వాఙ్మయము" అని పేరు.

ఈ ప్రదేశములు తెలుఁగు దేశమునకు సుదూరమున నున్నను క్రీ. శ. 11–వ శతాబ్ది ప్రారంభమునుండియు నసఁగా తూర్పు చాళుక్య వంశీయుఁడగు శ్రీ రాజరాజ నరేంద్రుఁడు (1019-1061), తంజాపూరు రాజధానిగాగల చోళసామ్రాజ్య చక్రవర్తి రాజేంద్రచోడ చక్రవర్తి కూఁతురగు అమ్మంగదేవిని వివాహమాడిననాఁటనుండియు, రాజకీయముగ సంబంధములును రాకపోకలును తొలుత నేర్పడినవి. ఈ కాలముననే పెరిఆర్ రు, కావేరీతీర ప్రాంతములనుండి అరవలు రాజుయొక్క ఆహ్వానము ననుసరించివచ్చి, గోదావరీ తీరప్రాంతముల నివాసము గావించుకొనిరి.* శ్రీ రాజేంద్రుని వెనుక చోళరాజ్య ప్రతినిధులే సీ దేశమును పాలించుచుండిరి. కాని యా వెనుక, తెనుఁగునాటి నేలిన వెలనాటి రాజులయు, కాకతీయులయు కాలమున (1132-1323) నీ సంబంధము చాలవఱకు సడలినది. ఆంధ్ర భాషాపోషణము, ఆంధ్ర సంస్కృతి దేశమున విస్తరిల్లినది. కాకతీయ సామ్రాజ్య విచ్ఛిత్త్య నంతరమున క్రీ. శ. 1336 లో విజయనగర సామ్రాజ్య మేర్పడినది. హరిహరరాయల బుక్కరాయల కాలమున కుమారకంపన దక్షిణదేశముపై క్రీ. శ. 1356 లో దండెత్తి యీ ప్రదేశము వశపఱచుకొనెను. కాని క్రీ. శ. 1370 ప్రాంతములో మహమ్మదీయులు, దక్షిణ దేశముపై దండెత్తి శ్రీరంగనాథస్వామి దేవాలయమును కొల్లగొట్టునపుడు గోపన యను ప్రసిద్ధ దండనాయకుఁడు, శ్రీ వేదాంత దేశికుల నియోగమున వారిని తరిమి, వేఱొకచోటికి తరలింపఁబడిన శ్రీరంగనాథుని విగ్రహము తిరిగి యథాస్థానమున ప్రతిష్ఠఁగావించెను. ఇది తాత్కాలికమే. ఆంధ్ర నాయకత్వ మీ ప్రదేశమున ప్రవర్తిల్లనేలేదు. ఈ గోపనయే దక్షిణాంధ్ర వాఙ్మయముతో సంబంధించిన మొదటి తెలుఁగుకవి.

---

* వీరు, ఆరామములు లేక తోఁటలకు నిలయమైన, కోనసీమ ప్రాంతమునే నివాసముగ జేసికొనుటచే, వారిని ఆరామ ద్రావిడులని మనము వ్యవహరింతుము.

# గోపన - సింధుమతీ విలాసము

ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయమున గ్రం. సం. ౨౯౬౦ 'సింధుమతీ విలాసము' అను గ్రంథము గలదు. ఇది రెండాశ్వాసముల ప్రబంధము. దీనిని రచించిన కవి 'గోపనమంత్రి' యని యీ క్రింది గ్రంథాంత గద్యవలన తెలియుచున్నది.

"ఇది శ్రీ మదాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, నరసనామాత్యపుత్ర శ్రీ వేంకటేశ్వర కరుణాకవితా విలాస శ్రీ మత్ప్రతివాది భయంకర వేదాంత దేశికోపదేశ విమలీకృత శిక్షిత శ్రీమదష్టాక్షరీ మంత్రరాజ జపవిరాజమాన నిజహృదయ కమలకర్ణికార సుకవిజన విధేయ గోపన నామధేయ ప్రణీతంబైన సింధుమతీ విలాసం బను శృంగారరస ప్రధాన ప్రబంధంబున ప్రథమాశ్వాసము."

శ్లో. రోాయం సింధుమతీ విలాస మఖిలం శృంగార సంపత్కరం
వాచామంజుల్రద పీయకం సకుముదం నానావిధో ద్వాహకం
పశ్యన్సాధు జన స్సుకార్య రచనః కోవాతుమ స్వాపిచన్
బిందుర్వాయది గీతివా బహువిధాః పాత్రమ్మైవా యది.

పద్య రచన.

చ॥ కడు భ్రమఁజెంది గొంకుచు వికారము నొందుచు ఖిన్నమూర్తియై
పొడమిన నెవ్వ గన్విభుఁడు భూరి దయారహితాత్ముఁడైనఁదా
నడరెడు పద్మినీ ముదిత యందము నాఁబటు సాంద్రనాద మై
కడవడుఁ గేకి సంఘము కేకారవమంటె చెలంగె దిక్కులన్.

ఈ ప్రతిని ప్రమోదూతనామ సం॥ శ్రావణ బ॥ ౫ భౌమవారము సంపూర్ణముగా చందానాగలింగము వ్రాసికొనెను.

(ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారము సం. ౧౮౦ సంపుటము ౫ పుటలు ౩౯౬-౩౯౭.)

ఈ గోపన కవినిగూర్చియు, గ్రంథమునుగూర్చియు గోలుకొండ కవుల సంచికలో పూర్వకవి పరిచయము అను శీర్షిక క్రింద ౩౯౭ పుటలో నిట్లు వ్రాయబడి యున్నది.

"౩౪ గోపమంత్రి. ని. (నివాసము) గార్ల. కా. (కాలము) క్రీ. శ. ౧౨౦౦ ప్రాంతము) ర. (రచన) సింధుమతీ విలాసము. పద్య కావ్యము.

వి. విశేషములు. కవి భారద్వాజ గోత్రుడు. సింధుమతి యను వేశ్యకు జయుడను యువకునకు గల సంబంధము దెలుపు శృంగార కావ్యము. ఇందు సంస్కృతాంధ్రకవిత గలదు."

దీనినిబట్టి పైని యుదాహరించిన పరవస్తులోని గ్రంథమును, నిదియును నొకటియే యనియు, కవియొకడేయనియు, గ్రంథవిషయము కూడ నొకటియేయని మనకు స్పష్టమగుచున్నది. మఱియు గోపన కవి తెలింగానా ప్రాంతము వాడనియు క్రీ. శ. ౧౨౦౦ ప్రాంతము వాడనియుకూడ తెలియుచున్నది. కాని గద్యమందలి 'శ్రీమత్ప్రతివాది భయంకర వేదాంత దేశికోపదేశ విమలీకృత శిక్షిత శ్రీమదష్టాక్షరీ మంత్రరాజ జపవిరాజమాన నిజహృదయ కమలకర్ణికార' అను విశేషణ వాక్యమును చూచిన గోపనకవి విశిష్టాద్వైత మతమున ప్రత్యేక విశిష్టత గడించిన శ్రీ వేదాంత దేశికుల వారిచే స్వయముగా నుపదేశము నొందిన వైష్ణవాగ్రేసరుడనియు నాతడుకూడ శ్రీ వేదాంత దేశికుల కాలమువాడేయనగా క్రీ. శ. ౧౩౨౦ ప్రాంతము వాడనియు మనము నిశ్చయింపవచ్చును.

ఈ గోపన, విజయనగర సామ్రాజ్య స్థాపనమైన మొదటి ఘట్టములో, మహమ్మదీయులను దక్షిణదేశములో కాలు నిలుపకుండ యరికట్టిన చారిత్రక మహాపురుషుడు. ఈ క్రింది వివరించిన చారిత్రకాంశములవలన చారిత్రక పురుషుడగు గోపనయే సింధుమతీ పరిణయమును రచించిన కవియని నిశ్చయింపవచ్చును. ఇందులో నుదాహ

రింపఁబడిన శాసనములలోని విషయములు పై గ్రంథమునందలి గద్య లోని విషయములతో సమన్వయము లగుచుండుటవలన, ప్రాచీనాంధ్ర కవులలో గోపన యొకఁడని నిర్వివాదముగా తేలుచున్నది. మఱియు కృష్ణమాచార్యుల వెనుక యాంధ్రవైష్ణవ వాఙ్మయమున నితఁడు రెండవ వైష్ణవ కవియని యెన్ననగును.

దక్షిణదేశముపై క్రీ. శ. ౧౩౨౭ ప్రాంతమున మహమ్మదీయులు దండెత్తివచ్చి తొండమండలమును జయించి శ్రీరంగ క్షేత్రమును కొల్లగొట్టవచ్చినప్పుడు, ఆ దేవాలయమునందలి యర్చకులు శ్రీ రంగ నాథుని విగ్రహమును మైసూరి మండలముననున్న తిరునారాయణ పుర మను నామాంతరము గల మేలుకోటయందు కొన్ని దినములు భద్ర ముగా దాచిరి. ఆ వెనుక నా విగ్రహమును శ్రీ తిరుపతి క్షేత్రమునకు దీసికొనిపోయి శ్రీవేంకటేశ్వర స్వామితో నచ్చటనే నిత్య పూజాదిక ములను నెఱవేర్చుచుండిరి.

క్రీ. శ. ౧౩౩౬ లో విజయనగర సామ్రాజ్య మేర్పడిన వెనుక సంగమ వంశీయుఁడగు హరిహరరాయలు, తన సోదరుడును సైన్యాధి పతియు నగు వీరకంపరాయని మహమ్మదీయుల నివారించి తొండ మండలములను జయించుటకు పంపెను. ఈ వీరకంపరాయనికి సహాయ భూతులుగానున్న సేనానాయకులలో సింధుమతీ పరిణయ ప్రబంధకర్త యగు గోపన యొకఁడు. ఈత డాకాలమునాఁడు 'చెంజ్' దుర్గమునకు పరిపాలకుడుగా నుండెను. మధురనుగూడ వశపఱచుకొన్న మహమ్మ దీయులను కంపరాయడు జయించి[1], దక్షిణదేశాంతర్గతమగు పాండ్య, చోళ, రాజులను విజయనగర పాలనక్రిందికిఁ దెచ్చెను.

1. ఈ జయవృత్తాంతమే 'కంపరాయ చరిత్ర' లేక మధురా విజయము అను సంస్కృత కావ్యమున వర్ణితమైనది. కంపరాయని రాణులలో నొకతెయు, కమ నీయ కవయిత్రియునగు గంగాదేవి లేక గంగాంబ రచియించినది. ఇందులో సంస్కృత కవిస్తుతిలో తెనుగుకవి తిక్కయజ్వస్తుతి గలదు. ఈ కావ్యము క్రీ. శ. ౧౯౨౮ లో ముద్రితమైనది. దాక్షిణాత్య కవయిత్రులు రచియించిన కృతులలో నిదియు పరిగణింపఁదగినది.

చెంజిదుర్గమునుండి యొకనాడు గోపన సేనాని శ్రీ వేంకటేశ్వర స్వామిని దర్శించుటకు తిరుపతి క్షేత్రమునకు వెడలి అచ్చట వేంకటేశ్వర దేవుని ప్రక్కనున్న మఱియొక విగ్రహము గాంచి యప్పటి యర్చకులను ప్రశ్నించెను. వారును నది శ్రీరంగనాథుని విగ్రహమనియు, మహమ్మదీయుల బారినుండి తప్పించి, యచ్చట భద్రపఱచుచుంటిమనియు నాతనికి ప్రత్యుత్తరమిచ్చిరి. అంత గోపన, రంగనాథుని విగ్రహము తిరిగి శ్రీరంగమున పునఃప్రతిష్ట చేయుటకు వారియనుమతిని బడసి, యా విగ్రహమును, తిరుపతినుండి, తన రాజధాని యగు చెంజి దుర్గమునకు చేరువనున్న సింగవర గ్రామమున రాతి దేవళములో నిలిపెను.

ఇంతలో మహమ్మదీయులు శ్రీరంగము నాక్రమించుకొనిరి. కాని మహమ్మదీయ సైన్యాధ్యక్షుని కా ప్రదేశము సరిగా నుండకపోవుటచే, శ్రీరంగమును విడిచి యాతఁడచ్చట కాఱు మైళ్ళదూరమున నున్న సమయవరమును రాజధానిగా జేసికొనెను. తురుష్కులిట్లు దేవాలయ ప్రదేశమునుండి తొలగిపోవుట, కంపరాయలు మధురా పట్టణమును జయించుట, గోపన్న వైష్ణవభక్తి గలిగియుండుట శ్రీరంగమునందలి యర్చకు లెఱింగి, గోపన్నతో నుత్తరప్రత్యుత్తరములు జరుపుచుండిరి. గోపన్నయు సరియగు సమయము చూచుకొని, క్రీ. శ. ౧౩౭౧ లో బ్రహ్మాండమగు సైన్యమును గూర్చికొని, మహమ్మదీయులను పూర్తిగ నోడగొట్టి, సింగవరములో వేంచేసియున్న శ్రీరంగనాథుని విగ్రహమును, మహావైభవముతో శ్రీరంగమున ప్రతిష్ఠించెను.

ఈ మహాకార్యమున కత్యంతానందము నొంది, మహాప్రసిద్ధులగు శ్రీ వేదాంతదేశికులవారు గోపనను స్తుతియించుచు రెండు శ్లోకములను చెప్పిరి. అవి రెండును, శ్రీరంగము దేవాలయమున తూర్పు ప్రాకారమున శిలాశాసనరూపమున వెలయుచున్నది.[1] ఆ శ్లోకము లి॥. ఈ శాసనకాలము. "క్రీ. శ. ౧౩౭౧ స్వస్తి శ్రీ బంధుప్రియే శాకాబ్దే.

1. Ranganatha Inscription of Gopanna S S. 1293—Epigraphica Indica, Vol. VI No. 33, Pages 322-330.

౧. ఆనేయాం నీల శృంగద్యుతి రచిత జగ ద్రంజనా నాదంజనాద్రే
స్వేచ్ఛామారాధ్య కాంచిత్సమయ మయ స్తే హనుష్కాన్ తురుష్కాన్
లక్ష్మీక్ష్మాభ్యానుమాభ్యాం సహనిజ నిలయేస్థాపయన్ రంగనాథమ్
సమగ్వార్యం సమర్చ్యం కురుతనిజ యశోదర్పణో గోపణార్యః.

౨. వీఖేశం రంగరాజం వృషభగిరి తటాత్ గోపణ క్షోణిదేవో
నీత్వాస్వాం రాజధానీన్నిజబలనిహతోత్ సిక్తతౌలుష్క సైన్యః
కృత్వా శ్రీరంగభూమిం కృతయుగ సహితా స్తన్న లక్ష్మీ మహీభ్యామ్
సంస్థాప్యం సరోజేత్ భన ఇవకురుతే సాధుచర్యాంసపర్యామ్."

ప్రతివాది భయంకర బిరుదము ధరించిన వారిలో ప్రథములు వేదాంత దేశికులే. వీరు శతాధిక గ్రంథకర్తలై శతాధికముగ జీవించిరి. (క్రీ. శ. 1270-1332)

ఈ శాసనములోని మొదటి శ్లోకము గురుపరంపరా ప్రభావము అను తమిళ వైష్ణవ మతగ్రంథమున నుదాహృతమై యున్నది. మఱియును వైష్ణవ దేవాలయములను గూర్చి తెలుపు "కోయిలొలుగు" అను చారిత్రిక గ్రంథమునగూడ నీగోపన మహత్కార్యము విశదీకరింపం బడియున్నది. ఆ గ్రంథమున గోపన, శ్రీ రంగనాథుని ప్రతిష్ఠించు సమయమున నా దేవునికి ౫౨ గ్రామములను సమర్పించెనను విషయముగూడ గలదు.

గోపన యాంధ్రబ్రాహ్మణ నాయకుండైనను, ఆతడు ద్రవిడ దేశమునందు పరిపాలన మొనర్చుటచే నాతనిగూర్చిన శాసనము లరవ భాషలో నున్నవి. అచ్చారపాకము శాసనమున[1], గోపన బ్రాహ్మణుఁడు, ఆపస్తంబ సూత్రుడును, భారద్వాజ గోత్రుడు నైనట్లు తెలుపబడి యున్నది. కాంచీపురము శాసనములలో మూడింటియందు,

1, Epigraphical Report, (Achchara-pakam (No. 250 of 1901).

గోపన పేరొక్కనబడి యున్నాఁడు. అందొక దానిలో గోపనకు అయ్యన అను కుమారుఁ డున్నట్లు తెలియుచున్నది.[1]

ఇక 'సింధుమతీ పరిణయము' ముద్రితమై ప్రకటితమైనచో, నది యాంధ్ర సాహిత్యమున కొక యమూల్యాలంకారమే యగును.

సంగమ సాళువ వంశీయులైన వెనుక తుళువ వంశావతంసుఁడును విజయనగరసామ్రాజ్యాధీశుఁడును నగు కృష్ణదేవరాయలు క్రీ. శ. 1509 లో రాజ్య మధిరోహించిన వెనుక దక్షిణదేశము జయించి, ఆ ప్రదేశములలో తెనుఁగు నాయకులను పరిపాలకులుగా నియమించుటయే తెనుఁగు వాఙ్మయమానాట ప్రవర్తిల్లుటకు హేతువైనది. కాబట్టి దక్షిణదేశాంధ్రవాఙ్మయ మేర్పడుట రాజకీయపరిస్థితుల మూలముగనే యని గ్రహింపనగును. మధుర తంజావూరులలో నియమితులైన తెనుఁగు నాయకులు తమతోపాటు, తమ భాషను, తమ సంస్కృతిని, తమ పరివారము నచ్చటకు తీసికొనిపోయి, తెనుగు యశస్సును స్థిరము కావించిరి. పూర్వ మేనాఁడో తెనుగువారైన యాంధ్రులు మగధదేశమును పాలించిన విషయము మన కంతగా తెలియలేదుగాని, దక్షిణదేశమును పాలించిన ఆంధ్ర నాయకులకు మాత్రము, ఆంధ్రత్వము-ఆంధ్ర సంస్కృతి, ఆంధ్రసాహిత్యమును నాంధ్రేతర రాష్ట్రములయందు శాశ్వతముగ నిల్పిన కీర్తి దక్కినది.

శ్రీ కృష్ణదేవరాయనియుగమున తెనుగుభాష యుచ్చస్థితిని బొందినది. ఆయుగమున — తెనుగు రాష్ట్రభాష యేర్పడుటచే 'దేశభాషలందు తెలుగు లెస్స' యైనది. అట్టి రాయలయాస్థానమున మెలఁగిన

---

1. South Indian Inscriptions Vol. 1 (No. 86-88 & E. P. R. No. 33 of 1890.)

దొడ్డయాచార్యులవారి వేదాంతదేశిక వైభవ ప్రకాశికలో గోపనను గూర్చి యిట్లు గలదు :

శ్లో॥ జిత్వాతులుష్కాన్ భువిగోపణేంద్రో రంగాధిపమ్ స్థాపితవాన్ స్వదేశే।
ఇత్యేవమాకర్ణ్యగురుః కవీంద్రో హృష్టో భవద్య స్తమహం ప్రపద్యే.

నాయకులు, ఆ భాషాభిమానమే యాలంబనముగాగా తాము పాలించిన ప్రదేశములలో కవులను పోషించి, గ్రంథములు వ్రాయించి, తాము స్వయముగ కృతికర్తలై కృతిభర్తలై, ఆంధ్రవాఙ్మయ చరిత్రమున నొక ప్రత్యేకయుగము నేర్పఱచుటకు కారణభూతులైరి.

కృష్ణదేవరాయని యనంతరమున నచ్యుతదేవరాయల కాలమున (క్రీ. శ. 1530-42) దక్షిణదేశములో నిద్దరు తెలుగు కవులు రచనలు గావించి యచ్చటి నాయకులకు కృతి నిచ్చిరి. వారిని గూర్చిన వివరము లిచ్చుచున్నాను.

## ౧. భద్రకవి - లింగకవి

(క్రీ. శ. 1530-40)

శ్రీ కృష్ణదేవరాయల యుగమున నచ్యుతదేవరాయల కాలమున వెలసిన ద్విపద కవులలో నొకఁడగు నీ లింగకవి చరిత్ర మింతదనుక కవిచరిత్రల కెక్కలేదు. మఱియు నీతఁడు వీరశైవుఁ డగుటచే కేవల వైష్ణవ యుగమనఁ దగిన రాయల యుగములో ప్రసిద్ధుఁడైన యీ కవి కాల మెఱుంగుట యావశ్యకమే యగును.

వంశవృత్తాంతము :—ఈతఁడు రచించినవి రెండు ద్విపద కావ్యములు 1. దేవాంగపురాణము, 2. సానంద చరిత్ర. వీనివలన నీతని వంశవృత్తాంతము కాలము నెఱుకపడుచున్నవి. ఈతఁడు కూడలి సంగమక్షేత్ర నివాసి. ప్రసిద్ధ శైవభక్తుఁడగు దేవరదాసుమయ్య వంశీయుఁడు. రామయప్రభునికి నమలాంబకును పుత్రుఁడు. ఈతని వంశ వర్ణనము బట్టి చూడ నీతఁడు రాజ్యాధికారి యని తోఁచుచున్నది.

" ధరణిపై దేవర దాసయ్య వంశ
వరనిధి సంపూర్ణ వార్ధి చంద్రుండు
దురిత దూరుఁడు శివద్రోహరగండ
బిరుద ప్రతాప గంభీర వర్తనుఁడు

చరితార్థ చరితుండు సత్యసంధుండు
సరసుండు శివ ధర్మ శాస్త్ర కోవిదుఁడు
పరమశివజ్ఞాన భరితాత్ముఁడనఁగఁ
బరగిన రామయ ప్రభు కూర్మిసుతుఁడు".

(దేవాంగపురాణావతారిక)

" జంగమ కులవార్ధి చంద్రోదయుండు
లింగైకనిష్ఠా విలీన మానసుఁడు
... ... ...
భాసిల్లు రామయ ప్రభువరేణ్యుంకు
తనదుపాతివ్రత్య ధర్మమార్గమున
ననసూయ కెనయైన యమలాంబ వలన
గనిన పుత్రుఁడు భద్రకవి లింగ విభుఁడు "

(సౌనంద చరిత్ర యవతారిక)

ఈతని గురువు శ్రీ కాళహస్తి సంగమేశ్వరుఁడైనట్లు—

" చిరభవాంబుజ హస్తి శ్రీ కాళహస్తి
గురుసంగమేశ్వరు గొనియాడి పాడి "

అని తన గ్రంథములో జెప్పియున్నాఁడు.

కాలము :—లింగకవి తన దేవాంగపురాణమును రచియించు నాఁడు పడవీడున కధిపతియగు శ్రీ కాళహస్తీశుఁడను నొక మహాపురుషుఁడున్నట్లుగా నిట్లు చెప్పినాడు:

" భూనారికిని శిరోభూషణంబైన
మానిత ద్రావిడ మధ్య దేశమున
నడరు మర్త్య స్వర్గమగు మధుర రస
పడవీడు సకల సంపదలకు వీడు
ఇర వొప్ప కాళహస్తీశ్వరుఁడనెడి
పురుషాగ్రగణ్యుఁ డప్పురి కధీశ్వరుఁడు
పట్టణంబుల కెల్లఁ బరగిన తల్లి
పట్టణంబయినట్టి పడవీటి యందు ".

పైని పేర్కొనబడిన కాళహస్తీశ్వరుడు కృష్ణదేవరాయని వెనుక విజయనగర సామ్రాజ్యమును పరిపాలించిన యచ్యుత దేవరాయల కాలమువాడు (క్రీ. శ. 1530-1542). ఈతడా కాలమున పడవీడును పాలించుచున్న క్రింది శాసనములు కన్పట్టుచున్నవి :

ఉత్తరార్కాడు జిల్లా, దేవకీపురమున బృహదంబాదేవి యాలయమున శాసనములు.

శా. శ. 1452 క్రీ. శ. 1530, పడవీడు తిరుమలేశ్వరుని వసంత మండప నిమిత్తము భూదానము.

శా. శ. 1452-1530. దేవకీపురము దేవాలయము - ధర్మకర్తృత్వము (శ్రీ కాళహస్తి నాయకుడు)

శా. శ. 1454-1532. ఇందులో స్పష్టముగా కొండమ నాయకుడనువాడా కాలమున గొల్లలను దేవాలయమునకు సేవకై వినియోగించుటకు పడవీడును పాలించుచున్న కాళహస్తీశ్వర నాయకుని యనుమతిని బొందెనని కలదు.

శా. శ. 1454-1532 దేవాలయమునకు ప్రతిమగ్గముపైని ౧౧ పణములు పన్ను కట్టుటకు శాసనము. ఇందు కాళహస్తీశ్వరుడు పేర్కొనబడినాడు.

(E. P. Reports 1913 page 41, 45) Nos. 364, 374, 373, 3J7)

పై శాసనముల ననుసరించి లింగకవి యచ్యుత దేవరాయల కాలము వాడనుట నిశ్చితము.

కవిత్వము. కావ్యములు :—ఈతడు శివకవిగావున కృత్యాదిని పండిత త్రయమును పాల్కురికి సోమనాథుని, పిడుపర్తి బసవేశ్వరుని, శేషయోగీంద్రుని (నాగులూటి శేషనారాధ్యుడు పర్వత పురాణకర్త), రంగనాథుని స్తుతించి యున్నాడు. ఈతని కాలము క్రీ. శ. 1530

ప్రాంత మగుటవలన పిడుపర్తి బసవన, శేషయోగీంద్రుఁడు నను వారి కాలములు గూడ స్పష్టముగా దెలిసికొనుటకు వీలు కలుగుచున్నది. ఈతఁడు తన కవిత్వమును గూర్చి—

" తెనుగుకు నెఱవాది ద్విపదకు రాజు "

" వినుత శబ్ద బ్రహ్మ విద్యా నిరూఢి
ఘనత మించిన భద్రకవి లింగ విభుఁడ
రమణీయ శివకవి రాజన్య హృదయ
కమల మిత్రుఁడు భద్రకవి లింగ విభుఁడు
నెఱయ నాతని కంటె నేర్పరి గలఁడె "

అని తెలుపుకొనినాఁడు. మఱియు కృతిపతి తన్ను పిలిపించి,

" అనఘాత్మ ! సంతోషమయ్యెడి మాకు
మాకులమునకు నీ మహనీయచరిత
శ్రీకరాభరణమై చెలువుదీపించు
కావున దేవాంగఘన చరిత్రంబు
వావిరిద్విపద కావ్యంబుఁ గావింపు.
నగజాధినాథుఁ డున్నతకులదైవ
మగు రామలింగంబు నధిపతిఁ జేసి
స్థిరముగాఁ, గీర్తిమందిరముగాఁ బుణ్య
కరముగా, నవరసాకరముఁగాఁ, జారు
తరముగా, నర్థసుందరముఁగా, దురిత
హరముగా, జనమనోహరముగా ననుచు "

గ్రంథము సేయ నాజ్ఞాపించెను. ఈ ద్విపదకృతియు నట్లే మనోహరముగా నుండును.

దేవాంగపురాణము—ఇది యేడాశ్వాసముల ద్విపద కావ్యము. దీనికి మూలము బ్రహ్మాండ పురాణము. ప్రథమాశ్వాసమున దేవాంగ

ఋషి జననము దేవతా వస్త్రనిర్మాణము వర్ణితములైనవి. ద్వితీయాశ్వాసము నుండి ఆఱవ యాశ్వాసము వరకు నాతఁడు విద్యాధర, పుష్పదంత, బేతాళ, వరరుచి, దివసాళి దేవరదాసి యవతారముల నెత్తిన కథ వర్ణితము. సప్తమాశ్వాసమున దేవాంగకులమున జన్మము, కులప్రశస్తి చెప్పబడినది. దేవరదాసి జైనులను ఖండించి శైవమును పెంపొందించెను. ఈ గ్రంథము చివర కొమరేంద్రుఁడను నొక దేవాంగుని వంశక్రమము వర్ణితమైనది.

ఈ కృతిలో నింద్రజాల, రస, వైద్యాదివిషయములు పెక్కులు వివరింపఁ బడినవి. ఈ గ్రంథము ముదునూరి రామేశ్వరస్వామి కంకితము.

సానందచరిత్ర :— ఇది సానందుఁడను శివభక్తుని చరిత్రమును తెలుపును. మూఁడాశ్వాసముల కృతి. అరుణాచలమున కుత్తరముననున్న అరుణాద్రి మంగళ మను గ్రామముననున్న వీరభద్రయ్య యను జంగమదేవర కంకితము. ఈతఁడు సంగయదేవర కుమారుఁడు. ఈ ద్విపదరచనమునకును కోట శివరామకవిరచిత పద్య సానందోపాఖ్యానమునకు చాలచోట్ల పద సాదృశ్యము గలదు. లింగకవి శివరామకవికంటె ముందు వాఁడుకాన, ద్విపద గ్రంథమే పద్యమునకు మూలమని చెప్పనొప్పును.

ఈతని గద్యలు :— (౧) దేవాంగపురాణము :

“ ఇదివీరభద్ర మహిమప్రసాద
విదితసత్కావ్య ప్రవీణధురీణ
సంగమేశ్వరగురు చరణారవింద
సంగతగంధ పుష్పంధయమాన
ఘనయశోనిధి భద్రకవిలింగధీర
వినుతమాధుర్య వాగ్విరచితంబైన
ప్రకటదేవాంగ పురాణంబునందు
సకలంకముగ... ఆశ్వాసమయ్యె.”

ఈ గ్రంథమునకు వ్రాతప్రతి యొకటిగలదు. సంఖ్య 949 ఇది క్రీ. శ. 1879 లో ఆరాధ్యుల వీరేశలింగముగారిచే చెన్నపురిలో ముద్రితమైనది.

(౨) సానంద చరిత్ర :—

" ఇదివీరభద్ర శ్రీ హేలాప్రసాద
సదమలసత్కావ్య సందర్భకుశల
చిరపుణ్యశోభిత శ్రీకాళహస్తి
గురుసంగమేశ్వర కోమలచరణ
జలజాతగంధ పుష్పంధయమాన
కలితమానసభద్ర కవిలింగధీర
విరచితసానంద విమలచారిత్ర
మరుదైనభనలతాయతలవిత్రంబు
సకలపవిత్ర మీ సత్కథయందు
నకలంకగతిఁ దృతీయాశ్వాసమయ్యె."

పల్నాటి వీర చరిత్రమున కోళ్ల పోట్లాట రచించిన మల్లన తల్లిదండ్రులు అమలాంబ, రామన మంత్రి కౌండిన్య గోత్రులగుటచే లింగకవి తలిదండ్రులు కారని యెఱుంగునది. (ప్రా. సంఖ్య. డి 1112).

దీనికి వ్రాతప్రతులు తొమ్మిదిగలవు. అందు రెండు కాగితపు ప్రతులు. తక్కినవి తాళపత్రప్రతులు (సంఖ్య 1184-92) ఈ గ్రంథముగూడ క్రీ. శ. 1885 లో నారాధ్యుల వీరేశలింగముగారిచే ముద్రితమైనది. తంజావూరి పుస్తకశాలలో దీనికి నాలుగు తాళపత్ర ప్రతులు గలవు. సంఖ్య 364-367.

# ౨. పచ్చకప్పురపు తిరువేంగళకవి.

(క్రీ. శ. ౧౫౩౮-౪౦)

అచ్యుతదేవరాయల కాలమున ప్రసిద్ధుఁడైన యొక ద్విపద కావ్యకవి తిరువేంగళకవి. ఈతఁడు భట్టుకులజుఁడు. మనకు తెలిసి నంతవరకు భట్రాజులలో నితఁడు మొదటి కవి యని చెప్పవచ్చును. ఈతఁడు రచించిన చొక్కనాథచరిత్ర అను గ్రంథమునుండి యీతని వంశ వృత్తాంతమిది.

కృతిపతి యీతని గూర్చి ప్రస్తావించుచు—

" అనఘుండు మీ తాత యగు తిమ్మరాజు
తన తమ్ము డయ్యలు దాను నిమ్మహిని
ప్రౌఢుఁడై చదువులఁ బరగ మెప్పించె
ప్రౌఢ రాయలచేత పచ్చ కప్పురము
రాజనఁగా దిమ్మరాజుకుఁ దిప్ప
రాజుదయించె విరాజితమ్ముగను
రాజుల మెప్పించె రసికుఁ డాతని త
నూజుఁ డవార్య సన్నుత కవీంద్రుఁడవు "

అని చెప్పినాఁడు. తిరువేంగళుని తండ్రి తిప్పరాజు. అతని తండ్రి యగు తిమ్మరాజును నాతని తమ్ముఁ డయ్యలరాజును తమ విద్యా విశేషముచే ప్రౌఢదేవరాయలను మెప్పించి, పచ్చ కప్పురము బహుమతిగా బడసిన నాటినుండి వీరు పచ్చకప్పురము వారైరి. ఈ ప్రౌఢదేవరాయలు క్రీ. శ. ౧౪౨౨ నుండి ౧౪౪౬ వఱకు విజయనగర సామ్రాజ్యమును పాలించిన యిమ్మడి దేవరాయలు కాదగును. మనుమఁడు క్రీ. శ. ౧౫౩౮ ప్రాంతమున నుండుటచే, తాత క్రీ. శ. ౧౪౫౦-౬౦ ప్రాంతముననుండుట విరుద్ధము కాదు.

కాలము :—తిరువేంగళకవి తన చొక్కనాథ చరిత్రను నన్నె నందలి పురాధ్యక్షుఁడగు గోళ్ల పెద్దరామనాయకునికి కృతిగా రచించెను. ఈతఁడు గోళ్ల చిన్న రామనాయకుని యన్న. అన్న దమ్ము లిరువురును అచ్యుత దేవరాయ ప్రతాప కార్య ధురంధరులై దక్షిణ దేశమున రామనాడుజిల్లా యందలి తిరుపత్తూరి సీమను పరిపాలించు చుండెడివారు. వీరు కమ్మ కులస్థులు. బసవనాయకునికిఁ దిప్పమ్మ వలన జన్మించినవారు. పిప్పలగోత్రులు. సుప్రసిద్ధ మధ్వ మతాచార్యుఁడగు వ్యాసతీర్థుని శిష్యులు. వీరికి ఉపనూరి సింహములను బిరుదు కలదు. వీరిలో గోళ్ల పెద్ద రామనృపాలుఁడు అచ్యుత దేవరాయల పుణ్యమునకై క్రీ. శ. ౧౪౩౦ క్రీ. శ. ౧౫౩౮ లో విళంబి సంవత్సర దక్షిణాయన పుణ్యకాలమున తిరుపత్తూరు నందలి తిరుత్తలి నాయనారు దేవాలయమునకు శాంత మంగళ మను గ్రామమును దాన మొనర్చి శాసనము వేయించినాఁడు. (E P. 1790 of 35-36) దీని బట్టి తిరువేంగళకవి క్రీ. శ. ౧౫౩౮ ప్రాంతమున నున్నట్టు స్పష్టమగును.

చొక్కనాథ చరిత్రమున నీ క్రింది పంక్తులు పై వాని కాధారములు:

" చెలఁగుచు నుపనూరి సింహంబు పేర
పురుషోత్తమధ్యాన పూర్ణాత్ము పేరఁ
దగుగోళ్ల బసవేంద్రు తనయుని పేర
సుగుణాఢ్య పరసతీ సోదరు పేర
ఘనత స్వామి ద్రోహ గండని పేరఁ
జనరామ విభునికి జ్యేష్ఠుని పేర
దీపించు నచ్యుత దేవరాయ ప్ర
తాప దక్షిణ బాహు దండాంకు పేర
జతురత నీ కావ్య సారంబునకును
బతియైన పెదరామ పార్థివు పేర "

" అరుణాచలేంద్ర పూజామోద విభవ
భరమించు నన్న నందలి పురాధ్యక్షు
ప్రియబంధు వనచైత్ర పిప్పల గోత్ర

దయసత్య దాక్షిణ్య ధర్మ స్వరూప
తగ మించు వ్యాస తీర్థ ప్రియశిష్య
సుగుణాఢ్య పరసతీ సోదర చరిత
ఆయతోన్నత బాహు డచ్యుత దేవ
రాయ ప్రతాప కార్య ధురంధరుండ
అంచిత కొండమనాయంకర గండ
మించి వర్తించు స్వామి ద్రోహగండ
చే కొన్న సుపసూరి సింహధ్వజాంక
వాకిటి చిన్న భూవర సహితుండ
బరవ భూవర తపః ఫలసత్కుమార
వసుధ గల్గిన కమ్మ వంశ వర్ధనుఁడ
బాగొప్ప తిప్ప మాంబా దేవి గర్భ
సాగర సంభవ సంపూర్ణ చంద్ర
చిరకీర్తి యుతుఁడైన చిన్నరామప్ప
పురుష రత్నంబన పొగడంగ మించి
విలసిల్లు పెదరాము విభవస్ఫురామ. "

చొక్కనాథ చరిత్ర తొమ్మిది యాశ్వాసముల ద్విపద కావ్యము. ఇది స్కాందమున, మధురా ఖండమున, హాలాస్య క్షేత్రమున వెలసిన సుందరేశ్వరుని (చొక్కనాథుని) లీలలు ఉరను తెలుపు హాలాస్య క్షేత్ర మహాత్మ్యమునకు తెలుగు కృతి. దీనికి చౌషష్టి లీలా విలాస మను పేరు కూడ కలదు. తిరువేంగళకవి చెయ్యేటి దరిని (బాహుదానదీతీరమున) వెలసిన ఓరుగంటమ్మను, ఏకవీరాదేవిని స్తుతించినాడు. కవిస్తుతిలో,

" బిరుదు వేములవాడ భీము నన్నయను
అరయ దిక్కన నెఱ్ఱనార్యు శ్రీనాథు
నిలగల్గు కవులను నెల్ల సద్భక్తి "

వినుతించినాడు. ఈత డల్లసాని పెద్దనకు సమకాలీనుడగుటచే నాతని నుతింపలేదు. ఈ తరువాతి కవులు పెద్దనను పెద్దగా స్తుతిం

చిరి. కాని కృష్ణరాయ యుగమున నంతగా స్తుతింపలేము. తిరువేంగళ కవి గద్యలో చెప్పినట్లుగా—

" ఇది సర్వ ఘనసత్కవీంద్ర పాదాబ్జ
విదితపూజామోద విమలుండు, పచ్చ
కప్పుర సౌరభ్య కలితనామాంక
తిప్పరాజు సుపుత్ర తిరువేంగళేంద్ర
విరచితంబుగ లోక విఖ్యాతమైన
సరస లక్షణ కావ్య సత్కవీంద్రాభి
నందిత శ్రీ చొక్కనాథ చరిత్ర
మందును నిది నవమాశ్వాస మయ్యె "

ఈతని కవితయు పచ్చకప్పుర సౌరభ్యము గుబాళించుచున్నది. హాలాస్య మహాత్మ్యమును తెలుగులో చెప్పుటకు తిరువేంగళకవి తొలివాడు. ఈ ద్విపదకృతి వెలసిన తరువాత ౧౮, ౧౯, ౨౦ శతాబ్దములలో, దీనికి పద్య గద్య కృతులు వెలసినవి. మైసూరు దొడ్డరాజు దళవాయి యగు కళువె నంజరాజు దీనిని వచన కావ్యముగ రచియించి యున్నాడు. మల్లంపల్లి బుచ్చికవీంద్రుడును, వెంకటగిరి సంస్థానమున తిరుమలసెట్టి జగన్నాథ కవియు, శ్రీ కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రి శర్మయు పద్యకావ్యములు రచించిరి. పై వానిలో ద్విపద, వచన కృతులు ముద్రితములు కాలేదు.

గోళ్ల చిన్నరామప్పయు, నాతని యన్న పెద తిమ్మయ్యయు తిరుపతి వేంకటేశ్వరునికి తిరువీధి యుత్సవముల నిమిత్తము ౧౫,౦౦౦ పణములు శ్రీ భాండారమున కర్పించినట్లు తిరుపతిలో శాసనము గలదు. ఈ శాసన కాలము శక. ౧౪౬౨ శార్వరి (౩౧-౧౨-౧౫౪౦). ఈ శాసన కాలమున చినరామప్ప రామునాడు జిల్లా నుండి చంద్రగిరి రాజ్యమునకు నాయకుడుగా మార్పు బడెనని నివేదికయందు సూచింపబడినది.

(Epigraphical Report of T. T. Devasthanams-pages (౨౪౪-౨౪౫).

ఇందలి శైలి దెలుపుటకుఁ గొన్ని పంక్తుల నుదాహరించుచున్నాను—

"ద్వి. ఘనమైన యొక మహాకమలాకరంబు
పురుణింప వైకుంఠపురమునుఁ బోలె
నరుదైన వేడ్క శ్రీహరి యుక్తమగుచుఁ
గమలనాభుని దివ్యకరములఁ బోలె
రమణీయ శంఖ చక్ర స్థిత మగుచు
సన్నుత విహగేంద్ర చరితంబుఁ బోలె
పన్నగ గజ కచ్ఛపంబులు గలిగి
వినుతింప దేవేంద్రు వీడును బోలె
యనిమిషాహార విహారంబు గలిగి
ప్రకటిత నక్షత్ర పథమునుఁ బోలె
మకర కర్కట మీన మండలి గలిగి
యనుపమ రాజ చిహ్నంబులఁ బోలె
ఘనతర పుండరీకంబులు గలిగి
యమృతాబ్ధి మథన విహారంబుఁ బోలె
రమణీయ సుమనస రాగంబుఁ గలిగి
దారుణంబైన కాంతారంబుఁ బోలె
సారంగ పటల సంచారంబుఁ గలిగి
యరుదైన శైల గహ్వరముల బోలె
చిరముగాఁ గేసరోదీర్ణంబు గలిగి
మహనీయ పుణ్యాశ్రమంబునుఁ బోలె
సహారంబును మేటి హంసలు గలిగి
కలిత భూపాంగనా కరములఁ బోలె
పొలుపొంద కంకణ స్ఫురణంబుఁ గలిగి
జన నుతంబగు దివ్య శరధియుఁ బోలె
మునుకొని బహు శిలీ ముఖములు గలిగి
కమనుత్త మాశ్వ లక్షణములుఁ బోలె
వడిమించు ఘనతరావర్తమ్ము గలిగి
చెన్నొందు నా సరసీరుహాకరము."

(ప్రాచ్యలిఖిత పుస్తక సంఖ్య 13-2-9 పుట 451. సప్తమాశ్వాసము.)

చొక్కనాథ చరిత్రకు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో 3 ప్రతులు గలవు. 1 కాగితము. 2 తాళపత్రములు.

1051 సంఖ్యగల వ్రాతప్రతియందు బ్రౌనుదొరవారీ గ్రంథము నూర్చి యీ క్రిందిరీతిని వ్రాసియున్నారు.

"This is a collection of 64 Tales or Legends (లీలలు) intended to describe the miracles or pranks of the God Siva. — It pretends to be translated from Sanskrit. It is also met with in Tamil. The Telugu style is low and easy enough."

1053 సంఖ్యగల వ్రాతప్రతి, ఆరాధ్యకులశేఖరుఁడు శరభేశ కృపగల సత్కవీంద్రుఁడు, ఏగంటి పెదసోమయ్య కుమారుడు సోమన, కీలక శ్రావణ బ॥ ౧౩ నాటికి పైడిపాటి రాచయ్యగారికొఱకు వ్రాసెను.

# తంజాపురాంధ్ర వాఙ్మయము

క్రీ. శ. 1565 లో ననఁగా పదునాఱవ శతాబ్దమధ్యమున విజయ నగర సామ్రాజ్య విచ్ఛిత్త్యనంతరమునఁ జిరకాలమునుండి దాక్షిణాత్య రాజ్యములని పేరెన్నికగన్న పాండ్య చోళరాజ్యము లాంధ్ర వాఙ్మయ మునకుఁ బట్టుఁగొమ్మ లయినవి. ఆంధ్రసాహిత్యాభివృద్ధి కనుకూలము లగుపరిస్థితు లేర్పడినకతన - తంజావూరు - మధుర - పుదుక్కోట - సేలము - మైసూరు మున్నగు రాజస్థానములాంధ్ర వాఙ్మయ రంగము లైనవి. అందు తొలిరంగమగు తంజావూరిని క్రీ. శ. 1535 మొదలు క్రీ. శ. 1673 వఱకుఁ బరిపాలించిన నాయకరాజుల కాల మున నాంధ్రవాఙ్మయ మెంతయేని యభివృద్ధినందినది.

తంజావూరిని నాయకరాజ్య సంస్థాపకుఁడగు చినచెవ్వప్ప నాయ కుఁడును, ఆ వెనుక నాతని కొమరుఁడు అచ్యుతప్ప నాయకుఁడును క్రీ. శ. 1614 వఱకుఁ బరిపాలించిరి. అచ్యుతప్ప నాయకున వెనుక రాజ్యమునకు వచ్చినవాఁడు తంజాపురాంధ్ర నాయక రాజశిరోమణి రఘునాథుఁడు. ఈతఁడే తంజావూరి రాజ్యమున తొలుత దక్షిణ దేశాంధ్ర వాఙ్మయమునకు శ్రీకారము చుట్టిన రాజకవి. కాబట్టియే క్రీ. శ. 1600 నుండి యీ వాఙ్మయ యుగము ప్రారంభమైనది.

తంజాపూరి నాయకరాజుల వంశవృక్షము




(రఘునాథ నాయకాభ్యుదయము పీఠిక 11.)

ఈ నాయకరాజుల పాలనమున నర్ధిల్లిన వాఙ్మయ యుగమునకే నాయకరాజ యుగమని పేరు.

# నాయక రాజయుగము.

## రఘునాథ నాయకుఁడు

దక్షిణ హిందూ దేశ సారస్వత చరిత్రమున కృష్ణదేవరాయల వెనుక రఘునాథ నాయకుఁడు మిక్కిలి ప్రసిద్ధుఁడు- కృష్ణదేవరాయల వలె, మహాపరాక్రమశాలియై, సంగీత సాహిత్య విద్యావిశారదుఁడై కవిపండిత పోషకుఁడై, కృతికర్తయై, కృతిభర్తయై తెనుఁగువారికి జిరస్మరణీయుఁడైన నాయకరాజు - విజయనగరమున కృష్ణరాయల నాఁటి వైభవము, తంజాపురమున మరి నూరేండ్లకు పునరుద్ధరణముఁ జెందినది. వారిరువురి చరిత్రలలో నీ క్రింది సమానాంశములను గమనించితిమేని, కృష్ణదేవరాయలే రఘునాథరాయలై తిరిగి జన్మించెనా యను నూహ కలుగక మానదు.

| కృష్ణరాయలు | రఘునాథరాయలు |
| --- | --- |
| అల్లసాని పెద్దన మనుచరిత్ర | చేమకూర వెంకటకవి విజయ విలాసము |
| భువన విజయసభా రంగము | విజయభవన సభా రంగము |
| తిమ్మరసు మంత్రి | గోవింద దీక్షితుఁడు |
| ఆముక్తమాల్యద తెలుగు కృతి | వాల్మీకి చరిత్ర రామాయణాది బహుకృతులు |
| మదాలస చరిత్రాది సంస్కృత కృతులు. | భారత సంగ్రహాది బహుకృతులు |
| వైష్ణవ మతాభినివేశము పరమత సహనము | వైష్ణవమత ప్రవిష్టత పరమత సహనము |
| సంగీత విద్యాభిజ్ఞత. | సంగీత శాస్త్రాచార్య వైదుష్యము- శాస్త్ర గ్రంథ కర్తృత్వము |

1. విజయ విలాసమను నీ సభా భవనమున, రఘునాథరాయలు నేపాళ చోళగుల జయించిన వెనుక, కృతినిచ్చి యుండుటచే వేంకట కవి భావస్ఫోరకముగ తన రచనకు విజయ విలాసమను పేరు పెట్టియున్నాఁడు.

2. కృష్ణదేవరాయడు సంగీత విద్యా ప్రవిష్ఠుఁడు. బండారు లక్ష్మీనారాయణ యను కవీశ్వరుఁడు "సంగీత సూర్యోదయము" అను సంగీత శాస్త్ర గ్రంథము సంస్కృతమున రచియించి రాయలకుఁ గృతిగానిచ్చి యున్నాఁడు. మఱియు రాయలు మధ్వయతి శ్రీ కృష్ణాచార్యుల వారి యొద్ద వీణావాదనము నేర్చెను. రఘునాథుఁడు ప్రవీణుఁ డనుట సార్థకమే।

శ్రీ కృష్ణరాయల కాలమునకంటె, రఘునాథనాయకుని కాలమున కవయిత్రులు పెక్కురు విలసిల్లిరి. వారిలో తొలుత పేర్కొనదగినది,

## రామభద్రాంబ

సాహితీ భోజుఁడు తంజావూరి రఘునాథరాయని కాలములో (క్రీ. శ. 1614-1633) విలసిల్లిన ప్రఖ్యాత కవయిత్రి రామభద్రాంబ. ఈమె రచించిన గ్రంథములలో సంస్కృతమున "రఘునాథాభ్యుదయము" అనునదిమాత్రము లభ్యమై ప్రకటితమైనది. (మదరాసు విశ్వవిద్యాలయము - ప్రాచ్య పరిశోధనాలయము - సంస్కృతశాఖా ప్రచురణములు - సంఖ్య 2) తెలుఁగుగ్రంథము లేవియు లభింపలేదు. అయిన నీమె తెలుఁగు కవయిత్రి యని విజయరాఘవనాయకుని కాలమునున్న చెంగల్వ కాళకవి రచితమైన రాజగోపాల విలాసమునందలి యీ క్రింది పద్యమువలన తెలియుచున్నది. విజయరాఘవరాయకుఁడు కాళకవి కవిత్వమును ప్రశంసించుచు చెప్పిన పద్యము :—

సీ. ఘటికాశతగ్రంథ ఘటనోత్కట నవీన
　　పాండిత్యగరిమలు భళి యనంగ
నౌష్ఠ్యనిరోష్ఠ్యాది కోద్దామ రసగర్భ
　　సందర్భ మౌనని సన్నుతింప
మాకందమంజరీ మధురిమా మాధుర్య
　　రచనావిశేష మౌరా యనంగ
పరిహృతేతరయుక్తి భాగ సనాతనకథా
　　చాతుర్య ధుర్యత సన్నుతింప

గీ. అయ్య దినముల "రామభద్రాంబ"వారు
నేఁడు "కృష్ణాఖ్య" కవితచే నేర్పు మెఱసి
కవిత సేయుట లెల్ల మీఘనత గాదె
కవివినుతచర్య! చెంగల్వ కాళనార్య!

(రాజగోపాల విలాసావతారిక. ముద్రితము. తంజావూరి పుస్తక భాండాగారము. సంఖ్య 222.)

పై పద్యములవలన చెంగల్వ కాళకవి రామభద్రాంబ గురువనియు, ఆమె తెలుఁగు కవిత్వ మాతని యనుగ్రహమువలననే చెప్ప నేర్చినదనియు మనము గ్రహింపవలయును. తెలుఁగున నీమెకవిత్వము గానరాకపోయినను, సంస్కృతకవిత్వమం దీమె యతిప్రాసలు మొదలగు ప్రత్యేక తెలుఁగుభాషా కవిత్వలక్షణములు పాటించుటచే నీమె తెలుఁగు కవయిత్రియేయని చెప్పనగును. మచ్చునకు

కటాక్షకాంతా - కరుణా రసోన్మయే నకేవలం తే - నతతాపహారిణః,
ప్రవర్ధయంతే - ఫలభార సంగత: సమస్త సంపత్ - సవలీశ్చ సంతతమ్.
దళత్పత్రికానాంకిత - దామసౌరభీ క్మిళన్మి ళిందావళ - మేదురోదరాత్,
సలీలలాస్య క్రమ - చంద్ర మోచిత .........పరాగ భాసురామ్.

ద్వాదశస్సర్గము

ఈ రఘునాథాభ్యుదయ కావ్యమున సుగృహీతనాముఁడగు తంజావూరి రఘునాథనాయకుని చరిత్ర వర్ణితమైనది. రాజాస్థానమున రాజసన్నిధానమున మెలఁగిన విద్వత్కవయిత్రి రచన మగుటచే కేవల సాహిత్య విషయముననేగాక చారిత్రకముగ నీ గ్రంథ ముపాదేయమైనది. కావుననే విజయనగర సామ్రాజ్య చరిత్రకారులు, తమ చారిత్రకసాధనములలో నీ గ్రంథము నొక ముఖ్యసాధనముగ క్రీ. శ. 1917 లో గుర్తించిరి. (Sources of Vijianagar History. S. K. Iyengar. 1917).

ఈ సంస్కృతకావ్యమున 12 సర్గలు గలవు. ప్రతిసర్గాంతమున గద్యగలదు. ఇందులో 900 శ్లోకములు గలవు. తృతీయ, దశమైకాదశ సర్గాంతములలో శార్దూల వృత్తములు మాలిని, ద్వాదశమున స్రగ్ధరయు గలవు. తక్కిన భాగములయందెల్ల రఘువంశము వలె నొకే వృత్తము వాడఁబడినది. ఇదియు రఘునాథుని చరిత్ర గావున రఘువంశమును రామభద్రాంబ యాదర్శముగ గొనియుండును.

రఘునాథాభ్యుదయము. సర్గలవిషయములు:—ప్రథమసర్గ-చోళదేశవర్ణనము, 2. తంజాపురవర్ణనము, 3. రఘునాథనాయక వర్ణనము, 4. రఘునాథుని దినచర్య - కమలావిలాసము, 5. సభావర్ణనము, 6. రఘునాథుని వంశావళి, 7. రఘునాథుడు, యువరాజు, వివాహము, తుండీరదేశజయము, 8. చోళగుని జయము 9. నేపాళ (జాఫ్నా) జయము, 10. పాండ్యరాజుల జయములు 11, 12. రఘునాథ రాయని కాలమున స్త్రీ విద్య-స్త్రీల సంస్కారము, సంగీతవిద్య, రావణ హస్తము, నాటకరచన, రాగములు, నృత్యములు, వాని విశేషములు చెప్పఁబడినవి. ఈ సర్గలంతయు జదువఁదగినవి.

ఇందలిగద్య :

ఇతి శ్రీ రామభద్ర కరుణాకటాక్ష లబ్ధ సారస్వత ప్రవర్ధమాన శతలేఖనీసమ సమయ లేఖినీ యాష్టభాషాకల్పిత చతుర్విధ కవితాను ప్రాణిత సాహిత్య సామ్రాజ్య భద్రపీఠారూఢ రామభద్రాంబా విరచితే రఘునాథాభ్యుదయే ప్రథమస్సర్గ :

ఇట్లే యన్ని సర్గలయంతమందు గద్యల నూహించుకొనునది.

ఈ క్రింది సమస్యను రామభద్రాంబ అత్యాశువుగా పూరించినది. సమస్యా సందర్భము విద్యాగోష్ఠిలో చూడనగును.

> " కిం తే సంతాన పాదపాయంతే "
> కతికతినః క్షితిపతయః
> కిం తే రఘునాథ నాయకాయంతే,
> భువి బహవః కిల తరవః
> కిం తే సంతాన పాదపాయంతే.

రసవత్కవితా సామ్రాజ్య భద్రపీఠాదిరూఢ యగు రామభద్రాంబకావ్యము తెలుఁగు భాషలోనికి ననువదించిన నామె వైదుషీ విశేషమింకను ప్రస్ఫుటము కాగలదు.

# మధురవాణి

రఘునాథనాయకుని కాలమున విలసిల్లిన కవయిత్రులలో మధుర వాణి మకుటమని చెప్పనొప్పును. ఈమె సంస్కృతమున రచించిన రామాయణ కావ్యము సుందరకాండము వఱకు 14 సర్గలుగల భాగము లభించినది. తెలుగున నీమె రచించిన కృతులు లభింపలేదు. కాని యీమె సంస్కృత ప్రాకృతాంధ్ర భాషలలో ప్రఖ్యాత కవయిత్రియై రఘునాథ భూపాలునిచే స్వర్ణాభిషేక మహాగౌరవము నొందిన దని యీమె గద్యములవలన తెలియుచున్నది.

తత్తాదృక్ ఘటికార్ధ నిర్మిత శతశ్లోకీ ఫణిగ్రామణీః,
    వాణీ ప్రాకృత శాస్త్ర నైపుణ సమున్మీల ద్యశః శ్రీ జుషా,
దివ్యోద్యన్మతి సఖ్యయా మధురవాణ్యాంబాఖ్యయా నిర్మితే
    శ్రీ రామాయణసారకావ్యతిలకే సర్గస్తృతీయో భవేత్.
ప్రస్తారాభి నవాత్త వృత్త కవితాధాటీ కథాశుక్రియా,
    షడ్భాషారచనా విశేష బహుధా విఖ్యాత కీర్తి శ్రియా,
దివ్యోద్యన్మతి ... ... ... ...
    ... ... ... సర్గస్తురీయో (సమస్యా) గమత్.
వీణా వాదకళా వినోద సమయే ధృత్వా సమస్యాః శతం,
    సద్యస్సంసది సాధుపూర యతయా దత్తా కవీంద్రైస్త్రయా,
దివ్యోద్యన్మతి ... ... .. ..
    ... ... ... సర్గోఽభవత్పంచమః. [యా,
ప్రఖ్యాతార్జవ యా పదార్థగమక వ్యాఖ్యాన
    పఞ్చాన్వయప్రాగల్భ్యస్పద నైషధ ప్రతివిధాసానంద నూరీంద్ర
దివ్యోద్యన్మతి ... ... ... ...
    ... ... ... సర్గోఽత్రషష్ఠోఽభవత్.
సద్యోవిస్మయకృన్నిగోమ్య కవితా సందర్భ ధారాసుధా,
    సారోర్మి పరిపూరిత శ్రుతి సుధీ సంభావితాభిఖ్యయా,
దివ్యోద్యన్మతి ... ... .. ...
    ... ... ... సర్గో+జనిష్టాష్టమః.
మాధుర్యైకధురంధరాంధ్రకవితా నిర్మాణ సమ్మాన్యయా,
    దివ్యోద్యన్మతి సఖ్యయా మధురవాణ్యాంబాఖ్యయా నిర్మితే,
శ్రీ రామాయణ సారనామని మహాకావ్యేతి భవ్యేసుధీ,
    వర్గోల్లాస విశేషధామ్ని నవమస్సర్గో మనోజ్ఞోఽభవత్.

సూరిస్తస్య కుమారసంభవ మహాకావ్య ప్రతిగ్రస్థన,
ప్రాగల్భ్య ప్రకటక్రియా పదసదః ప్రఖ్యాతవైదుష్యయా,
దివ్యోద్యన్మతి ... ... ... ...
... ... ... దశమస్సర్గో౽త్ర కావ్యే౽భవత్.
ప్రౌఢ శ్రీ రఘునాథ నాయకకృత స్వర్గాభిషేకక్రియా,
దివ్యోద్యన్మతి సఖ్యయా ... ... సర్గస్తదేకాదశః.

రఘునాథుడు రచించిన తెలుగు రామాయణము నాస్థానములో విదుషీమణులు పఠించుచుండగా నొకనాడాతడు తన యాంధ్ర రామాయణమును సంస్కృతీకరింపగల కవయిత్రు లెవ్వరైన గలరా యని ప్రశ్నించెనట. ఆ ప్రశ్నకు జవాబుగా శ్రీ రామచంద్ర మూర్తియే రఘునాథునికి స్వప్నములో దర్శనమిచ్చి, యిట్లు చెప్పెనట:

చతుర మధురవాణీం సమ్యగాకర్ణయుస్త్వం
సరసి మధురవాణీ నామదత్తం త్వయైన
సరస కృతివిధాయాం సాధుమేధా విశేష
స్వధిక పటురశేషా స్వాంబుజాక్షేషు సైషా.

"నీకు మధురవాణి యను బిరుదముపొందిన మేధావతి, సరస కృతి నిర్మాణ నైపుణిగల కవయిత్రి గలదు. ఆమెచే నీ గ్రంథము రచితమైన దివ్యముగ నుండు" నని చెప్పి యంతర్హితుం డయ్యెను. రఘునాథుడును నామెను బిలిపించి రామాయణమును సంస్కృతీకరించుట కాజ్ఞయొసగెను.

రఘునాథుని రామాయణముకూడ మనకు పూర్తిగ లభ్యము కాలేదు. నాలుగాశ్వాసముల గ్రంథము గ్రంథాదినుండి దొరకుచున్నది. (రఘునాథ రామాయణము అను పేర ప్రకటితమైనది. ఆంధ్రసాహిత్య పరిషత్ప్రకటితము, కాకినాడ.) దొరకినంతవఱకు సంస్కృతాంధ్ర రామాయణములను బట్టిచూడగా తెలుగుకన్న సంస్కృతమున కొంత విస్తృతి కలదని చెప్పనొప్పును. మధురవాణి తెలుగు కవయిత్రి గావున నచ్చటచ్చట యతిమైత్రి పాటించినది. మంగళ శ్లోకములో

లక్ష్మీం దిశేల్లక్ష్మణ పూర్వజన్మా
వీరో రఘూణాం విజయం ప్రయచ్ఛేత్
ఆరోగ్యమర్కాభ జనశ్చదద్యాత్
రతీశమూర్తే రఘునాథ నేతుః

ప్రకృతి మధురకావ్య ప్రౌఢ సందర్భ విద్భి
ర్న్యసతి జనమణీభిర్యుక్త పార్శ్వద్వయోఽసౌ,
అథసవిధ ముపేతాం సౌహృదాహ్వాయ మన్మా
మవనిపరివృఢానా మగ్రణీ రిత్యభాణీత్.

ఆజహ దలంకృతిక్రమ మనేకరసోల్లసితం
సరసపదార్థ సంగతి సమగ్రగుణాను గుణమ్,
రఘురమణ ప్రబంధతిలకం రసికాభిమతం
సుదతి విధీయతామితి సుధీరగదీన్నృపతిః.

ఇట్టి యతులు పాటింపబడినవి. పై యుద్ధృతాంశములబట్టి యీమె యాంధ్రభాషా కవితా పాండిత్యము నూహింపనగును.

(భారతి ధాత మార్గశీర్షమున ప్రకటితమైన శ్రీ రామకృష్ణ కవిగారి మధురవాణి అను మధురవ్యాస మిందుల కుపజీవ్యము.)

వీరివిద్యాగోష్ఠి :—

ఆ రఘునాథభూపాల చంద్రుండు విద్వత్కవీంద్రులంజూచి యే మనుచున్నాఁడు.

రఘునాథరాయని వారిమాట :—వింటిరా! కవులార! ఈ పడుచు లాంధ్రగీర్వాణ ప్రాకృతసమస్యలు పూరింపఁగోరుచున్నారు. వీరినిఁ బరీక్షింపరయ్యా!

వా : అన విని యమ్మహారాజుతోఁ గవిరాజు లేమనుచున్నారు.

అయ్యయ్యా! స్వామినగర లక్ష్మీసరస్వతులు సాక్షాత్కరించి యుండఁగఁ బరీక్షయేలయ్యా? అయినను మీ రానతిచ్చిన మీఱరాదు గద. ఈకన్యలాస్యలకు సమస్య లిచ్చేమయ్యా! అని సమస్యలు యిచ్చిరట యెటువలెను.

సమస్య: రారాజనియచ్యుతేంద్ర రఘునాథనృపా !

వా: ఔరా ! రామభద్రమ్మవారు ఆ సమస్య పూరించి చదివిరట యెటువలెను.

క. ఏరీ నీసరి రాజులు, భూరమణులు నిన్నుఁ జాలఁ బొగడుదురు భళీ !
స్వారాజని రేరాజని, రారాజని యచ్యుతేంద్రరఘునాథనృపా !

వా: ఔరా ! ఈ పద్యంబు విని యాంధ్రకవితా నిర్వహణంబునకు మెచ్చి గీర్వాణ భాషను సమస్య నిచ్చిరట యెటువలెను.

సమస్య : కిం తే సంతానపాదపాయంతే

వా: అవురా ! ఆశుకవితావాణి యగునాశుకవాణి యీ సమస్య పూరించి చదివెనట యెటువలెను.

శ్లో. కతికతిన క్షితిపతయః, కింతే రఘునాథనాయకాయంతే,
భువి బహువః కిలతరవః, కింతే సంతానపాదపాయంతే.

వా: అవురా ! యీరీతి సంస్కృత సమస్య పూరించి చదివిన విని మెచ్చి ఆ రామభద్రమ్మకు మధురవాణమ్మకు వేర్వేర ప్రాకృత సమస్య లిచ్చిరట యెటువలెను.

౧ సమస్య: రహుణాహక్ఖితి చందిరోవిహాఇ

౨ సమస్య: వడ్డఇ రహుణాహరాయసాహోహిం

వా: అవురా ! ఈ రెండుసమస్యలు వారు పూరించి చదివిరట యెటువలెను.

## రామభద్రాంబ

శ్లో. పరిపుణ్ణకలాహిసోహమాణో, అహోయంసతుక్క సెవ్వమాణో
సహీప (స?) చెందిఆఓ, రహుణాహక్ఖితి చందిరోవిహాఇ.

ఛాయ: పరిపూర్ణకళాభిశోభమానః, అభితస్సతుక్కలనిత్య సేవ్యమానః
సఖీయ (శః?) చంద్రికాఢ్యో, రఘునాథక్షితి చంద్రోవిభాతి.

వా: అవురా ! ఆ రెండవ సమస్య పూరించి చదివెనట యెటువలెను.

తొల్లొక్కెక్కసుహావహానుయర వియయ రాహవంస ఇణం
దెట్ఠూణణియతణూయం వడ్డయిరహుణాహరాయపాహోహి.

ఛాయ: త్రైలోక్యైకసుఖావహం, శుభకర విజయ రాఘవంశ శశినం
దృష్ట్వానిజతనూజం, వర్ధతే రఘునాథరాజపాథోధి.

వా: భళి! భళి! మేలు! మేలు! సాహిత్యసామ్రాజ్యపట్టభద్ర
ఈ మహామహిమంబు స్వామినగరిగాక తక్కినరాణుల కెక్కడిదయ్యా?
(రఘునాథాభ్యుదయమునుండి)

# రఘునాథ నాయకునిరచనలు

## పా రి జా తా ప హ ర ణ ము

ఈ ప్రబంధమును, రెండుజాములలో నత్యాశువుగ రఘునాథుఁడు రచించెనని యజ్ఞ నారాయణదీక్షితుఁడును రాజచూడామణి దీక్షితుఁడును, చెప్పియున్నారు. ఈ రచనకు మెచ్చి తండ్రి యచ్యుతప్ప నాయకుఁ డీతనికి కనకాభిషేకము గావించినాఁడు. ఏనిని యూర్ధ్వానములో చదివినట్లు రఘునాథనాయ కాభ్యుదయములోని యీ క్రిందిపంక్తుల వలనఁ దెలియుచున్నది. "విరిబోండ్లు కొండఱు వినిపించి రపుడు, హారువైన పారిజాతాపహరణంబు" ఇదియు నేడు లభ్యముకాలేదు.

గజేంద్రమోక్షము, రుక్మిణీకృష్ణవివాహము, జానకీపరిణయము.

ఈ మూఁడును యక్షగానకృతులు. వీనిలో గజేంద్రమోక్ష, రుక్మిణీకృష్ణవివాహరచనలు, సాహిత్యసుధలో యక్షగానములుగా పేర్కొనఁబడినవి. జానకీపరిణయము రఘునాథనాయకాభ్యుదయమున 'చాటుకావ్యము' అనగా యక్షగానమని చెప్పఁబడినది. ఇవియును లభ్యముకాలేదు. ఇవియును నా స్థానములో చదివినట్లు పైగ్రంథము నుండి తెలియుచున్నది.

"జానకీకల్యాణ చాటుకావ్యంబు
తానిర్వహించిన తక్కినకృతులు; కొండఱు వినిపింప"

## అచ్యుతాభ్యుదయ - నాయకాభ్యుదయ రచనలు

రఘునాథుఁడు తన తండ్రియగు నచుతప్పనాయకుని జీవితచరిత్రను రచియించి నాయకాభ్యుదయ రచనలకు మార్గదర్శకుఁడయ్యెను. రఘునాథుఁడు తన తండ్రి చరిత్ర రచియించినట్లే, యాతని కుమారుఁడు విజయరాఘవనాయకుఁడు తన తండ్రియగు రఘునాథుని జీవితచరిత్రను రఘునాథనాయకాభ్యుదయ మను పేర రచించినాడు—విజయరాఘవ నాయకునికుమారుఁడు మన్నారుదేవుఁడు తన తండ్రిచరిత్రమును 'విజయరాఘవనాయకాభ్యుదయము' అను పేర రచించియున్నాఁడు. వీనికి నాయకాభ్యుదయ రచనలని పేరు.

రఘునాథుఁడీ గ్రంథమును ద్విపదగా రచించినట్లు నలచరిత్ర యందలి యీ క్రింది పంక్తులు తెలుపుచున్నవి :

"భూషించి యచ్యుతాభ్యుదయ ప్రబంధ,
నిర్మాణమున మాకు నిఖిలదేశముల
నిర్మలసత్కీర్తి నెగడుగావునను
యటువలె ద్విపదకావ్యము వేఱె యొకటి
ఘటియించి సత్కీర్తిఁ గైకొందు ననుచు
మది నెంచి"

అచ్యుతాభ్యుదయ రచనమును గోవిందదీక్షితులవారు సాహిత్యసుధలో నుట్టంకించి యున్నారు. రఘునాథుని రామాయణమున నిది పేర్కొనఁబడినది. ఈ ద్విపదకృతిని రఘునాథనాయకుని యాస్థానమున విద్యావతులైన వెలఁదులు చదివి వినిపించినట్లు రఘునాథనాయకాభ్యుదయమునందలి యీ క్రింది ద్విపదవలన తెలియుచున్నది :

"విరిబోండ్లు కొందఱు వినిపించిరపుడు
భువి మెచ్చ నచ్యుతాభ్యుదయకావ్యంబు"

ఈ కావ్యమును, మన్నారుదేవుని విజయరాఘవనాయకాభ్యుదయమును నేడు లభ్యము కాకయున్నవి.

## నలచరిత్ర

అచ్యుతాభ్యుదయరచనానంతరము రఘునాథుఁడు నలచరిత్రమును ద్విపదకృతిగా రచియించెను. ఇందెనిమిది యాశ్వాసములు గలవు. మహాభారతారణ్య పర్వమునందలి కథను, శృంగారనైషధ కథను జోడించి రఘునాథుఁ డీనలోపాఖ్యానమును రసోల్లసితముగా నంతరించినాఁడు. రఘునాథుని తక్కిన గ్రంథములతో పాటు దీనిని యాస్థానమున సాహిత్య విద్యాచతురలగు సారసాక్షులు చదివి వినిపించి నట్లు రఘునాథనాయకాభ్యుదయమునందలి యీ క్రిందిపంక్తులను బట్టి తెలియుచున్నది.

> "విరిబోండ్లు కొందఱు వినిపించి రపుడు, నవరసచిత్రంబు నలచరిత్రంబు
> హరువైన పారిజాతాహరణంబు, మెఱవడిఁ జూపు వాల్మీకిచరిత్ర
> జానకీకల్యాణచాటుకావ్యంబు, తా నిర్వహించిన తక్కిన కృతులు

గోవింద దీక్షితులవారు "సాహిత్యసుధ" లో నీ గ్రంథరచనమును ప్రశంసించిరి.

> "శ్రీ పారిజాతాహరణప్రబంధ, చిత్రం చ వాల్మీకిచరిత్రకావ్యమ్
> తథాచ్యుతేంద్రాభ్యుదయం గజేంద్ర, మోక్షం చరిత్రంచ న
> లస్య చిత్రమ్.
> నిర్మాయవాగ్భి ర్నిపుణార్థభాగ్భిః"

తెనుగుభాషలోని ప్రశస్తద్విపదకృతులలో నీ నలచరిత్రము పరిగణింపఁదగినది. ఇది శ్రీ రామునికంకితము. గ్రంథావతారికలో నలమహారాజుకథను తనకు ముందురచించిన నన్నయ శ్రీనాథులను నిట్లు పొగడియున్నాఁడు.

> "శిలలలోపల వెన్న చిలికినకరణి
> యలఘుసంస్కృతముల యర్థంబు లెల్ల
> తెలుఁగుమాటల తేట తెల్లంబుఁగాఁగఁ
> గొలువొందఁ బల్కనేర్చిన నన్నపార్య

తిక్కయజ్వను నెఱ్ఱధీమణిఁ దలంచి
యక్కజంబుగ నిటు లౌ ననునుభయ
భాషల నానార్థభంగులింపార
నైషధాదికప్రబంధంబు లెన్నని
భువి నిల్పి సత్కీర్తిఁ బొందినయట్టి
నవరసనాథు శ్రీనాథునిఁ బొగడి"

శ్రీనాథుని "తల్లి మదేకపుత్రక" యన్న పద్యము ననుసరించి వ్రాసిన యీ క్రింది ద్విపదలు హృద్యములై యున్నవి.

"ఒంటిగాడనె నాకు నూరంతబలగ
మింటి కెల్లను గర్తనే నొక్కరుండ
నాతల్లి యెంతయైనను గలదయ్య
నాతల్లి కూటికి నవయ దెన్నడును
నూఱేండ్లపంట కన్నులుగాన దిపుడు
గారాబుపట్టి నొక్కరుఁడ నే నరయ
యిల్లాలు కడుగోల యెండ కన్నెఱుఁగ
దల్లడిల్లఁగ నుండునట్టిది యేను
కొడుకులు గుడ్డలో కూనలు నన్నుఁ
బెడఁబాయ రెన్నఁడు పెంచిన మమత
బిసఖండములు తెచ్చి పెట్టునందాక
దెసలుఁజూచుచు నోరు తెఱచియుందురు
కన్నవారికిఁబోలె కాన్పించునయ్య
విన్నవారల కట్టి వేదనలెల్ల
దయఁ జూడుమయ్య సంస్తవనీయచరిత !
నయ మించవయ్య యోనవనీతభావ !
నిగ్రహింపకుమయ్య నిషధేశ ! నన్ను
ననుగ్రహింపుము చాల నుతులు గాంచెదవు."

"వెట్టచే నదియును వేవేగఁ గఱఁగె
పుట్టవే ఘలుగులు భూమిలోపలను
కాంచనపక్షముల్ గలవంచు నెంచి
యంచలఁగనువార లవనిలోఁ గలరె ?
పొమ్మని వినవుమో పుణ్యచారిత్ర !
నమ్మి నిద్రించితి నాతెక్కతుదల
బంగారమున కాసపడితినో రాజ
సింగారముమే కాని చేతికి రాదు."

ఇందలి శైలి జాతీయమైనది. సుకిబిసికినయట్లు, ఇనుపదబ్బనముల జంజారులు, చక్కిలములవలె చిక్కుట మొదలగు పలుకుబళ్లు నల్లమంది-పసుగు కంబానకెలయించినట్లు - ఆనాలు చవిచూచుట- మొదలగు జాతివార్తాచమత్కారములు నిండు నిండుకొనియున్నవి. అచ్చటచ్చట శ్రీనాథుని నైషధ పద్యములను ద్విపదానువాదములు గలవు. ఈ గ్రంథాశ్వాసాంత గద్యయిది.

"ఇది రామచంద్ర మహిత దయాసాంద్ర
విదిత సాహిత్య నవీన సాహిత్య
చిన చెన్నయాచ్యుత క్షితిపాలతనయ
వినయాది శుభగుణ విభవ సనాథ
రఘునాథ భూపాల రమ్యవాగ్జాల
సుఘటిత నవరసస్ఫుట శబ్దమహిమఁ
దనరెడు నలచరిత్రమను ప్రబంధ
మునఁ బ్రథమాశ్వాసమును దగు శ్రీల"

రఘునాథుండు పూర్వోత్తర కథాసందర్భములను గమనించి కొన్ని సముచితవర్ణనలు గావించినాఁడు. ప్రథమాశ్వాసమున నలుని యశ్వకళానైపుణ్యము, చతుర్థాశ్వాసమున సంగీతశాస్త్రవివరణము, షష్ఠాశ్వాసమున నలదమయంతులకష్టపరి, కలివర్ణనము, రఘునాథుని

కవితాచాతుర్యమును, శాస్త్రవైదుష్యమును ప్రస్ఫుటీకరించుచు నీ గ్రంథరచనను ప్రత్యేకించుచున్నవి. ఇందలిరచన కొకముచ్చుతునుక : హంసను నలుఁడు పట్టుకొనినప్పుడు చెప్పిన మాటలు.

“ ముసలకుండఁగఁ బట్ట మేదినీశ్వరుఁడు
నదిగని విడువఁడీయవనీశుఁ డనుచు
నలువంకలనుఁ జూచి నలువంకఁజూచి
తలపున కడునద్భుతము పిక్కటిల్ల
మనుజభాషల నంచ మనుజేశుఁ బలికె
వినవయ్య! యో రాజవీరశేఖరుఁడ
ధరణి నాజాండ మేఁతకుఁగాఁగఁ దిరిగి
తిరిగి బడలిక లెల్లఁ దీర నీయూర
వంచన నయమార్గవర్తన చించి
పొంచిపట్టితి వేమి పుణ్యంబు గలిగె ?
రాజహంసుఁడవయ్యుఁ బ్రౌఢి నెంచకయు
రాజహంసము మట్టరాదయ్య నీకు
ద్విజరక్షణంబు సంధిలఁజేయుచేత
ద్విజశిక్షణంబు సంధిలఁజేయఁదగునె
పక్షిని గాని యే ప్రతిపక్షిగాను
భక్షింపఁ దలఁచి నన్ బట్టితే నీవు
పట్టెఁడైనను లేదు పలలంబు నీవు
పట్టినకతమున పాణియుగంబు ”

నలోపాఖ్యానము ప్రత్యేక ప్రబంధరూపమున వెలువడుట కిది మొదలు. దీని వెనుక చక్రపురి రాఘవాచార్యుఁడు ద్విపదగను, సిరి ప్రగడ ధర్మనామాత్యుఁడు, బెహరా రామకృష్ణకవి పద్యకావ్యములుగను రచించిరి. ధర్మవరము కృష్ణమాచార్యులవారి చిత్రనళీయము చాల వ్యాప్తమైన గ్రంథము. పై రఘునాథుని నలచరిత్ర తక్షణమే పునర్ముద్రితము కాదగినది. దీని వ్రాతప్రతి తంజావూరిలో లేక పోవుట విశేషమే: ద్విపదకృతులు పెక్కులు ముద్రితము లగుచున్న కాలమున నిదియును సుముద్రితమై వ్యాప్తి చెందఁదగినది.

దీనిని క్రీ. శ. 1921 సంవత్సరమున, కీర్తిశేషులు చెలికాని లచ్చారావుగారు శ్రీ రామవిలాస ముద్రాక్షరశాలలో ముద్రించి యున్నారు. ముద్రితప్రతి డెమ్మీ సైజున నూటయిరువది పుటలలో నున్నది. రంగనాథరామాయణ ముత్తర కాండమువలె నిదియు ద్విపద లోకేపంక్తిగా చిన్నయక్షరములతో ముద్రితమైనది.

గ్రంథమున నేడాశ్వాసములును, నెనిమిదవ యాశ్వాసములో కొంతభాగము గలదు. ఋతుపర్ణుఁడు కుండిన నగరమునకు గుఱ్ఱముల నాయత్తపఱుపుమని చెప్పగా నలుఁడు (బాహుకుఁడు) చిక్కిన గుఱ్ఱములను సిద్ధముచేసిన యీ క్రింది పంక్తులతో ముగియుచున్నది.

"సింధుజంబులగు తేజీల నేర్పఱచి
తెచ్చితి కుండిన దేవ! నామనసు
వచ్చినవీ వారువములని పలుక
ఋతుపర్ణవిభుఁడా గ్రహించి "మేల్ మేలు"
మతిమంతుఁడని నిన్ను మన్నన జేసి
యడిగినందుల కిట్లు హాస్యాస్పదములు
బహుగుఱ్ఱములఁ జూపఁగఁ బాడియగునె?
చిక్కలంబులు బోలె చాలఁగూలంగ
చిక్కినవివిజూడు చేరునేయొక్క
నాఁటనెయీకుండినమునకు నేఁటి
మాటలు చాలింపుమా! యని పలుక
బాహుకుండనియె నాపార్థివు తోడ
వాహంబులివి కృశత్వముఁ బొందియున్న
నుండనీ నివియేఁగు నొకనాఁటిలోన
కుండినంబునకు నిక్కవము నాపలుకు
కండలుఁబెరిగిమై గదలంగ లేక
కొండలవలె నుండు గుఱ్ఱంబు లేల?
పంచకంబులు నున్నఁ బాతినవెల్ల

కొంచెఁగ నేఁగునే క్రోశమాత్రంబు
బక్కచిక్కిన నేమి బలసిన నేమి
యుక్కళంబగు మనసుండంగ వలయు
వేటాసపడక, బల్విడి జగ్గుఁగొనక
కాటుఁజూపక యసంగంబుగా వెనుక
జిహ్మాక కరసాంజ్ఞచేతన మదికి
సమ్మతంబగు మహాజవమున మెలఁగు
హయరత్నముల నేలునట్టి రాజునకు
జయముగల్గుటకు సంశయమును గలదె?
కనుఁజిక్కి యున్నవిగా యనిసుఱచి
వడినేఁగి యాడంగవలెనె యశ్వములు
పచ్చికుట్టులుగావె పరికించి వాని
యిచ్చనెఱుంగుచు నెక్కుడ వలయు
...            ...            ..."

దీనితరువాత కథలో, నలుఁడు నిజరూపము నొందుట, దమయంతితోఁగూడి రాజ్యము పాలించుట యను సంశములు మాత్రమే యుండుటచేత నీ కథయంతయు నెనిమిదవ యాశ్వాసముతో పూర్తియైనదని నిశ్చయింపవచ్చును.

## రఘునాథ రామాయణము

శ్రీ రామచంద్రభక్తుఁడగు రఘునాథుఁడు వాల్మీకిచరిత్రమును రచియించుటయేగాక, వాల్మీకి మహర్షిప్రణీతమైన శ్రీమద్రామాయణమును చంపూకావ్యముగా రచియించెను. ఈ గ్రంథమంతయు నాతఁడు పూర్తిచేసెనో లేదో కాని నేఁడు లభ్యమగుచున్న భాగమున బాలకాండమున మూఁడాశ్వాసములు సంపూర్ణముగను, నాల్గవయాశ్వాసము 26 పద్యములు మాత్రమే గలవు. ఇది ముద్రితమైనది. లభ్యమైన భాగము రఘునాథరాయని రసవత్కవితకు చక్కని యుదాహరణమై

యొప్పుచున్నది. ప్రథమాశ్వాసమున అవతారిక, సంగ్రహరామాయణము, వాల్మీకి శోకము శ్లోకమగుట; రెండవయాశ్వాసమున కోసలదేశవర్ణన, అయోధ్యాపురవర్ణన, దశరథమహారాజువర్ణన, పుత్రునికొఱకుచింత, పుత్రకామేష్టిచేయు ప్రయత్నము, ఋష్యశృంగ చరిత్ర; మూఁడవయాశ్వాసమున ఋష్యశృంగు నయోధ్యకువచ్చుట, దశరథుఁడశ్వమేధయాగముచేయుట, దశరథునకు పుత్రప్రసాదము లభించుట యను వృత్తాంతములు గలవు. నాల్గవయాశ్వాసము శ్వేతద్వీపవర్ణనతో ప్రారంభమైనది.

ఇందలికవిత జాతివార్తాచమత్కారములు గలిగి రసభావగర్భితమై యలరారుచున్నవి. రసపోషకములగు వ్యావహారికపదములు నుపయోగించి రఘునాథుఁ డొక క్రొత్తవన్నె కవితకుఁ గూర్చినాఁడు. ఋష్యశృంగునిఁ జూడగానే అప్సరస లనుకొనుమాటలు

"సీ. కొమ్మరో నడునెత్తి కొమ్మొంది యాచుట్టు
జడలు చెంపల వ్రేలబడుట యేంది
మెడచుట్టుఁజల్లుల చిడిపిరాల్గూర్చిన
తీరునఁ బూసలపేరు లేంది
బుసి గప్పుకొన్న చొప్పున మేన నిండంగ
మేదించినట్టి యీబూది యేంది
కసవు ముప్పిరి త్రాటఁ బొసగంగఁ గట్టిన
పొడచింకతోలు నచ్చడమ దేంది

గీ. నొసల మసిబొట్టి దేంది యొద్దెసలనిట్టి
జూచి గనుగొను మమ్మెక్క జూచినపుడె
వెఱపడ రయించుఁ జేతొమ్ము నఱచికొనుచుఁ
గడఁగి డగ్గఱఁ జేరక కడన యుండి."

దశరథుఁడు పుత్రులు లేరని చింతించు సమయమున పలికినపలుకులు బాల్యచేష్టలును చక్కగ నిరూపించుచున్నవి.

"చ. కలుగునొకో చకోరహితు గన్గొని తెమ్మని పోరువెట్ట దా
దులు గికురించి యద్దమునఁ దోఁచిన చందురుఁ జూప రెండుచే
తుల గొని పట్టి సంతసముతోఁ దనచేతికిఁ జిక్కె నంచు న
గ్గలికఁ జెలంగు బాలకుని కన్నులఁ జూడఁగఁ గల్గుభాగ్యముల్."

రాజులెంత సర్వజ్ఞులైనను రమణులకు లోఁబడుదురని యీ క్రింది పద్యమున చక్కఁగాఁ దెలిపియున్నాఁడు.

"సీ. షడ్దర్శనీ పరిశ్రమ సమంచిత బుద్ధి
వాసిఁగన్నట్టి విద్వాంసులకును
కర్ణామృతస్యంది కవితా నిరూఢిచేఁ
బ్రౌఢిమించిన కవిరాజులకును
గాంధర్వ సర్వస్వకళఁ గళంకము లేక
జాణలౌ జగజెట్టి జాణలకును
దత్తిలభరత మతంగాది మతముల
వఱలెడినాట్య తత్త్వజ్ఞులకును
గీ. నిచ్చి యీ కొల్వులంజల కీయఁ దగునె
పల్లకీలను హెచ్చు సంబళము బిరుదు
వాద్యములు జూడ నృపులు సర్వజ్ఞులయ్యుఁ
దెలియలేరని కొందఱు పలికి రఘుఁడు."

విజయనగర సామ్రాజ్య కాలమున పుట్టిన ప్రబంధములవలె నిందును సమకాలిక జాతీయ జీవితము ప్రతిబింబించియున్నది. కోసల దేశవర్ణనయందలి ప్రాసంగులు, సన్నవంకలు, బంగారు తీగెలు మున్నగు ధాన్యములను గూర్చి చెప్పుట, పొలములకు నీటిపాఱుదల జల సమృద్ధి ప్రత్యేకించి వర్ణించుట యానాడు తంజావూరి రాజ్యమండల మెంత సుక్షేత్రఖండముగా నుండెనో తెలియగలదు,

సీ. పుష్పమంజరు లిష్ప పువ్వు రాజనములు
కస్తూరి నిగరాలు గంధసరులు
గంగాజలంబులు బంగారు తీగియ
తేనుంగు దంతముల్ దీనసరులు
సన్నవంకలు ముత్తెసరులు ప్రాసంగులు
రాయమెచ్చులు నీశ్వరప్రియములు
నయములు రామబాణములు సీతాభోగ
ములు బాలకేసరుల్ మోసనములు

గీ. కటియమేనులు సన్నబక్కండ వఱియుఁ
గలుగు ధాన్యంబులెల్ల ముక్కాలుఁబండి
నిండి యెల్లెడఁ జూచిన నెగడు చుండు
శ్యామ మనుపేరి నెఱుఁగరా భూమిజనులు (2—11)

మఱియు దశరథుని కొల్వుకూటములోని వేత్రధరుల యీ క్రిందివర్ణనము.

సీ. వెన్నముద్దలువోలె సన్నసుగ్గడితంపుఁ
వెలిచల్వబటువుపాగలు పొసంగ
నునుపారి యఱచట్టలును వాని కొనరిన
వలిపెపచ్చడములు జెలువ మొసగ
నొండొంట నొరవచ్చు చున్నచెంపలగొప్ప
నీలాలప్రోగుల నిగ్గుదొలఁక
నృపముద్రల జెలంగు నవరంజి ముద్దుటుం
గరములు కరములఁ గరము మెఱయ

గీ. శుద్ధవేషంబుతోడఁ బ్రసిద్ధులైన
సచివు లధిపుహజారంబు నరణి దఱిసి
క్రమమొనరి కొన్నికక్ష్యాంతరములు గడచి
యంత హెగ్గళ్లువచ్చి రమ్మనుచుఁ బిలువ.

వీరు రఘునాథనాయకుని కొలువులోని హెగ్గళ్లేగదా!

ఇందలి శ్వేతద్వీపవర్ణనలోని కొన్ని భావములు ప్రవరసేనుని సేతుబంధ మహాకావ్యమునుండి గ్రహింపబడినవి. ఇది రఘునాథుని వస్తుకవితాసామర్థ్యము (అనగా వర్ణితవిషయము నొక్కదానినే బహు రీతులు, బహుభంగిమములు నొప్పునట్లుగా రచించుట) నిరూపించు చున్నది. కొన్ని స్వతంత్రభావములును గలవు. రెండింటినిమాత్ర ముదాహరింతును.

"సీ. రమ పెండ్లినాడిము త్తెములప్రాల్ నిండిన
విధుకాంతమణికాంత వేది యనఁగ
జలవారణములపోరులు సూచు సలిలభ
ర్తకు నొనర్చిన వెండితమక మనఁగ
జలశాయి హరినాభిచతురాస్యు గొలువ వ
చ్చినవాహనమరాళసేన యనఁగ
మున్నిటిరాయని ముంజేతివజ్రము
యంపుహంపీరుతాయత యనంగ

గీ. బాలసంద్రంబు ఘనయాచకాళి కెల్లఁ
దోరహత్తుగాఁ దీరసపూర ము త్తు
ననుచు నె త్తినధవళ పట్టాంబరాఢ్య
జంబనఁగ పాండురాంతరీపంబు వెలయు.

గీ. నీరుపాపలు గుమిగూడి నింగి కెనయ
వీచికారజ్జువుల గట్టి విడిచినట్టి
కాగితపు గాలిపటము నిష్కంపలీల
నున్నదో యన తెలిదీవిచెన్ను మీఱు."

ఇట్లు తెలిదీవిని నలువది విధములుగా వర్ణించిన రఘునాథుని. కవితావైశద్య మెట్టిదో పాఠకు లూహింపగలరు. ఇందులో 467 గద్యపద్యములు గలవు. (1-138-2-192, 3-111-4-26) ఆశ్వాసాంతగద్య వాల్మీకి చరిత్ర గద్యవలెనే యుండును.

ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక సంపుటము సంఖ్య 40.

రఘునాథనాయకునికి శ్రీనాథునికవితయం దెక్కువ మక్కువ. రామాయణముననుస, వాల్మీకి చరిత్రముననుస, నలచరిత్రము నందును శ్రీనాథుని ప్రత్యేకముగఁ బేర్కొనుటయే యిందుకు తార్కాణము.

రామాయణమున :-

క. నానా శాస్త్రపురాణ
జ్ఞానము సందర్భమునఁ బొసంగఁగఁ గృతులె
న్నేనియొనరించి మించిన
శ్రీనాథుని వచన వైఖరిన్ మదిఁ దలఁతున్ (1—12)

వాల్మీకిచరిత్రమున

శా. సందర్భంబు నవార్థగర్భమగుచున్ చాటుక్రియన్మించుగన్
చిందుల్ ద్రొక్కుచు నిండియుంతట రసశ్రీ మెచ్చుఁ గొల్పంగనా
నందాంబోధి తరంగముల్ బలె ప్రబంధంబుల్ భువిన్నిల్పిదా
వందెల్లంబుఁగఁగీర్తి గాంచుమను శ్రీ నాథున్మదిం గొల్చెదన్. (1—12)

నలచరిత్రమున శ్రీనాథస్తుతి ముందుదాహరించితిని.

పద్యముల యెత్తుగడలు :—

ఉ. పంచమ వేదమైపరఁగు భారత సంహితనంధ్రభాషఁ గావించె
భీమఖండము- (1—5)
పంచమ వేదమైపరఁగు భారత మంధ్రవచో విలాసముల్నించి
రామాయణము

ఉ. కప్పుర భోగివంటకము కమ్మని గోధుమపిండి సాజ్జయున్
క్రీడాభిరామము (1—11)
కప్పుర భోగివంటకము కమ్మని నేవడియన్భుజించిమేల్ (2—13)

"సీ. తనదాన మహిమ చింతామణి కామధు
క్సంతానముల కోడిబంటి [illegible] రామాయణము (1-38)

"సీ. తన దానమహిమ చింతారత్న
జీమూతములసిగ్గుఁ జె [illegible] నైషధము (1—9)

ఈ క్రింది పద్యము కృష్ణరాయల [illegible] ముక్తమాల్యద యందలి రెడ్ల వర్ణనకు ప్రతిబింబము.

కప్పుర భోగివంటకము కమ్మని నేవడియన్నుభుంచిమేల్
దుప్పటు లట్లు మూరగల తోరపుఁ బచ్చడముల్చెలంగఁగా
గొప్పక దానిపైఁడి జిగిగుత్తపుటుంగరముల్ గరమ్ములన్
ద్రిప్పుచు రచ్చసేయుదురు రెడ్డిదొరల్ తమి హెచ్చనచ్చటన్.
(2—13)

ఆంధ్రసాహిత్య పరిషత్ప్రచురణము. ౪౦. 1937.

## శృంగారసావిత్రి

ఇది రఘునాథభూపాలునికృతిగాఁ బ్రకటితమైనది. ఇందలి కవితాసౌకుమార్యమును, రాజాస్థాన సంప్రదాయములును రచనారీతులును రఘునాధనాయకునికృతిగా పట్టియిచ్చుచున్నవి. కాని యాశ్వాసాద్యంత పద్యములుగాని గద్యగాని కనపట్టుట లేదు - రఘునాథుని కృతులలో నెవరును నీగ్రంథము తడవియుండలేదు - భావిపరిశోధనమున నింతకన్న వివరము లిచ్చుటకు వీలుగలుగునేమో గమనింపవలసియున్నది.

*ఈ కృతి* క్రీ. శ. 1928 లో శృంగార గ్రంథమాలలో గంటి సూర్యనారాయణ శాస్త్రిగారిచే, ఇండియా ముద్రాక్షరశాలలో ముద్రితమై ప్రకటింపబడినది. ఇందుగల పీఠికలో 5, 6 పుటలలో నిట్లున్నది.

"సావిత్రీ చరిత్ర"

"రసవంతమగు నీ ప్రబంధమును ... మహారాజ కవియే (తంజావూరి రఘునాథుడు) రచియుండునని మేము నుకొనుచున్నాము. దీనిమూలము తంజా ... పుస్తకము. గ్రంథారంభ మొక యాశ్వాసము లేనట్లున్నది. ఆశ్వాసాద్యపద్యములు లేవు. నడుమఁగూడ నొకచోఁగొంత గ్రంథపాత మున్నది. ఈ గ్రంథమును ముగియ రచింపకపూర్వమే గ్రంథకర్త స్వర్గస్థుఁడై యుండునని యూహాము. ఆ ప్రతినిఁబట్టి తత్కర్తను గుర్తింపఁ గుదురదయ్యెను. కాని శ్రీరఘునాథరాయ మహాకవి రచియించిన రామాయణము నందలి పద్యములు (ఋష్యశృంగ తపోభంగము పట్టుననున్నవి.) ఈ గ్రంథమునందును నుండుటచే తత్కర్తయే, యేతత్కర్తయని మే మూహించితిమి." కాని నేఁడు ముద్రితమైన పై రఘునాథ రామాయణమున ఋష్యశృంగ తపోభంగముపట్టున 'శృంగార సావిత్రి'లోని యొక్క పద్యమైనను గానరాలేదు. కావున నీ గ్రంథకర్తృత్వ మింకను నిశ్చితము కాలేదని చెప్పనగును.

వాల్మీకి చరిత్ర

ఆంధ్రవాఙ్మయమునఁ గవిరాజశిఖామణి నన్నిచోడదేవుఁడును, సాహితీసమరాంగణ సార్వభౌముఁడు శ్రీకృష్ణదేవరాయలును, సంగీత సాహిత్య విద్యారసజ్ఞుడుఁ రఘునాథనాయకుఁడును రాజకవిత్రయముగాఁ గీర్తింపఁదగినవారు. ఆంధ్రవాఙ్మయచరిత్రమున ప్రత్యేకవిశిష్టత గలిగిన తంజాపురాంధ్ర వాఙ్మయమునకు మూలపురుషుఁ డీ రఘునాథనాయకుఁడే.

ఈ ప్రబంధమున కథావస్తువు కవితావతార ప్రథమతీర్థంబగు వాల్మీకి చరిత్రము. పరమపవిత్రమగు నా రఘునాథుని చరిత్రము జగదాదిమకావ్యముగ సంస్కృతభారతిని వాల్మీకిరచియించి కవియై

కీర్తినందగ, నా వాల్మీకిచరిత్రః ము [illegible] సహజమాధురీ ధురీణమగు నాంధ్రభాషలోఁ బ్రబంధరూపమున రచియించి, రఘునాథునికే యంకితమొసంగి, కవిరాజై కవితాచరితార్థత గాంచినాఁడు. రఘునాథనాయకుఁ డీ ప్రబంధమును రచియించినట్లు గోవిందదీక్షితులవారు తమసాహిత్యసుధయం దిట్లు చెప్పియున్నారు.

> శ్రీ పారిజాతహరణ ప్రబంధ, చిత్రంచ వాల్మీకి చరిత్రకావ్యం
> తథాచ్యుతేంద్రాభ్యుదయం గజేంద్ర, మోక్షంచరిత్రంచ నలస్య చిత్రమ్
> శ్రీ రుక్మిణీ కృష్ణవివాహ ముఖ్య, గానంప్రబంధానట నైక భేదాన్
> నిర్మాయవాగ్భిర్నిపుణార్థభాగ్భి, ర్విద్వత్కవీనాంవిదధాసి హర్షమ్.

గ్రంథమున నాశ్వాసాంతగద్యలో రఘునాథుని పేరే యుండుటచేత నిది రఘునాథ కృత మనియే నిస్సంశయముగఁ జెప్పనొప్పును.

## — గద్య —

"ఇది శ్రీ రామచంద్రసాంద్ర కరుణాకటాక్షలబ్ధ సిద్ధసారస్వత విశేష, నిరర్గళ వాగ్వైభవాశేష, సరససాహిత్యకళాభోజ; సత్యసంభూషిత ముఖాంభోజ, సకలసామ్రాజ్యధౌరేయ, నిత్య వితీర్ణధారారాధేయ, నిరితావారితాన్న సత్రసంతోషిత ప్రతిదివస పంచాశత్సహస్రభూసుర, బహువారావర్తిత మహాదానవైభవావర్తిత కీర్తిభాసుర, నిజమాంకితాకలంకవస్తుసమగ్ర, బహుళాగ్రహారభూషిత, చోళధారామండల నిఖిలభోగవిభవ నిర్జితాఖండల సాధితసముద్రాంతరద్వీప పరనృపాలసంస్తుతప్రతాప, నేపాళ భూపాలస్థాపనాచార్య, కర్ణాటరాజ పూజనీయధౌరంధర్య, రామసేతు శ్రీ రంగవిజయరాఘవపుర కుంభకోణాది దివ్యస్థల ప్రతిష్ఠాపిత రామభద్ర, సర్వజనసంభావిత, గాంభీర్య ముద్రావినిర్జిత సముద్రసదాశ్రితభరణ దీక్షాదక్ష దక్షిణసింహాసనాధ్యక్ష, రాజాధిరాజ సన్నుతాసాధారణశౌర్య దిగంత ప్రసిద్ధతరౌదార్య సుజ్ఞానజనక సతతసంసేవితజనక పోషితవిద్వత్కవియూథ, భువనశోభితగుణసనాథ, బలవత్పరిపంథిగృహీత కాంతవిమోచన

శ్లాఘనీయ బాహుబల,
యాచ్యుత నృపాలపుత్ర, సుజన సంతాన పారి,
సాయక సకలధర్మసంధాయక, రఘునాథనాయక ప్రణీతంబైన [illegible]
చరిత్రంబను మహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము."

## కథావిమర్శనము

వాల్మీకి చరిత్రమూలము సంస్కృతమున ధర్మఖండమున నున్నది. మరియు వాసిష్ఠ రామాయణము, భక్తవిజయము మున్నగు గ్రంథములలో నీకథ యున్నట్లు తెలియుచున్నది. ఈ రెండింటియందును కథలు కొంచెము భిన్నముగ నున్నవి. ధర్మఖండమున వాల్మీకి కిరాతకుఁడనియు, దోపిడివృత్తిచే జీవించుచుండె ననియు, సప్తర్షి దర్శనముచే రామమంత్రోపదేశమును బొంది మహర్షియై విలసిల్లె ననియు కలదు. వాసిష్ఠరామాయణ భక్తవిజయములలో నీతఁడు తొలుత నుత్తమబ్రాహ్మణుఁడై, యౌవనమునఁ గిరాతవనితాలోలుఁడై సాధుపురుష సందర్శసాంగత్యములచే మహాపురుషుఁ డయ్యెననియుఁ జెప్పఁబడియున్నది. పై రెండింటిలో * ధర్మఖండములోని కథయే వాల్మీకి చరిత్రమునఁ బ్రపంచితమై యున్నది. రమారమి మూఁడు పంక్తులలోఁ జెప్పఁదగిన యీ కథను మూఁడాశ్వాసముల మహాప్రబంధముగా రచియించుటయే రఘునాథరాయని కవితాప్రతిభను చాటుచున్నది. వాల్మీకి చరిత్రకథా సూత్రము గమనించిన నీవిషయము మఱియు స్పష్టమగును.

ముక్తిసుందరీ నికేతనమగు బదరీవనమున శౌనకాదిమహర్షులు హరిస్మరణచిత్తులై యుండ నారదుఁ డచటికి వచ్చెను. మునులు నారదుని విష్ణుకథలనుఁ దెలుపఁ గోరిరి. నారదుఁడు వైకుంఠమునకుఁ

---

* ధర్మఖండము క్రీ. శ. 1700 సంవత్సర ప్రాంతమున గోదావరీమండల ప్రాంత వాస్తవ్యు డీదురుపల్లి భవానీశంకరకవి ఆంధ్రమునఁ బదియాశ్వాసముల మహాప్రబంధముగా రచియించి యున్నాడు. ఈ గ్రంథమును అభినవాంధ్రభోజులు శ్రీ పీఠికాపురాధీశ్వరులు క్రీ. శ॥ 1931 లో నచ్చువేయించిరి.

## హనుమంతునివర్ణన కృత్యాది

ఉ. ఎక్కడ రామకీర్తన మొకించుకయే విననైన వేడ్కఁదా
నక్కడ వచ్చి రంజిలికృతాంజలియై ప్రమదాశ్రు పూరముల్
పిక్కటిలంగ మైఁబులకబృందము జాదుకొనంగఁ బాడుచున్
జొక్కుచు నాడు నయ్యనిలసూను ప్రభానతభానుఁ గొల్చెదన్.

ఇది "యత్ర యత్ర రఘునాథకీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్, బాష్పవారి పరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్."

అను శ్లోకమునకుఁ దెలుఁగుచేఁత.

సీ. పంకజబిందు బింబస్థాయి త్రైలోక్య
మంగళదాయి శ్రీరంగశాయి
సకల జనానంద సంధాయి గరుడ తు
రంగమయాయి శ్రీరంగశాయి
సహ్యకన్యాతటాంచలకులాయి ప్రపంచ
రక్షణోపాయి శ్రీరంగశాయి
అఖిలదైవతసంసదతిశాయి యగణిత
బ్రహ్మాండకాయి శ్రీరంగశాయి

గీ. నిఖిలజగదింద్రజాలంబు నెఱపుమాయి
అచ్చలకునెల్ల మొదల నచ్చైనవ్రాయి
కొలుచువారలపాలిటి తలఁపురాయి
రావణానుజదాయి శ్రీరంగశాయి ద్వి. అ.

పై పద్య మనుప్రాసఘటితమైయున్నను నిది చదివినతోడనే సంకుసాల నృసింహకవి కవికర్ణరసాయనమున నీక్రింది పద్యము స్మరణకు రాకమానదు,

సీ. అపవర్గకాంతఁ జే నంగొన్నవారికిఁ
దంగేటిజున్ను శ్రీరంగశాయి
నిర్వాణదారిద్ర్య నిర్విణ్ణుఁడగువాని
ముంగిటిసేవధి రంగశాయి
సంసారమల విమోచనము నాకాంక్షించు
పంగువు పైగంగ రంగశాయి
పరమార్థలాభతత్పరుఁ డైనవానికి
ముంగొంగు పసిఁడి శ్రీరంగశాయి
గీ. బెదరకాకఁటి యమృతంబుఁ బిదికికొనఁగ
శృంగములు లేని మొదవు శ్రీరంగశాయి
కోరువారలకోర్కె లీఁగోరివచ్చు
జంగమామరతరువు శ్రీరంగశాయి.

అచ్చటచ్చట శబ్దాలంకారములు హృదయంగమమై కవితకుఁ గణన కూర్చుచున్నవి.

క. లోపలఁ జని చని హరినీ
లోపలకురువిందకందళోజ్జ్వల కనకా
లోపల సద్రచనాజా
లోపలలితమైన యొక్క యున్నతవేదిన్.

మ. తమసానిమ్నగదాఁటి తజ్జలసముద్యద్బాల శైవాలఁ జా
తమసారద్యుతి తీరభూరుహ విభాధట్టంబుతోఁ గూడి నం
తమసానీకముఁ బోలె నద్దెసలు నిండం జూచి యోహో మహా
తమసానీరము నిండెఁ జెల్లదని చింతం జాలఁ బల్కింపుచున్

వాల్మీకిచరిత్రము స్వతంత్ర ప్రబంధముగా నెన్నఁదగినది. కవితాప్రౌఢిమయందేమి, కావ్యనిర్మాణమునందేమి, కళాప్రదర్శనము నందేమి, ఆంధ్రప్రబంధములో నున్నతస్థాన మాక్రమించుచున్నది. రసౌచిత్యవిషయమున దక్షిణాంధ్రవాఙ్మయమున నీ కావ్యమునకుఁ

ప్రత్యేకవిశిష్టత కలదు. రఘునాథభూపాలుఁ డుపయోగించిన శబ్ద జాలమాతనికి నన్నిచోడని కుమారసంభవముతోడను, శ్రీకృష్ణదేవ రాయలవారి యాముక్తమాల్యదతోడను పరిచయమున్నట్లు తెలుపుచున్నది. తృణజ్యోతి, ఓహరిసాహరిమున్నగు పదము లిందులకుఁ బ్రమాణము. 'ఉగము' మున్నగు నపూర్వపద ప్రయోగము లిందు కానఁబడు చున్నవి. రఘునాథభూపాలుఁడు వైష్ణవుఁడగు శ్రీరామభక్తుఁడయ్యును, పరమత సహిష్ణుతకలవాఁడు. వాల్మీకిచరిత్రమున క్షేత్రవర్ణనమున శైవక్షేత్రములఁగూర్చి చేసినప్రశంస లాతనికిఁ బ్రాచీన శైవవాఙ్మయ మునఁగల పాండితిని సూచించుచున్నవి. చూడుఁడు, మధురయందలి సోమసుందరుని వర్ణనము.

సీ. మునులకందగరాని మోక్షంబు పక్షికి
దయచేసె నెవ్వాఁడు నయమొనర్ప
వివిధార్థములుగ ద్రావిడసూత్రములు సల
క్షణముగా నెవ్వాఁడు సంగ్రహించె
జంబుకంబులు తురంగంబులుగాఁ జేసి
యమ్మె నెవ్వాఁడు పాండ్యాధిపతికి
శ్రుతినిందకులకుఁ దామసుల శూలవిద్ధులఁ
గావించె నెవ్వాఁడు ఘనత మెఱయఁ

గీ. దట్టఁదలఁబెట్టపట్టెఁడు పిట్టుకొఱకు
ముసలియవ్వకునై మన్నుమోసె నెవ్వఁ
డట్టి లింగస్వరూపున కఖిలపతికి
సోమసుందరునకు నీడు జోడు గలదె. ద్వి. ఆ.

జంబుకంబులు తురంగములు చేయుట, పిట్టవ్వకుఁ దట్టలు మోయుట మున్నగుకథలు దాక్షిణాత్యశైవవాఙ్మయముతోఁ బరిచయ మున్నఁగాని సాధారణముగఁ దెలియనట్టివి. ఇట్లే తంజావూరు అరుణాచలము, శ్రీశైలవర్ణనము రఘునాథుని పరమతసహనముఁ

దెలుపుచున్నవి. ఇట్లు పరమతసహనము గలిగినవాఁడయ్యు, తన రామభక్తిని గ్రంథమునందుఁ బ్రస్ఫుటముఁ గావించినాఁడు. గజ తీర్థమును వర్ణించుపట్టున భాగవత గజేంద్రమోక్షణకథను సంక్షేపముగఁ భావగర్భితముగ జెప్పియున్నాఁడు. కథయందు ప్రసక్తిలేక పోయినను, తన కాలమున తానత్యున్నత స్థితికిఁదెచ్చిన నాట్యకళా, సంగీతకళావిశేషముల నీగ్రంథమునఁ దృతీయాశ్వాసమున వివరించినాఁడు. పుట్టి తేనియపోలిక నిట్టలంపు దీయఁదనముఁగలిగిన తెలుఁగు బాసయందు బుట్టఁబుట్టువు మనుగడను నీరాచకయిసరి వ్రాసి, తను గొల్చువేల్పునకు నీకబ్బపుఁగన్నెనిచ్చి యెల్లకడల నెల్లవేళలఁ దెలుఁగు వారిలో నెలకొనిన పేరుగడించినాఁడు. మహాదాతయై, శత్రుజేతయై, కృతిప్రణేతయై, శరణాగతత్రాతయై, గాంధర్వవిద్యాభిజ్ఞాతయై కవి పండిత హృదయసంస్థాతయగు నీరఘునాథభూనేత చరిత్రము బంగారు నీట లిఖింపఁదగినది. రాజకవీంద్రకృతమై కవిరాజసమ్మానితమగు నీతని కృతులాంధ్రమహాజను లాదరింతురుగాత !

ఈతని యాస్థానమందలి కవులు :—

## చేమకూర వేంకటరాజు

ప్రబంధవాఙ్మయమున బహుళ ప్రచారములోనుండి తెలుగు వారికి తొలినుండి తెలిసిన దాక్షిణాత్యకృతి విజయవిలాసము. ఈ రసవత్తరప్రబంధము రచియించినకవి చేమకూర వేంకటరాజు. కృతిభర్త అభినవభోజరాజబిరుదాంకుఁడు రఘునాథరాయలు. రఘునాథనాయకుఁడు పాండ్య, తుండీర, [1]నేపాళ [2]చోళగులను జయించినవెనుక, క్రీ.శ. 1516 ప్రాంతమున విజయభవన మనుసౌధమున నీకృతి నంకితముగొని యుండును. ఈ విజయభవనరాజము రఘునాథనాయకునిచే తాను

1. నేపాళమనునది-నేటి జాఫ్నా (Jaffna) అనుపదము సంస్కృతీకరణము - అరవమున దీనివి 'యాప్పాణము' అని యందురు.

2. 'చోళగ' అనునది, దేవికోట ద్వీపమును పాలించు నొకనాయకుని పేరు.

పొందిన విజయములకు చిహ్నము (పుట 18-41-424-25) గాఁ గట్టింప బడినట్లు, రఘునాథనాయకాభ్యుదయమున నిట్లు చెప్పబడినది.

“విజయచిహ్నములచే వెలయుచు నున్న,
విజయభవనరాజు వేదికాస్థలిని”

విజయవిలాసమునగూడ నీభవనము పేర్కొనబడియున్నది.

“క. చెలులు ప్రసంగవశంబున
నలరెంగడువిజయభవన మనినన్” (3-26)

ఇచ్చట కథాభాగమున విజయుఁడు (అర్జునుడు) న్న భవనమని యర్థము. రఘునాథరాయలు పై విజయములను పొందినవెనుక, నీ భవనమున కృతి నిచ్చుటచేతనే, భావస్ఫోరకముగ నీ గ్రంథమునకు, విజయవిలాసమని పేరుపెట్టియుండుట గ్రంథపరిపాటి చెప్పక చెప్పు చున్నది. దీనికి సుభద్రాపరిణయమని నామాంతరము. ఇదియును పై విషయమును స్పష్టపఱచుచున్నది.

క్రీ. శ. 1656 లో ప్రసిద్ధలాక్షణికుఁడగు నప్పకవి తన గ్రంథమున విజయవిలాసమునుండి పద్యము లుదాహరించుటనుబట్టి చూచినచో నీకృతి రచితమైన ముప్పదినలువదేండ్లలో నెంత ప్రఖ్యాతిగన్నదో తెలియగలదు.

మఱియు పల్నాటిలోని తంగెడసీమ కాపురముగాగల యప్పకవి దక్షిణదేశమున సుదూరమున నున్న తంజావూరిలో రచితమగు కృతి నుదాహరించుట చూడగా నప్పటికి రెండింటికి, నడుమ రాకపోకల వ్యవహారము లెంతనిరంతరాయముగా సాగుచుండినవో తెలియఁగలదు.

కులభేదముచేత లోకోత్తరమగు వసుచరిత్రనుండి పద్యము లుదాహరింపని యప్పకవి, విజయవిలాసరచయిత వేంకటరాజుకులము తెలియకపోవుటచే 5 పద్యము లుదాహరించినాఁడు. చేమకూర

వేంకటరాజు కులమున కళంకముగలవాడే యనుటకు శ్రీ వాసిరెడ్డి వేంకటాద్రినాయనివారి కాలమున నడచిన యీ ప్రసంగమువలన దెలియవచ్చుచున్నది.[1]

కులమున కళంకముగల బుచ్చి వెంకు అను నొకకవినిగూర్చి వేలూకకవి ప్రభువుయొక్క యభిప్రాయముగా :—

"కులమునఁ గళంకు కలదనుకొంచుఁ గొంకు
బుధజనాటన్యవన్యంకు బుచ్చివెంకు."

అనెనట. అంతట వేలూకకవి లేచి

కొంకక తమరాడిన యది
బొంకేలగు వేంకటాద్రిభూపాలక యీ
న్యంకేల వానికిం గల
రంకే యిచ్చోట నిలుప రసవంతమగున్.

అని చమత్కరించెనట. అందుల కాబుచ్చివెంకు

ఉ. పన్నినసత్ప్రబంధమున బాగునునోగును జూడ కీసుచే
మన్ననమాలి మాకులముమాటఁ దలంతురె? చేమకూర వెం
కన్నకు లోప మేమి? కులమా కవనానకు? వెంకటాద్రిరా
జన్న గణించి మీరలు దయామతిఁ బ్రోచిన మాకుఁ జాలదే?

ఉత్తమసాహితీపథకమున జాతిమతభేదములు లేవుగదా! అప్ప కవి యిందలి రచనా నైపుణికి ముగ్ధుఁడై పద్యము లుదాహరించి యుండును. అప్పకవియే యననేల, అఖండకవితా సాహితీసంపన్నుం డును, అనుపమానవైదుషీ భూషణుండును, అభినవభోజరాజ బిరుద విరాజమానుండును నగు రఘునాథరాయలే వేంకటకవినిగూర్చి "వాక్ప్రియమరూఢి నీయంతవాడికేఁడి" (1-48) అనియు, "ప్రతిపద్యమునందు

1. చాటుపద్యరత్నాకరము శ్రీ నీపాల పిచ్చయ్యశాస్త్రిగారిచే సంపాదితము, పుట 162.

చమత్కృతి గలుగం జెప్పనేర్తువ" నియు, "క్షితిలో నీమార్గ మెవరికిన్ రాదు సుమీ" (1-50) అనియు, ప్రశంసింపగా నిక తక్కినవారి ప్రస్తావనయే యనావశ్యకము. నాటినుండియు దక్షిణాంధ్రవాఙ్మయమునవే గాక నా యుగమున ప్రభవించిన ప్రబంధములన్నింటికి నిది తలమానికమై వెలయుచున్నది.

విజయవిలాసమున మూండాశ్వాసములలో క్రమముగా, 228, 206, 238 మొత్తము 672 పద్యములు గలవు. ఇందు వచనము లెనిమిదిమాత్రమే యుండుటచేత నిది కేవల పద్యకృతియనియే చెప్పనగును. ఇందు ప్రతిపద్యచమత్కృతి యిట్లు సాధింపంబడినది.

1. జాతీయములకూర్పు, 2. యమకము (గమకము)లపేర్పు, 3. శ్లేషలనేర్పు, 4. సామెతలు.

1. ఆనతియిచ్చెనాయది 'శిలాక్షరము', దానమిచ్చెనా 'ఏనుగుపాడి', కంకణముగట్టు, పంచబంగాళమైపాఱు, పెట్టనికోట, దెబ్బదీయుట, చిదిమిపెట్టినబంటులు, ఉక్కుతునుకలు, కొంగుంబసిండి, నడుమంత్రపుగల్మి, జాదులు ప్రసాదములు, కాలుద్రొక్కు, పెట్టనిసొమ్ములు మొదలగు జాతీయము లిందు చక్కగ ప్రయుక్తములైనవి. వీనిసార్థక్యము నెఱుకపఱచుట కొకపద్య ముదాహరించుచున్నాను.

చ. జలరుహగంధిపీనులపసల్ నవసంఖ్య నదేమి లెక్కనున్
చెలియ నఖాంకురాళి నెలచేసియస్సైకము దానుచుక్కనుఁ
బొలఁతుక గబ్బిచన్నుగవపువ్వులచెండ్లను లేను బంతనుఁ
కలికిముఖారవింద మల కల్వలరాయని త్రోసిరాజనున్.

2. సామెత లచ్చటచ్చట ముచ్చట గూర్చుచుండును.

వంటయింటికుందే లిది యెందుఁబోఁగలదు. 1-71. ఏటికివచ్చెనమ్మ తాఁబిలువని పేరంటమునకు. 1-78. ఈఁతకుమిక్కిలి లోఁతుగల్గునే. 1-167. మోక్షమునకుఁబోవ మొసలెత్తుకొనిపోయె. 2-43.

పెద్దలున్నారు వారెర్గి పెండ్లిసేయగలరు. 2-187. నిండ్లమ్ముఁలుగల వారికి తోడుచల్లకడపలవారే. 3-44. శోభనమునిూదని శోభనము. 3-138.

3. యమకము లప్రయత్నముగనే యర్థస్ఫురణను గలిగించును.

ఆపురమేలుమేలు భళియంచు. 1-84. యమునాతరంగిణిలో యమునా 1-121. తియ్యనివింటివాని వెనుదియ్యక 1-143. గోష్ఠి నుండెడు పద్మరాగోష్ఠి 2-100. రౌక్మమగు గిరిఁజూచిన రౌక్మమనం 2-103. కలశస్తని మణికంకణకల శస్తనినాదము 3-79.

కొన్ని పద్యములలో నన్ని పాదములం దిట్టి చమత్కృతి యుండును.

గీ. నలినలీలనంచు నలినలిగానించు
నించుమించులాడు నించుమించు
లేమనగవుఁజూపు లేమనగను! చూపు!
జగమెఱుంగుదాని జగమెఱుంగు. 1-101.

గీ. హిమరసైకసైకతమునందు విహరించు
కైరవేషువేషు ఘననిభాంగు
వెనరుఁదవుల దవులనే చూచి క్రీడిగా
నెఱిగి యాకార! యాకారగేందువదన. 2-124.

ముదితచేతులఁ దలఁబ్రాలు త్రియములు ముదితచేతులగుచు
(ముదితచేతస్కులగుచు అని యుండదగును.) 3-24.

ఈ క్రింది యుదాహరణ సాంగపదమగు మనశ్శబ్దమును ఉద్ధరణచేయును.

మనసుభద్ర సుకృతమహిమ మనసుభద్రమక్కో. 3-87.
మంగళసూత్రంబు చతురిమం గళసీమన్. 2-14.

5. జాతీయధ్వనులు : ఊఁత - (Accent) మనోభావవ్యక్తీకరణమునకు

క. మీరింద్రప్రస్థముఁ గ
న్నారా? పాండవులఁ జూచినారా? సుఖులై
వారందఱు నొకచో ను
న్నారా! వీరాగ్రగణ్య నను నెఱుఁగుదురా?

తెనుగున ఊఁత (Accent) యున్నదని చెప్పుటకు నీ గ్రంథమున చక్కని యుదాహరణములు గలవు. ఒకటి—

క. అరచందమామ నేలిన,
దొరగా 1నెన్నుదురు, నెన్ను2దురు బిత్తఱికిం
బరువంపు మల్లెమొగ్గల,
దొరగా 1బల్కుదురు, బల్కు2దురు జవ్వనికిన్. 2-78.

పై పద్యమున 1 యని సూచించినచోట నూదిపలికిన ఒకయర్థమును 2 సూచించినచో నూదిపలికిన మఱియొకయర్థమును తెలుపును- ఒకటి నెన్నుదురు = గణింతురు; రెండవది నెఱ + నుదురు - నెన్నుదురు. రెండవదానిలో నొకటి పల్కుదురు = చెప్పుదురు, రెండవది పల్ + కుదురు = పలుయొక్క కుదురు, చాలు అనగా దంతపంక్తి

ఇట్టి మనోహరకావ్యమున పాతాళలోకమున గల నాయికయులూచిని, మర్త్యలోకమున గల నాయిక చిత్రాంగదను, స్వర్గలోకనాయిక సుభద్ర (సుభద్ర శ్రీకృష్ణుని చెల్లెలు) చిత్రించి చేమకూర వేంకటకవి సిద్ధహస్తుఁడైనాఁడు. విజయవిలాసము దక్షిణదేశీయాంధ్రకవితా విజయవిలాసము.

విజయవిలాసకర్త తన కృతిపతి మహానాయకుఁడని యీ క్రింది విశేషణములచే సూచించియున్నాఁడు.

కావ్యగీతి ప్రియత్వము :—అభినవ భోజరాజ బిరుదాంకుఁడు (1-53). అభినవ భోజరాజవర బిరుదాంకా. (1-225) విద్యాధిక (2-1). స్నిగ్ధసారస్వతా (2-206). విరాజచ్చతుష్షష్టి విద్యాప్రవీణా (3-238). క్షోదక్షమరసభావ సుకవితా భోజునకున్ (1-61). సరసాగ్రేసర (1-225). భరత శాస్త్ర ప్రౌఢమార్గ లాస్య రసాస్వాదన కోవిదా (1-225). క్రమకవితాలోచన కందళిత హర్షలోలుప హృదయా (1-227). అతులాగమ శాస్త్ర నిరస్తసురేజ్య (!-227).

కులీనత :— అచ్యుతేంద్ర రఘునాథనృపా (2-1). అచ్యుతేంద్ర రఘునాథ (3-1). మూర్త్యంబా గర్భశుక్తి ముక్తామణికిన్ (1-63). అచ్యుత రఘునాథ వసుంధరాధ్యక్షునకున్ (1-64).

ధార్మికత్వము :—వానరప్రభుతనూజా స్థూలలతా (4-225). తులాదిక విద్వదవాప్త శతక్రతులాభ (1-228). శుభోదయకారణ రత్నతులాపురుషాదిక దానచణా (1-228) షోడశ మహాదానాద్య పుణ్యక్రియాదక్షా (2-204). దయాదృఢతాశేషధాత్రీమరున్నిస్స్వతా (2-206). ఘనావేలగరిష్ఠ దానవదపి పరితోషిత కాళగౌతమీ చోళకవిద్విజస్తుతవచోలగ (2-237).

గుణాఢ్యత్వము :—సత్యాదిమ చక్రేశ్వర (1-226). శ్రీ జానకీ మనోహర పూజాంచిత హృత్పయోజ (3-1). రామసేవా ధురీణా (3-238). సీతాధృజ్జానాంఘ్రి సేవాధనికిన్ (1-60). సకలాస్థానప్రణుత వరగుణాభరణునకున్ (1-62). అఘటన ఘటనా చాతుర్యఘనోర్జిత కార్యనిర్వహణ ధుర్వహధీమఘవాచార్యునకు (1-64). దక్షిణ సామ్రాజ్య విభవధౌరేయునకున్ (1-61) షష్ఠ్యంతములు.

**మహాభాగ్యము** :—పురందర విద్భోగధురంధరా (2-225). విభవ భృత్తుంగాపురీవల్లభా (1-225). ఆదిగర్భేశ్వర (2-1). శాశ్వత కీర్తివైభవ రమాభృచ్ఛోళసింహాసనాధ్యక్షా (2-204). దుగ్ధవారాశి విద్యోతికీర్తి (2-206). సుధాభుక్ధురీణామ నాగ్భోగవర్తి (2-206). పోష్యాఖిలద్విగ్రాజ (3-1). శ్వేతగజైకలాంఛన విజిత్వర శుభ్రయశో విశాల (3-237). ధారాళగళన్మదద్విరద రాజవిరాజి సభాంగణా (3-237).

**వైదగ్ధ్యము** :—తరుణీమన్మథ (1-226). శ్రవణభూషా దివ్యరత్న త్త్వహా శరణి శ్రీకరగల్లభా (1-225). వనితానేచనక మనోహరాంగ (1-227). శృంగార కళానూచన (1-227). నరాధీశ్వరాకార లీక బాణా (2-237). స్మరానందనా (3-238). సాతూన్మనోజనకు (1-69). దాక్షిణ్యగజేయున కున్ (1-61). కీర్త్యౌదార్య ధరితామర్త్య మహీరుహసుధాబ్ధి మహికాఘృణికిన్ (1-63).

**ఔదార్యము** :—ఆశ్రితభరణ గుణాభరణ (1-226). యాచకవినత (1-227). దాక్షిణ్యాకర మూర్తి (2-204). ఆశ్రిత ధీర రక్షణ కళాధౌరంధరీ సత్కృపావీక్షా (2-204). సకలార్థి జన నిర్వ్యాజకృపా (3-1).

**ప్రతాపసుభగత్వము** :—శౌర్యబహుళరాజ్య ధురంధర (-226). శ్రీధుర్యశౌర్య (2-1). ధైర్యతుష్టాధర మూర్ధన్య (2-1) దుర్దమరాట్ కిరీట దళనైకాక్షేయ క్షేయకా (2-204). కలహారంభణ కౌతూహల పులకిత భుజపరాక్రమార్జిత నానా జల దుర్గవ నీదుర్గస్థలదుర్గాహార్య దుర్గ సామ్రాజ్యనిధీ ! (2-205) చోళగమానభంజనా (2-237). ఆరాతి క్షమాభృద్భిదాం చత్ కృపాణా (2-237). శాతాసికలిత బాహాస్వీతాసికవి పతరాజ నిఖిలావనికిన్ (1-60). నేపాళనృపాల స్థాపన చణు నకు (1-62). ఘూర్జరవదరి కరిస్పృణికిన్ 1(-63)

కవితాశక్తి:—కృతిపతియగు రఘునాథనాయకుని కవిత్వమును గూర్చి, వేంకటరాజు

"ఉ. తారసపుష్టిమై ప్రతిపదంబున జాతియువార్తయుఁ జమ
త్కారము నర్థగౌరవముఁ గల్గ ననేక కృతుల్ ప్రసన్నగం
భీరగతిన్ రచించి మహిమించినచో నిఁక శక్తు లెవ్వర
య్యా: రఘునాథ భూపరసికాగ్రణికిన్ జెవిసోఁకఁ జెప్పఁగన్"

అని వ్రాసిన పద్యము ప్రత్యక్షరము సత్యము:
రఘునాథుఁడే తన కవితఁగూర్చి యిట్లు చెప్పుకున్నాఁడు.

క. చెప్పవలె కప్పురంబులు
కుప్పలుఁగాఁ బోసినట్లు కుంకుమపైపై
గుప్పిన క్రియ విరిపొట్లము
విప్పినగతి ఘుమ్మనం గవిత్వము సభలో
చెప్పఁగఁ జవులై చల్లఁగఁ
గవులకుఁ దవులై సమస్త కావ్యకళాబం
ధువులై రససింధువులై
మువురాయన కవితలవని నలరఁగవలదా? (వాల్మీకి చరిత్ర).

రఘునాథుఁడు తనకృతులయందు పేర్కొనని కవితాగుణవిశేషములను వేంకటరాజు పేర్కొనుటయే పై పద్యమున విశేషము.

అప్పకవీయమున విజయవిలాసము నుండి యుదాహృతములైన పద్యములు.

ఉ. ఆనిమొఱుంగు (1-83), శా. దేవబ్రాహ్మణ (1-85), శా. తాసైరింపక (1-114), తే. చెఱకువిలుకాని (1-158), మ. అని వశ మీమది (2-4), చిత్తజుఁడగ్గితూపు (3-15), క. కొమ్మపయి నీవు (3-56).

## వ్యాకరణ విశేషములు.

అత్త్వసంధి :—లేవెలంత, ఈబిడాకు (1-185).

ఇత్త్వసంధి :—బంతినుఁ (1 102) బంతిది (2-107) తండ్రే (3-165) మఱందింత (3-170).

క్త్వార్థేకారసంధి :—అడిగిచ్చురో (1-59) దీనిని కవిసంశయ విచ్ఛేదకారుఁడు 'ఇడగవచ్చు నుత్వప్రత్యయపై నిత్త్వసంధి...అఘమడంగఁ గాంచి శేఖరు నన్నయట్లు కవిజనానుమతిని' అని సమర్థించినాఁడు. అనవలసంటి (1-161), చూపిటు (2-202), ఉదంతమునకు షష్ఠికి నగాగమము రాయి. వాదుకు (1-134), సిగ్గుకు (2-30), మంతుకు (2-37), స్వరలోపము ఎత్తి (2-187), చాలిన్నిలుఁగు (3-61), మిశ్రసమాసములు. దినచలువలు (2-144), ఆత్మనేపదమున నను ప్రయుక్తంబగు 'కొని' కి 'క' ప్రయోగము ఊఁదుక (1-134), కట్టుక (3-154).

లఘ్వలఘురేఫలకు మైత్రి :—రూపము తారతమ్యమునెఱుంగు.

పై విశేషము న్నియు శివకవుల జాను తెనుగు సంప్రదాయము ననుసరించి సరియైనవి. ఆధ్యతన వైయాకరణ సంప్రదాయము ననుసరించినచో సరియైనవి కావు.

### విజయవిలాసము తాళపత్రప్రతులు

### మదరాసు ప్రాచ్యలిఖితభాండాగారము

విజయవిలాసము. 769 నుండి 781 వఱకు తాళపత్రప్రతులు 782, 783, 784. సవ్యాఖ్యానము.

785. Note of C. P. Brown.

This Commentary on the Vijayavilasam, a very Celebrated Telugu poem written by the learned Zuluri Appaya, on a

**Comparison of six manuscripts under the direction of C. P. Brown at Masulipatam in 1831.**

**N.B.—The preface is wanting in this Copy and must be supplied from my first manuscript when the book is Copied fair.**

**The name of the Commentator and the date of the Completion of Commentary are expected as given at the end of the M. S.**

"ఈ విజయవిలాస ప్రబంధమునకు టీకరించేలాగున ఛార్లెసు ఫిలిప్ బ్రౌన్ దొరవారు సెలవిచ్చినందున మచిలీపట్టణమందు జూలూరి అప్పయపంతులు రచించడమైనది. ఇంగిలీషు సంవత్సరము ౧౮౩౦ డిశంబరు తే ౧౧ ది విక్రుతినామ సంవత్సర మార్గశిర బ॥ ౧౩ లవరకు సంపూర్ణమైనది."

తంజావూరి పుస్తకభాండాగారము 251-255. 5 ప్రతులు 1 సమగ్రము. 4 అసమగ్రము.

ముద్రితప్రతులు,

1860. వివేకకళానిధి ముద్రాక్షరశాల.
1883. బహూరి త్యాగరాయశాస్త్రిగారి టీకతో ముద్రణము.
1894. అముద్రిత గ్రంథచింతామణి మూలముమాత్రమే.
1900. కొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావుగారిచే ముద్రితము.
1911. వేదము వేంకటరాయశాస్త్రిగారు - టీకతో ముద్రితము.
1952. శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి టీకతో ముద్రితము వావిళ్ల.

## సారంగధర చరిత్రము.

చేమకూర వెంకటరాజు రెండవకృతి సారంగధరచరిత్ర. ఇదియును విజయవిలాసమువలె మూడాశ్వాసముల ప్రబంధము. ఈ ప్రబంధమున నవతారికలేదు. ఆశ్వాసాద్యంతముల నున్న పద్యములు విజయవిలాసమునుండి గ్రైకొనబడినవి. గద్య విజయవిలాసమందలి

గద్యయే. 'ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాద లబ్ధప్రసిద్ధవాగ్వైభవ సుధాసారజనిత యశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్య కుమార కుమారారాధిత బుధసమాజ వేంకటరాజ ప్రణీతంబైన ... తృతీయాశ్వాసము.' ఇందు ప్రథమాశ్వాసమున 136 గద్య పద్యములును, ద్వితీయాశ్వాసమున 283 ను, తృతీయాశ్వాసమున 270 యును, మొత్తముమీద 689 గద్యపద్యములు గలవు. దీనికి వ్యాఖ్యగలదు. వ్యాఖ్యతో నీగ్రంథము ముద్రితము. [1]

## మూలకథ

తెనుఁగు దేశమున జనరంజకములగు కథలలో నొకటియగు నీ సారంగధర చరిత్రకథను తొలుత గౌరన నవనాథ చరిత్రమును ద్విపద కావ్యమునఁ జెప్పియున్నాఁడు. ఈతఁడు క్రీ. శ. 1480 ప్రాంతమువాఁడు. అందు 'చౌరంగి' అను సిద్ధుని కథయే సారంగధరుని కథ. ఇది మహారాష్ట్రదేశమున వెలసిన 'నాథపంథీయ' సంప్రదాయమునకు చెందినది. మాళ్వాదేశమున జరిగినది. గౌరనకృతిలో కథారంగము మాళవదేశమనియు,మాంధాతపురమనియు రాజు రాజమహేంద్రుడనియు నున్నది. మాళవదేశమునుండి యీకథ కాంధ్రదేశముతో సంబంధము గల్పించినవాడు దోనూరి కోనేరు నాథుడు. ఇతడు క్రీ. శ. 1549 లో తాను రచించిన ద్విపద బాలభాగవతమునకు చివర గార్వేటి రాజుల పూర్వులను వర్ణించుచు నందులో విమలాదిత్యునికి భానుమతికి తనయుఁడైన రాజరాజనరేంద్రుఁడు, రాజమహేంద్రవరమను పురము గట్టించి వేగిదేశమేలెననియు, నాతని పెద్దకొడుకు సారంగధరుడనియు, పినతల్లియైన చిత్రాంగి చేసిన యపకృతి గడచి చౌరంగి (సారంగధరుఁడు)

1. బహూరివారిప్రతి 1855
2. వేదమువారిప్రతి
3. వావిళ్లవారిప్రతి
4. కొండపల్లివారిప్రతి
5. శ్రీ దీపాల పిచ్చయశాస్త్రిగారి ప్రతి 1942 జితకౌశివ్యాఖ్యా సమేతము. ఇది నవీనపథకము ననుసరించి కూలంకషముగా వ్యాసంగముచేసి ప్రకటితమైన ప్రాచీన కృతులలో ప్రత్యేకముగ పరిగణింప దగినది. ఈ గ్రంథమునుండి యనేక విషయములిందు సంగృహీతములైనవి.

అను సిద్ధాంతమ్యొకటియుం జెప్పినాడు. క్రీ. శ. 1620–30 ప్రాంతముల నీ కథనే తొలుత ప్రత్యేక పద్యకావ్యముగ వ్రాసిన చేమకూర వేంకట రాజు, మాళవ మాంధాత నామములుజ్జగించి, రాజమహేంద్రవరము రాజధానిగా జేసి, మహాభారత కృతికర్తయగు రాజరాజనరేంద్రునితో నీ కథకు సంబంధము కల్పించియున్నాడు. చేమకూర వేంకట కవి కృతిని ననుసరించి యీ కథను రచించిన, బాణాల శంభుదాసు కూడ నించి తిమ్మకవ్యాదులందఱును నీ కథ యాంధ్రదేశమున జరిగినట్లే వ్రాసినారు. క్రీ. శ. 1656 లో నప్పకవి యీ కథకు స్థిరత్వము గల్పించుటకు సారంగధరునికి నాంధ్రశబ్ద చింతామణికి ముడిపెట్టినాడు. ప్రజాగాథామృతమున బహుళ ప్రచారమందిన యీ కథకు సంబంధించి నవి ముప్పది రచనములు వివిధభాషలలో గలవు.

వేంకటరాజు గౌరన గ్రంథమునందువలె చిత్రాంగి యువ్వనపు గర్తయని చెప్పగా, బాణాల శంభుదాసుడు, పైకోనేరునాథు వ్రాతకు భంగమువచ్చునని రాజనరేంద్రుని భార్యగా నొక చిత్రకథ కల్పించి నాడు. తిమ్మకవి దాని ననుసరించినాడు. కాని యీ మార్పు సహజముగ నుండలేదు. గౌరన కృతిలో సారంగధరుని భార్యపేరు మంగళాంబయని యుండగా వేంకటరాజు 'మంజువాణి' యని మార్చినాడు. ఇది సహజ ముగ నున్నది.

## కథాసంగ్రహము.

ప్రథమాశ్వాసమున రాజనరేంద్రుని సంతానచింత, ఈశ్వర ప్రసాదమువలన సారంగధరుడు జన్మించుట, అతడు దినదినాభివృద్ధి నంది యౌవనవంతుడగుట, చెంచుల విన్నపముననుసరించి రాజు వేటకుం బోవుట, సారంగధరుడు పావురాలపందెము నాడుట. ఆ పందెములో సారంగధరుని పావురము చిత్రాంగి మేడపై వ్రాలుట. అను విషయ ములు గలవు.

---

1 జలకాళి, పుట 55 పీఠిక.

ద్వితీయాశ్వాసమున సారంగధరుని చిత్రాంగి వద్దకుఁ బోవలదని సుబుద్ధి నివారించుట. సారంగధరుడు విసికివెడలుట చిత్రాంగి వలపు సారంగధరుని నిగ్రహము - చిత్రాంగి సారంగధరుని హింసించుటకుఁ బ్రతినపూనుట - రాజు చిత్రాంగికై విరాళిగొనుట - విరహబాధ సహింపలేక రాజధానికి వెడలుట. చిత్రాంగిసాంత్వనము. చిత్రాంగి సారంగధరునిపై నేరము మోపుట - రాజు మంత్రులతో పెద్దలతో నాలోచించుట. అను విషయములుగలవు. తృతీయాశ్వాసమున చిత్రాంగి వదలింప యామె నేరముస్థిరీకరించుట. రాజు సారంగధరునికి కాలుసేతులు ఖండించు శిక్ష విధించుట - తలారులు కొనిపోవుట - రత్నాంగి చిత్రాంగి సంవాదము - రత్నాంగి రాజుతో మొఱపెట్టుకొనుట - ఆమె సారంగధరుని జూచి దుఃఖించుట, సారంగధరుఁడామె నోదార్చుట, తలారులు సారంగధరుని కాలుసేతులు నఱికి పోంచియుండుట. మత్స్యేంద్రనాథుఁడు వచ్చి సారంగధరునితో నాతఁడు దోషికాడని చెప్పుట - ఆమాటలు తలారులు రాజునకెఱింగించుట. రాజు చిత్రాంగిని బిలిపింప నామె యబద్ధమాడుట - ఆకాశవాణి నిజము చెప్పుట - రాజు చిత్రాంగిని బావిలోనికిఁ ద్రోయించుట. సారంగధరుఁడు, మత్స్యేంద్రనాథుని యనుగ్రహంబున కాలుసేతులు వచ్చి సిద్ధుఁడగుట. అను విషయములుగలవు.

వేంకటకవి కథాభాగమును ననుసరించుటయే కాక, గౌరన ద్విపద పంక్తులకుఁ బద్యానువాదములుఁ గూర్చికొనెను.

గౌరన.

ద్వి. తల్లి ! నాయెడ నీకుఁ దగునె కోపంబు
మల్లడిగొనుచున్న మన్మథు వేడుకఁ
గాకనీపలుకు వికారమాటలకుఁ
జీకాకుపడి ధర్మశీలంబువదలి. (పుట 51)

వెంకటకవి.

క. తల్లీ! నాపై నీకుం
జెల్లునె కోపంబు మదనశితశరపాళీ
హల్లకనిహతి వ్యథచేఁ
దల్లడపడి నట్టిదూరు తగవా పూనన్? (2-140)

గౌరన.

ద్వి. పలికితినోరి! నాపతిలేనివెనుక
నలుకక కనుఁబెట్టి యంతఃపురంబు
వన్నెలుపచరించి నడిఁజొచ్చివచ్చి
నన్నుఁజేపట్టి మన్మథ వికారమున
నెడమాటలాడెదు విభునికేఁగూర్తు
నొడలుప్రాణంబులు నుర్వీశుసొమ్ము
పాపాత్మ! పినతల్లిఁ బట్టియీరీతి
నేపినకష్టుతే మొడనై నఁగలరె. (పుట 85)

శా. ఓరీ! నాపతిలేనిచో భయములేకొక్కింత శుద్ధాంతమె
య్యారంబేర్పడఁ జొచ్చినన్నుఁగని కామాంధుండవై ప్రేలెదీ
వారాజన్యుని సొమ్ము ప్రాయమును నా ప్రాణంబు. బొమ్మా రకే
యీరీతిన్ పినతల్లిఁ బట్టిన ఖలుం డెచ్చోఁగలండేమహిన్. (2-228)

ఇట్లనువాదములున్నను చేమకూరకవి సిద్ధహస్తుఁడగుటచే, నీ ప్రబంధమున కొక ప్రత్యేక వ్యక్తిత్వము నొడఁగూర్చినాడు. సారంగధర చరిత్రలో తెనుగునుడికారము పెంపునింపు నింపుచున్నది.

లోకోక్తులను వాడుటలో నీకబ్బమునకవి చాల నేర్పుచూపినాడు. కొండంత దేవరకు కొండంతపత్రి – గ్రామోనాస్తి కుతస్సీమా – ఏటావలి గిలిగింతలు – తలప్రాణము తోకకువచ్చె – మేనమామపోలిక మొదలగునవి యితరకవులు వాడినను నీతని వాడుకయందవి యనర్ఘమైనవి.

జాతియోక్తులతో శ్లేషార్థమును సమర్థించుట కనువుపడ్డగించిన పని, బొట్టుపెట్టినట్లు, పాలునువిఱుగు బుజాలుమూఁడయి మొదలగునవి.

శ్లేషబిగింపులు - మనసెఱుగునికల యొడలు మఱచిన శివము - మొత్తనిచోటనె గుద్దలివాడి - మూఁడు త్తరవులు.

శబ్దాలంకారమున యమకమున కీతఁడు పెట్టినదిపేరు-అవి యప్రయత్నముగనే వచ్చినటుచుండును. జనవరు కేలన్ - మనసరులకే - పరియలుగా - మురియలుగా నురియలుగా. ఇక తెనుగున పదముల విఱుపులలో నర్థాంతరములు గలుగునట్లు రచించునేర్పతని కలవడినట్లు వేఱొకని కలవడలేదు. సారంగధరునకు స్మనసారంగను - సెలవిండు తెక్కపెట్టుచు సెలవింపు నృపాలయనుచు - మేగినివరేణ్యా నీ వరణ్యమునకు - ఇట్టివి ఎచ్చటఁజూచిన నచ్చట గన్పట్టుచు ముచ్చట లొదవించుచుండును. ఇట్టి లోకోత్తర శిల్పనైపుణిం జూచియే, కవితామర్మజ్ఞుడగు రఘునాథనాయకుఁ డీతని "క్షితిలో నీమార్గ మెవరికిన్ రాదు సుమీ" యని ప్రశంసించినాఁడు. సారంగధర చరిత్రమునందలి కవితా శిల్పమును గూర్చి ప్రసిద్ధ విమర్శకుల యభిప్రాయముల నిందు పొందుపఱచు చున్నాఁడను.

బ్రౌనుదొరగారు :—విజయవిలాసము a poem in three books describing the marriage of Arjuna — సారంగధర పద్యకావ్యము. This poem is greatly admired for the beauty of it styo, which is very intricate.

**వేదము వేంకటరాయశాస్త్రిగారు** :—ఇందు పూమొగ్గలనోలె తామే విడుశ్లేషలును, ద్రాక్షాపాకంబున నోరూర రసమొల్కు రచనలును పదాచారాభిమానం బురికొల్పు ధర్మ్య నిబంధన నైపుణియు విసిగింపని వర్ణనలును, బరువులు నెరువులుం గాని కబ్బంపుఁదొడవులును ఈ ప్రబంధమును భారతి భాండాగమునంగు కడునుచ్చస్థానమందు నెలకొల్పుచున్నవి.

విద్వత్కవి వీపాల పిచ్చయ్యశాస్త్రిగారు :— సారంగధర చరిత్ర చక్కని జానుతెనుగు కావ్యము వెంకటకవి తెలుగు పొలము నాలుగంచులు తిరిగి, ఆటలు, పాటలు, ఆచారములు, అలవాటులు, సంప్రదాయములు సాంగెములు మున్నగువాని తీరుతీయములెఱింగి, సీమసీమలలోని జాతీయములైన పలుకుబడులను - నానుడులను (లోకోక్తులను) సంతరించి అందుమేల్తములేర్చికూర్చి, సుడికారపు సొంపులో, ప్రతిపద్య చమత్కృతితో నీకమ్మని కావ్యము తీర్చినాడు. విజయవిలాసమునను శబ్దశిల్పము గలదు గాని శ్లేషాది చమత్కృతులింత ప్రౌఢమైనవి లేవు. ...శిల్పనైపుణిచే చెన్నుమిగిలినను కవితా కమనీయత యందును రచనా సౌష్ఠవమునందును సారంగధర, విజయవిలాసమున కించుక వెనుకపడినమాట నిజము.

## వచనానువాదము

చేమకూర సారంగధర చరిత్ర పద్యకృతికి, సముఖము వేంకట కృష్ణప్పనాయకుడు తూ. చా. తప్పక వచనానువాదమును గావించి యున్నాడు. దాని వివరముల నాతని గ్రంథమునం జూడనగును.

ప్రసిద్ధలాక్షణికుడగు నప్పకవి సారంగధర చరిత్రనుండి యొక సీస పద్యపాదమును నొక చంపకమాలను నుదాహరించి యున్నాడు. సీ. ఉమ్మెత్తపువ్వనా నొరపైన కుచ్చుల్లు చెలగి మీగాళ్లపై చిందులాడ (1-120), చ. తలవరు లేగలేగ (3-117).

## —: కృష్ణాధ్వరి :—

ఈతడు నైషధ పారిజాతీయమను శ్లేషప్రబంధమును రచించి రఘునాథ భూపాలుని కంకితముగావించి యున్నాడు. ఈ గ్రంథము నీనాటి పరిశోధకులు కన్నుతెఱుపుకు పూర్వము హరిశ్చంద్ర నళోపాఖ్యాన పీఠికలో[1] నముద్రితగ్రంథ చింతామణ్యాధిపతులు పూండ్ల రామకృష్ణయ్యగారును ప్రథమకవి జీవిత రచయితలగు గురజాడ

1. పీఠిక 12 పుట. క్రీ. శ. 1892

శ్రీ రామమూర్తి పంతులుగారు తమ 1ద్వ్యర్థికావ్య కవుల జీవితములలోను దీనినిగూర్చి తెలిపి యీక్రింది పద్యము నుదాహరించిరి.

ఉ. ప్రేమము లేమియుంగనమిఁ బింగళిసూరన రామరాజున
ర్మ్యాభణ భాషితంబులగు పుణ్యకథాన్వయ సంగ్రహోద్ధృత
శ్లేషకృతుల్ ప్రసిద్ధిగని శ్రీరఘునాథ నృపాళమౌళికా
నైషధ పారిజాతకృతి నాయక రత్నముఁ జెంది హెచ్చుగన్

ఈ గ్రంథము నేటివరకు నముద్రితమే. తంజావూరి పుస్తకశాలలో M 215 సంఖ్యగలయొక్క తాళపత్ర ప్రతిమాత్రమే దీనికి గలదు. వేఱొక ప్రతి లేదు. తంజావూరి పుస్తక సూచికయందు నిందులో నైదాశ్వాసములున్నట్లు తెలుపబడి యున్నది. కాని గ్రంథాంత గద్య - 'ఇది శ్రీమద్రఘునాథ పాలనానుభవ నిష్ణాత కృష్ణాధ్వరివిరచితంబైన నైషధ పారిజాతీయంబను పుణ్యశ్లోకశ్లేష ప్రబంధంబునందు చతుర్థాశ్వాసము' అనునది పరిశీలించినను, గ్రంథము చక్కగా సూచినను నిందు నాల్గాశ్వాసములే యున్నట్లు నిశ్చయింపవచ్చును.

రఘునాథనాయకుఁడు డీకృతికి ముందు పెక్కు కృతులందినట్లు కృష్ణాధ్వరి యిట్లు తెలుపుచున్నాఁడు.

సీ. నవరస శ్రీరఘునాథ భూపాలీయ
నానుభామాభీష్ట నాయకుండు
పారిజాత కథావతారికా హృదయకా
వ్యస్వయంవర వరవల్లభుండు
కళ్యాణకౌముదీ కందర్పనాటక
కన్యోద్వహన బద్ధకంకణుండు
అమరుకాలంకారహారి భంగ్యర్థ శృంగార సంజీవనీ కాముకుండు.

1 ద్వ్యర్థికావ్య కవులు పింగళి సూరన. పుట 314. క్రీ. శ. 1892

సీ. తాళచింతామణీ వధూతత్పరుండు
మంచి జామాత రఘునాథమనుజనేత
తెలియ నైషధపారిజాతీయ కృతియు
నేవురకన్నల చెల్లెలై హెచ్చుననుచు.

ఇందు పేర్కొనఁబడినవన్నియు సంస్కృతగ్రంథములు - కృష్ణాధ్వరి తెలుఁగుకృతి నిచ్చుచున్నాఁడుగాన నేవురు సంస్కృతి కన్యలకు నీ తెలుఁగు కృతికన్య చెల్లెలుగా విలసిల్లునని చక్కగా చెప్పియున్నాఁడు.

## కృతిరచనా సందర్భము

కృతిపతి రఘునాథుఁడు పారిజాతాహరణ కావ్యమును, నలచరిత్రమును తెనుగున రచించియే యున్నాఁడు. ఇందులో పారిజాతాహరణము లభింపలేదు కాని నలచరిత్రము లభించుచున్నది. అది 'ద్విపద' ముందుదాహృతమైనదే - కృష్ణాధ్వరియు కృతిపతి రచించిన కథలనే గ్రహించి, యసమాననైపుణ్యమున నాకథలను జోడించి యేకైక కృతిగా రచించి, యాతని కంకితము గావించినాఁడు. ఈ విషయమే గ్రంథాదిని

ఉ. నైషధ పారిజాతహరణ ద్వికథార్థ సమర్థన (శ్రీమా)
[1]శ్లేషగతి ప్రబంధము ఫలించిన మా రఘునాథశౌరి సం
తోషముఁబొందున న్గడకతో దశదిగ్జయ శోభిసత్యశో
భూషణమైన యీకృతికిఁ బూనితిప్రౌఢినిరూఢిఁ జెందఁగన్.

తనకు నీరచనయందు మార్గదర్శకులగు సూరనరామరాజభూషణులను స్తుతించు పద్యము "ప్రేమములేక" ముందుదాహరించితిని. కృష్ణాధ్వరికూడ యసామాన్య ప్రతిభగలవాఁడగుటచేత నీరచనముత్తమ శ్రేణికిఁ జెందినదిగా విలసిల్లినది.

---

1. తంజాపురాంధ్ర నాయకరాజ చరిత్రమున పుట 237 లో "కృష్ణయజ్వ కూడా తెనుగున శృంగార నైషధ పారిజాతమను ద్వ్యర్థికావ్యమును రచించెను." అని కలదు. గ్రంథనామము సందెక్కడను ముందు శృంగార పదము గన్పట్టుటలేదు. ఇది శ్లేషప్రధానమగు ద్వ్యర్థి కావ్యము - గ్రంథములో "నైషధపారిజాత హరణద్వికథార్థసమర్థన క్రియా శ్లేషగతి ప్రబంధము" అనియు గద్యలో 'నైషధపారిజాతీయంబను శ్లేషప్రబంధంబునందు' అని కలదు.

## కథాసంపుటీకరణము

ఈ ప్రబంధ కథలలో నలకథ మహాభారతారణ్య పర్వమునను సంస్కృతాంధ్ర నైషధములయందును గలదు. పారిజాత కథ భాగవతమున నున్నది. ఇందు మహాభారతమున నలునికథలో నల దమయంతీ వివాహానంతరము రాజ్యవినాశమును పునఃప్రాప్తియుగలవు. నైషధమున వివాహముతో గ్రంథము పరిసమాప్తమగుటచే, నా భాగమునే కృష్ణాధ్వరి గ్రహించినట్లు ఈ క్రింది పద్యమునలన దెలియుచున్నది.

క. శ్రీహర్ష శ్రీనాథ
వ్యాహారప్రతిభ సంస్కృతాంధ్ర నిబంధ
వ్యూహాని నాకు దొరకుట
యేహరు పృథయార్థ కథన హేళిక కనుచున్."

## ప్రథమాశ్వాసము

"చారులమూలమున దమయంతీ సౌందర్యగుణవిశేషముల నెఱిఁగిన నలుఁడామెయందు బద్ధహృదయుఁడై ప్రొద్దుబుచ్చుటకు నుద్యానవనమునకేగి యందు హంసనుబట్టుకొని యామె ర్తమై వేడినదానికభయం బిడెను.. ప్రత్యుపకార మొనర్ప నెంచిన హంసయు దమయంతిమొద్ద కప్పుడె యేగియామె నలునియందను రక్తయగునట్లొనర్చెను.

శ్రీకృష్ణుఁడు, చారులవలన నరకాసురుని దుష్టవర్తనము విని యొకనాఁడు వనమున విహరించుచుండ నరకపీడితులైన దేవతలాతని శరణుఁజొచ్చిరి. ఆర్తులైనవారికభయంబిడి యాతఁడు నరకునివధియింప నిశ్చయించెను. దేవేంద్రుఁడంత నాతనికి నరకునికారాగారముననున్న రాజకన్యలవార్త నెఱింగించి వారినాతనితోఁ గూర్చువాఁడై యప్పుడ రాజకన్యలమొద్దకేగి వారు శ్రీకృష్ణునియందు బద్ధహృదయలగునట్లొనరించెను.

## ద్వితీయాశ్వాసము

నారదుఁడు దేవలోకమునకేగి దిక్పాలురతోఁ గొలువున్న యింద్రునకు దమయంతీరూపమును వర్ణించి చెప్పి యింద్రాదిదిక్పాలకు లామెను వరింప భూలోకమునకేగఁ బ్రతినసల్పుట్లొనరించెను. విదర్భపురమున భీమరాజు దమయంతీ స్వయంవరసన్నాహ మొనరించెను.

నారదుఁడు ద్వారకకేగి శ్రీకృష్ణుఁడు రుక్మిణితోనుండ నొక పారిజాత పుష్పమును కృష్ణునకిచ్చి యాతనిచే దానిని రుక్మిణికిప్పించెను. ఆ వృత్తాంతము విని యాగ్రహించిన సత్యభామకు శ్రీకృష్ణుఁడు దేవలోకమునుండి పారిజాత వృక్షమును దెచ్చియిచ్చుటకుఁ బ్రతినఁజేసెను. అనంతరము శ్రీకృష్ణుడు నరకాసుర వధకై ప్రాగ్జ్యోతిషమునకేగ సన్నాహ మొనర్చి సంసిద్ధుఁడై యుండెను.

## తృతీయాశ్వాసము

ఇంద్రాగ్ని యమవరుణులు స్వయంవరమునకై భూలోకమున కరుదెంచి స్వయంవరమునకుఁబోవు నలుని మార్గమునఁ గాంచి యాతనిఁ బ్రార్థించి దమయంతియొద్దకు దూతగాఁ బంపిరి. భీమరాజు స్వయంవరాగతుల నెదుర్కొని సత్కరించెను. నలుఁడు దమయంతి యందమును వర్ణించి యనంతరము దౌత్యమును నెఱవేర్చెను.

శ్రీకృష్ణుఁడు బలదేవసాత్యకికృతవర్మాదులతో నరకునిపై వెడలి మార్గమధ్యమునఁ దన్నుఁ గాంచిన యింద్రాదులఁ బంపి నరకునిపురమును ముట్టడించి సకలబల సహితముగ నాతని నడఁచివైచెను. అనంతరము ప్రాగ్జ్యోతిషమును బ్రవేశించి నరకుని కారాగారమునయున్న రాజకన్యల రూపములను వర్ణించి వారితో సంభాషించెను.

## చతుర్థాశ్వాసము

భీమరాజు ప్రార్థింపఁగా సాక్షాత్కరించిన సరస్వతీదేవి రాజకుమారుల నొక్కొక్కరిని దమయంతికి వర్ణించి చెప్పుచు నామెవారిని

వరింపనిచ్చగింపకుండ వేతాళుని వర్ణించుచు నిట్లు షోడశసహస్రరాజ
కుమారకల వర్ణించెను. అనంతరము నలకూబరాదులను నింద్రాదుల
నుంచెలదాసి వర్ణించి యనంతరమునలుని వర్ణించెను. అపుడు దను
యంతి యుత్సుకత నొందసరస్వతి యామెను గొనిరాగా దను
యంతియు నలుని కంఠమునఁ బుష్పదామమును వైచి యాతని వరి
యించెను ఆయుత్సవ సమయమున నష్టదిక్పాలకులు వారి దీవి
నయుండు దమయంతిని వివాహమై స్వపురముం జేరి యామెతో విషయ
భోగములం దేలి పుత్త్రపౌత్త్రయుండై సుఖముగా రాజ్యముచేయుచుండెను.

కృష్ణునిచేఁ బ్రార్థితయై సత్యయురుదెంచి గొరుకుర- రాజ
పుత్రికిఁ గృష్ణ వర్ణించి తెల్పియామె కృష్ణునివరించి యభిప్రాయము
మెఱింగి యన్యరాజకుమారికి దెల్పుచు నిట్లు షోడశ రాజకుమారికలను
గృష్ణునివర్ణించి చెప్పెను. అంతఁ దనయందు బద్ధానురాగలగువారిఁ
గృష్ణుండు ద్వారకకనిపి సత్యతో స్వర్గమున కేగుచు మేరువును దాసి
యామె కింద్రాది నివేశంబులు వర్ణించిచూపెను, స్వర్గ ప్రవేశమొన
రించి యదితికి కుండలములర్పించి యామెపొగడ్తలంది యింద్రోద్యాన
మందలి పారిజాతమును దాసి యావృక్షమును బెఱికిగరుడనిపై నిడియుద్ధ
గించిన దేవతలనదిమి సత్యాయుక్తుండై ద్వారక కేగి యామెయుద్యాన
మున నావృక్షరాజమును బ్రతిష్ఠించి శుభముహూర్తమున రాజకన్యా
సహస్రంబుఁ జేపట్టి దక్షిణనాయకుండై మెలంగుచుఁ బుత్త్రపౌత్త్రయుండై
సుఖముగా రాజ్యము చేయుచుండెను.”

కృష్ణాధ్వరి పై రెండు కథలయందును నేకథను పూర్ణముగా
మూలమునుండి గ్రహింపక రెండింటిని నిపుణముగా మేళవించెను.
భాగవత కథయందలి యింద్రాదులు శ్రీకృష్ణునితో నరకుని దుష్కృత్య
ములు దెల్పుటయు నాతనినరకుఁడు వధింపఁబ్రతిన వట్టుటయునను కథతో
బ్రారంభించి దానికి తిమ్మన (పారిజాతాపహరణములోని) కథకుమాతృక
యగు కథలోని నారదాగమనమును, అతఁడొసఁగిన పుష్పమును శ్రీ
కృష్ణుఁడు రుక్మిణికిచ్చుటయు నందులకుసత్య యాగ్రహింప నామె

కొఱకు దేవలోకమందలి పారిజాత వృక్షమునే తెచ్చియిచ్చుటకు బాసయిచ్చుటయు నను కథనతుకు వెట్టియనంతరము నరకవధయు నదితికుండలము లిచ్చుటకు స్వర్గమున కేగి మరలివచ్చునపుడు దేవపారిజాత మునుహరించుటయు షోడశ సహస్రరాజకన్యలం బరిణయ మగుటయు ననుభాగవత కథాభాగముతో ముగించెను. ఈ కల్పనచే నారదుం డింద్రాది దిక్పాలకులకు దమయంతీ రూపగుణములు వర్ణించిచెప్ప వా రామె పాణిగ్రహణమునకై విదర్భాపురమున కేగం బ్రతినసల్పిరను నైషధ కథ కనుకూలకథ యేర్పడుటే కాక మిక్కిలి రసవంతమై భాగవతకథకు వన్నెవచ్చినది.

ముఖ్యమగు నీ మార్పే కాక నైషధకథానురోధముచేఁ బారిజాత కథయందును పారిజాతకథానురోధముచే నైషధకథయందును గవి చేసిన మార్పులనేకము కలవు. శ్రీకృష్ణుండు తన్నువలచిన పదునాఱువేల రాజకన్యలను మన్నించి యందలమున నిడి ద్వారకకుఁ బంపినట్లు భాగవతమునుండి గృష్ణాధ్వరి దమయంతీస్వయంవరానురోధముచే శ్రీకృష్ణుఁడు దన్ను రాచకన్నియలకు వర్ణించి చెప్పసత్యను బ్రార్థించెననియు నామె యొక్కొక్క తెకు వేర్వేర నాతని గుణరూపములు వర్ణించి చెప్పెననియుఁ గల్పించెను. ఇట్లు సత్యకింద్రాదినివేశంబులు వర్ణించి చెప్పుట మొదలగు నవి కూడ కల్పింపఁబడెను. పారిజాత కథయందలి కృష్ణనరకాదుల యుద్ధమున కనుకూలముగ భీమరాజు స్వయంవరాగతుల నెదుర్కొనుటయు శ్రీకృష్ణుఁడింద్రాదులతో యుద్ధముచేయుట కనుకూలముగ నలవరణ సమయమందలి సమ్మర్దమును గంచుకులు వారించుటయు[1] లోనగునవి గల్పింపఁ బడినవి.

1. సీ. ప్రాసఖడ్గాదిసంబాధులౌ యోధుల దండకురాకుండఁ దఱిమి తఱిమి
ప్రస్ఫురత్క్షురరజో భ్రాజులౌ వాజుల నొమ్మిఁ గ్రమ్మరకుండఁ దోలి తోలి
గజ్జన్మదస్రవారంభులౌ కుంభుల కోటిదూరంబుగాఁ గొట్టికొట్టి
కటురయాక్రాంతసత్పథములౌ గథములఁ గనుచూపుమేర నేగదిమి గదిమి

తే. కంచుకులగ్రకౌరివత్తుమునదవ (?) రాజమార్గంబుసర్వతోరణముగుచు
నావనావరులతిమాత్రహర్షులైరి. దైవతావనిపత్రచూతములనిడ.

క. అమ్మహిపాలకుమారుల, యొమ్మిక దెలుపంగ నేరఁడౌరుఁడని విశ్వా
సమ్మున విదర్భభూపతి, నెమ్మదిఁ బ్రార్థింపవచ్చె నెనరుదయింపన్

వ. సారగనాథురాణి యమ్మహాబాహు నెదిరి ప్రత్యక్షమయ్యె.

ఈకవి వర్ణనలకును మృదుపదరచనానైపుణ్యమునకును సులభ గ్రాహ్యశ్లేషకు నీక్రిందిపద్యముల నుదాహరణములుగా గ్రహింపనగును. ఉభయకథాపక్షములను జంద్రోదయవర్ణనము.

"సీ. అంధకారముగొందులకరుగూకిననేమి
వెన్నెలకుబ్బుఁ గావింపలేదె
అంభోరుహశ్రీలనాహరించిననేమి
కైరవంబులనెల్లఁ గావలేదె
కోకంబులకు మేలుఁ గూర్పకుండిన నేమి
చెరఁజకోరముల మన్నింపలేదె
విరహిదంపతులకు వేడి చూపిననేమి
సుఖితులకునుజల్వజూపలేదె

గీ. మేలుదలఁచినవారికి మేలుచేయుఁ
గీడుదలఁచినవారికిఁగీడుచేయు
నేఁడు జాబిల్లినెత్తిదీవించనేల
ధర్మమిదిరాజమాత్రసాధారణులకు."

పురవర్ణనము, స్త్రీవర్ణనము

సీ. రంగారుకడవన్నెబంగారుకుండల
నొరయుచు నుండుపయోధరములు
కంటికిమూరమౌకాశావకాశంబు
నధరీకరించుమధ్యమునుతీవి
మాలిన్యమెఱుఁగనిమణిదర్పణంబులఁ
గడకొత్తుముఖ చంద్రకాంతకాంతి
మించురత్నాకరమేఖలకునుభూష
ణంబై నచాయునితంబభార

తే. మారవర్ణింపఁ బ్రద్యుమ్న హర్మ్యమిట్టిదింతియే యనిమరి నిశ్చ
యింపరాని
యేపానతిఁ జెరా ... ... నృపతి పుత్త్రికలు జూచి హృదయ
మలర."

నోరయుచునుండు (పు) [1]రాచుకొనుచుండు (స్త్రీ) పోటీచేయు
చుండు

పయోధరములు (పు) మేఘములు (స్త్రీ) స్తనములు

రత్నాకరమేఖల (పు) సముద్రమునొడ్డాణముగాఁగలభూమి (స్త్రీ) రత్నముల కాకరమగు నొడ్డాణము.

వ. సత్యాయత్తచిత్తానువర్తకార్య నిర్వాహణంబుకై వచ్చితి వంటివి తత్సాక్షికంబుగా నిన్ను వరించెద ముదితస్వయంవరోత్సవంబున ననుచు రాజకన్యాలక్షణంబున విన్నవింప ననుకంప మానుండై విని రేపు సోమశ్రవణంబు శోభనకృత్యంబులకు నిశిరంబు ప్రవేశించి హర్షోత్కర్షంబున సమస్త రాజలోక సాధారణ నాగరిక సౌవస్తిక స భాషణంబుల విదర్భభూపతి పూజ్యమానుండై సముద్యద్వైభవ వివాహశోభ నలుండు నగరిశృంగారంబు గావింపగా మించుచుండె నప్పుడు.

సత్యాయత్తచిత్తా { (నై)[2] సత్యమునకధీనమైన చిత్తముకలవాఁడా / (పా) సత్యభామకధీనమైన చిత్తముకలవాఁడా

తత్సాక్షికంబుగా { (నై) సుపర్వులు సాక్షులై యుండఁగా / (పా) సత్యభామ సాక్షియైయుండఁగా

రాజకన్యలు + అక్షణంబున (పా) రాజకన్య + లక్షణంబుననై

విదర్భభూపతి + పూజ్యమానుఁడై (పా)

విదర్భభూపతి (చేతఁ) బూజ్యమానుఁడై (నై)

వివాహశోభ (చేత) నలుండునై

వివాహశోభనలు + ఉండు (పా)

1. పు = పురవర్ణన. స్త్రీ = స్త్రీవర్ణన.
2. పా = పారిజాతాపహరణకథ. నై = నైషధకథ.

క. ధృతిచే విదర్భభూపతి, సుతనుసమాజంబునెల్లసాక్షిఁగాంచి శుభ
స్థితిఁ బెండ్లియాడె నధికగతి, రతిభావనలుంచు సానురాగ శ్రీలన్.

విదర్భభూపతిసుతను = విదర్భరాజకుమారి యగు దమయంతిని (నై)
సమాజంబునెల్లన్ = సదస్యులనందఱను (నై)
విదర్భభూపతి = రుక్మిణీపతియగు కృష్ణుఁడు
సుతనుసమాజంబున్ = రాజకన్యసమూహమును

సూరనాదులుపయోగించిన యాంధ్రభాషా సంస్కృతాభిభాషా శ్లేషాదులగు నర్థశ్లేషలను గ్రహించినట్లు పై యుదాహరణముల వలననే స్పష్టముగాఁ దెలియుచున్నది. (నైషధ పారిజాతీయముసంఖ్య. 172.)

ఇట్టి యుత్తమకావ్య మింతవఱకును ముద్రితము కాకుండుట యాంధ్రుల దురదృష్టము. దీనినిగూర్చి మద్రాసు విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధన శాఖాపత్రికలో శ్రీ చల్లా సత్యనారాయణగారి వ్యాసము చూడఁదగినది.

అముద్రిత నైషధపారిజాతీయమునుండి మఱికొన్ని పద్యము లుదాహరించుచున్నాను.

షష్ఠ్యంతములనుండి

క. వరదోషా ? పరయోషా
పరభాషా రహిత భూమిపాలక బుషికిన్
మరుదుర్వీ కరదర్వీ
కరటుర్వీశ ప్రతాప ఘనతేజునకున్

క. వాణీనిపుణసభాంత
ర్వాణీహితను వస్తుమహిత వాదాన్యకయు
క్పాణికిఁ బరగిరి బిరుదక్రు
పాణికి రఘునాథభూమిపాలాగ్రణికిన్

కవి విజ్ఞప్తి

చ. ఫణితఫణీంద్రులార ! రసభావ వశంవద భావనాఘనం
ఘణితమదుక్తి ధోరణులఁ గల్గిన తప్పులు దిద్దరయ్య ! త
ద్గుణమగుణంబు దూషణము దూషమౌనను వారుగాక త
ద్గుణముగుణంబు దూషణము దూషణమౌనను వారలాప్తులే.

శా. ఆలంకారిక పూర్ణమత్కృతి పరంబాజాన సారస్వత
శ్రీలుండై రఘునాథశౌరిగని హర్షింపంగ నన్యుల్ వృథా
స్థూలంభావుకులైన కొందఱు దృఢప్యూతోష్ఠతా సూచితో
పాలంభుల్ గనకున్ననేమి కుహనా హల్లోహలుల్ లోహలుల్.

## క్షేత్రయ

ఆంధ్రసంగీత ప్రపంచమున మూర్తిత్రయమని చెప్పఁదగినవారు అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్య. వీరిలో కడపటివారిరువురు తంజావురాస్థానికి సంబంధించినవారే. క్షేత్రయ సంగీతవిద్యాచక్రవర్తి యగు రఘునాథుని దర్శించినట్లుగా మండ నరసింహకవి రచించిన (ఆంధ్రకౌముది) యను గ్రంథమున నిట్లు గలదు.

మువ్వగోపాలభక్తేన క్షేత్రజ్ఞకవినా ఉక్తత్వాచ్చ.

క. తమ్ముదామె వచ్చురర్థులు. క్రమమెఱిఁగిన దాతకడకు రమ్మన్నారా
కమలంబు లున్నచోటికి, భ్రమరంబులు యచ్చుతేంద్ర
రఘునాథనృపా !

కాని యీతనిపై క్షేత్రయ చెప్పినపదములు కానరావు.

## కవిచౌడప్ప

ఆంధ్రవాఙ్మయమున హాస్యరసమును వెల్వారించిన కవిచౌడప్ప రఘునాథనాయకుని నెఱిఁగినట్లుగా నిక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

క. నేరుతునని మాటాడఁగ, వారిజభవునంతవానివశమా ! తంజా
వూరిరఘునాథరాయని, గారొకఁగఁగ కుందవరపు కవిచౌడప్పా.

రఘునాథుని గూర్చినవి :

ఉ. రాజిత రాజకోటి నతి నన్వయమున్న సువర్ణదాన సం
పూజితవిప్రకోటి మతిబొందుచునార్గురు చక్రవర్తులన్
రాజులఁ జేయునట్టి రఘునాథ నృపాలుఁడె చక్రవర్తియా
నీ జగమందు నేఁడు మొదలిర్వు రియిద్దరు రాజులెన్నఁగన్.

ఉ. ఆయతకీర్తి ధౌతహరిదంచలుఁ డంజన లక్షణాభినో
పాయ దృఢప్రయోగ పరిపాటి కృతుల్ రఘునాథ భోజ భూ
నాయకుఁ డందుగాక విగుణస్ఫురదోషములెల్ల ఘుణాక్షర
న్యాయజడ ప్రబంధముల నందుమనంగలనైన నందునే

మ. స్వయముక్తాత్మకృతిస్తుతుల్ జనులు భాషామంజరిం జెలంగని
ర్ణయముల్ గాంత సమాసచక్రము క్రియల్ నైఘంటుకాఖ్యల్ నిర
న్వయతం గూర్చి కవిత్వమను సభలఁ వర్ణింప విద్వత్కవి
ప్రియమా నాపదవాక్య మానసువచశ్రీ మత్కృతుల్ దక్కఁగాన్.

## విజయరాఘవనాయకుఁడు

విజయవిలాసకృతిభర్తయై, వాల్మీకిచరిత్రాదికృతికర్తయై సంగీత విద్యావిశారదుఁడని మహాప్రసిద్ధిఁ జెంది యాంధ్రులకు, చిరస్మరణీయుఁడగు తంజావూరు రఘునాథరాయని కొమారుఁడీ విజయరాఘవనాయకుఁడు. రఘునాథరాయని వెనుక క్రీ. శ. 1633 నుండి క్రీ. 1673 వఱకును దంజావూరును బరిపాలించెను. ఈతని కాలముననే మహారాష్ట్రులు తంజావూరిరాజ్యము నాక్రమించుకొనిరి. ఈతని కొమారుఁడు మన్నారుదేవుడు కూడ తండ్రితోఁగూడి మహారాష్ట్రులతో యుద్ధమున మడియుటచే తంజావూరు నేలిన యాంధ్రరాజులలో నీతఁడు కడపటివాఁడు.

తండ్రివలె విజయరాఘవనాయకుఁడు కృతిభర్త, కృతికర్త. ఈతఁడు తెలుగున నాటకములు, ద్విపదలు, చౌపదలు మున్నగునవి, పెక్కు రచించినాఁడు.

## నాటకములు

1. రాజగోపాల విలాసము, 2. చెంగమలవల్లీ పరిణయము, 3. గోవర్ధనోద్ధరణము, 4. రతిమన్మథవిలాసము, 5. రాసక్రీడానవనీత చోరము, 6. పారిజాతాపహరణము, 7. రుక్మిణీ కల్యాణము, 8. రాధామాధవము, 9. ధనాభిరామము, 10. సత్యభామావివాహము, 11. ఉషాపరిణయము, 12. దక్షిణద్వారకాస్థలవర్ణనము, 13. కాళియమర్దనము, 14. రఘునాథాభ్యుదయము, 15. ప్రహ్లాద చరిత్రము, 16. పూతనాహరణము ? 17. విప్రనారాయణ చరిత్రము, 18. సముద్రమథన నాటకము, 19. కృష్ణవిలాసము, 20. మోహినీ విలాసము, 21. జానకీ కల్యాణము, 22. ప్రణయ కలహము. 23. కంస విజయము.

## ద్విపదలు

1. పాదుకాసహస్రము, 2. మోహినీవిలాసము, 3. రఘునాథ నాయకాభ్యుదయము.

1. గోపికా గీతలు, 2. భ్రమర గీతలు, సంస్కృతమునుండి తెలిఁగించినవి.

## చౌపదలు

1. ఫాల్గునోత్సవము రగడ - చౌపది.

## దండకములు

1. రాజగోపాల దండకము.

ఇంకను. వేడుకోలు విన్నపములు, దరువులు, ఏలపాటలు, సంకీర్తనలు, కోలవంజి, మొదలగు యక్షగానములు, నాట్యము సేయునప్పుడాయా యభినయనములకు రాగములకు ననుకూలములగు నాట్యములు నీతఁడు రచియించినట్లు ప్రహ్లాదనాటక పీఠికచేఁ దెలియుచున్నది.

ఈతని గ్రంథములనుగూర్చి వివరించుటకుముందుగా, నీతనియాస్థా మున విలసిల్లిన చెంగల్వకాళకవి రచించిన రాజగోపాలవిలాసము నుండి యీతనిచరిత్ర నుదాహరింతును.

—: విజయరాఘవనాయకుని చరిత్ర :—

"శ్రీహరిపాదపద్మమున నాల్గవజాతి ప్రభవించెను. ఆ జాతిలో కొండఱు రాజచంద్రు లుదయించిరి వారిలో కృష్ణరాజను నాతఁడు మొదటివాఁడు. అతనికి తిమ్మరాజు జన్మించెను. తిమ్మరాజు గుణాతిశయముచే శ్రీహరియే మానవునిగా నవతరించినట్లు ప్రఖ్యాతిగాంచెను. అతనిభార్య బయ్యాంబ. వారలకు మహాప్రసిద్ధుఁడు చెవ్వనృపతి కొమారుడయ్యెను. అతఁడు శ్రీశైలమునకు సోపానపంక్తి కట్టించి, ప్రాకారమును నిర్మించెను. వృద్ధాచలమున ప్రాసాద మండపములు గట్టించి గ్రామములనా క్షేత్రపతికి దానమిచ్చెను. అరుణాచలమున దేవాలయమునకు గోపురము కట్టించెను. వృషభగిరియందు పూజాదికము లేర్పాటుచేయించెను, చెఱువులు త్రవించి, షోడశమహాదానములు కావించెను. ఈతనిని చిన చెవ్వప్పయని యందురు. చినచెవ్వప్ప మూర్తిమాంబను పెండ్లియాడి యామెవలన అచ్చుతప్పనాయకుఁడను పుత్త్రునిఁ బడెసెను.

అచ్చుతప్పనాయకుఁడు శ్రీరంగనాథస్వామికి సింహాసనము ప్రణవమయమైన బంగారుసెజ్జ, రత్నాంగద కిరీటరాజము, అభయహస్తము నర్పించుటయేగాక దేవళమునకు నెనిమిదవ ప్రాకారమును గోపురమును నన్నశాలయును కట్టించెను. ప్రాకారములలో నారామములు నిలిపి, చైత్రరథారోహణోత్సవము జరిపించు నేర్పాటుచేసెను. అచటనున్న యర్చకకోటి కగ్రహారములిచ్చి, వివిధనాట్యసేవ, నివేదనములు ప్రతిదినము జరుగ గట్టడఁగావించెను. శ్రీరంగపతి సన్నిధానమున ముత్యాలతో తులాపురుష దానమును గావించెను. ఈతఁడు భక్తిపరుడేకాక పరాక్రమవంతుఁడని సమర నిశ్శంకుఁడని కీర్తిఁగాంచెను.

ఇట్టి యచ్యుతనాయకునికి మూర్తిమాంబకు రఘునాథనాయకుఁడు జన్మించెను. రణము పెండ్లిచవికెగా భావించిన మహావీరుఁడు రఘునాథుఁడు. అతడు పాండ్య, తుండీర, చేర, పారశీక, ఆంధ్ర దేశ రాజుల నందఱనుజయించి, విజయలక్ష్మిని వరించెను. అతడపజయమన నెఱుఁగఁడు ఈతఁడు రణరంగ ధీరుఁడైనను శత్రురాజులు వెనుకకుఁ దగ్గనవారిని సంరక్షించి, వెన్నాడకయుండు నుదారుఁడు. ఈతని యేనుగుల శాలలో, వింధ్యసింహళపు టేనుగులు. గుఱ్ఱాలశాలలో శక. సింధు బాహ్లీక దేశపు గుఱ్ఱములు నుండెడివి. భాండాగారములో కోట్లసంఖ్యకుమించు నవరత్నమయ కాంచనాభరణములు. ప్రకాశించెడివి. నగరిలో మెఱపుదీగెలఁ బోలిన మెలతలు, మెలఁగెడివారు. ఇవియన్నియు శత్రురాజుల కానుకలు. ఈతఁడు జయించిన వీరులకు లెక్కలేదు. వైరిరాజుల శిరస్సులను పాషాణములతో నితఁడు కావేరీనది కానకట్టగట్టెనఁడన వచ్చును. కృతులు మెచ్చంగఁ దగినసత్కృతులు ధరాదేవికి హారములనదగు నగ్రహారములు, సకల దేవాలయ ప్రతిష్టలు సర్వవిధములైన దానములను చేసి రఘునాథనాయకుఁడు రాజ్యమేలెను.

రఘునాథరాయుని భార్య కళావతి. ఆమె పరమపతివ్రత. వారికి, అచ్చుతరామభద్రుఁడని విజయరాఘవనాయకుఁడని యిరువురు కుమారులు గలిగిరి. అందు పెద్దవాఁడగు రామభద్రుఁడు మహావీరుఁడు. అతని నిలువెల్ల కరుణ. అతనిపలుకులు నీతిప్రచారములు. తలపులు ధర్మమునకు పుట్టినిండ్లు. నడకలు దాక్షిణ్యాసంకేతములు. అతఁడు మన్మథునివంటి సుందరుఁడు. అతనిసోదరుఁడే విజయరాఘవనాయకుఁడు. ఇతఁడే కృతిభర్త.

ఈతఁడు మహాపరాక్రమశాలి. శత్రురాజుల నిగూఢ తంత్రంబు లెఱుఁగు నింగితజ్ఞత, వైరిరాజభూతములను నిగ్రహించు శక్తి, పరిపంథి వర్గమును స్తంభింపఁజేయు మగఁటిమి, పరరాజులను యంత్రపు బొమ్మల వలె నాడించుబుద్ధిసూక్ష్మత, యితని యందు మూర్తీభవించి యుండెను. ఒకనాఁడే మైదాను యోజనములుమేర దాడి వెడలి తిరిగివచ్చు దండి

తనము, ఒక గుఱ్ఱముపైనుండి వేఱొకగుఱ్ఱముపైకి నెగురులాఘవమును, మావంతు నెదిరించి యేనుగుపైకి గిరి దానిఁదలించు భుజశక్తి, ఎట్టి శూరునైన నెదుర్కొని. వానిమర్మములు నాటునట్లు సూటిగా కత్తి మీటు చాకచక్యము నీతనియందే కన్పట్టును.

—: సాహిత్య రాయ పెండేరము :—

ఈతని కాలికి 'సాహిత్యరాయ పెండేరము' అను బిరుదందె కలదు. అది, వైడూర్యములతోను, పద్మరాగములతోను, ముత్యములతోను, నీలములతోను కూర్పఁబడి సామంతరాజులు మ్రొక్కుచున్నప్పుడు వారి కిరీటముల కాంతు లీగండపెండేరమున కుపచారము సమకూర్చుచున్నట్లు మెఱయుచుండెడిది. సభయందు, జరుగు తర్కవ్యాకరణమీమాంసా చర్చలు, నవ్యకావ్యసాహిత్య నైపుణ్య ప్రదర్శనములు, లక్ష్యలక్షణగ్రంధ సమన్వయ చాతుర్యములు, చమత్కారభాషాగోష్ఠీవినోదములు నీగండ పెండేరమున కుపచారము చేయుచున్నట్లు కన్పట్టెడిది. ఈపెండేరనినాదము బిరుదవాద్యములనాదమున కుత్కర్ష గలిగించుచు, విద్యావిషయక సందేహములు గలిగినప్పుడు రాద్ధాంతనినదమును ప్రకటించుచు సకలవిద్యాసామ్రాజ్యసింహాసన మెక్కినట్లు నిలసిల్లుచుండెను. మఱియు నీపెండేరమున నాతఁడు జయించినరాజులు బొమ్మలై వ్రేలుచుండిరి.

—: శారదాధ్వజము :—

ఈతఁడు 'విజయరాఘవవిలాసంబున' విద్యాగోష్ఠి నున్నప్పుడు, పైపెండేరముగాక, యాతనిమ్రోల "శారదాధ్వజము" నొప్పుచుండును. ఒక్కయెడ చీనిచక్కెర పానకమువలె మధురమై, వేఱొకయెడ విరజాజి పూవుదండవలె పరిమళయుక్తమై, మఱియొక్కయెడ మలయమారుతము వలె చల్లనై, యింకొకయెడ, నిండువెన్నెలవలె నిరతిశయాహ్లాదకారియై వెలయునట్లు కవితచెప్పఁగల చాతుర్యము విజయరాఘవనాయకునికే కల దని, తనహస్తముచే నీధ్వజము చాటుచుండును.

"పద్యము నవనవోన్మేషమై వెలయవలెను. వాక్యవైఖరుల లంకారానుసారులు కావలెను. శబ్దము పాణినీయవ్యాకరణ ప్రామాణ్యమై యుండవలెను. కర్పూరమువలె కవితాసందర్భము గప్పున గుబాళింపవలెను" అని శారదాధ్వజము చాటుచుండెడిది.

విజయరాఘవనాయకుని సాహిత్యగోష్ఠిలో, పసిఁడి తీవలఁబోలిన పడఁతులు "పాండ్యమండల విభాళా" యంచు గైవారము చేసెడివారు. భరతసంగీతసాహితివిద్యలు భామాస్వరూపములు దాల్చినవో యనునట్లు, తమతమబిరుదు వాద్యములు, చిహ్నములు, వెలయఁగా తారుణ్యవతులగు తరుణు లందు తనరారుచుండిరి. వారిలో నాటకర్త్రులు పాటకర్త్రులు నుండిరి. ఆటకర్త్రులలో,

చంద్రరేఖ

యను నామె యగ్రస్థానమధిష్ఠించినది. ఈమె విజయనగర సామ్రాజ్యాధీశుఁడగు వీరవేంకటరాయపృథ్వీమహేంద్రునివలన బహువిధ బిరుదగౌరవముల నందిన నట్టువరాలు. ఈమెకాక నీ క్రింద నుదాహరింపఁబడిన నాట్యకర్త్రు లాసభయందెన్నిక గన్నవారు. వారొక్కొక్క నాట్యమున ప్రత్యేకవిశిష్టత గడించిరి.

| | | |
|---|---|---|
| రూపవతి | – వే పదములు | నాట్యము |
| చంపకవల్లి | – శబ్దచూడామణి | ,, |
| మూర్తి | – జక్కిణి | ,, |
| కోమలవల్లి | – కొరవంజ | ,, |
| లోకనాయకి | – నవపదములు | ,, |
| శశిరేఖ | – దేశి | ,, |
| రత్నగిరి | – దరుపదములు | ,, |
| భాగీరథి | – పేరణి | ,, |

ఇంకను మదనపదములు, దూత్యము, నవరత్నమాలికలు మున్నగువాని నితరు లభినయించెడివారు. అన్నియును శాస్త్రోక్తముగా నభినయములగుచు, వారి నాట్యకళానైపుణ్యమును, సువ్యక్తము గావించెడివి.

సంగీతమును నీ పెద్దకుగనే పాటక త్తెలు ప్రపంచించిరి. ఒక భామ వీణె, ఒక లేమకిన్నెర, నొకముదిత ముఖవీణె నొకకొమ్మ పిల్లంగ్రోవి, ఒక ధవళాక్షి తంబురా, ఒక సారసాక్షి స్వరమండలము చేకొని, వానిపై సంగీతము వినిపించిరి. ద్విపదలొకతెటీవ, తత్ప్రసంగ మొకతన్వి యక్ష గానమొక యతివ, జోలసువ్వాలనొక సుందరి, ధవళంబులొక తరుణి, ఏల లొకయించుబోణి - దండె మీటులతో, రావణహస్తములతో, తాళ ములతో, చెంగులతో సకలహృదయ ద్రవీకరణ కారణలై సకలసభాహ్లాద కారిణులై జంత్రగాత్రముల గాంధర్వవిద్య వినిపించిరి కేవల శాస్త్రీయ మార్గమున నొక కీరవాణి, స్థాయిగమకము రక్తిగడలుకొన, రాగాలాపన చేసెను. ఇక తక్కిన వెలదులు వాద్యములతో విద్యుద్వల్లులవలె గోష్ఠి సాగించునప్పుడు, అ కాశమునుండి విద్యాధరులు, తాము రమణీ వేషములు ధరించి యీ విద్యలునేర్పుటకై భూమికివచ్చిరోయని భ్రాంతి గలిగించిరి. ఆ సభయందే కృష్ణమాంబ తన కవితాచాతుర్యమును చూపి. యందఱ నాశ్చర్యమగ్నులుగఁ జేసెడిది.

విజయరాఘవనాయకుఁడిట్టి విద్యాగోష్ఠియందు నిమగ్నుఁడైనను, నిరంతరదానశీలియై ప్రజలనేమఱక పోషించుచుండెను. కాశీనుండి. రామేశ్వరమువఱకును. ద్వారకనుండి దక్షిణతీరమువఱకును, నితని యన్న దానమును వినుతింపని బ్రాహ్మణులులేరు. ప్రతిదిన మేఁబదివేలమందికి నన్నదాన మొసఁగెడు మహాదాత.[1]

ఆతఁడు. శా. శ. 1555 వకు సరియగు శ్రీముఖ సంవత్సర శ్రావణ శుద్ధ ద్వాదశీ, సౌమ్యవారమున, దక్షిణద్వారమున కృష్ణతీర్థమున స్నానము చేసి, సంకల్పపూర్వముగా షోడశమహాదానములుచేసి. బ్రాహ్మణులకు నగ్రహారాదికము లొసంగెను. ఇది క్రీ. శ. 1633వ సంవత్సరము. ఈ నాఁడే విజయరాఘవుని రాజ్యారోహణ దినము. ఇట్టి మహావిద్వత్కవి రాజచంద్రునికి. కాళయకవి తన గ్రంథమును పై సభయందు నంకితము

1. ఇప్పటికి నన్నదానములకు ప్రసిద్ధికెక్కిన యిండ్లకుగాని సత్రములకుగాని "తంజావూరి సత్రములు" అనిపేరు వాడుకలోనున్నది.

గావించెను. పైని పేర్కొనిన కాలమే యీకృతి రచనాకాలమని యూహింపవచ్చును. అట్లయిననిది విజయరాఘవనాయకుని రాజ్యారంభవత్సరముననే వెలసినది. విజయరాఘవనాయకుఁడు పలువదేండ్లు పాలించినాఁడు. తరువాతి కాలమున నీతని యాస్థానమున పెక్కురు కవులును మహాప్రసిద్ధిఁజెందిన కవయిత్రి రంగాజమ్మయు వెలసిరి. ఈ గ్రంథమున వారి ప్రశంసయే లేదు ఇంతియేకాక, ప్రతి యాశ్వాసాంతమున నీ కావ్యము " చంద్రరేఖా " చిహ్నాంకితమై యున్నది.

ప్రథమాశ్వాసము - క. ధావనవల్గన వేష్టన
రేవంతక "ముద్దుచంద్రరేఖా" కాంతా!

ద్వితీయా ,, - తపనాభాంత ధ్వాంత
త్రిపురయూధా "ముద్దుచంద్రరేఖా" నాథా!

తృతీయా ,, - చతురానన చతురవధూ
శ్రితవదనా "ముద్దుచంద్రరేఖా" మదనా!

చతుర్థా ,, - "శ్రీముద్దుచంద్రరేఖా"
ప్రేమస్థేమాభిరామ"

ఈమెముందు చెప్పబడిన నట్టువరాలు చంద్రరేఖయే. వీరవేంకటపతిరాయల వలన మెప్పుచెందినది యీమె. క్రీ. శ. 1614 ప్రాంతమున తంజావూరిని చేరి విజయరాఘవ నాయకుని చేపట్టి యుండవలెను, కాని యప్పటికి కాతఁడు యువరాజుగనే యామె నొక మహిషిగా పరిగణించుటచే, కాశకవి యిట్లామె నామాంకితమును వెలయింపఁజేసి యుండును కావున నీకృతి విజయరాఘవుని కాలమున ప్రాథమిక కృతియే. మఱియు నిందు విజయరాఘవనాయకుని సాహిత్య విద్యావైభవము వర్ణితమైనను నసంఖ్యాకములైన నాతని గ్రంథరచన లేవియును దాహృతములు కాలేదు. అనగా నీకృతిరచనము నాటికాతఁడింకను గ్రంథరచనకు నారంభింపలేదని తెలియుచున్నది.

పై వానిలో లభ్యములైన గ్రంథముల వివరణము

1. రఘునాథనాయకాభ్యుదయము, ద్విపద, 2. రఘునాథాభ్యుదయము, నాటకము, 3. కాళియమర్దనము - నాటకము,

4. ప్రహ్లాద చరిత్ర, 5. పూతనాహరణము, 6. విప్రనారాయణ చరిత్రము.

పై వానిలో రఘునాథాభ్యుదయము రఘునాథనాయకాభ్యుదయము (ద్విపద నాటకములును[1]) విప్రనారాయణ చరిత్రమును నేడు ముద్రితములైనవి. ముద్రితములైన మూఁడు కృతులును, చారిత్రకముగనేకాక సారస్వతదృష్టిని ముఖ్యములైనవి.

## రఘునాథాభ్యుదయము

ఇది తన తండ్రియగు రఘునాథనాయకుని గూర్చి రచియించిన యక్షగాన నాటకము - శృంగారరస ప్రధానమగు నీ నాటకమున రఘునాథనాయకుని చిత్రరేఖ యను వనితమోహించుట, చిలుకచే రాయబారమంపుట, వారి సమాగమము వర్ణితములైనవి - మఱియు నందు రఘునాథరాయల కాలమున ప్రవర్తిల్లిన విద్యాగోష్ఠీ వినోదములు - రామభద్రాంబ, శుకవాణి, కవయిత్రుల, సమస్యాపూరణములు, రాజకీయముగా నాదాయవ్యయ విచారణలు, కమ్మవారి వర్ణన, మున్నగునవి చక్కఁగ చిత్రింపఁబడినవి.

## రఘునాథనాయకాభ్యుదయము

ఇదియు పై విధమున రఘునాథనాయకుని చరిత్ర వర్ణించునదియే. ఇది ద్విపద కృతి. ఇందు మొదటి రెండాశ్వాసములును సమగ్రముగను, మూఁడవ యాశ్వాసమున కొంతయును నున్నది. ముద్రితప్రతిలో (1-684, 2-484, 3-912) 2081 ద్విపదపంక్తులు గలవు. గ్రంథమింక నెంతయుండెనో తెలియరాదు. ఈ గ్రంథరచనావిశేషమిది.

---

1. పై రెండు గ్రంథములును సుప్రసిద్ధాంధ్రదేశీయచారిత్రక పరిశోధకాచార్యులను ప్రశస్త విద్వాంసులునగు డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారి నిపులపీఠికలతో తంజావూరి సరస్వతీ మహాలు పక్షమున ప్రకటితములైనవి.

## నాయకాభ్యుదయ రచనలు

తమ తండ్రుల పూర్వవృత్తాంతమును దెలుపు నిట్టి రచనలకు రఘునాథ నాయకుఁడే మార్గదర్శకుఁడు. అతఁడు తనతండ్రియైన అచ్యుతప్ప నాయకుని చరిత్రము, అచ్యుతాభ్యుదయమనుపేర రచియించియున్నాఁడు. అది ద్విపదకృతియే.

రఘునాథుఁడు ద్విపద నలచరిత్రములో :

" భూషించి యచ్యుతాభ్యుదయప్రబంధ
నిర్మాణమున మాకు నిఖలదేశముల
నిర్మల సత్కీర్తి నెగడు గావునను
యటువలె ద్విపదకావ్యము వేఱె యొకటి
ఘటియించి సత్కీర్తిఁ గైకొందునంచు

మదినెంచి "

యని చెప్పియున్నాఁడు. అచ్యుతాభ్యుదయము నేఁడు లభ్యము కాలేదు విజయరాఘవుని కాలమున దానిని సభలో చదివి వినిపించినట్లు పై గ్రంథమువల్లనే మనకు తెలియుచున్నది. మఱియు, రఘునాథ రామాయణమునందు సంగీతసుధ యందు పేర్కొనబడినది. దీని ననుసరించియే ద్విపదకృతిగా " రఘునాథనాయకాభ్యుదయము " అను పేర విజయరాఘవనాయకుఁడు రచియించి యున్నాఁడు. విజయరాఘవుని పుత్త్రుఁడగు మన్నారుదేవుఁడును, తన తండ్రి చరిత్రమును "విజయరాఘవ నాయకాభ్యుదయము" అనుపేర రచించినట్లు "హేమాబ్జ నాయికా స్వయంవరము" భరత వాక్యమున నిట్లు చెప్పఁబడినది.

"ఇవ్విధంబున ...... విజయరాఘవభూపాలక ప్రియపుత్త్రుండును ......విజయరాఘవాభ్యుదయాది ప్రబంధ నిబంధన చాతురీ ధౌరేయుండును, అతులిత పితృభక్తి గురుభక్తి భాగధేయుండును మహితానుభావుండగు మన్నారుదేవుండు హావణించిన హేమాబ్జనాయికాస్వయంవరము అను నాటకము... ...

(తంజావూరి పుస్తక సూచిక, M. 675. పుట 277-278)

ఇది రాజగోపాలస్వామి కంకితమై ప్రశస్తరచనతో నున్నది. ఇందు తంజావూరి కోటయందు గల భవనములు రఘునాథరాయని విజయవిశేషములు దినచర్య మొదలగునవి సంపూర్ణముగ వర్ణితములైనవి.

విప్రనారాయణ చరిత్ర;

పన్నిద్ద రాళ్వారులలో తెనుఁగు వారికి ప్రియతముఁడైన తొండరడిప్పొడి యాళ్వారుల చరిత్రమును ప్రశస్తమైన యక్షగాన నాటకముగ విజయరాఘవనాయకుఁడు సంతరించి యున్నాఁడు. ఈ కథను ప్రబంధరూపమున తొలుత తెలుఁగున వెలయించినవాఁడు, భారతకవిత్రయములో పరిగణితుఁడునునగు నెట్టాపెగ్గడ వంశీయుఁడు చదలువాడ మల్లనకవి. ఈతని విప్రనారాయణ చరిత్రము ముద్రితమై ప్రచారమున నున్నది. దీని తరువాత యావదాంధ్రదేశమున విశేషముగ వ్యాప్తిఁ గన్నది సారంగుతమ్మయ్య రచించిన "వైజయంతీ విలాసము" అను ప్రబంధము. కాని విజయరాఘవనాయకుని యక్షగానకృతి వీని రెండింటిని కొన్నిపట్టుల మించియున్నది. ఇదియు నేఁడు ముద్రితమైనది[2] గాన, నీ గ్రంథము నుండి యొక రసవత్ఘట్టమును మాత్రమే యుదాహరింతును.

విప్రనారాయణుని వైరాగ్యభావ మీ క్రింది పదములో నెంతో చక్కఁగ వర్ణితమైనది.

కాంభోజిరాగము ఆటతాళము

చదివేది దివ్యప్రబంధము మాకు స్వపదుసంసారబంధము
ఎదనుండు హరిభక్తిగంధము యోగీంద్రులతో నేమాకుసంబంధము
మీతో మాకేటిమాటలు, విన

---

1. ఆంధ్రసాహిత్య పరిషత్తు (కాకినాడ) వారి పక్షమున క్రీ. శ. 1940 లో నీ గ్రంథము విపులమైన పీఠికతో ప్రకటితమైనది. పీఠికాకర్త నిడుదవోలు వేంకటరావు ఎమ్. ఏ.

2. తంజావూరి సరస్వతీమహాలువారి పక్షమున, అచ్చటి పండితులగు శ్రీ అ. మహాదేవశాస్త్రి, శ్రీ నిడుదవోలు? ... శ్రీ విశలదేవుని సుందరశర్మగార్ల సంపాదకత్వమున వెలువడినది.

త్రాతిగాదు మీపాటలు
భవనంబులు పర్ణశాలలు, మా
పాటలు హరిమీాదియేలలు
తగిలియుందురు ముక్తబాలలు మా
దాపురములు హరిలీలలు
మేమున్నయూరు శ్రీద్వారకా, ముక్తి
కామినిపై మాకు కోరికా
స్వామిభక్తిమాకు చేరికా వో
కోమలి నీవికపోవె యూరక
ఆలుబిడ్డలు పొందుకోరము. మేము
కోరేదీహరిభక్తసారము
నీలవర్ణుని గొల్చువారము, మీా
యాలాపములు విననేరము
పరమాన్నములు కాయగూరలు మా
పరిధానములు నారచీరలు
సరిపోవుమీాకు మామేరలు మా
సంగడివాండ్రు ఫకీరులు.

దేవదేవీ విప్రనారాయణ సంవాద మీా యక్షగానమునందలి రసోత్తర రచనములలో నొకటి.

పదం – కాంభోజి ఆటతాళము

విప్ర. ద్రావిడవేదము చదివినవాఁడనె ధవళాక్షి! నీవు నన్నేలవే
దేవ. ద్రావిడవేదము చదివినవారు కందర్పునివేదము విందురా
విప్ర. అంగన! మన్నలు తళిగప్రసాదము పొంగలి చవిగొన్నవాఁడనే
దేవ. పొంగలి చవిగొన్నవానికి వనితల యెంగిలిచవి మనసాయనా
విప్ర. ఆరామకైంకర్య మాచరించి మన్నారుని గొలిచినవాడనే
దేవ. ఆరామకైంకర్య మాచరించువాని కీరామకైంకర్యమేలయా
విప్ర. చెలువ! మన్నరుపాద తులసీదళములు శిరసునధరియించువాఁడనే
దేవ. తులసీదళములు ధరియించువానికీ తొలుతటిముడిపువ్వులేలయా.

ఇందచ్చటచ్చట పాత్రోచితభాష వాడబడినది. అప్పటి రాజకీయ వ్యవహారము ననుసరించి తమిళభాష బహుసరసముగ నుపయుక్తమైనది. ఈనాడును నీ నాటకమును ప్రదర్శించిన సభ్యులను సమోన్మాదాంబుధినోల లాడించును. గ్రంథములోని రసవత్తర ఘట్టములకు ప్రత్యేకించి వివరించుటకు వీలులేనంత ప్రశస్త రచనతోకూడిన యీ నాటకము దాక్షిణాత్య నాటకములలో మేటియనిచెప్పనగును.

## అముద్రిత కృతులు

అముద్రిత కృతులలో నీ క్రిందిపద్యము 'నాందిగా' ముందుగాఁ గానగును.

సీ. భోజకన్యాముఖాంభోజ రాజమరాళ - సత్యాఘనస్తనస్తబకభృంగ
జాంబవతీవిలోచన చకోరశశాంక-మిత్రవిందాతటిన్మేఘరూప
భద్రవశావశ భద్రదంతావళ-వరసుదంతామనో వనమృగేంద్ర
లక్షణారూపకలాపి నీపర్జన్య-భానుసుతాలతా పారిజాత

గీ. షోడశస్త్రీసహస్ర చ - క్షుఃప్రసార
హారసార మసార మో - హనశరీర !
విజయరాఘవ భూపాల - భజనలోల !
కేలుమోడ్చెద రాజగో -పాల ! నీకు.

పై రచనము లన్నిటిలోను ప్రహ్లాద చరిత్రను యక్షగానము చివర కృతి - ఈయక్షగానము నే విజయరాఘవనాయకుని కృతులన్నియు పేర్కొనఁబడినవి - మఱియు నిందు పై సీసపద్యము లేదు - గ్రంథములో నిది చాటుకావ్యముగా పేర్కొనఁబడినది - (సంఖ్య 541)

## పూతనా హారణము.

ఇందు శ్రీ కృష్ణుఁడు పూతనను సంహరించుట వర్ణితము. గ్రంథారంభమున పన్నిద్దఱాళ్వారుల స్తుతిగలదు - దీనివలన విజయరాఘవుని

వైష్ణవభక్తి ప్రస్ఫుట మగుచున్నది. ఇందు కైవారగద్యలో నీతడు "చతుర్విధ కవితా నిర్వాహక సార్వభౌమ బిరుదాంగద విరాజమాన చరణాంభోజు" అని వర్ణితుఁడైనాఁడు. (సంఖ్య 554):

## కాళియ మర్దనము.

శ్రీకృష్ణుడు కాళియుని మర్దించుట యితివృత్తము. ఇందు విజయ రాఘవ నాయకుఁడు కనకాబ్జ యిక గన్న చిన్నకుమారుఁడుగా వర్ణితుఁడైనాఁడు. (సంఖ్య 500,)

ఈతని యాస్థానమునందు విలసిల్లిన కవులు కవయిత్రులు పెక్కురు. కవులలో తొలి పేర్కొన దగినవాఁడు.

## చెంగల్వ కాళకవి

ఈతఁడు రచించినది రాజగోపాలవిలాసమను నొక ప్రబంధము. తంజావూరి పుస్తక భాండాగారమునతప్ప మఱెచ్చటను దీనికి వేఱుప్రతి కానరాలేదు. అచ్చటనున్న వాని వివరణములివి.

—: తాళపత్ర ప్రతులు :—

సంఖ్య 222 రాజగోపాలవిలాసము, (కాళయ)
M 256 ; S–18 × 1¼ ; L–52. 11. 6. G. 1300.

గ్రంథప్రారంభము సరిగ నున్నదిగాని గ్రంథాంతమున గద్యమందు సీస పద్యము లోపించినది.

సంపూర్ణము. వ్రాఁత చక్కనిది–5 ఆశ్వాసములు యాఱవసత్రమున సగముభాగముమాత్రము కలదు. అదితప్ప గ్రంధపాతము కన్పట్టదు. శైథిల్యము స్వల్పము.

223 – M 257 16 × 1⅛ 50 ఆద్యంతములల కొంతభాగము లేదు.

224 – M 398 18 × 1¼ 18 ఇందు విజయరాఘవుని వంశము మాత్రము వర్ణితము.

## విజయరాఘవ వంశావళి

ప్రస్తుతము ముద్రితమగు గ్రంథము పై మాటి ననుసరించినది - గ్రంథావతారికలో విజయరాఘవనాయకుని వంశమునుగూర్చి, యాతని వైదుష్యమునుగూర్చి విపులముగ నుండుటచే చాలకాలము క్రిందటనే, యీ భాగమును వేఱుచేసి, "విజయరాఘవ వంశావళి" యని నామకరణము చేసినట్లున్నది. ఇప్పటికి పదునాలేండ్లక్రిందట "తంజాపురాంధ్ర వాఙ్మయము"1 గూర్చి వ్రాసినపు డాంధ్రసాహిత్య పరిషత్తు నేనీప్రతి నుపయోగించితిని - కాని యిది గ్రంథభాగమేగాని వేఱుకాదు. పైతాళ పత్రప్రతులలో వ్రాయసకాని పేరుగాని వ్రాసినకాలముగాని తెలుపఁబడియుండలేదు. గ్రంథాంతమున పద్యములలోని స్వల్పలోపములు తప్ప ప్రతులన్నియు బాగుగనే యున్నవి - లేఖక దోషములున్నను వ్రాత స్ఫుటముగ నున్నది - ఇది గ్రంథమాతృకా వివరణము.

"రాజగోపాలవిలాసము" అను నీ ప్రబంధము, తంజావూరి నాయకరాజును, మహాప్రసిద్ధుఁడును నగు రఘునాథనాయకుని పుత్త్రుఁడగు విజయరాఘవనాయకుని కంకితముగా చెంగల్వకాళయ కవిచే రచింపఁబడినది - ఈ కాళకవి తన్నుగూర్చి యీ ప్రబంధమున (1-29) నిట్లుచెప్పినాఁడు.

సీ. శ్రీవత్స గోత్రుండు శ్రీకరపాకనాఁ
టాఱ్వేల బంధుజనాతిశాయి
కాళయమంత్రి పుంగవునకు గంగమాం
బకు నుదయించు తపః పలంబు
రణరంగగంధవారణ బిరుదాంకిత
స్వకులజ శ్రీకంఠ సచివమౌళి
పార్వతీ పరిణయ ప్రముఖప్రబంధని
బంధధురంధరప్రౌఢ ఫణితి

1. చూడుఁడు. ఆంధ్రసాహిత్య పరిషత్తు రజతోత్సవ సంచిక. 1936 పుటలు 150-164.

గీ. వైదిక చెంగల్వ వేంకటయ్యయును రాని
నూతల తిరుమలయ్య తనూజకృష్ణ
మాంబ మును గన్ననిధి కాళహ స్తి గిరీశ
కలితలలితో క్తి భారతి కాళసుకవి.

పై పద్యములవలన నితఁడు పాకనాటి యార్వేలనియోగి బ్రాహ్మణుఁడనియు, తాత కాళయమంత్రి, పితామహి గంగమాంబయనియు, తండ్రి వెంకటయ్యయనియు, తల్లి కృష్ణమాంబయనియుఁ దెలియుచున్నది. మఱియు నితనితండ్రి రణరంగ గంధవారణ బిరుదాంకుఁడగు శ్రీకంఠునకు మంత్రియనియు, నాతఁడు పార్వతీపరిణయమను ప్రబంధమును రచించెననియు, తల్లి రానినూతుల తిరుమలయ్యతనూజ యనియు, నితఁడు శ్రీ కాళహ స్తీశ్వరుని ప్రసాదమున కవితాసిద్ధిఁ బడసిన వాఁడనియుఁగూడ స్పష్టపడుచున్నది.

ప్రస్తుత మీతని తండ్రి రచించిన పార్వతీపరిణయము లభ్యము కాదు. కాని యీతఁడు కవివంశములోనివాఁడేయని చెప్పనొప్పును. ఈతఁడు విజయరాఘవనాయకుని తండ్రియగు రఘునాథనాయకునికాలము నుండి యున్నట్లుగ నీతరువాతి పద్యమువలన తెలియుచున్నది.

సీ. ఘటికాశతగ్రంథ ఘటనోత్కట కవీంద్ర
పాండిత్యగరిమలు భళియనంగ
నోష్ఠ్యనిరోష్ఠ్యాది కోద్దామరసగర్భ
సందర్భమానని సన్నుతింప
మాకందమంజరీమధురధురీమాధుర్య
రచనావిశేషమహా యనంగ
పరిహృతేతరయుక్తిభాగనూతనకథా
చాతుర్యధుర్యత సంస్తుతింప

గీ. అయ్యదినముల రామభద్రామ్మవారు
నేఁడు కృష్ణాజి కవితచే నేర్పు మెఱసి
వినికిసేయుటయెల్ల మీ ఘనతఁగాదె
కవివినుతచర్య! చెంగల్వ కాళనార్య!

పై పద్యమున పేర్కొనబడిన రామభద్రాంబ, సంస్కృత సాహిత్యసామ్రాజ్య భద్రాసనాసీనయని ప్రసిద్ధికెక్కిన విదుషీమణి. ఈమె సంస్కృతమున రఘునాథనాయకాభ్యుదయ మహాకావ్యము రచించినది. ఈమెకు తెలుఁగుకవిత నేర్పినది కాళకవియేయని పైవ్రాసినదానఁ దెలియుచున్నది. కృష్ణాంబయను కనయిత్రి, విజయరాఘవనాయకుని కాలమున, నాస్థానములోనుండినట్లుగ నీగ్రంథమున (1-27) తెలుపఁబడియున్నది. ఈమె ఛందశ్శాస్త్రమున, సమస్యాపూరణమున, సంస్కృతాంధ్రకవితల నిపుణురాలని కాళకవియే యిట్లు చెప్పినాఁడు.

సీ. ప్రస్తారసంఖ్యను పదుమూఁడుకోటులు
        నలువదిరెండు లక్షలు పదేను
వేలు నేణ్నూటను వింశతియును నాఱు
        వృత్తంబులందు నీవృత్తములకు
నీవర్ణన సమస్యనీవు గూర్పు మటన్న
        నావృత్తమున సమస్యను రచించి
యందుకు శ్లోకంబు లాశువుగాఁ జెప్పి
        నవి తెనుంగునను పద్యములు చేసి

గీ. యిరువదాఱును ఛందంబులెఱిఁగియిట్లు
కవితఁ జెప్పిన వార లీభువిని గలరె
ననుచు నందఱు వినుతింప ఘనతఁ గాంచె
కీర్తనీయగుణాలంబ కృష్ణమాంబ.

పై శిష్యురాండ్ర సామర్థ్యము వర్ణించుచు, స్వోత్కర్ష యనిపించుకొనకుండ, తనసామర్థ్యమునే వ్యక్తపఱచినాఁడు కాళకవి. ఈతఁడు

1. ఘటికాశతగ్రంథ ఘటనుఁడు - గడియకు నూఱుపద్యములు చెప్పు సామర్థ్యముగలవాఁడు. అనఁగా ఆశుకవిత్వమున ప్రవీణుఁడు.

2. ఓష్ఠ్య నిరోష్ఠ్యాది నియమములతో కవిత (పఫబభమ వర్ణములను విడుచుట) చెప్పువాఁడు. అనఁగా చిత్రకవిత్వమున నిపుణుఁడు.

3. మాకందమంజరీమధురఘురీమాధుర్య రచనచేయఁగలవాఁడు-అనఁగా మధురకవితలో నాఁటితేఁటినవాఁడు.

4. పరిహృతేతరయుక్తిభాగ నూతనకథాకథకుఁడు - ఇతరుల మాటలు గైకొనక, క్రొత్తగా కథావస్తునిర్మాణముచేయఁగలవాఁడు. అనఁగా 'విస్తర' కవితావిశారదుఁడు. కాబట్టి కాళయ చతుర్విధకవితా విశారదుఁడని చెప్పనొప్పును.

ఇంకనీతఁడు సంస్కృతాంధ్రకవనమున, ఛందశ్శాస్త్రమున సంపూర్ణప్రజ్ఞ గలవాఁడని రెండవపద్యమే చెప్పుచున్నది. కాని యే కారణముచేతనో నీతఁడు, రసికవతంసుఁడును రాజకవీంద్రుఁడునగు రఘునాథనాయకుని యాస్థానమున ప్రసిద్ధికెక్కలేదు.

"ఉ. భూనుతకీర్తులైన కవిపుంగవులందఱు మెచ్చనిచ్చలున్
తేనియసోనలై కరటుఁదేఁటిన చక్కెరపానకంబులై
వీనులవిందులై రసికవేద్యములై యలవాగ్వధూటికిన్ గానుకలైన"

యీతనికవిత రఘునాథు నాకర్షింపవలసినదే. దీనికి, కాళకవి తొలుతనుండి విజయరాఘవనాయకునే యాశ్రయింపఁగా, క్రమక్రమముగా, కాళకవి ప్రతిభ గుర్తించి యాతని కేవలకవిగానే గాక స్నేహితునిగా సంభావించి, విజయరాఘవనాయకుఁడు గౌరవించుచుండ. నాతఁడు రఘునాథనాయకుని యాస్థానకవిపదమునకుఁ బ్రయత్నముచేయు నావశ్యకత లేకపోవుటయే కారణముగాఁ గన్పట్టుచున్నది. విజయరాఘవ నాయకుఁడు రాజ్యమునకు వచ్చినతోడనే గ్రంథమాతనికి కృతినొసంగుట కూడ పైయంశమును బలపఱచుచున్నది. మఱియును రాజైన విజయ రాఘవనాయకుఁడు తనయింటికి తనభార్యలతోఁగూడవచ్చి విందారగించి, యింటివారలనందఱను ననేకవిధముల గౌరవించెనని చెప్పిన యీ క్రింది సందర్భమునుబట్టి, వారిరువురికెంత యన్యోన్యగౌరవ స్నేహబాంధవము లుండెడివో గ్రహింపవచ్చును.

విజయరాఘవనాయకుఁడు గ్రంథమంకితముగఁ గోరుచు నిట్లు చెప్పినాఁడు.

మ. పదియార్వన్నె పసిండికిన్ వలపు పైపైఁ జెందు చందంబునన్
చదురుల్ మీఱుభవత్ప్రబంధమిల నిచ్చల్ దక్షిణ ద్వారకా
సదనాస్థాన కథానుషంగములచే సంభావ్యమై మించె నేఁ
డది మాకంకిత మీవొనర్పుమని యాహ్లాదంబు సంధిల్లఁగన్.

సీ. అల సహ్యజాతటి నగ్రహారంబులు
బహురేక మించు నుంబళికయూళ్లు
బంగారు వనుసుల పచ్చల పల్లకి
పసిఁడిగొమ్ముల కట్లభద్రకరులు
పడివాగె తేజీలు బంగారుకాళాంజి
హడపంబు చామరల్ హంసకంబు
తరమైన చౌకట్లు తారహారంబులు
నంగుళీయాది రాజార్హభూష

గీ. లెలమి నపరంజి హరివాణములును గిండ్లు
పెట్టెలకోలంది జాలెలు మట్టుమీఱి
.......................ఘనత
కనుగుణంబుగ దయచేసి యపుడు మఱియు,

క. కేళాకూళుల సజ్జల
కేళీవనములను మించు గృహరాజంబున్
శ్రీలెసఁగ నొసగి లోకులు
మేలని కొనియాడ కరుణ మీఱఁగనంతన్.

గీ. విందునకుఁ దాము గఱితలు వేడ్కవచ్చి
వరుస సొమ్ములు తమయింటి వారికొసఁగి
యాంధ్రజులకెల్ల చతురంత యానములను
మహితభూషణములు బహుమతులు సేయ"

పై పద్యములవలన కాళకవినెంతగా గౌరవించినది మనకు తెలియవచ్చును. కాళకవిని కవిగానెంచక, రాజకవిగానెంచి యాతనికి వివిధరాజ చిహ్నములనొసగి విజయరాఘవుఁడు సమ్మానించెనని యాశ్వాసాంతగద్యవలన నెఱుకపడుచున్నది. "ఇతి శ్రీమత్కాళహస్తీశ్వరకరుణాకటాక్ష లబ్ధసిద్ధసారస్వతనయ పింగల్వ వేంకటార్యతనయ, విజయరాఘవభూపప్రసాదాసాదిత వివిధరాజచిహ్నచిహ్నితభాగధేయ కాళయనామధేయ ప్రణీతంబైన రాజగోపాలవిలాసంబను మహాప్రబంధంబునందు బ్రథమాశ్వాసము."

కాళయ ప్రతిభావంతుఁడైనకవి. బంగారమునకుఁ బరిమళమబ్బినట్లుగా, నీతనికి విద్వత్కవిరాజగు విజయరాఘవనాయకుని స్నేహబాంధవము సమకూడినది. ఈ రాజగోపాల విలాసమొకటితప్ప తక్కిన యీతనికృతులేవియు కానరాలేదు. అయిన కాళయకవితా చాతుర్యమును బ్రకటించుటకు నీ ప్రబంధమొక్కటియే చాలును. ఈ విషయమునుగూర్చి విస్తరించుటకు ముందు, కృతిపతియగు విజయరాఘవనాయకుని గూర్చి మనము తెలిసికొనఁదగును.

రాజగోపాలవిలాసమున ప్రథమాశ్వాసమున కృత్యవతరణికలో రమారమి యేబది పద్యములలో విజయరాఘవనాయకుని యుదంతమంతయు వివరింపబడినది. అతని పూర్వులసంతతి సంగ్రహముగను, తక్కిన కృతిభర్తసంగతి సవిస్తరముగను నందు వర్ణితమైనది. ఈ భాగమునే 'విజయరాఘవ వంశావళి' యని వేఱుచేసి వ్రాసినట్లు మున్ను తెలిపియుంటిని.

ఇది దక్షిణద్వారకాస్థల మహాత్మ్యమును దెలుపు నైదాశ్వాసముల ప్రబంధము. దక్షిణద్వారక యనగా తంజావూరి జిల్లాలోని మన్నారుగుడి, అచటనున్న స్వామి రాజగోపాలుఁడు. ఈ స్థలమహాత్మ్యమునకు మూల మగ్నికల్పమని తెలుపఁబడియున్నది. సూతుఁడు శౌనకు నడుగగా శౌనకుఁడాతనికి "చంపక వనాంతరమున గోప్రళయ

మౌని తపస్సుచేసి హరినివేడగా నాతఁడు ప్రత్యక్షమై యాతని కోర్కె ననుసరించి పదాఱువేల గోపికలతో, అష్టమహిషులతో నచ్చటనే నిలిచెను" అనిచెప్పుట కథాబీజము.

ప్రబంధమున కథ

చంపక వనమున శ్రీకృష్ణుఁడు వనవిహారము సలుపుచు, అష్టవిధ శృంగారనాయకులవలె చెలగుచున్న తన యష్టమహిషుల స్వభావములు తెలియఁగోరి వారివారి నాయూజాడలనుండ నియమించెను. తొలుత రుక్మిణిజాడకరిగి యామెకుఁ గనఁబడకుండ పొంచియుండి, యామె యనుతాపమెఱిఁగి యెదుట ప్రత్యక్షమై యానందాబ్ధిలోలాడించెను. ఆ వెనుక భద్రవద్దకు నొకదూతినంపి సంకేతస్థలముచెప్పి తానచ్చటి కేగెను. కాని భద్రయలిగి కృష్ణునియొకింతతడవు విరహవేదనకుఁ గాలుపఱచెను. అంతలక్షణ తనస్థలములో నొక చంద్రకాంతశిలపై కృష్ణునికొఱకు నిరీక్షించుచు తనసౌధమునంతయు నలంకరింపఁజేసెను. ఆతఁడు రాకపోవుటచూచి యొకదూతినంపి, రప్పించెను.

శ్రీకృష్ణుఁడామెను సమ్మదాంతరంగితగా నొనర్చితక్కిన కాంతలం నలంచుకొని వారి సమాగమము కాంక్షించుచుండెను. జాంబవతి తన దూతికతో విరహవేదన నివేదింప నామెవలన శ్రీకృష్ణుఁ డెఱింగి పొదల చాటున యామె యనురాగమ్ముగ్రహించి, యామెను మోదమునఁ దేల్చి, మిత్రవింద సౌధమునకేగి, యామెను ముదితురాలుగ నొనర్చి విరహగ్లానిచే కుందుచున్న సుదంతను సంతసపఱచెను ఆపై తనకొఱకు వ్యథచెందు కాళింది నానందమున దేలించి, సత్యభామను, సకల సౌఖ్యముల సంభావించెను.

ఆపైని దక్షిణద్వారకానగరమును కవివర్ణించి చంపకవనము నకు దక్షిణద్వారకాసంజ్ఞ గలుగుట వివరించియున్నాఁడు.

చంపకవనమున తపస్సుచేసెడు ఋషులలో వహ్నిముఖుఁడను సంయమిశ్రేష్ఠుఁడు గలఁడు. అతనికి గోప్రళయుఁడు గోభిలుఁడు నను నిరువురు తనయులు గలిగిరి. వారిరువురిలో గోప్రళయుఁడు, స్నాన సంధ్యాజపహోమకృత్యంబులు నిర్వహించుచు నతిథియభ్యాగతులను పూజింపుచు, నిరంతరభగవద్భక్తి సంప్లావితుండై శ్రీహరిగూర్చి తపస్సు చేయ నారంభించెను. అతఁడు శీతవాతోష్ణస్థితుల లెక్కింపక నుగ్రరీతి తపస్సుచేయుట తోడనే శ్రీమహావిష్ణు వాతని తపశ్చర్యకు మెచ్చి ప్రత్యక్షమయ్యెను గోప్రళయుఁడాతని బలువిధముల ప్రణుతించెను. మహావిష్ణువు మిక్కిలి సంతసించి వరముకోరుకొమ్మనెను. గోప్రళయుఁడు రుక్మిణి మొదలగు పట్టమహిషులు పదారువేల గోపికలు వీరితో శ్రీకృష్ణావతారమున ద్వారకలో నున్నట్లుగా చంపకవనమున నివసింపఁగోరెను. అంత మహావిష్ణు వట్లే చంపకవనమునకు దక్షిణ ద్వారకాసంజ్ఞనిచ్చి యచ్చట కృష్ణావతార రూపమున వసించెను. గోప్రళయుఁడా క్షేత్రంబున తొలుత కృష్ణుని వరమువలన కృష్ణతీర్థమును, నందుండి హరిద్రానదినిఁ గలుగజేసెను. విష్ణు పుష్కరిణి నిర్మించెను. అచ్చటనే బృందావన రూపమున వనమును ప్రతిష్ఠించెను. గోభిలుఁడు కూడ గోప్రళయున క్షేత్రనిర్మాణమున తోడుపడెను. కొంతకాలము నకు గోప్రళయుఁడు వైకుంఠవాసి యయ్యెను.

ఇచ్చట బ్రహ్మ తొలుత తపస్సుచేసెను. మహాలక్ష్మి విష్ణువునుగూర్చి తపస్సుచేసెను. శ్రీ మహావిష్ణువు వారివారి కోర్కెల నెఱవేర్చెను.

ఆపైలి హరిద్రానదీ ప్రభావమువర్ణితము. ఏ పాపమునకైన నిష్కృతి గలదు గాని కృతఘ్నతకు నిష్కృతిలేదు. అట్టి కృతఘ్నతా దోషమును తొలగించిన హరిద్రానదీప్రభావమున కొక కథ యనుసంధింపఁబడినది. గోదావరీనది యుత్తరమున సింధుసౌవీరమధ్య ప్రదేశమున సౌరాష్ట్ర దేశము గలదు. దానిని రాజశేఖరుఁడను రాజు

పాలించుచుండెను. అతఁడొకనాఁడు వేఁటకు బయలుదేఱి సాధన సామగ్రిచే యాటవికులతో చాలసేపు వేఁటలాడి యనేక మృగములను జంపెను. అంత నొక వరాహము చెంచులకు వశముగాకుండ తన యెదుటనుండి పోవుచుండగా దానిని పట్టుకొనుటకై వెంట సాగెను. కాని రాళ్ళురప్పలు, గట్టులు పుట్టలు దాటినను చిక్కలేదు. అతఁడు మిగుల డస్సి, దాహము మిక్కుటముకాగా నక్కడ నొకయాశ్రమమును గన్పడ నందు ప్రవేశించెను. అచ్చట యజ్ఞశీలుఁడను ముని యాతని నేదదీర్చి, యాదరించి, యన్నపానాదుల సంతుష్టుం గావించి తన పురమున కనిచెను. ఆ వెనుక, నీ రాజునకు కృతజ్ఞతా స్వభావమెంత వఱకు నున్నదో పరీక్షించుటకై మునిరూపమునకే దొంగవానివలె, చీకటి పడగానే రాజుగారి ధనాగారములోని విలువగలవానిని గ్రహించి, పట్టుకొనిపోవుచుండెను. అంత తలవర్లాతని పట్టుకొని, కట్టుకట్టి రాజు గారి ముందఱ నిలువఁబెట్టిరి. అంత రాజు మునినిఁజూచి తన కుపకృతి చేసినవాఁడని గ్రహించియు సొమ్ముతీసుకొని యాతని దుర్భాషలాడి యవమానపఱచి, యూరు వెడలఁద్రోయించెను. అంత కృతఘ్నతా దోషముచే, రాజు మతిభ్రాంతికలిగి పిచ్చివాఁడై యడవుల దిరుగు చుండెను. తన యాశ్రమము ముందు రాగానే యజ్ఞశీలుఁ డతని పాపము పరిహరించెదనని యాతని చేరఁబిలిచి యిది వచ్చుటకు నాతని రాజ్యమదాంధతయు కృతఘ్నతయే కారణమని తెలుపును. మఱియును బ్రాహ్మణాశీర్వాదము వలన సర్వశుభములును సమకూరవలయునవియు నచ్చట హరిద్రానదిలోఁ గ్రుంగిన తన పాప నివృత్తియై పూర్వరూపము వచ్చునని చెప్పెను. అట్లు చెప్పినతోడనే హరిద్రానదిలో మునుఁగగానే తన పూర్వ తేజస్సు, రూపమును ధరించి, విష్ణుభక్తుఁడై యచటి రాజ గోపాలస్వామికి నంతయు కైంకర్యము చేసి కృతార్థుఁడయ్యెను.

శ్రీకృష్ణుని యష్టమహిషులును నష్టవిధశృంగార నాయికలుగా నిరూపించి, కవి, యాలంకారిక శాస్త్రానుగుణ్యముగ, శృంగార రస పోషణము గ్రంథమున నిట్లనుసంధించినాఁడు.

| | | | |
|---|---|---|---|
| రుక్మిణి | - స్వీయ | | ప్రథమాశ్వాసము. |
| భద్ర | - కలహాంతరిత | } | ద్వితీయా ,, |
| లక్షణ | - వాసవసజ్జిక | } | |
| జాంబవతి | - విప్రలబ్ధ | } | |
| మిత్రవింద | - ఖండిత | } | తృతీయా ,, |
| సుదంత | - విరహోత్కంఠిత | } | |
| కాళింది | - ప్రోషితభర్తృక | } | చతుర్థా ,, |
| సత్యభామ | - స్వాధీనపతిక | } | |

ప్రథమాశ్వాసమున మొదట యవతారికయు, పంచమాశ్వాసమున చివఱ క్షేత్ర మహత్మ్యమును సంఘటించి గ్రంథము పూర్తి చేసినాఁడు. గ్రంథ మందంతటను శ్రీరాజగోపాలనామమున వెలసిన శ్రీకృష్ణుని విలాసములే గావున నీ ప్రబంధమునకు "రాజగోపాలవిలాసము" అను పేరు సార్థకమగుచున్నది. "విజయరాఘవ విలాస భవనమును రాజగోపాల విలాస మలంకరించుట విశేష సంఘటనమే గదా!

ఇందైదాశ్వాసములలో 454 పద్యములు గలవు. ఇది ప్రబంధమని యనిపించుటకు, చతుర్థాశ్వాసమున ద్వారకాపురవర్ణన, పంచమాశ్వాసమున, వేట వర్ణన చేయఁబడినది.

కాళయకవి కవిత, ధారాశుద్ధిగలిగి ప్రసన్నమై మృదుమధురమై వెలయుచున్నది. సంస్కృతసమాసము లుపయోగించిన నవి ప్రసాదగుణము గలిగి, హాయిని గూర్చును. ఈతని సమాసరచన నన్నయ శ్రీనాథుల రచనఁ దలపించును.

మ. కలమంద్రోదిత రత్నకంకణ ఝణత్కారంబు తోరంబుగాఁ
దలిరుం దీవెల వంచలించుగతిహస్తన్యాసముల్ మీఱఁగాఁ
లలనల్ "పాండ్య నృపాల మండల విభాళా" యంచు గైవారముల్
వలనొప్పన్ రచియించి రంత నుచిత వ్యాపార పారీణతన్,

చ. మలయతటీపటీరతరుమూలసుసౌరభభారమందు సం
చలనసమీరలోలజలజాతసుజాతపరాగరాగముల్
కలిత మనోహరా స్తరణకాంతనిశాకరకాంతవేదికా
తరమునుండి యవ్వికచ తామరసాక్షిఁ దలంచి యుల్లము.

క. హరియించె వారి బడలిక
పరిసరకాసారతీరపరిచితహంస
గురుదంచల హతిచంచల
సరసిజదళతాళవృంతజాతానిలముల్.

నన్నయవలె మత్తేభవృత్తము పలికించుటయందు [illegible] గట్టివాఁడు.

మ. సుమనస్సాయకలోలచాపమదఖర్జూత్రజ్జనల్ సేయునీ
బొమపొల్పంబు తదీయబాణముల సొంపుల్ వంపువాల్జూపులన్
బ్రమదాంభోనిధిఁ దేల్చి, సౌఖ్యములు నాపాదించె నూహించఁగా
రమణీ! కోపము సేయునట్టి యుపకారం బెన్నఁగా శక్యమే!

అచ్చతెనుఁగు పదములతోనిట్లు :—

మ. తొగరారా తెగమేడ యోరులజోతుల్ దేటనిద్దంపుతే
జిగురు వెన్నెల చల్వ చప్పరములన్ చిన్నారి వ్రాగుత్తులన్
నెగడం జేయఁగ బాటనుండి వలి తేనెల్ చిందు చందంబునన్
చిగురుంబోడి మురాజేరి పలికెన్ చిత్రంబు రానత్తతిన్.

మ. కలలో నైనను నీదు మాటలకు నేఁగాదంను మాటాడుటల్
గలవో? వాకలవాడలం దిరిగి రాగా నీకు మెండొడ్డుటల్
గలవో? మంచినవారలందఱు నగంగా నిన్ని విన్నాణముల్
గలవో? మానవతీవిలాస మంకరాంకా! యింక నేనుందురా!

ఇందు శృంగారరసము అనుకరకావ్యము నందువలె భావప్రధానము గాని, యాంధ్రకావ్య సాధారణమగువర్ణన ప్రధానము గాదు -

వస్తువర్ణన గావింపక, భావస్ఫోరణముగ సంభాషణ మూలముననే శృంగారరసావిష్కరణము గావించిన కాళకవి ప్రతిభ యసమానమైనది.

రాజగోపాల విలాసమునకు కొంచెము ముందుగఁ బుట్టిన విజయ విలాసముతో సరిచూచిన నీ విషయము స్పష్టము - విజయ విలాసమున శ్లేషలమూలమున వర్ణనలమూలమున వేంకటకవి రససిద్ధి గావించినాఁడు. జాంబవతి లక్షణ నాయికల ఘట్టములోని సంభాషణలు చూచిన కాళకవి కేవలశ్లేషవర్ణనల పొంతఁబోక యెంత భావప్రధానముగ రచించినదియుఁ దెలియఁగలదు.

ఈ గ్రంథము విజయరాఘవనాయకుఁడు సింహాసన మెక్కిన తొలి సంవత్సరముననే యనఁగా క్రీ. శ. 1633లో రచియింపఁబడినది. కాబట్టియే నీ మహారాజు కాలమున విలసిల్లిన రంగాజమ్మ మొదలగు కవయిత్రుల వృత్తాంతముగాని, విజయరాఘవనాయకుని రచనలు గాని యిందుండుట కవకాశములేదు. విద్వత్కవియు, విష్ణుభక్తాగ్రేసరుఁడగు విజయరాఘవనాయకుని కాలమునాఁటి విస్తృతమగు వాఙ్మయమునకు తలమానికమగు 1 నీకృతి నింకను మనము చక్కగా చదువవలసియున్నది.

—: కోనేటి దీక్షిత చంద్రుఁడు :—

ఈతఁడు "విజయరాఘవ కల్యాణము" అను నాటకమునకుఁ గర్త. రాజగురువగు శఠకోప చతుర్వేది శ్రీనివాస తాతాచార్యుల శిష్యుఁడు. రామానుజాచార్య తనయుఁడు. విజయరాఘవనాయకుని చేత నగ్రహార తారహారాదిబిరుదవాద్య పారితోషికములందిన మనీషి. 'కందళద్రసగర్భసందర్భంబులు హావణించునట్లు' రచితమైన యీ నాటకమునుండి యుదాహృతమైన యీ క్రింది భాగమునుండి పై యంశములు దెలియుచున్నవి.

1. ఈకృతి తంజావూరి సరస్వతీ మహాలువారిచే ప్రకటితమైనది. గ్రంథ సంపాదకుఁడు నిడుదవోలు వేంకటరావు ఎమ్. ఏ.

"శ్రీమద్రామాయణోపదేశ సంతుష్టాంతరంగ భగవత్కృపాపాంగ వీక్షణాను రక్షణప్రాప్త సూర్యాగ్రహార తారహారరచిత రత్నకంకణకే దారతాను రూపమౌక్తిక కలాపహృద్యతర బిరుదవాద్యనానావాహనాది సమ్మాన మాననీయ శాశ్వతైశ్వర్యధుర్యులను, బహువారరచిత యాగ భాగసంతర్పితాఖిల దేవతావర్యులును, సంగీతసాహిత్య విద్యా ధురీణవరేణ్యులును, రామానుజాచార్య తనయాగ్రగణ్యులును భారత భాగవతాది శిక్షావైచక్షణ్య విజితవిబుధాచార్యులును గురురాజ శతక్రతు శ్రీనివాసదేశిక ప్రతిష్ఠాపితోద్యోయ వైభవధుర్యులును, సకలసద్గుణ సాంద్రుండునగు కోనేటిదీక్షిత చంద్రుండు" విజయరాఘవ నాయకుఁడు "శ్రీరామాభిరామంబగు శ్రీరామసౌధంబున కలువరా చెలువంబుగల చలువరాజగతిపై, సాత్త్వరత్న సింహాసన సుఖాసీనుఁడై" యున్నయపుడు,

చ. చతురవచోవిశేషములు శాశ్వతవైభవ శోభనంబులున్
విత్తరణగౌరవంబులు నవీనయశంబు లుదారతేజముల్
క్షితిళవిరాజకోటికిని జేరుచునుండ ధృఢవ్రతంబుగాఁ
బ్రతిదినముల్ గృతుల్ విజయరాఘవ భూమిపతిన్నుతింపఁగాన్

ఈ కృతిని రచించెను. విజయరాఘవ కాంతిమతీవివాహమిందు వర్ణితము. రచనాధోరణి యక్షగానసరణి నడచియున్నది. ఈ గ్రంథము శ్రీరామసౌధమున, తంజాపూరిలోనే, విజయరాఘవ నాయకుఁడు చలువరాజగతిపై కొలువుదీర్చియున్న సమయంబున రచితమైనది. ఈ శ్రీరామసౌధమున నేడు శరభోజీ శిలావిగ్రహముగలదు. అముద్రితము (సంఖ్య 701.)

—: పురుషోత్తమదీక్షితుఁడు :—

ఈతఁడు "తంజాపురాన్నదాన మహానాటకము"ను రచియించిన కవి. తంజాపూరి నాయకరాజు లన్నదానమునకు ప్రసిద్ధిఁజెందినవారు. "నిరతావారితాన్న సత్రసంతోషిత పంచాశత్సహస్రభూసుర" అని

రఘునాథనాయకుని వాల్మీకిచరిత్ర గద్యయందుగలదు. విజయరాఘవ నాయకుఁడట్లే ప్రతిదినము నేఁబదివేలమంది బ్రాహ్మణులకు నన్నదానము చేసిన యన్నదాత. ఈ గ్రంథమం దచ్చటచ్చట పాత్రల సంభాషణ ములలో నరవభాష ప్రయుక్తమైనది. దీనికి "సత్రమరులు" అని నామాంతరము. అముద్రిత గ్రంథమునుండి యీ క్రింది భాగముద్ధృతము.

తంజాపురాన్న సత్రములు "వేంచేసియున్న సేతుకాశీశలాంతర నిరంతరితమత్త్రయధరిత్రీసుపర్వులకు ఘృతగుడపాయసాపూపదధ్యన్న దుగ్ధవ్యంజన రంజితంబగు" తదీయారాధనంబున నతిహర్షంబు నొందించెడివి.

"ఈ సత్రముల కధికారి నెల్లూరి యెల్లమరాజు ఏమనుచున్నాఁడు మనయేలినవారు బ్రాహ్మణ్యప్రభువులు. వీరవైష్ణవ సార్వభౌములు అట్లుగనుక బ్రాహ్మణులకు అన్నపానాదుల పట్లకొదువవచ్చినా తాళరు. ఎంత మాత్రపువాఁడైనా తంజావూర ఉపవాసము ఉండరాదు. అటుగనుక ఘడియలు పంద్రెండాయెను. రామానుజకూటము, మధ్యకూటము, పెద్దసత్రము పరామర్శిస్తిరా! పొడిఅమరెనా? వంట అవుచున్నదా? తడియాకులు అమరిస్తిరా? ఉప్పు, ఊరగాయలు, ఊరుబిండి, పప్పు, పచ్చళ్లు, వేపుడుకూరలు, తడిదాలు పిండిమిరియాలు, పుల్లకూరలు, పాయసం, కజ్జాయీలు మొదలైన పదార్థాలెల్లా, శోధస్కారాలు, అమరిఉండా?"

ఈ హృద్యమగు కృతియందు నాయకరాజుల కాలమున బ్రాహ్మణులకుగలుగు సదుపాయములు, నిత్యాన్నదానప్రశస్తి చక్కగావర్ణింపబడినది. నెల్లూరినుండి తరలివచ్చినవారిలో ముఖ్యుఁడు నెల్లూరియెల్లమరాజు సత్రములకధికారి. ఈ కృతిలో విశేషముగా తెలుగువారి వంటకములే వర్ణితమగుటచేత నా సత్రములలో నాంధ్రబ్రాహ్మణ భోజనము విశేషముగా దొరకుచుండెడిదని గ్రహింపనగును.

## —: కామరసు వేంకటపతి సోమయాజి :—

ఈతఁడు విజయరాఘవ చంద్రికావిలాసమను నాటకమును రచించిన మహాకవి. విజయరాఘవ పట్టభద్రుని పట్టపుఁగవి. ఈకృతి నాటకమును, "విజయరాఘవచంద్రుని చంద్రికా విహార శృంగారలీలా విలాసంబు కవిహృద్వారంగ శృంగాటకంబులధాటి సల్పుభారతీ ఘోటకంబుగా" శృంగారరస గర్భావిర్భావంబునకు గర్భోటకంబుగా వర్ణించి యున్నాఁడు

ఈ నాటకమునుండి చోళదేశ వర్ణనమును, విజయరాఘవనాయకుని వర్ణనము నుదాహరించుచున్నాఁడను. దీనివలన యంతలి కవితారీతి యెఱుకపడును.

### చోళదేశ తంజాపుర వర్ణన - రగడ

కవులెంతురు చోళదేశము దివ్య - కావేరీవారి ప్రకాశము
నవరత్నములున్న కోశము సుర - నాయకరాజ్యసంకాశము
చెఱుకు రాజనంపుఁబైరులు కాపు - నేమముగలిగినయూరులు
తిరముగాఁ బ్రవహించు నేఱులు చోళ- దేశంబున వెయ్యేఱులు
ఆ రాజ్యమునకు మంజీరము అల్ల- అమరావతి గన్నసారము
భూరమణీమణిహారము తంజా - పురము సుపదలకొటారము
నవరత్నంబులపేటలు దివ్య - నారికేళంబుల తోటలు
సవరణ సేసిన కోటలు వీట - సరసులు నూటాఱుకోటులు
వలరాయనిమీఁది యేలలు చాల - వర్ణింప నేర్చిన బాలలు
విలసిల్లు నాటకశాలలు అందు - వింతవింతలు కృష్ణలీలలు
పరులనుగెల్చిన పౌజులు మెచ్చ - పాలింతురు దినరాజులు
సరిలేని విద్యాభోజులు వీట - సకినున్న రాజాధిరాజులు.

## విజయరాఘవనాయకుని పద్దెము

### ద్విపద

శ్రీరాజగోపాల - సేవచేఁ జాల
పేరుఁగాంచిన ఱేఁడు - బిరుదు మన్నీఁడు
లక్షణాన్వితుఁడు క - ళావతీసుతుఁడు
దాక్షిణ్యశాలి యు - త్తమరాజమౌళి
రణముల జగజెట్టి - రఘునాథుపట్టి
గుణరత్నముల దీవి - గురుజనసేవి
బహుదానపరుఁడు భూ - పాలశేఖరుఁడు
సహజగుణస్ఫూర్తి - సర్వజ్ఞమూర్తి
రతులకు రతిరాజు - రాజుల రాజు
వితరణగుణశౌరి - విభవజంభారి
జగదుపకారి వై - ష్ణవమతోద్ధారి
తగవులవీడు చిం - తామణిజోడు
నీతికిమాంధాత - నియమసంధాత
జాతివార్తల మేటి - శౌర్యకిరీటి
సరసుండు నెఱజాణ - చక్కనివాఁడు
పరమవైష్ణవుల చే - పట్టు కుంచంబు
బాహు విక్రమశాలి - భరతకోవిదుఁడు
సాహిత్యభోజుండు - సంగీతవేది
కోరినవారికి కొంగు - బంగారు
చేరువమేరు వా - శ్రిత వర్గమునకుఁ
బేదల పాలింటి - పెన్నిధానంబు
వేదకోవిదులకు - వెలలేనిసొమ్ము
పలికిబొంకని రాజు - పరమవివేకి
నిలుకడగలవాఁడు - నిత్యాన్నదాత
పట్టభద్రుండు కృ - పాసముద్రుండు

చుట్టాలసురభి రా - జులమేలుబంతి
వరశరణాగత - వజ్రపంజరుఁడు
నరులపాలింటి పు - న్నమ చందమామ
ఏకవీరుఁడు జగ - దేకవదాన్యుఁ
డాకారమన్మథుం - డసమసాహసుఁడు
మానినీసూతన - మకరకేతనుఁడు
భానుసమానుండు - పరతత్త్వవేది
అనుమానములేని - యావనమాలి
చనవరి యిల్లాలి - చనుబాలుగ్రోలి
పెరిగిన యన్న గో - భిల మానికన్న
పరతత్త్వరుచిఁగన్న - పాయంపుమిన్న
విజయరాఘవశౌరి - విద్యావిహారి
భుజబలకంసారి - పూర్ణసంసారి
అన్నిట ననధాని యారాజధాని
మన్ననతోనేలు మహి మేలుమేలు.

(అముద్రితము - సంఖ్య M. 686 తంజావూరి పుస్తక భాండాగారము) సంఖ్య 603. ఇందలిదే

కమ్మవక్కణ. లీలావతి వ్రాసినది.

సీ. శ్రీరాజగోపకుమారుతౌవిజయరా
ఘవ నాయనయ్యావారవధరింప
గదగయ్యదేవర పదపద్మములకు మీ
బైటినాటకశాల పడుచునైన
లీలావతిని పదివేలు దండంబులు
పెట్టిచేయంగల విన్నపంబు
కలలోన ననుమీరు కలిసినదాదిగ
గనుగొని స్వారిగాఁ గదలిరాఁగ

గీ. ఆసపడిచూచి నగరిసొమ్మైన దాన
మాచకోరిక నంపితి మనవిఁదెల్ప
గట్టిగా నన్నుమీరు చేపట్టుటన్న
నించువిల్కాఁడు మతినిర్వహింప నుండె.

విజయరాఘవ చంద్రికావిలాసములో విజయరాఘవనాయకుఁడు లీలావతియను పై నాటకశాల పడఁతితో చంద్రికావిహార వినోదములు సలుపుట యిందలి యితివృత్తము,

—: పసుపులేటి రంగాజమ్మ :—

విజయరాఘవనాయకుని యాస్థానమునకు విఖ్యాతకవయిత్రి యగు రంగాజమ్మకు రంగాజీయని నామాంతరము. ఇంటిపేరు పసుపులేటివారు తండ్రి వేంకటాద్రి. తల్లి మంగమ్మ. ఈమె రచించిన కృతులు,

1. మన్నారుదాస విలాసము - ప్రబంధము.
2. ఉషాపరిణయము - ,,
3. మన్నారుదాస విలాసము - నాటకము.
4. రామాయణ సంగ్రహము.
5. భారత - ,,
6. భాగవత - ,,

ఇంతియేగాక సంగీతమున నీమె లలితఫణితిని మృదుర సాస్వదములగు పెక్కుపదములు రచియించినట్లు, తన యుషాపరిణయావతారికయం దిట్లు చెప్పినది. "ఇంపుమీర నేనును శృంగారరసంబులఁ జెన్నుమీరు మన్నారుదాస విలాసంబు వినుపించుచున్న సమయంబున,

సీ. వేంకటేంద్రుని పుత్రి ! వినుత సద్గుణధాత్రి !
ఘనయశోరాజి ! రంగాజి ! వినుము.
మాధుర్యమున మించు మన్నారుదాస
విలాస ప్రబంధంబు లలితఫణితిఁ

గావించి, మిగులశృంగారంబు గన్పట్టఁ
బదములు మృదు రసాస్పదములగుచు
రాణింప రచియించి, రామాయణంబును
భాగవతంబును, భారతంబు

గీ. సంగ్రహంబుగ రచించి సరసరీతి
మమ్ము మెప్పించితివి చాల నెమ్మదవరఁ
పరగ హరివంశమున నుషాపరిణయకథ
తెనుఁగుఁ గావింపుమిక నీవు తేటగాఁగ.

పై కృతులలో మన్నారుదాసవిలాస ప్రబంధమును మన్నారు దాసవిలాస నాటకమును. (వీనిలో మన్నారుదాసవిలాస నాటకముతప్ప తక్కినవి రెండును నముద్రితములు.) ఈమె రచితములగు పదములు కూడ మనకు లభ్యముకాలేదు. కాని యీమె తన కృతులలో వాని నచ్చటచ్చట కూర్చుకొనియుండుటచే నుదాహరణమునకు మాత్రమే మనకు దొరికినవి

రంగాజమ్మ కృతులను కూర్చి యెఱుంగుటకు ముందు నామె విద్యావైదుష్య మెఱుఁగఁదగినది. అది యాయా గ్రంథముల కడపటఁ గూర్చిన గద్యయే తెలుపఁగలదు. దానినిట నుదాహరించెదను.

“ ఇది శ్రీమద్రాజగోపాలకరుణాకటాక్షవీక్షణానుక్షణ ప్రవర్ధమానసారస్వతధురీణయు, విచిత్రతరపత్రికాశతలిఖిత వాచికార్థావగాహనప్రవీణయు, తత్ప్రతిపత్రికాశతస్వహస్తలేఖన ప్రశస్తకీర్తియు, శృంగారరసతరంగితపదకవిత్వమహనీయ మతిస్ఫూర్తియు, అతులితాష్ట భాషాకవితాసర్వంకషమనీషా విశేషవిశారదయు, రాజనీతివిద్యావిశారదయు, విజయరాఘవ మహీపాలవిరచితకనకాభిషేకయు' విద్వత్కవిజన స్తవనీయ వివేకయు, మన్నారుదాసవిలాసనామ మహాప్రబంధనకృత లక్షణయు, మహనీయరామాయణ భారతభాగవత కథాసంగ్రహవిచక్షణయు, పసుపులేటి వేంకటాద్రి బహుజన్మతపఃఫలంబును, మంగ

సూరాంశాగర్భశుక్తిముక్తాఫలంబును, రంగద్గుణకదంబయునగు రంగాజమ్మ పచనరచనాచమత్కృతిం జెన్నుమీఱు ఉషాపరిణయ ప్రబంధమునందు తృతీయాశ్వాసము.”

పై గద్యవలన నీమె రాజగోపాలదేవుని దయవలన కవయిత్రి యయ్యెననియు, వాచకత్వముననేగాక, చిత్రవిచిత్ర శతలేఖినీ విద్య యందు ప్రవీణురాలనియు, నెనిమిదిభాషలలో కవనమల్లగల నేర్పఱి యనియు, పదకవిత్వమున ప్రౌఢిమగన్నదనియు, రాజనీతినెఱిఁగిన రమణియనియు, సరసశృంగార పదకవితయందు జాణయనియు, విజయ రాఘవమహీపాలునిచే కనకాభిషేకము మహాగౌరవమును బొందిన విద్వత్కవయిత్రి యనియు తెలియుచున్నది. (కనకాభిషేకము చేయు విధానముగూర్చి చూడుఁడు: శృంగార శ్రీనాథము: గౌరవముచేయు వ్యక్తిపై బిందెలతో బంగారు నాణెములు స్నానముచేయునట్లు వెలువ రింపవలెను. క్రిందపడిన యీ నాణెములన్నింటిని తక్కినవారందఱకును పంచిపెట్టవలెను. ఇది కనకాభిషేకము. ఇందు కవికి గౌరవమేగాని కనకము లభింపదు పుట 189)

కనకాభిషేకగౌరవము బొందుటయనునది సామాన్య విషయము గాదు. లోకోత్తర ప్రతిభాశాలియగు మహాకవికిగాని, విద్వల్లోకమకు టాయమానుఁడగు మహావిద్వాంసునికిగాని చేయఁదగిన మహాగౌరవ ములలో కనకాభిషేకమే ప్రధానమైనది. విజయనగర సామ్రాజ్యాధీశుఁ డగు దేవరాయనిచే శ్రీనాథ మహాకవి యీ సత్కారమును గాంచిన వాఁడు. వ్యాఖ్యాతృచక్రవర్తి మల్లినాథసూరి సర్వజ్ఞసింగ మహీ పాలునిచే నీసత్కారమును పొందినవాఁడు. కాని యింతవఱకు స్త్రీలెవ్వరును నిట్టి గౌరవమును బొందినట్లు మనకు తెలియుటలేదు.

కవయిత్రియగు రంగాజమ్మ యిట్టిగౌరవమును బడయుట యాంధ్ర లోకమును, నందు ముఖ్యముగా నాంధ్రమహిళామండలియు గర్వింపఁ దగిన విషయము. అంతియేకాదు; ఆంధ్రవాఙ్మయ చరిత్రమున నిది సువర్ణాక్షరములతో లిఖింపఁదగినది.

గద్యలో 'అతులితాష్టభాషాకవితా సర్వంకషమనీషా విశేష విశారద' అనునది నీమెయెడల సార్థకమే. అష్టభాషలనఁగా 1. సంస్కృతము. 2. ప్రాకృతము. 3. శౌరసేని. 4. మాగధి. 5. పైశాచి. 6. చూళిక. 7. అపభ్రంశము. 8. తెలుఁగు అనునవి. ఈ భాషలయం దీమె కవితావైదుష్యము తెలుపుటకు మన్నారుదాస విలాస నాటకము నుండి యీ క్రిందివాని నుదాహరించుచున్నాఁడను.

సంస్కృతము,

ఔదార్యమంగనృపభంగవిధాన ధుర్యమ్
శౌర్యంచ ధైర్యమపి శౌర్యుపలాలనీయమ్
రూపంచ పంచశరపీరవిలోభనీయమ్
యస్యాస్త్యహో విజయరాఘవ సార్వభౌమ.

ప్రాకృతము,

భద్దదేయు పుణెతుహ చంపయరత్నప్పయేన నంచాలో
హారిద్దణం యిలతుజ్జ్వల మందిర విహాయీాయరాయగోపాళో.

శౌరసేని,

విదదయసో వత్తదిసో జయయివిహాద్దణ్పదోయేసో
కణ్ణపదబత్తిసీళో మణ్ణారుదాసో మహీపాళో.

మాగధి,

పుశుపశరాసన శరిసే రూవేణ హరియ్యే మహీమాయే
దాణేహంరాహేయే వియయి రహునాహశామి సంతాణె.

పైశాచి,

సౌవజ్జోగునవంతో బమ్మ్సనహచ్చాను పూళన్దమహనానో
అయ్యావెన్నసమానో లోకవిలోకస్స పున్నెనిమచందో.

చూళిక,

ఖమళవిలోచనమధనే యాంచకరఘున ధౌవ్యపాదపోయేసో
భాహాభళభళపద్దా ఆరవికారయ వియయరాఘువో విషయ.

అపభ్రంశము

పుణు కావిగోడి తుంహో డడ్థూణ మణెన్నరూపు ఆగమాణు
దూాయి యనిబ్భరవిరహు పుహోవు మణ్ణరుదాసు భూపాలు.

తెలుఁగున నామె గ్రంథకర్త్రయేగావున నుదాహరణమీయలేదు. సంస్కృతపద కవిత్వమునందీమె చతురయనుటకు నీమెరచించిన చూర్ణిక రూపకతాళవర్ణములు మొదలగునవి తెలుపును. ఈమెకు సంస్కృత వ్యాకరణమున మంచిప్రవేశము గలదనుటకు, మన్నారుదాసవిలాసమున నొకచో నీమెవ్రాసిన వ్యాకరణశాస్త్ర ప్రసంగమే యుదాహరణము. గ్రంథవిస్తరభీతిచే వాని నుదాహరింపలేదు.

మన్నారుదాసవిలాసనాటకమున నీమె ప్రతిభ లోకజ్ఞత హాస్య రససంవిధానము - సంగీతజ్ఞానము నిండారవెల్లి విరియుచున్నది. ఈ నాటకమునందు పాత్రోచితభాష వాడఁబడుటచే నిదిమఱియు రసవత్తరమై హాస్యమననిదియని నిరూపించుచున్నది. ఇందు కొన్ని యుదాహరణములు.

ముహూర్తము నిర్ణయించుటకు రాజాగారియాస్థానముననున్న గణితజ్ఞుల చర్చలు, ఒకరిపై నొకరివాక్యములు సంభాషణ :—

భైరవజోస్యులు : మంచనభట్లుగారు పంచాంగం విప్పుడా ?

మంచనభట్లు : భైరవజోస్యులు. నేరనిమాటలె ఆడుదువు. చక్కంగా అశ్వినిభరణి కృత్తికలు గురుతెరుగవు నీకు పంచాంగం విప్పే దిన్నా నీభవిష్టికి.

భై : మంచనభట్లుగారికి మూలానక్షత్రమే మాటాడకమునుపే మూలం రేగుతూ ఉన్నది.

మం: ఓరి భైరజోశ్యస్సిగా! తిథివారనక్షత్రాల్లో నొకటి గురుతెరు గవుగదా! పంచాంగమనంగా నేందిరా?

భై: మంచనకు ముక్కుమీదనే వుంటుందు కోపం. అమావాస్యనాడు గ్రహణమనిన్నీ, ఆగ్నేయస్సర్శ అనిన్నీదబ్బరలే వ్రాస్తివే! మేముగ్రహస్ఫుటంచేసి గ్రహణము లేదంటిమే.

మం: నీవు పోచన సోమయాజులవారింట మొగవాండుపుట్టునని ప్రశ్న జెప్పి యోకాతుర్రప్రయోగం చేయించుకవస్తిలే!

భై: నీవు బుచ్చానధానికొడుకు బుచ్చిగాండు పదహారోయేంట పల్లకి యెక్కునని జాతకంవ్రాస్తివే - ఇదిగో బిచ్చంయెత్తుక తిరుగు మన్నాండె?

మం: నేఫలభాగం వ్రాసినవారు పదివేలమంది పల్లకిపదస్థులు నీకేం తెలుసు పోరా.

మధ్యస్థులు: వోయి, చాలించరోయి, మీ జగడాలు, నగరివారు ముహూర్తం నిర్ణయించమంటే ఏపాగాధా లాడుచున్నారు.

పురోహితుల మాటలు

కొండుభట్లమాట: అవునోయి యల్లుసోమయాజులు, నూరుతరాల నుంచి యీ యింటికి తగువైన పురోహితుండనేనుండగా నీ వెవ్వండికొడకవు నా స్వాతంత్ర్యం కొంగుముడిరూక తీసుకు పోయేటట్టుగా?

యల్లుసోమయాజులు: ఏమోయి కొండుభట్లా! మాతాతకు చవ్వప నాయనివారు పాకెన సంభావన కట్టడచేసివుండగా నీ వెవ్వండ వోయి అపహరించుక పోయేటట్టు. మా అన్నకొడకవా! ముత్తైదువుల మాటలు.

యల్లమ్మ : అవునషేతిమ్మక్క ! నాకువకక్కబ్బద్దా వకటికొదవా ! చాలుచాలు; నిన్నమూవారు సుక్కురారం సంతలో పిండి కూరకంచున్నా గానుగపిండిదెచ్చేరు. నోరు మెదలించవలె నంచున్నా.

తిమ్మక్క : పొరుగింటి తిమ్మావధానిపెండ్లాం వీరమ్మ పాటలు పాడుతూన్నది. అందుకొని నీవున్నా పాడ్రాదమ్మో.

యల్లమ్మ : ఇదేందో నీవు నాగపసానిలా పైత్తనంచేసుకు వుండేదానవున్నా కడమవారు పాటలుపాడేవారున్నా.

తిమ్మక్క : వోశమ్మా-మాయింటి ఆయన యెందుకో యీ వేల లమ్మంచున్నారు. పక్కడంతా మొగవారేవున్నారు. నీవుధవళం యెత్తు నేనుంగూడా పాడేగాని.

ఇట్లే లగ్ననిర్ణయసందర్భమున నీమె జ్యోతిషపరిజ్ఞానమును, విద్వద్గోష్ఠియందీమె విద్యావిశేషములును నీ నాటకము మూలమున వ్యక్తములగుచున్నవి.

ఇందలి కథ విజయరాఘవనాయఁడు కాంతిమతియను నొక కన్యను వివాహమునాడు నట్టివృత్తాంతము. ఒకనాడు రాజగోపాలస్వామి యుత్సవము చూడవచ్చిన యువతులలో కాంతిమతి యనునామె విజయరాఘవునిచూచి, మోహించి విరహవ్యథతోవేగి, విలాసవతి యను నొకదూతిని రాజువద్దకుపంపెను. రాజును విలాసవతి చెప్పినవిషయము గ్రహించి తాను కాంతిమతిని వివాహము చేసికొందునని తెలియజేసెను. ఇంతలో నొక యెఱుకతవచ్చి ముందుగానే రాజుపెండ్లికంగీకరించునని చెప్పెను. విలాసవతి వచ్చి యీ శుభవృత్తాంతము చెప్పగానే కాంతిమతి సంతోషముతో కాలము గడపుచుండెను.

ఇక్కడ రాజు కాంతిమతి విరహముచే సుక్కుచుండగా రాజగురువగు శతక్రతు తాతయాచార్యులవారీసంగతిగ్రహించి, కాంతిమతి

తండ్రియగు రాజచంద్ర మహారాజునద్దకుఁబోయి యాతనితో కాంతిమతీ వివాహమునుగూర్చి ముచ్చటించెను. రాజచంద్రుండు నందులకంగీకరింప వివాహప్రయత్నములు గావించిరి. రాజును భద్రగజముపై నెక్కి యూరేగిరాగా వధూవరులఁ బీఁటలపైఁగూర్చుండఁబెట్టి పురోహితులు వివాహసంకల్పము నడిపి "దేవతాహ్వాననాంద్యగ్ని ముఖస్నాతకవ్రత పునఃపుణ్యాహవాచన అంకురార్పణ కన్యావరణమంగళాష్టక నవవస్త్ర ధారణ మంగళసూత్రధారణ వివాహప్రధాన హోమాదిశుభకర్మంబులు" సక్రమముగానడిపించిరి. ముత్తైదువులంత ధవళంబులు శోభనములు పాడిరి. విజయరాఘవ కాంతీమతీవివాహము పూర్తియైనవెనుక నిజ నగరప్రవేశమైనది. నాయికానాయకులు సుఖస్థితినుండిరి.

ఈ ప్రశస్తనాటకమును క్రీ. శ. 1926 లో నాంధ్రసాహిత్య బరిషత్తువారు కీ. శే. జయంతిరామయపంతులవారి సంపాదకత్వమునఁ బ్రకటించినారు. వారి ఆధునికాంధ్ర వాఙ్మయవికాసవైఖరియం దీ నాటకముఁగూర్చిన విమర్శనము 29-40 పుటలవరకుఁగలదు.

## ఉషా పరిణయము

ఉషానిరుద్ధుల వివాహవర్ణితమైన యీ ప్రబంధమున మూఁడా శ్వాసములు సమగ్రముగను నాలుగవ యాశ్వాసములో కొంతభాగ మును లభ్యమగుచున్నది. అముద్రితమగు నీ గ్రంథము తంజావూరి పుస్తకశాలలో 140 సంఖ్యగానున్నది. కృత్యవతరణికలో విజయ రాఘవనాయకుని వంశావళి సంగ్రహముగాగలదు. శృంగారరస ప్రధాన మగు నీ గ్రంథమునుండి కొంతభాగమును దాహరించుచున్నాను.

ప్రారంభము

శ్రీవిజయాయురున్నతులచే నలరించెదఁగొల్చువారలన్
ధీవిభవంబు మీఱఁజనని తెల్పుచు హేమవనింజెలంగురా
జీవదళాయతాక్షుఁడగు చెంగమలేశుఁడు మన్ననారు గో
త్రావిభుధేంద్రుని న్విజయరాఘవ చంద్రునిఁబ్రోచుఁగావుతని.

ఇష్టదేవతా ప్రార్థనమును శతక్రతు శ్రీనివాస తాత గురువర్య వందనమునైన వెనుక తంజాపురీశుఁడగు విజయరాఘవ మేదినీవిభువరుండు "రాజగోపాల విలాసంబునందు నతులితవిలాసవతులైన కులసతులును విబుధసన్నుతమతియగు విజయవెంకటపతియు, మహితప్రభావుండగు మన్నారుదేవుండును, తతయశోధనుండగు తాతఘనుండును, రంగద్గుణ విలాసుండగు చెంగమలదాసుండును, మొదలగు నిఖిలజన మిత్రులైన పుత్రులును, నిరుపమచరిత్రపవిత్రులైన పౌత్రులును, నిరవద్యరూపరేఖా కనకపుత్రికలైన పుత్రికలును యింపుమెఱయం దామరతంపరలైనిండి యుండ" రంగాజమ్మ మన్నారుదాసవిలాసము నాటకము వినుపించు చుండ, విజయరాఘవుఁ డుషాపరిణయము రచియింపుమని కోరెను. ఆమెయు వంశావతారము వర్ణించి గ్రంథము ప్రారంభించి ముగించెను. ఇందు రంగాజమ్మ కథాసంవిధానమును, కవితాచమత్కారమును తెలియఁగలగు. కవనము రమ్యమేయైనను, నాచనసోమ, కనుపర్తి అబ్బయామాత్య దామెర అంకభూపాల రచనలతో తులఁదూఁగలేదు.

## ఉషాపరిణయము

క. కుందకయుండఁగ కరముల
నిందుముఖిఁ బ్రహ్మయెట్లు సృజియించెనొకో
యందంబు పొగడఁదరమా
కందర్పుని రాజ్యలక్ష్మికై వడినమరెన్.

మ. ఘనసంఘంబు ప్రచండవాతమున వేగన్వీచ్చు చందంబునన్
ఘనదంభోళి కఠోరఘోర పరిఘాఘాతంబునన్ నొచ్చియా,
దనుజానీకము బార వెంటఁజని యుత్సాహంబు రెట్టింపఁగ
య్యనిరుద్ధుండట పోకుపోకుఁడు నిలుండంచున్ వెసంబల్కుచున్.

సీ. ముల్లోకములు మెచ్చ ముక్కంటిచేతను
వరములు గైకొన్న వరబలుండు
వేయుకరంబుల వివిధాయుధంబులు
ధరియించియనిసేయు ధైర్యశాలి
దేవేంద్రముఖులైన దిక్పాలకులనెల్ల
క్షణమాత్రమునగెల్చు సాహసికుఁడు
మాయాబలంబున మగటిమిచేతను
పగతుఱసాధించు బల్లిదుండు

గీ. ప్రమథగణములతో గూడ భర్గునంత
వాఁడువాకిటిగొల్లయై వచ్చికొలువ
నల్లశోణితపురమేలు నట్టిమేటి
యమితతేజోధికుండు బాణాసురుండు.

## మన్నారుదాస విలాసము.

### ప్రబంధము.

రంగాజమ్మరచనలలో ప్రథమమును ప్రశస్తమును నగునీకృతి యింతదనుక ముద్రణభాగ్యమునందలేదు - ఈగ్రంథరచనాకాలము నాటికి రంగాజమ్మ కనకాభిషేక సన్మానములను బొందియుండలేదు. ఇందు విజయరాఘవ నాయకునికి మన్నారుదేవునిపై గల మక్కువయు, అమన్నారు స్వామికి నేతద్దేవాలయమునకు విజయరాఘవుఁడొనరించిన దానధర్మములు, అచ్చట ఫాల్గుణమాసమున జరుగు తిరునాళ్ల వైభవములు కాంతిమతీ వివాహము మున్నగునవి వర్ణితములైనవి. ఈగ్రంథమునకు గల రెండుప్రతులలో నొకటి గ్రంథలిపిలో నున్నది.

ప్రారంభము.

ఉ. శ్రీరుచిరాంగియై వెలయుఁజెంగమలాంబికఁగూడి సంతత
శ్రీరమణీయ వైభవవిశేషముల......
సారెసుపుత్ర పౌత్రులను శాశ్వతలక్ష్ములనిచ్చి వేడ్క దు
ర్వార భుజాబలున్ విజయరాఘవభద్రునిఁబ్రోచు గావుతన్,

గీ. విజయరాఘవమేదినీవిభుఁడుకన్న
తండ్రి, గురువును, దైవంబుతానయగుచుఁ
జెలువుమీఱు శతక్రతు శ్రీనివాస
తాతయాచార్యచరణ పద్మములుగొలుతు.

క. పన్నగశాయి చరిత్రముఁ
బన్నుగద్రవిడ ప్రబంధఫణితిని నుడువన్
పన్నిద్దరాళువార్లఁ బ్ర
పన్నుల సన్నుతులుచేసి భావింతుమదిన్.

ఇష్టదేవతాస్తుతియైన వెనుక తంజాపురీ వల్లభుండగు విజయరాఘవుని వర్ణన.

సీ. ఏరాజచంద్రుండు శ్రీరాజగోపాల
సేవాధురీణుఁడై చెలఁగుచుండు
ఏరాజతిలకంబు హేమాబ్జనాయికా
వరతనూభవుఁడన వన్నెకెక్కు
ఏరాజశేఖరుండిలలోన పదియాఱు
దానమ్ములను మహత్త్వంబుఁజెందె
ఏరాజసింహుండు వీరాధివీరుఁడై
పరవీరులనుగెల్చె బాల్యముననె

గీ. అతఁడు రఘునాథ భూపవరాత్మజుండు
మానినీజనమోహన మన్మథుండు
భావికీర్తి ప్రకాశిత భవనతలుఁడు
శ్రీలవిలసిల్లు తంజాపురీవిభుండు.

నిండుకొలువై "శ్రీమద్రామాయణ భారతార్థంబుల నుపన్యసింపుచుండ నాజయలక్ష్మి యనందగు నాజయమ్మయు, సంపదలసొంపారు చంపకవల్లెమ్మయు నిరుగడల సరసనొరనుకఁ గూర్చుండ, ప్రఖ్యాతనయులగు

తనయులును పరివేష్టింప మన్నారు కాంతిమతీ కరగ్రహణము, ఫాల్గుణ మహోత్సవాది దివ్యవైభవంబులు శ్రీరాజగోపాల నామాంకితంబుగా నొకప్రబంధంబు గావింపుము. మఱియు నేతత్ప్రబంధమున కత్యంత మహత్త్వంబును గలుగునని యానతిచ్చి మెచ్చివచ్చు జాంబూనదాభరణంబులు నమాల్యంబులను మన్నారు శుణంబులు? నొసంగిన" వంశావతారం బభివర్ణించెను.

## రఘునాథ నాయకునివర్ణన

ఉ. సారభుజాబలంబునను చక్కదనంబున సద్గుణంబులన్
ధీరనుత ప్రతాపముల దిక్కులమిక్కిలి నిండుకీర్తులన్
ధారణిఁబ్రోచు నేర్పున నుదారదయం గవితాచమత్కృతిన్
శ్రీరఘునాథభూమిపఫణీమణికిన్ సము లేన్నృపాలకుల్.

సీ. దినమొక్కలక్ష భూదేవతోత్తములకు
సత్రంబుఁ బెట్టుటే స్వామివ్రతము
ప్రతివత్సరంబుఁ దప్పకయె షోడశమహా
దానముల్ జేయుటే ధన్యపూన్కి
అనిశంబు శ్రీవైష్ణవావళికిని నగ్ర
హారంబు లిచ్చుటే యధిపుమతము
కవులవిద్వాంసులఁ గనకపత్ములఁ
గాచిరక్షించుటే ఘనునిరీతి

గీ. ఆమహామహుఁడచ్యుత తిమ్మమహేంద్ర
తనయవర్యుండు రఘునాథ ధరణివిభుఁడు
సవ్యగుణయుక్త శ్రీరఘునాథుఁడగుచు
ధాత్రిఁ బాలించెవిబుధ సంతతులుబొగడ.

ఈతఁడు రాజగోపాలదేవుని వేడుటచే మన్నారను పేరుగ విజయరాఘవుడు జన్మించెను. రాజగోపాలుఁడిట్లనెను.

గీ. శివివిజయాఖ్యసుతుని వేడితివిగనుక
లీలమను రాఘవునిగఁ గొలిచితిగనుక
విజయరాఘవనామంబు వెలయఁదాల్చి
చెలఁగి వేయేండ్లు పుడమిరక్షించుచుండు.

విజయరాఘవనాయకుఁడు.

సీ. తొలుఁదొల్త పసిఁడి యుయ్యేలలూఁగువేళనే
తోరహత్తుగఁదులఁ దూఁగనేర్చె
దాడిపల్కులు నేర్చు తరిని శ్రీరాజగో
పాలనామంబును పలుక నేర్చె
అక్షరాభ్యాసంబు నప్పుడె గ్రామముల్
వేడ్కనొప్పంబులు వెట్టనేర్చె
గరిడిలోపల సాముదొరకొన్నవేళనె
తునెలుగా వైరులఁ దునుమనేర్చె

గీ. జనకుఁడీతఁడు సుజ్ఞానజనకుఁడనుచు
అనుదినము తండ్రిసేవ సేయంగనేర్చె
మన్నారుల భక్తుఁడై చిన్ననాఁడె
ఇతఁడు మన్నారుదాసాఖ్య నెసఁగనేర్చె.

సీ. శ్రీరాజగోపాలశౌరి కంకితముగా
మంజరీముఖకృతుల్ మహినొనర్చె
రాయలసాహిత్య రాయపెండేరంబు
శారదాధ్వజము నెసంగనెగడె.

... ... ...

విజయరాఘవుని వర్ణన. మన్నారు (రాజగోపాల, విజయరాఘవుల క భేదవ్యవసాయము)

సీ. వక్షస్థలంబున వన్నెకెక్కినమచ్చ
లాలితంబగు వనమాలికయును
సరిలేనికరముల శంఖచక్రంబులు
నవరత్నమయమైన నవ్యనేత్ర
మనుపమంబై మించుకనకాంబరంబును
రమణమైమీఱు వజ్రములవంకి
ముంజేతులను బొల్చుముత్యాలకడియముల్
చరణపద్మమునందు బిరుదుపెండె

గీ. మనమరె నిద్దరియందును నందముగనె
నెంతభావించినను భేదమెఱుఁగరాదు
కావునను రాజగోపాలదేవుఁడిపుడు
తనరమాపద్వయంబును దాల్చెనేమొ ?

పురవర్ణనలో నొకపద్యము.

ఉ. కన్నులు గండుమీలు తొలుకారు మెఱుంగులు మేనులయ్యెడన్
గన్నవి కావుకౌనులలకంబులు చొక్కపుటింద్రనీలముల్
చన్నులు కుంభికుంభములు సారసముల్ పదముల్ దలంపఁగా
నన్నగరంబు కామినుల కన్యవధూటులు సాటివత్తురే.

గ్రంథాంతమున.

సీ. నావిభుండైన మన్నారుదాసునిచేత
ముదమున మంజరీముఖకృతులను
పొగడొంద నంకితంబుగఁగాంచు శ్రీరాజ
గోపాలశౌరికిఁ గోర్కెమీఱ
నేనంకితముసేయ నిటునంటి మన్నారు
దాసవిలాసంబు ధరణిలోన
పరమభాగవతుని చరితంబుగావున
వినినవ్రాసినఁజదివిన జనులకు

గీ. నాయురారోగ్యపుత్ర పౌత్రాభివృద్ధి
ధనకనకదివ్యవస్తువాహన సమృద్ధి
నిరుపమానకవిత్వ పాండిత్యమహిమఁ
గలుగునాచంద్రరవి తారకంబుగాఁగ.

మన్నారుదాసవిలాసము - (ప్రబంధము) - చిత్రకథ

—: సౌందరి :—

రంగాజమ్మరచించిన యీకృతి తంజావూరి పుస్తకశాలలో కలదు కాని, ఈగ్రంథమే మఱియొక కవయిత్రి 'సౌందరి' అనునామె దీనినిరచించినట్లుగా నందలిగద్యములు కూర్చబడి "అల్లాడ విజయసింహభూపతివిలాసము" అనుపేర మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకాగారమునసున్నది. దాని సంఖ్య 786. ఇది తాళపత్రగ్రంథమే. ప్రాఁతనవీనముగ స్ఫుటముగ నున్నది. ఒక్కొక్క దానియందు 14 పంక్తులుగలవు. ఈగ్రంథము చదివిన వారి కిది యొక కూటసృష్టియని తోచకమానదు. ఏలననగా రంగాజమ్మ గద్యయందలి పేళ్లుమాత్రమే యిందు మార్పుచెందినవిగాని తక్కినవి యన్నియు సమానమే. ఇప్పుడు ముద్రితమైన మన్నారుదాస విలాసనాటకములోని పద్యములిందున్నవి. కాబట్టియిది రంగాజమ్మకృతియే, "సౌందరి" అనునామె యెట్లోసంగ్రహించి (ఆమెయు సంగీతసాహిత్యములు నేర్చినదికాదగును) గ్రంథకర్తృత్వము నభిలషించి, దీనినిట్లు మార్పించి యుండును. రంగాజమ్మ గద్యలో "విజయరాఘవ" అని యున్నచోనిందు "విజయసింహభూపతి" అచట "పసుపులేటి" యన్న నిచట "రాచవేటి"-అచట "మ గమాంబ" ఇచ్చట "మా ర్తికాంబ" యిత్యాదిగా వెలసినవి. ఈమార్పులు కేవలము పేరులలోనే యుండుటచే నొక్కొక్కప్పుడు యతిదోషములుగూడ గమనింప బడియుండలేదు. ఉదాహరణమునకు :—

క. ఆరాజుల చనవీరా
వీరాయితకేళి నిన్ను వెలకుగొనేరా
నేరాలకేమి రారా
రారాపులు మాని విజయభూపతిధీరా!

ఇట్లుగా 14 వ పత్రమునగలదు "రారాపులు మాని విజయరా ఘవధీరా" అనిగదా యుండదగినది. కావున నీకృతి రంగాజమ్మదే యనుట నిక్కము.

అముద్రితమగు ని గ్రంథమునుండి కవిత్వశైలిని తెలియుటకు 'వసంతవర్ణన' నుండి కొన్ని పద్యములు లుదాహరించు చున్నాడను.

మ. పరగెన్ జైత్రుఁడు నవ్యసూత్రతిలకా పాణిగ్రహంబందుచున్
మెఱయన్ మల్లికలున్ తరువ్రజములు స్వచ్ఛందఁగా నిత్తఱిన్
తెఱఁగొప్పన్ నిడి పాణిపల్లవములన్ దీవ్యన్నవామోదముల్
నెఱయన్ దాల్చిన సేసఁబ్రాలనగ గన్పించెన్ ప్రసూనావళుల్.

క. బాహుబలశాలి మరుఁడు
త్సాహంబున జగముగెలువ తరలెడుచో స
న్నాహంబుదెల్పు తత్ఘన
కాహళ రావములన నళికధ్వను లెసగెన్.

గీ. కొమరుమీఱిన నవపల్లవముల కాంతి
గాఢమౌ సాంధ్యరాగంబు కరణిమించ
నవుడు గనిపించె నందందు నందనుగను
తారకంబు లనంగను కోరకములు.

క. తరుణీజన మానమద
ద్విరదంబుల మదమడంప దివురుమరునికిన్
దరమగు రత్నాంకుశముల
మురువుగ గనుపట్టినపుడు మోదుగమొగ్గల్.

గీ. మలయనిలయానిలుం డను మంత్రవాది
యచట భ్రమరాక్షరము ద్రిప్పుచును మఱియు
పొసగు కుసుమ పరాగంబు భూతి జల్లి
సల్పె యువతి మానగ్రహోచ్చాటనంబు.

ఈమన్నారుదాస విలాసమునసే రంగాజమ్మ యొకదండకముగూడ విజయరాఘవుని పేర రచించినది. అదియు పై విధముగా మార్పు చెందినది. అల్లాడవిజయసింహభూపతిపై "మోహిని" అను నామె మరులుగొనుట, పొందుట యిందలివిషయము. ఇదియు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో "మోహిని దండకము" అనుపేరగలదు. సంఖ్య 2001 మన్నారుదాసకావ్యము, నాటకము రెండును విజయరాఘవనాయకుని చరిత్రాత్మకము లేనిగాని వేఱుగావు. రంగాజమ్మ కృతు లిట్లితరుల కృతులుగా మార్పుచెందు నవకాశమున్నదనుటకు మఱియొక వృత్తాంతముగూడ నిటఁ దెల్పెదను.

"విజయరాఘవ నాయకుఁడెల్లప్పుడును నీమెతో (రంగాజమ్మతో) నానందించుటచూచి, యాతనిపట్టమహిషి యాగ్రహము నాపుకొనఁజాలక యొకదూతికమూలమున దూషణోక్తులతో నొకవార్తం పెంపెనట! దానికి విదుషీమణియగు రంగాజమ్మ దూతికీపద్యము జవాబునిచ్చెనట!

ఉ. ఏవనితల్ మనుదలఁప నేమిపనో? తమ రాదువారు గా
రో? నలపించు నేర్పెఱుఁగరో? తమకౌఁగిటిలోన నుండగా
రావవదేమిరా? విజయరాఘవ! యంచిలుదూఱిబల్మి చేఁ
దీవరక తెనె యిటుల తీసుక వచ్చితినా తలోదరీ!

మఱియు నంతఃపురములో నిట్టిసందర్భములో చెప్పినచాటువులు:

ఉ. 'రాజనిభాననా! సరసురాలవు; జబ్బుగ నల్లినావదే
మే జడ?' 'యింతకంటెవలెనే?' 'వలనొప్ప బిగించియల్లవే
ఓజవరాల! వేతెపనియున్నది' 'దోసమె' దోసమే! మహా
రాజగునట్టి యవ్విజయరాఘవుమై చిగురాకుకోమలీ!

చ. కులికెదవేటికే చెలియ! కుంచెడు మానెడుగాను నెల్లవా
రలు వినినారులే! విజయరాఘవనాయఁకు నిన్నుగూడుటల్!
వలపులెచాటుచున్నవి; జవాదియు నల్లవు: విట్టివీగఁగా
వలెనటె? చూచి యోర్తురటె వంతులుజంతు లవేటిమొమ్మొలే?

౪. “ఇంతీ పానుపుపై నిదె
కంతుడు కూర్చున్నవాఁడు ; గనుగొను!” “సహావా,
కంతుఁడనంగుఁడు; నీ తెలి
విం తేనా? విజయరాఘ వేంద్రుఁడు, చెలియా!”

పై పద్యములు ‘విజయరామ’అను మార్పుతో విజయనగరరాజు (కళింగదేశమున) విజయరామరాజుపై అశీదము సూరకవి చెప్పినట్లు కీర్తిశేషులు గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు సూరకవిచరిత్రలో వ్రాసియున్నారు. ఆ వైపున నీపద్యములు సూరకవియని యేమాత్రము. (పై పద్యములు చాటుపద్య మణిమంజరి (ప్రథమభాగమున) 63, 64, పుటలలో బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించియున్నారు.

## రంగాజమ్మ కులము

రంగాజమ్మ వారాంగనయని పూర్వచరిత్రకారు లభిప్రాయపడియున్నారు. వీరుజన్మముచే వేశ్యలుగానుండియు, సంస్కార విశేషముచేత జాణలై సాంఘికజీవిత మాధుర్యము చవిఁజూపిన సరసురాండ్రయత్యున్నతస్థానము నాక్రమించినవారు. రఘునాథరాయల కాలమున, రామభద్రాంబ, తిరుమలాంబ, మధురవాణి. విజయరాఘవుని కాలమున రంగాజీ, కృష్ణాజీ మున్నగువారు కులమున వేశ్యలేయైనను, ఏకచారిణీవ్రతము ననుసరించినవారు (అనగా జీవితకాలమంతయు నొకే నాయకుని ననుసరించియుండువారు.) కావుననే వీరిలో కొందఱు, తమ నాయకులకు ధర్మపత్నులుగాఁ జెప్పికొన్నారు. రంగాజమ్మయు నట్టి యేకచారిణీవ్రత సంపన్నురాలై సాహిత్యసామ్రాజ్యము నధిష్ఠించిన పూజ్యురాలు. పరిశోధకశిఖామణులు, విద్వద్వర్యులు మా. రామకృష్ణకవిగారు ‘మధురవాణినిఁ’ గూర్చి వ్రాయుచు నీవిషయమున పై యభిప్రాయమునే వ్యక్తపఱచినారు,

ఏనాఁటిసాంఘికపరిస్థితుల కానాఁటిసాంప్రదాయముల ననుసరించి విమర్శింపవలెను. నేఁడును నీకులజులు సంగీతసాహిత్య విద్యాసంస్కార

సంపన్నులై, ఉత్తమశ్రేణిలో జేరిన తారాగణములై ప్రకాశించుచునే యున్నారు. కావున రంగాజమ్మయు, సర్వాంధ్రలోకమునకు, సంతత స్మరణీయయు పూజ్యయు ననుట నిర్వివాదము.

విజయరాఘవనాయకుని యాస్థానమునఁ గల కవయిత్రులలో 'కృష్ణాజి'లేక కృష్ణాజమ్మనుగూర్చి యీవఱకు తెల్పితిని. ఇపుడా కాలమునసే యాంధ్రకవయిత్రులలో నగ్రగణ్యయని చెప్పఁదగిన రంగాజమ్మనుగూర్చి వివరించితిని.

## క్షేత్రయ

దాక్షిణాత్య సంగీతప్రపంచమున, మూర్తిత్రయమని చెప్పదగిన వారు ముగ్గురు. అన్నమయ్య, క్షేత్రయ, త్యాగయ్య. ఇందు కడపటివారిరువురు తంజావూరికి సంబంధించినవారే. క్షేత్రయ రఘునాథనాయకుని కాలమున తంజావురాస్థానమునకువచ్చి, యా వెనుక విజయరాఘవ నాయకునిపై వేయిపదములను చెప్పియున్నాఁడు. ఇవి శృంగారరస వత్తరంగములై వెలయుచున్నవి ఇందుండి యొకపదము[1] నుదాహరించుచున్నాను.

కాంభోజి - ఆది

పల్లవి

సుదినమాయెనే యీప్రొద్దు సుదినమాయెనే యీ

అనుపల్లవి

మదనావతారుని సేవ - మనకుఁగలిగెనే ॥సుదిన॥

చరణములు

ప్రొద్దున నిలువుటద్దము పొడగన్న ఫలము - ఈతని
ముద్దుమోముఁ జూడఁగలిగె - ముద్దులగుమ్మ ॥సుదిన॥

---

1. చూడుడు భారతి (సెప్టెంబరు 1950) విజయరాఘవ పదములు. శ్రీ తిమ్మావఝల కోదండరామయ్యగారు. ఇందు (పుటలు 294-295)

ఈప్రొద్దు పూర్ణకుంభము - లెదురై నఫలము ఈ
భూపాలకుంజరుని నేఁ - బొడఁగంటినమ్మ
ద్విజరాజుల సేవించిన - దివ్యశకునము అచ్యుత
విజయరాఘవేంద్రుని యీ - విడిదిలోఁగంటి. ॥సు॥

మహారసికుఁడును, మహాకవియు, మహాభక్తుఁడును నగు విజయరాఘవనాయకుఁడు తంజాపురాంధ్ర వాఙ్మయమునకేగాక, యావదాంధ్రవాఙ్మయమునకు సంస్మరణీయుఁడు.

—: పెద్దదాసరి :—

విజయరాఘవనాయకుని కాలమున పెద్దదాసరియను, మహాభక్తుండుండెడివాడనియు, వానిని విజయరాఘవనాయకుఁడు తిరస్కారభావముతోఁ జూచెననియు, కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిలవారు దక్షిణాంధ్ర సాహిత్యమున వ్రాసియున్నారు. ఈతఁడు నృసింహస్వామి భక్తుఁడనియు సంస్కృతమున తెనుగున పెక్కుపదములు రచియించినవాడనియు, సంగీతప్రపంచమున కీతడుపరిచితుడనియు కర్ణాటసంగీత రచయితలను నాంగ్ల గ్రంథమున పేర్కొనఁబడినది.

"Appendix III. I append h rewith the following list of composers about whom only scanty information is available.

1. Pedda - Dasari in the time of Nayak rule in Tanjore. A Devotee of Lord Narasimha and a Composer of Pedas in Telugu & Sanskrit."

—: మన్నారుదేవుఁడు :—

ఈతఁడు విజయరాఘవనాయకుని కుమారుఁడు. మహారాష్ట్రులపైకి తండ్రితో యుద్ధమునకు వెడలి, వీరస్వర్గమలంకరించిన వీరుఁడు. ఇతఁడును తండ్రితాతలవలె గొప్పకవి. విజయరాఘవాభ్యుదయమను ప్రబంధమును రచించెను. అది [illegible]. మనకు లభ్యమైనది. [illegible]

విజయరాఘవనాయకునకు రక్తాబ్జనాయిక లేక హేమాబ్జనాయిక అను చెంగమ్మను, మన్నారుఁడను రాజగోపాలునకు వివాహము చేసిన కథ యిందువర్ణితము. ఇదియును యక్షగానవాటకమే.

ప్రారంభము.

సీ. శ్రీరమణీసముజ్జృంభమాన కటాక్ష
హారమణీలసదురోవక్ష
వార్తాచమత్కార వైభవప్రదనామ
మార్తాండ మండలమహితధామ
మాణిక్యకేయూర మండితభుజదండ
చాణూరగర్వశిక్షా ప్రచండ
తంజావురాధిప స్తవనీయచారిత్ర
కంజాతపత్ర సంకాశ నేత్ర

గీ. ద్వారకాధీశ కాంచన వసనివాస
పాకరిపుమిత్ర చెంగమలాకళత్ర
మముఁగటాక్షించి శుభలీలమనుపుఁజాల
రాజగోపాల రాధికారతివిలోల.

మధ్య. ద్వి. వనజభోణి దక్షిణద్వారకాపురిని
చెలువుమీఱినయట్టి చెలువమన్నారితండు
వెలఁదిరోపది యాఱువేవురు జవ్వనుల
వలపించియేలిన వన్నెకాడెయితండు
కనకాంగి విజయరాఘవునింట వెలయుచు
దినదినముపూజందు దేవుఁడేయితఁడు.

ఈరీతిం జేరి యప్పుడాకప్పురగంధి యప్పురంబున విజయరాఘవ పట్టభద్రుండు. కట్టించిన గుజరాతికెంపు చెక్కడంపుపనుల మిటారిం పు నతిదిక్కారంబులగు గోపురప్రాకారంబులు, శ్రీవైష్ణవపుంగవగే

హంబులు, శృంగారవనసమూహంబులు, హరిద్రానదిమొదలు బొదలు నేనేక తటాకంబులు హాటకమయంబులైన మంటపానీకంబులు నాలోకింపుచు సొంపునంది యానంపంగి మన్నారునగరిపాలికిం జేరి ప్రవేశించి యచ్చట హచ్చులగుపచ్చల గచ్చులనిచ్చలంబులగు శాతకుంభ స్తంభ సహస్రంబుల మించు విజయరాఘవ భూపాలమంటప రాజంబుచేరువ రాయసంపుచెలువ చదివేపద్యం. స్వయంవరాహ్వానము కమ్మవక్కణ.

సీ. శ్రీమన్మహాగుణస్తోమ సంపన్నుఁడై
భాసిల్లు రాజగోపాలశౌరి
పాదంబులకు మ్రొక్కి పాలకడలిరాజు
వేడ్కసేయంగల విన్నపంబు
సౌమ్యసంవత్సర చైత్రశుద్ధాష్టమి
మాపట్టియగు చంగమకుస్వయంవ
రోత్సవంబొనరింప నుద్యుక్తులైనాము
తామిటవిచ్చేసి యీమహోత్స

గీ. వంబునెఱవేర్పగావలెస్వామి నమ్మ
భానకును నారదునివెంటమా నియోగి
నంచితిమి వారిపల్కులాలించి మీరు
వేగనిటు సాగి రాగ నీవిన్నపంబు.

క. రారమ్ము విజయరాఘవ
ధారణినీవంటి ముద్దుతనయులు గలుగన్
సారెకుమామదిలో గల
కోరిక లొనగూడుటరుదె? గుణ రత్ననిధీ!

గీ. విజయరాఘవ! వత్స! యీపెండ్లినీవు
సంఘటింపంగ మామది చల్లనయ్యె
ప్రబలి సర్వంసహారాజ భాగ్యములను
ధరణివర్ధిల్లు మాచంద్రతారకముగ.

## భరతవాక్యం

ఇవ్విధంబున చినచెవ్వయాచ్యుతాశేషప్రపౌత్రుండును, రఘునాథజననాథ పౌత్రుండును, విజయరాఘవభూపాలక ప్రియపుత్రుండును రాజగోపాలాంబికా గర్భకలశజలధికువలయ మిత్రుండును అతులకనక తులాప్రముఖనిఖిల మహాదాన దీక్షాధురీణుండును అనేకాగ్రహారప్రతిష్ఠాపన ప్రవీణుండును, విజయరాఘవాభ్యుదయాది ప్రబంధనిబంధన చాతురీధౌరేయుండును, అతులిత పితృభక్తిగురుభక్తి భాగధేయుండును, మహితానుభావుండునగు మన్నారుదేవుండు భువనస్తవనీయంబుగా రూపణించిన హేమాబ్జనాయికా స్వయంవరంబను నాటకంబునకు కథానాయకులగు రక్తాబ్జనాయికా రాజగోపాలకులు తమప్రియపుత్రుండై ధాత్రిపాలింపుచు చాలవర్ధిల్లుచున్న విజయరాఘవ భూపాలునకు సర్వసర్వంసహాధిపత్య నిత్యాయురారోగ్య భాగ్యంబులుపాలించి రక్షింతురుగాత.

ఈ సౌమ్య. క్రీ. శ. 1664. అదియే గ్రంథరచనాకాలము. ఈతడు క్రీ. శ. 1674లో తండ్రియగు విజయరాఘవనాయకునితోగూడ మహారాష్ట్రులతో జరిగిన యుద్ధమున హతుఁడయ్యెను. కాబట్టి యీతనితో నాయకరాజపాలన మంతమైనది. ఆనాటినుండి మహారాష్ట్రరాజ్యపాలన ప్రారంభము.

## తంజావూరి మహారాష్ట్ర రాజులు

నాయకరాజుల వెనుక తంజావూరు మహారాష్ట్రులు పరిపాలించిరి క్రీ. శ. 1674 మొదలు క్రీ. శ. 1855 వఱకును వీరి పరిపాలనకాలమని చెప్పనొప్పును. ఈ మహారాష్ట్రరాజులు తమ పూర్వులగు నాయకరాజులవలె సంస్కృతాంధ్రభాషలఁ బోషించి కృతికర్తలై కృతిభర్తలై కీర్తిఁగాంచిరి, మాతృభాష మహారాష్ట్రమై, పాలించిన దేశము ద్రావిడమైనను, సంస్కృతాంధ్ర భాషలయం దత్యంతాభిమానము వహించి, యాభాషల ద్రావిడదేశమునఁ జిరస్థాయులఁ గావించిన మహా

రాష్ట్ర ప్రభువులు మనకృతజ్ఞతకు పాత్రులు. అట్టిరాజన్యుల కాలమున వెలసిన కవులఁగూర్చియు గ్రంథములఁగూర్చియు నాంధ్రలోకమున కెఱిఁగించుచున్నాను.

ఆయా రాజుల కాలమున వెలసిన కవులఁగూర్చియు, గ్రంథములఁగూర్చియు, సుగమముగ తెలిసికొనుటకై మొదట తంజావూరు మహారాష్ట్రరాజుల వంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.






వివరణము :—

(1) తంజావూరు మహారాష్ట్రరాజుల వంశముఁ గూర్చిన వివరములు తెలుఁగున నీ గ్రంథములవలన తెలియనగును.

(1) నెల్లూరి-శివరామకవి కామకళానిధి (2) ఏకోజీ ద్విపదరామాయణము (3) మాతృభూతకవి పారిజాతాపహరణము (4) శివాజీ మహారాజు అన్నపూర్ణా పరిణయము. వీనిలోఁ గామకళానిధి తక్క-తక్కినవి యముద్రితములు. ఇవియే గాక గంగాధరుని భోసలవంశావళి శ్రీధర-వేంకటేశార్యుని శాహేంద్రవిలాసము, శేషాచలపతి భోసలభోసలీయమునను సంస్కృత గ్రంథములయందును, The Maratha Rajahs of Tanjore అను నాంగ్లేయ గ్రంథమునందును గలవు. వీనిలో నేను వ్రాసినరీతి వంశవృక్ష మెచ్చటను వ్రాయబడలేదు. ఆ గ్రంథముల యందలి విషయములు విమర్శించి నేనీ వంశవృక్షముఁ దయారు చేసితిని.

(2) ఒక పేరుగల రాజు లిద్దఱుండుటచే వారిపేరు కెదురుగ నొకటి రెండును నంకెలు వేయఁబడినవి.

(3) మొదటి తులజాజీని తుక్కోజీయని వాడెదరు.

(4) హరిశ్చంద్ర జయసింహులు రాజ్యమునుఁ బరిపాలింపకపోవుటచే వారి రాజ్యకాల పరిమితి తెలుపలేదు; ఇందు జయసింహుఁడే కామకళానిధి కృతిభర్త.

## ఏకోజీ (1676 - 1683)

తంజావూరునుఁ బరిపాలించిన మొదటిరాజన్యుఁడేకోజీ. ఈతఁడు మహారాష్ట్రరాజ్య సంస్థాపకుఁడగు శ్రీశివాజీ చక్రవర్తికి దనయుఁడు. ఈతఁడు తంజావూరున మహారాష్ట్ర రాజ్యమును స్థిరముగ నెలకొల్పినాఁడు. ఈతఁడు తెలుగున ద్విపద రామాయణమును రచియించినట్లు ప్రొఫెసరు సుబ్రహ్మణ్యముగారు తమ తంజావూరు మహారాష్ట్రరాజుల చరిత్రమున వ్రాసినారు.[1] ఇచ్చట ప్రొఫెసరుగారు పొరపాటు పడినారు. ఏకోజీ వ్రాసిన ద్విపద రామాయణావతారికను బట్టి చూడ వతను

1. Ekoji himself is said to have composed in Telugu a Dwipada Ramayana and several other works in Telugu were written in his reign (Page 22. The Maratha Rajahs of Tanjore 1928)

తులజాజీ లేక తుక్కోజీ కొమరుఁడని స్పష్టముగఁ దెలియుచున్నది. కావున నతఁడు శ్రీ శివాజీ చక్రవర్తి కొమరుఁడగు నేకోజీ కాఁజాలఁడు. ద్విపద రామాయణమునందలి గద్యముఁ జూచిన నీ విషయ స్పష్టము కాగలదు.

"అని భోసలాబ్ధిసుధాంశుఁ డు [illegible]
ధననాథతుల్యుఁ డుదార విక్రముఁడు
సరససాహిత్య లక్షణ చక్రవర్తి
కరుణాసముద్రుండు సవికల్పకంబు
విలసిల్లు తుళజభూవిభు కుమారకుఁడు.
పొలుపొందు యేకోజి భూమిపాలకుఁడు
ఘనశౌండి తుళజేంద్ర ధరణీశు పేర
పెనుపొందుసుకరాంక బిరుదాంకుపేర
రమణీయమైన యీ రామాయణమున
కమనీయ సుందర కాండంబుఁ జెప్పె."

దీనింబట్టి యీ యేకోజీ క్రీ. శ, 1736 సంవత్సరమునఁ దంజావూరును బరిపాలించిన రెండవ యేకోజీ గాని క్రీ. శ. 1680 సంవత్సర ప్రాంతమున నున్న యేకోజీ కాఁడు. కాని యీసందర్భమునఁ దంజావూరు తెలుఁగుగ్రంథముల సూచిఁ బ్రకటించినవారు కూడ మొదటియేకోజియే యీరామాయణగ్రంథకర్తయని వ్రాయుట మఱియు వింతగ నున్నది. గ్రంథసూచికఁ దయారు గావించినవారే రామాయణగ్రంథావతారికయందుఁగల రాజుల నామములను పద్యోల్లేఖాంకితములు గావించియే యున్నను గ్రంథ ప్రకాశకు లాంగ్లేయభాషలో నిది మొదటి యేకోజీ వ్రాసినట్లు వ్రాసిరి; చూడుఁడు.

**A** Descriptive Catalogue of Telugu Manuscripts in the Tanjore Maharaja Serfoji's Saraswathi Mahal Library (Pages 122, 123)

...మొదటి యేకోజీ స్వయముగ గ్రంథకర్త కాకపోయినను కవి పండిత పోషకుఁడై యుండెనని మనమూహింపవచ్చును.

## శహాజీ లేక శహా మహారాజు

## (1684—1712)

ఏకోజీతరువాత నాతని కొమారులు ముగ్గురును క్రమముగా రాజ్యమును బాలించిరి. వారిలోఁ దొలివాఁడు శహాజీ. ఈరాజచంద్రుని కాలము తంజాపూరు మహారాష్ట్రరాజ్య భాషావాఙ్మయ చరిత్రమున సువర్ణ యుగమని చెప్పఁదగినది. సంస్కృతాంధ్రము లందేమి, ద్రావిడభాషయందేమి లెక్కలేనన్ని కృతు లీ రాజేంద్రునికాలమున వెలసినవి. కృతికర్తయై, కృతిభర్తయై, యపరభోజుఁడై విరాజిల్లిన శాహరాజేంద్రుఁడు, శ్రీకృష్ణదేవ, రఘునాథరాయాదులవలె నాంధ్రులకుఁ జిరస్మరణీయుఁడు,

సంస్కృతవాఙ్మయము శహాజీకాలమున విశేషముగా నభివృద్ధి నందినది. శహాజీ సంస్కృతమున శబ్దరత్నసమన్వయము శబ్దార్థ సంగ్రహమునను రెండు నిఘంటువులు రచియించినాఁడు. ఇంతియగాక క్రీ. శ. 1693 లో తిరువశనల్లూరు (Tiruvisanallur) అను గ్రామమునకు శహాజీ రాజపుర మను నామకరణముఁ గావించి దానిని నలుపదియాఱుగురు విద్వాంసులకు ధారాపూర్వకముగ నొసఁగెను. అందలి విద్వాంసులందఱును సుప్రసిద్ధులే! వారిలోఁ గొందఱిని గూర్చి యిందు వివరించుచున్నాఁడను.

1. రామభద్రదీక్షితుఁడు—శహాజీ రాజపుర విద్వన్మండలి భూషణప్రాయుఁడు అభినవపతంజలి బిరుదాంకుఁడు అప్పయదీక్షితుని మనుమఁడగు నీలకంఠదీక్షితుఁడును, చొక్కనాథ దీక్షితుఁడును బాలకృష్ణ భగవత్పాదుఁడును నీ విద్వద్వరేణ్యుని గురువులు. పతంజలి చరిత్రము జానకీపరిణయము, శృంగారతిలకభాణము, పరిభాషావృత్తి వ్యాఖ్య, షడ్దర్శనసిద్ధాంతసంగ్రహవ్యాఖ్య మున్నగునవి యీతని కృతులు. 1

---

1 రామభద్రదీక్షితునిగూర్చి వివరములు తెలియఁ గోరువారు Indian Antiquary అను పత్రికయందు 33 సంపుటముఁ జూడఁదగుదురు.

2. శ్రీధర వేంకటేశార్యుఁడు—ఈతనికి అయ్యావాళ్ అను నామాంతరము. దాక్షిణాత్య మండలముల నేఁటికిని మహావిద్వాంసునిగా బూజింపఁబడుచున్నాఁడు. ఈతని స్తుతిగ్రంథములు పదునాలుగు ముద్రితమైనవి ఈతఁడు శహాజీ రాజపురాగహార ప్రతిగ్రహీతలలో నొకఁడు. శహాజీరాజు పేర శహేంద్ర విలాసకావ్యమును రచియించి యున్నాఁడు ఇది యెనిమిది సర్గలు కల కావ్యము. శహాజీ జీవితముఁ దెల్పును. ఇది యముద్రితము. ఈ వేంకటేశార్యుఁగూర్చి పండితవతంసులు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రులవారు. శృంగారరాధామాధవ సంవాదపీఠికయందు వ్రాసియున్నారు. [1]

3. భాస్కరదీక్షితుఁడు - వేదాంత గ్రంథమగు సిద్ధాంత సిద్ధాంజనమునకు రత్నమాలిక యను వ్యాఖ్యానము వ్రాసిన విద్వాంసుఁడు. ఈ సిద్ధాంత సిద్ధాంజనమాతని శిష్యుఁడగు కృష్ణానంద సరస్వతిచే రచియింపఁబడినది. తనశిష్యుఁడు వ్రాసిన గ్రంథమునకు వ్యాఖ్యవ్రాసి వ్యాప్తికిఁదెచ్చినగురు వీతఁడు ఈతఁడు లలిత సహస్రనామములకు వ్యాఖ్యాత.

4. పెరియప్పకవి - ఈతఁడు శృంగారమంజరీ శాహజీయమను నాటకమునుఁ శహాజీ జీవితమునుఁ జిత్రించుచు వ్రాసినాఁడు. ఈతఁడు పైన వివరించిన కృష్ణానంద సరస్వతీ శిష్యుఁడు. ఈతని పాండిత్యమునకు మెచ్చి కృష్ణానందయతి యాతనికి కవితార్కిక సార్వభౌముఁడని బిరుద మిచ్చెనట—విశ్వనాథదీక్షితుఁడను వైనతేయ సూరియు నీతని యన్నదమ్ములు విశ్వనాథుఁడు సిద్ధాంతసిద్ధాంజనముపై వ్యాఖ్య రచియించెనఁట. ఈతనితండ్రి యన్నశాస్త్రి వేంకటపతిరాయల సభయందు కామదేవకవిని జయించి యాతనివలన బంగరుపల్లకిని పరాకరమను గ్రామమును బహుమానముగా గొనెనఁట[2]

---

1. దయాశతకము మున్నగునవి శ్రీరంగము వాణీవిలాస ముద్రాయంత్రమున ముద్రితములు.

2. శృంగార రాధామాధవము పీఠిక మూడు నాలుగు పుటలు (శృంగార గ్రంథమాలా ప్రకటితము ౧.

5. వేదకవి- ఈతఁడు విద్యాపరిణయము జీవానన్దము మొదలగు సంతరార్థ కథా సమన్వితములగు రెండునాటకముల రచియించినాఁడు. ఇవి రెండు వేదాంతవిషయములు ప్రతిపాదించుచుఁ ప్రబోధచంద్రోదయమునుఁ బోలియుండును, విద్యాపరిణయ మీాతనిపోషకుఁడగు నానందరాయమఖి కృతిగాఁ గానవచ్చుటచే నీతఁడీ నాటకమురచించి తన పోషకుని కారోపించెనని విజ్ఞులు తలంచుచున్నారు.

6. మహాదేవకవి - ఈతఁడద్భుతదర్పణమును ప్రబోధచంద్రోదయము పోలికని రచియించియున్నాఁడు. ఇది కావ్యమాలయందు ముద్రితము. ఈతఁడు శుకసందేశమను నొక సందేశకావ్యమును రచియించినాఁడు [2]

7. వీరరాఘవకవి-ఈతఁడు వల్లీపరిణయము, రామరాజ్యాభిషేక నాటకము, పార్వతీస్తోత్రము రచియించినాఁడు. ఈశ్వరునికిఁ గామాక్షికి బుత్త్రుఁడు కౌండిన్యగోత్రుఁడు.

8. నల్లదీక్షితుఁడు ఈతనికి భూమినాథకవి యని నామాంతరము ఈతఁడు రామభద్రదీక్షితుని శిష్యుఁడును బంధువునై ప్రఖ్యాతి గాంచిన వాఁడు. ఈతఁడు సుభద్రాపరిణయము నాటకమును ధర్మవిజయమును నాలుగు స్తబకముల చంపూకావ్యమును రచియించెను. ఇందు రెండవది శహాజిమహారాజు చరిత్రమునుఁ దెల్పుకావ్యము. ఈకవి శహాజిని నభినవభోజునిగాఁ జెప్పియున్నాడు.

"ఇత్యనభినవభోజరాజ శహాజిమహామహేంద్ర సుందరముఖ చంద్ర సందర్శన మహామహాంద్రీ కృతవాగ్విలాసస్య, రామభద్రాధ్వరప్రియ

---

1. Triennial Catalogue of Manuscripts. Oriental Manuscripts Library 'Madars' Vol II Part I. Sanskrit (Pages 2575-2577)

2. సంస్కృత దూతకావ్యోత్పత్తి వికాసములు - శ్రీమాన్ యాయాజ్ఞి - వీర రాఘవాచార్యులవారు, ఎమ్. ఏ ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. 18 వ సంపుటము 5 - 6 సంచికలు.

శిష్యస్య, తదీయవంశజన్మనో భూమినాథవిద్వత్కవేఃకృతౌ ధర్మవిజయే చతుర్థస్తబకః"

ఇట్టి ప్రసిద్ధసంస్కృత పండితకవులు శహాజీరాజు పురమందున్న వారు గాక శహాజీయాస్థానమును నలంకరించిన వారెందరేని గలరు. శహాజీమంత్రియగు త్రయంబక రాయమఖి యేకోజీమంత్రియగు గంగాధర మఖతనయుఁడు. యేకోజీ త్రయంబక రాయమఖినిఁ తనకాలము నందే తనకొమరుఁడగు శహాజీకి మంత్రిగాఁ జేసెను. గంగాధరమఖి చెంగల్పట్టు మండలమునందలి తిరువలంగాడు గ్రామవాస్తవ్యుఁడయ్యు మహారాష్ట్రరాజుల కోఁకపై తంజావూరు నివాసముగా నేర్పరచుకొనెను. గంగాధరమఖి యప్పయదీక్షితుని వంశమువాఁడు. అప్పయదీక్షితుని కువలయానందమునకు రసికరంజనివ్యాఖ్యవ్రాసి గ్రంథావతారిక యందు భోసలవంశావళియను పేర మహారాష్ట్రరాజుల వంశచరిత్రము వర్ణించినాడు, గంగాధరమఖికి ముగ్గురు కొడుకులు. మువ్వురును గ్రంథకర్తలు, విద్వాంసులు, రాజకార్యనిపుణులు, అందు తొలివాఁడు.

1. నరసింహరాయమఖి :— ఈతఁడు తండ్రివెనుక నేకోజీకి మంత్రిగానుండెను. ఈతఁడు త్రిపురవిజయచంపువును రచియించెను.

2. త్రయంబకరాయమఖి— ఈతఁడు శహాజీవద్దను, శహాజీ వెనుక రాజ్యమునుఁ బరిపాలించిన మొదటి శరభోజీవద్ద మంత్రిగా వ్యవహరించినవాఁడు. రామాయణమునకు ధర్మాకూతమను వ్యాఖ్యానమును, స్త్రీధర్మమును రచియించినవాడు. ఈతఁడు శహాజీ ప్రోత్సాహముచే క్రీ. శ. 1696 సంవత్సరమున కుంభకోణమువద్ద స్వామిమలయందు బ్రహ్మాండమగు యజ్ఞముఁ గావించినాడట. అవిషయము గ్రంథస్థమై యున్నది.

3. భగవంతార్యమఖి :— ఈతఁడు తనయన్నగారి వెనుక మొదటిశరభోజీవద్ద సచివస్థానమలంకరించినవాఁడు. రాఘవాభ్యుదయ నాటకము, ముకుందవిలాస కావ్యము, ఉత్తరచంపువు నీతనికృతులు. వీరిలోఁ

దొలివాఁడగు నరసింహరాయమఖి తనయుఁ డానందరాయమఖి గూడ మిగుల ప్రఖ్యాతిఁగాంచిన మంత్రిసత్తముఁడు. ఈతఁడును శహాజీయొద్దను మొదటి శరభోజీయొద్దను మంత్రిగా నుండెను. ఈతఁడాశ్వలాయన గృహ్య సూత్రవ్యాఖ్యను రచియించెను. వేదకవిఁగూర్చి వ్రాయునపుడు విద్యాపరిణయనాటకము నానందరాయమఖి కారోపింపఁబడినదని తెలిపియున్నాను, ఇట్లే అప్పాధ్వరి విరచితమైన యాచారనవనీతమను పెద్ద ధర్మశాస్త్ర గ్రంథముగూడ నానందరాయమఖి కారోపింపఁబడినదని చెప్పుచున్నారు. ఆనందరాయమఖి మంత్రియై, విద్వాంసుఁడైయుండుటచే నాతనియనుగ్రహమును నాతనిద్వారా రాజానుగ్రహమును నందించుట కా కవులిట్లు చేసియుందురని యూహ పొడముచున్నది. వీనిలో విద్యాపరిణయము నిశ్చయముగ నానందరాయమఖి కృతియనియు, నాచారనవనీతమప్పాధ్వరి విరచితమనియు నీ మధ్యనొక విద్వాంసుఁడు వ్రాసియున్నాఁడు.[1] గాక కోసలభోసలీయమును శహాజీ పేర రచించిన శేషాచలకవియు, శహారాజాష్టపదిని రచించిన శ్రీనివాసకవియు, నటేశవిజయమును రచియించిన వేంకటకృష్ణకవియు శహాజీరాజీయము, శహారాజసభాసరోవర్ణన రచియించిన లక్ష్మణకవియు, సుమతీంద్రజయఘోషను రచియించిన సుమతీంద్రుఁడును, శహారాజనక్షత్రమాలను రచియించిన నారాయణుఁడును నీ రాజచంద్రు నాస్థానము నలంకరించిన విద్వత్కవులు.

## శహాజీ (1684-1712)

శహాజీమహారాజు పరిపాలనకాలమున నాంధ్రభాషావృద్ధి మనకు విస్మయమునుగలిగించును. ఈ విద్వత్ప్రభువు రచియించిన యాంధ్ర గ్రంథములను, పోషించిన యాంధ్రకవులను మనమెఱిఁగినమేని యాతఁడాంధ్రభాషాపోషణకే కేవలము జన్మించినట్లు తలంపవలసియున్నది. మఱియు నీ మహారాజు కాలమును, వాఙ్మయ పరిణామమును తెలిసికొనుటకు

---

1. Journal of O.iental R3seaich vol. III Part I (1:29) Pages 68 - 73-v. A. Ramaswami Sastri B. A. (Honours)

నెంతయేని తోడ్పడుచున్నది. గతానుగతికమగు ప్రబంధవాఙ్మయము గాక, జాతీయ సారస్వతమునకు సంబంధించిన నాటకములు, యక్షగానములు, ద్విపదలు, గేయములు, శాస్త్రీయగ్రంథములు మొదలగునవి యీ మహారాజుకాలమున వెల్లివిరిసినవి. వీనిని మనము పరిశీలించిన, నాకాలమున నాంధ్రవాఙ్మయము దక్షిణమున నెంత గౌరవస్థానమున నున్నదియు తెలిసికొని సంతసింపుదుము.

ఆంధ్రమున శహాజీమహారాజు కృతము లీక్రింది గ్రంథములు గలవు :—

1. కిరాతవిలాసము.—నాటకము. అర్జునునకుఁ బరమేశ్వరుఁడు పాశుపతంబు నొసఁగుట యిందలి యితివృత్తము. శివునకంకితము.

2. కృష్ణలీలావిలాసము.—నాటకము. శ్రీ దేవకీదేవి గర్భమున శ్రీకృష్ణుఁ డవతరించుటయు నాతని చిన్ననాటి చేష్టలును, సత్య నాతఁడు పరిణయము చేసికొనుటయు, నిందు వర్ణితము. శ్రీకృష్ణాంకితము.

3. గంగా పార్వతీ సంవాదము.—నాటకము. దీని నామమే యిందలి కథను తెలుపును. శృంగారరస ప్రాధాన్యము. శివాంకితము.

4. జలక్రీడలు.—గోపికావస్త్రాపహరణము వర్ణించు నాటకము. శ్రీకృష్ణాంకితము.

5. త్యాగరాజవినోద చిత్రప్రబంధ నాటకము.— ఇయ్యది నిజముగా వినోదచిత్రములు గలిగియున్నది. పేరు ప్రబంధనాటకము గనుక చిత్రము. ఇతివృత్తము సంస్కృతము, తెనుఁగు మహారాష్ట్రమునను మూఁడు భాషలలో వర్ణిత మగుటచే వినోదకరము. ఈనాటకములవల నీమహారాజున కామూఁడు భాషల యందుఁగల పాండిత్యమెంతయేని తెలియనగును.

6. ద్రౌపదీ కల్యాణము—నాటకము. ద్రౌపది పెండ్లికథ వర్ణితము శివాంకితము.

7. పంచరత్న ప్రబంధ నాటకము—నటశిఖామణియగు విశ్వరునిమొదట బిరుదుమిటారులు తమ నాట్యవిద్యా కౌశలమును జూపుట వారు బహుమానములు చేయుటయు నిటులనే నవసిద్ధజోగి, చెంచు, బిరుదు బంటులనువారు తమ గాన, నాట్య, అభినయాది విద్యా కౌశలమునుఁజూపుట యిందు వర్ణింపఁబడినది. ఇది శ్రీశివాంకితము.

8. పార్వతీ కల్యాణము—పార్వతిపెండ్లి యిందు వర్ణితము. పరమేశ్వరాంకితము.

9. రతీ కల్యాణము—నాటకము. రతీ మన్మథ వివాహము. గౌరిదేవి కంకితము.

10. రామపట్టాభిషేకము—శ్రీరామాంకితము.

11. రుక్మిణీ సత్యభామా సంవాదము—శ్రీకృష్ణాంకితము.

12. వల్లీ కల్యాణము—కుమారస్వామి వల్లియను నామెను పెండ్లాడుట యిందలి యితివృత్తము. శివాంకితము.

విఘ్నేశ్వర కల్యాణము—నాటకము. విఘ్నేశ్వరుని పెండ్లి కథ. శివాంకితము.

14. శంకరపల్లకి సేవాప్రబంధము-నాటకము. శ్రీపార్వతీ పరమేశ్వరుల కంకితము.

15. శచీపురందరము—నాటకము. ఇంద్రుఁడు శచీదేవిని బెండ్లియాడినకథ. శివాంకితము.

16. శాంతా కల్యాణము—నాటకము. దశరథుని కూతురగు శాంత ఋశ్యశృంగ మునీశ్వరుని పెండ్లియాడినకథ శివాంకితము

17. సతీపతిదాన విలాసము—నాటకము. శ్రీకృష్ణాంకితము.

18. సరస్వతీ కల్యాణము—నాటకము. శ్రీకృష్ణాంకితము.

19. సీతాకల్యాణము—నాటకము. శ్రీరామాంకితము.

20. సతిదానశూరము—నాటకము. శ్రీశివాంకితము.

ఇన్ని గ్రంథములు రచియించుటచేతనే శహాజీమహారాజు గుణ భరిత సకలభాషాచతుర్విధసాహితీ నిర్వాహకుఁ డనియు, సాహిత్యసం భావశారద యనియు బ్రసిద్ధివడసినవాఁడు.

(1)

కిరాత విలాసము

ముఖదరు :—జయపార్వతీరమణ, జయజానకీరమణ, జయఅంగకదమన, జయమధుసూదనా, జయత్రిపురసంహరణ, జయవేదోద్ధరణ, జయఅఖిలనుతచరణజయ జనాభరణ.

సూ. ఈవిధంబున సకలదేవతా ప్రార్థనంచేసిన యాతదనంతరం శ్రీశాహామహారాజప్రణీతంబైన కిరాతవిలాసంబనెడు నాటకంబు నందు తొలుత కథాక్రమం వినిపించేమార్గం.

ద్వి. శ్రీసదాశివుడు రాజితగిరీశుండు.
భాసిల్లుచున్న యీపార్వతితోడ
సన్నిద మొనరించినపగడశాలాడి,
విన్నైనచెంచులవేషంబుబూని
వెడలెరుద్రాణియావిధమువహించి,
వృషమిని చరియించిభూతేశునిజూడ
సరసంబులనుకొంతసయ్యాటములను,
యిరువురుగావించియేకమాటయును
అనుకతలనుచాలనమరుకిరాత
ఘనవిలాసము శాహఘనుఁడుగావించె
సరససత్కవివరుల్ సన్నుతిశాయ,
ధరణలోనాచంద్ర తారార్కముగను.

సూ. ఈవిధంబున కథాసంవిధానంబుందు నాటకం వినిపించిన యాతద నంతరంబున శ్రీ శాహమహారాజ ప్రణీతంబునందు తొలుత వినాయక ప్రార్థనం శాయుగా విఘ్నేశ్వరుండు వచ్చే మార్గం పరాకు. ...............

తుది:—సూ॥వ॥ ఈవిధంబున పార్వతీపరమేశ్వరులు కూడియుండు సమయంబున నారద కిన్నరకింపురుషులు మంగళం పాడేమార్గం. మాయాకిరాతహరునికిమంగళం. నిత్యం మాయాకిరాత దేవికి మంగళం అమరనందితుని.. ...శాహమహారాజదేవునికిమంగళం దీనికి 501 (M. 616) మొదలు 504 వఱకును నాలుగుప్రతులు కలవు.

## (2)

## కృష్ణలీలా విలాసము

మొదలు:—జయ దేవకీపుత్ర జయదివ్యనుతపాత్ర, జయకృష్ణసుచరిత్ర జయజగన్మిత్ర, జయశుభావహగాత్ర జయజగత్కృతి సూత్ర, జయభానుశశినేత్ర జయజితామిత్ర, జయజయా.

సూ॥ వ॥ అవురా యీవిధంబున అభీష్టదేవతావందనంబుగావించి సభానాయకాదుల నభివర్ణించి యాతదనంతరంబున శ్రీ శాహమహారాజ ప్రణీతంబైన కృష్ణలీలావిలాసంబు కథాక్రమంబుగా వినిపించేము వినవౌధరింపవయ్యా.

తుది:-అవురా యీవిధంబున యాకన్యవచ్చిన యాతదనంతరంబున సుముహూర్తమందు కృష్ణునికి సత్యభామకు వివాహంచేయు సమయంబున నారదకిన్నరకింపురుషులు మంగళంపాడే మార్గం పరాకు. మందరధరునికి మాధవునికి నందకుమారునికి నరహరికి పొందుగాసత్యభామను పెండ్లాడిన గోవిందునికి యశోదనందనునికి శోభానమే, శోభనమే.

గద్య. ఇది శ్రీమద్భోసలకుల శాహమహారాజ విరచితం శ్రీకృష్ణలీలా విలాసనాటకం సకలవిద్వజ్జన ప్రీతయే సకలశ్రేయసే శ్రీత్యాగేశ సాంబశివ పూర్ణానందార్పణమస్తు:

505 (M. 17) 506 రెండు ప్రతులు.

(3)

గంగాపార్వతీ సంవాదము

మొదలు:—జయరమాపురవాస, జయచంద్రికాహాస, జయసుమేరుశరాస జయకృత్తివాస, జయజయ.

..........

సూ॥ ఇత్తెరంగులైన పలుకాకులైన కాకవి నికరంబులు బకంబులను గాడి కవనవనరుకవులకు జోహారుచేసి, చతుర్దశ భువనములయుత రసాతలరాజమాన్య రాజన్యరత్నమణిముకుట మసృణరుచి మంజరీ పుంజబిందుమాలికా మనోహరపాదారవిందుండును...
భోసకులజలధి శశాంకుండును......
గుణభరితసకల భాషా చతుర్విధ సాహితీ నిర్వాహకుండును దీపాంబికా గర్భశుక్తిముక్తాఫలుండును నగు శ్రీ శాహవసుంధరాపురందరుండు రచియించిన శృంగారంబున పొంగారు గంగాపార్వతీ సంవాదంబనియెడు నాటకంబునకు కథాక్రమం బెట్టి దనిన వినిపించెదము వినవధరింపుము స్వామీ.

తుది :-ద్వి. శ్రీగిరీశుని పేర సితతను పేర
భోగిభూషణు పేర పురహరు పేర
కైలాసపతి పేర గౌరీశు పేర
ఫాలలోచను పేర భవహరు పేర

గద్య. అంకితంబుగ భోసలాన్వయజలధి
పంకజవైరి దీపాంబికాసుతుఁడు
సరససద్గుణుఁడగు శాహభూవిభుఁడు
తెరలగంగాపార్వతీ వివాదంబు
విరచించె రసికులు వినుతులు సేయ
ధరణిలో నాచంద్ర తారార్కముగను.

515 (M. 491) నుండి 518 వఱకు నాలుప్రతులు గలవు.

## (4)
## జలక్రీడలు

మొదలు :— జయదేవకీపుత్ర జయదివ్యనుతిపాత్ర జయ కృష్ణసుచరిత్ర జయ జగన్మిత్ర.

సూ. వ॥ అపురా! యీవిధంబున అభీష్టదేవతావందనంబు గావించి సభానాయకాదుల నభివర్ణించి. శ్రీ శాహమహారాజ ప్రణీతంబైన జలక్రీడలనియెడు నాటకంబు కథాక్రమంగా వినిపించేము అవధరించరయ్యా

తుది :—మంగళంబులు పాడేమార్గంబుపరాకు దరువు మందరధరునికి మాధవునికి, నందకుమారునికి నరహరికిపొందుగ గోపకన్యలను పెండ్లాడిన గోవిందునికి, యశోదనందునికి శోభానమే, శోభానమే భోసలశహాజీ, భూవిభునిభాసిల్లు ప్రేమనుపాలించు వానిక శోభనవై భవసంతతి ధీసంపదలిడు దేవునికి శోభానమే.

521 (M. 598) మొదలు 527 వఱకు 7 ప్రతులు.

## (5)
## త్యాగరాజవినోద చిత్రప్రబంధ నాటకము

మొదలు :— ఏవంకవినాటార్యంభేఇష్టదేవతాప్రార్థనంకరోమి. చూర్ణిక॥ ఇహాఖిలుచరా చరవందితపాదారవిందే. * * *

సూత్ర॥ అపురాయీవిధంబున పగరనుకోనియాడి త్యాగవినోదచిత్రప్రబంధంబునందు సరససకలవిద్యాపారంగత సకలభాషాభిజ్ఞ మృదుచిత్ర విస్తారకవితా నిర్వాహకవిద్వాంసులకు కర్ణరసాయనంబుగా త్యాగేశనామాంకిత విద్యాసుధావారినిజనిత సంగీత సాహిత్యతరంగంబులలో యథోచితంబుగా తోచిన అణుమాత్రంబుగా కవివిస్తరించను, నిష్కపటులాతప్పులుదిద్ది విన నాధరించరయ్యా.

"ఇది సంస్కృతము, తెలుగు, మహారాష్ట్రము అను మూఁడు భాషలతో వ్రాయఁబడిన నాటకము. ఆయాపాత్రలీ మూఁడుభాషలను కూడ నుపయోగించును. ఏ పాత్ర యేసందర్భమున, నేభాషను వ్యవహరించునను విషయము నిర్ణయించుటకు శక్యముగాకున్నది. దీనకాఱంకములుగలవు. అయంకముల నచ్చటచ్చట తెలుగువ్యవహరింపఁబడెను. సంస్కృత బహుళంబుగానుండుటచే సంస్కృతనాటక సమాఖ్యకుఁదగియున్నది. తెనుఁగునకుగూడ నిద్దానప్రవేశముంటదీనఁ బ్రసక్తికలిగినది."

530 (M 572) మొదలు 534 వఱకు 5 ప్రతులుగలవు.

(6)

ద్రౌపదీకల్యాణము

మొదలు :— తోడ్యం. జయపార్వతీరమణ జయమనోభవహరణ, జయభుజంగాభరణ, జయలోకశరణ, జయజగన్మోకమహీశశేశ్వర తనూజ జయజగదోదార భోసలశాహరాజ.

తుది:- అవురా యీవిధంబునవచ్చిన వ్యాసులకు నెదుర్కొని వందన మాచరించి యుచితాసనంబుం కూర్చుండనేమించి యీవ్యాసు లంజూచి ద్రుపదభూపాలుండు పలికేమార్గం.

క. వరముని సందోహపురం
దర! ధరమీకెఱుఁగనట్టి ధర్మముగలదే
వెరవేమికన్యకకువే
గురుపెనిమిటులనుచు పలికె కుంతి'పెద్ద'కొమరుతోన్?

హూ. అవురా యీవిధమునపలికిన ద్రుపదుని వాక్యంబు.

535 (M. 551) నుండి 538 వఱకు 4 ప్రతులు.

(7)

పంచరత్న ప్రబంధము

మొదలు:- జయరమాపురవాస జయచంద్రికాహాస
జయసమేరుశరాస జయకృత్తివాస

సర్వగుణభరిత సకలభాషాచతుర్విధ సాహితీనిర్వాహకుండును దీపాంబా గర్భశుక్తిముక్తాఫలంబగు శ్రీశాహావసుంధరాపురందరుండు రచియించిన పంచరత్నప్రబంధంబు నందు తొలుత విఘ్నేశ్వరప్రార్థన చేయగానే విఘ్నేశ్వరుడు వచ్చేమార్గం. దరువు.

తుది:-ద్వి. శ్రీకంఠగుని పేర సితదేహు పేర
లోకదాయకు పేర రుద్రుని పేర
పురుహూతనుతు పేర, పురహరు పేర
కరుణాంబునిధి పేర గౌరీశు పేర

...

సాహితీపుంభావ శారదనైన
శాహభూపాల శానుడురచించె
సరససత్కృతునెల్ల సన్నుతిసేయ
ధరణిలో నాచంద్ర తారార్కముగను.

సూ. ఇత్తెరంగున ఉదారవేషభాషాభూషితంబగు శ్రీశాహమహారాజ ప్రణీతంబైన పంచరత్న ప్రబంధంబునందు, రసికజనమనోహరమై సకలకవికర్ణ భూషణమై రాణించుమహాప్రబంధంబు త్యాగేశ్వర ప్రీతికరమై విలసిల్లుగాత.

540 M. 685)

(8)

పార్వతీ పరిణయము

మొదలు:- జయపార్వతీరమణ, జయమనోభవహరణ, జయభుజంగాభరణ, జయలోకశరణ.

*    *    *    *

సూత్రధారి॥ వ॥ అపురా ఈవిధంబున మరిన్నే విధానసం టేను,

సీ. సకలవిద్యావిలాసములచేరంజిల్లు
శాహభూపాలుని సన్నుతించి
అతనిసభాసీమునమరుధీరుల నతు
ర్వేదవేదాంతవిదులుపొగడి
అందువానందించు అనవద్యసాహిత్య
పరులుమహాకవీశ్వరులవేడి
సంగీతభరతశాస్త్రకళాధురీణుల
నేర్పులమదినెంచి యేర్పరించి

తే. ఆమహారాజుపరమేశ్వరాంకితముగ
వరగచేసిన పార్వతీపరిణయాఖ్య
మనెడు నాటకమారాజు ననుమతమున
వేషభాషాదియుతముగా విస్తరింతు.

వ॥ అన్నంతసగనక, అవురా యీవిధంబున అభీష్టదేవతావందనంబు గావించి, సభానాయకాదులను అభివర్ణించి శ్రీ శాహమహారాజ ప్రణీతంబైన పార్వతీకల్యాణం బనియెడు నాటకంబు, కథాసంవిధానంబుగా వినుపించెదము వినవధరించిరయ్యా, కథాసంవిధానం.

తుది:- సూ॥ ఈవిధంబున బ్రహ్మేంద్రాదిదేవతలు పార్వతీపరమేశ్వరుల వివాహమహోత్సవంబుశాయంగా ఆసమయంబున గంధర్వకిన్నరకింపురుషులు పుష్పవర్షంబులు వర్షించియూ మహోత్సవంబున తుంబురనారదాదులు మంగళంబులు శోభనంబులు పాడేమార్గంపరాకు. * * *

మహేంద్రశాహరాజాయమంగళం నిత్యమహితకల్యాణమంగళం

* * * *

శ్రీచోళనాయకాయ శ్రీవాసుదేవకవి వచస్సంతుష్టాయమంగళం.

545 (M. 508) మొదలు 553 వఱకు 9 ప్రతులు గలవు.

## (9)
## రతీకల్యాణము

ముదలు:- జయదేవిశార్వాణి జయవినుతగీర్వాణి, జయకీరవరవాణి జయమృదులపాణి జయశుభగుణశ్రేణి జయగౌరికల్యాణి, జయ విభవనిశ్రేణి జయఘనాశ్రేణి.

* * *

సూ॥ ఈరీతినినాంద్యారంభమందు ఇష్టదేవతావందనంబు గావించి సభానాయకుని అభివర్ణించి శ్రీశాహమహారాజప్రణీతంబైన రతీకల్యాణ నాటకం కథాక్రమంబుగా వినుపించేను వినవధరించ రయ్యా.

తుది:- సూ॥ ఈవిధంబున సకలదేవతలువచ్చిన తరువాతను వివాహాశ్రయంగా మంగళంపాడేమార్గం ॥మంగళం॥ గౌరికిరమ్యవిహారిణికి, సారకృపారసహారిణికి, మీరినప్రేమనా ధీరుల బ్రోచును కోరికలొసగు గుణనిధికి, దేవునికిమహాదేవునికి. దేవాధిపనుత భావునికి, శ్రీవైభవములుతగ సానముండై తగుసేవకనిధియగు శివునికిని, భోసలశాహజభూవిభుని, భాసిలుప్రేమను పాలించు, వాసిగశోభన వైభవసంతతి ధీసంపదలిచ్చు దేవునికి, శోభానే, శోభనమౌ,

గద్య. ఇతి శ్రీమద్భోసలకుల శాహమహారాజ విరచిత రతిమన్మథవిలాస మహానాటకం సకలపద్యజిన ప్రీతియే సకలశ్రేయసే శ్రీత్యాగేశ సాంబసదాశివ శ్రీపూర్ణానందార్పణమస్తు.

561 (M 537) ముదలు 567 వరకు 7 ప్రతులు గలవు.

## (10)
## రామపట్టాభిషేకము

ముదలు:-జయదశరథపుత్ర జయరామసుచరిత్ర జయకావ్యనుతిపాత్ర జయజగన్మిత్ర జయ జయ జయశుభావహగాత్ర, జయజగత్పతి సూత్ర జయభానుశశినేత్ర జయజయా.

సూ॥ అప్పురా యీవిధంబున అభీష్టదేవతావందనంబుగావించి సభానా యకాదుల నభివర్ణించి శ్రీశాహమహారాజప్రణీతంబైన రామ పట్టాభిషేకమనెడు నాటకంబు కథాక్రమముగా వినుపించేము వివనవధరించవయ్యా.

తుది: సూ॥ వ॥ అప్పురా యివ్విధంబున యీదేవేంద్రాది దేవతలు శ్రీ రామస్వామిని కనకసభయందు నవరత్నఖచిత సింహాసనంబున కూర్చుండ నియమించి సకలమైన తీర్థములచేత పట్టాభిషేకంబు సేయుసమయంబున, నారదకిన్నరకింపురుషులు, మంగళంబు పాడేమార్గంబుపరాకు. శ్రీరామభద్రునికి మంగళం, శ్రీసీతా దేవికిమంగళం, వనజాతనేత్రునికి, శ్రీశాహమహీపాల దేవునికి మంగళం.

గద్య. శ్రీనిలయంగనా శ్రితరక్షకుండు
భావజాకారుండు పరమపుణ్యుండు
భోసలకులసింధుపూర్ణ చంద్రుండు,
శ్రీశాహభూపాల శేఖరుండిపుడు
శ్రీరామపట్టాభిషేకనాటకము,
కోరిగావించె నెక్కువభక్తిమీర
నెవ్వరుచదివిన నెవ్వరువిన్న,
నెవ్వరాడినను మరియెవరుచదివినను
ధనధాన్యములు తరుచైననతులు,
ఘనమైనసంపదల్ కరిరథాశ్వములు
అరుదైనభక్తి నానతిశోభనములు.
గరుడవాహానుడిచ్చు గరిమమీరగను
ధరణిలోనాచంద్ర తారార్కముగను.

572 (M. 581) నుండి 577 వఱకు 7 ప్రతులు గలవు.

577. ఈప్రతితుదినిట్లుగలదు, "తారణనామసంవత్సరే భాద్రపద కృష్ణపక్షే ఏకదశ్యాంసౌమ్యవాసరే తంజాపుర్యాంచేళువభాండస్థానే ప్రసన్నానంత శ్రీనివాసముఖోద్గతేలేఖనం ప్రతాపరామోపనామ్నా తుళ దేవపతవిఠ్ఠలేన లిఖితం."

( 11 )

## రుక్మిణీసత్యభామా సంవాదము

మొదలు :—

ద్వి. చెలువొందరుక్మిణి శ్రీసత్యభామ
తొలుత వచ్చుటయు ముద్దులకృష్ణుఁడంత
యరుదెంచి, రుక్మిణిసాదరంబునను
నరయుచు సరసములాడుచుండుటయు
చక్కనికృష్ణుని సత్యభామ పుడు
పెక్కువ చెలిచేత పిలువనంపుటయు
చెలువునివిత మెల్ల చెలిదెల్పి తెలిసి
కలగుచురుక్మిణి శాంతాగమునను
పాదరింటికరుదెంచి పొంచియుండుటయు

సూ॥ వ॥ అవురా ఈ విధంబున తొలుత కథాసంవిధానంవినిపించి యా తదనంతరంబున శాహాంమహారాజ ప్రణీతంబైన రుక్మిణీసత్య భామా సంవాదంబనెడు నాటకంబునందు తొలుత నిర్విఘ్నంబు గాను విఘ్నేశ్వర ప్రార్థనచేయగా విఘ్నేశ్వరుండు వచ్చేమార్గం.

తుది :—ఈరీతిని పలుకగా వారుకృష్ణునితో నేమన్నారు సూత్రధరుడు.

చెలువగానీపాద సేవచేసెదమునీ
పలుకులువినిమేము పరగనడిచెదము
పొలుపొందయిదినిజము పూవిల్తుజనమాన
పాలింక వెలయంగ మమ్మేలరా శ్రీకృష్ణ
వేడుకమీఱగరారా.

583 (M 605) మొదలు 586 వఱకు నాలుగుప్రతులు.

## (12)
## వల్లీకల్యాణము

మొదలు :—

జయపార్వతీరమణ, జయమనోభవహరణ
జయభుజంగాభరణ, జయలోకశరణ
జయజాహ్నవీధరణ, జయజితాంతఃకరణ
జయసరోరుహచరణ, జయజగత్తరణా జయజయా.

అపురా యీవిధంబునవిఘ్నేశ్వరుని పాదపద్మంబులకు వందన మాచరించి యా తదనంతరంబున మరిన్నేవిధానసం తేను.

శ్లో॥ నృత్యైర్వికారగతైః కరాబ్జవలనైః తాలాయత కంకణః
ప్రక్వాణైః స్మృతితాంగతైర్ముఖవలల్లోలాంబమాలారుతైః ।
వీణాయామృదుగీతిభిః పరవశానాళీజనాః కుర్వతీ
వాగ్దేవీవదనాంబుజేనివసతిశ్రీశాహపృధ్వీపతేః ॥

సూ॥ వ॥ అపురా యీవిధంబున కుమారస్వామికి వల్లీదేవికి వివాహంబు సేయుసమయంబున నారదకిన్నర కింపురుషులు మంగళంబులు పాడేమార్గం పరాకు.

మంగళం॥ గౌరీశరమ్యవిహారునికి సారెక్ర్పారసహారునికి మీరిన ప్రేమను ధీరుల ప్రోచుచు కోరికలొసగెడుగుణనిధికి దేవునికిమహాదేవునికి దేవానివనుతభావునికి శ్రీవిభవముల పావనుండైతగు సేవకనిధియగుశివునికినిభోసల శాహజిభూవిభుని భాసిల్ల ప్రేమనుపాలించు వాసిగశోభనవైభవ సంతతిధీసంపదలిడు దేవునకు.

### ఫలస్తుతి

ద్వి. ఖండేందుధరపాదకంజంబులందు
మెండైనభక్తిచేమీరినవాండు
శ్రీవాసవవిభుండు చిరయశోధనుండు
భోసలకలశాబ్దిపూర్ణచంద్రుండు

సత్యసంధుఁడు సదాచారసంపన్నుఁ
డత్యంతదయశాలి యతిమానసుండు
సరసశిరోమణి శాహభూవరుఁడు
ఇరవొందగారచించిన శక్తిధరుని
కల్యాణంబు (ధరణిలో నెవడుచదివిన
నెవడువినిన నెవండాడిన నెవరుచూచినను)
సుతులుధనంబులు శుభములుమిగుల
అతులితమైనట్టి యైశ్వర్యములును
పొందుగాకృపను పొలుపొందవారలకు
ఇందుశేఖరుఁడిచ్చు యీప్సితార్థములు.

530 (M 466) మొదలు 596 వఱకు 7 ప్రతులు.

596 సంఖ్యగల తాళపత్రగ్రంథమున చివరనిట్లుగలదు. "తారణ నామ సంవత్సరే, ఆశ్వీయుజమాసే, శుక్లపక్షే, షష్ఠీస్థిరవాసరే, నవ రాత్రే, శివభోపనామ్నా ప్రతాపరాయ ఉశేలేఖనం పరిపూర్ణమస్తు."

దీనినిబట్టి ప్రతాపరాయుడను నాతడీగ్రంథమును తారణసంవత్సర మునందు లిఖించినట్లు తెలియుచున్నది. ఇది క్రీ. శ. 1704 లో సరి పోవుచున్నది గాన యీనాటక మా సంవత్సరమున వ్రాయబడినది.

## (13)

## విఘ్నేశ్వర కల్యాణము

మొదలు :— తోడెం రాగంనాట తాళం ఝంపె

జయపార్వతీరమణ, జయమనోభవహరణ......

సూ॥ వ॥ అపురా యీ విధంబున నిష్టదేవతాప్రార్థనసేసిన యూతదనం తరంబున శ్రీశాహమహారాజ ప్రణీతంబైన విఘ్నేశ్వర కల్యాణ మనెడు నాటకంబు కథాసంగ్రహంబుగా వినిపించెదము విన నొధరించరయ్యా!

తుది :— వరువు ఆదితాళం. గుమ్మకాంభోజిరాగం మాతృక

మాతంగజముఖునికిమంగళం నిత్యం
మదనహరసుతునికి మంగళం
రంజితభక్తునికి రాజశిరోమణికి
మంజులరూపునికి మంగళం
శాహజీరాజేంద్రుపాల సతతము మెలంగు
సామికిమహనీయరూపునికి మంగళం

గద్య :— సూత్రధార వచనం

ఇతిశ్రీమద్భోసలకుల శాహమహారాజ విరచితం విఘ్నేశ్వర కల్యాణ నాటకం సకలరసిక విద్వజ్జనప్రీతయే శ్రీ త్యాగేశసాంబశివార్పణమస్తు.

610 (M 523) మొదలు 616 వఱకు 7 ప్రతులు.

610 లేఖరి వెంకటరంగయ్య.

(14)

(విష్ణుపల్లకిసేవా ప్రబంధము)

మొదలు :—జయరమాంపురవాసజయచంద్రికాహాస,
జయసుమేరుశరాసజయకృత్తివాస.

* * *

సూ॥ ఇత్తెరంగునపలుగాకుతైన కాకపినికరంబులనుగ్గాడికవనవనసుకి పుత్తైన సుకవులకు జోహారుచేసి చతురుదధివసన వలయితరసాకల రాజమానరాజన్య మస్తన్యస్తమణిముకుట మసారమరీచిమంజరీపుంజమిళిందమాలికా మనోహర పాదారవిందుండును సుందరీబృందమకరంద సాయకుండును సుకరమకరంద ఝషముఖప్రముఖ బిరుదాంకుండును భోసలకులజలధిశశాంకుండును పరాశరప్రభవకనాశనపణితసుత పతంజలికపిగుంభన జరీజృంభదుట్టంకన సముద్ధృతరాద్ధాంతకలనా ద్వితీయుండును మహారాజవిలాసనివాసనిబరీసనీతు వేలవంగనమాలికా రచనాచణకటాక్షాలక్ష్మి

వశంవదుఁడును కలితసంగీతతాన శ్రుతిస్వరస్థాన రాగాంగగాన క్రియాస్థాయి గమక ప్రబంధధాతుగాయనగుణ తతానద్ధదాశహ కుండును దీపాంబికాగర్భశుక్తిముక్తాఫలంబగు శ్రీశాహవసుంధరా పురందరుండు రచియించిన పల్లకీసేవ ప్రబంధమున తొలుత విఘ్నేశ్వర ప్రార్థనసేయగా విఘ్నేశ్వరుండు వచ్చేమార్గం.

తుది :—సూ॥ ఇత్తెరంగున స్వామిమేలుకొన్న తదనంతరంబున శోభనమునుడివే క్రమమువరాళు.

శోభానమే శ్రీహరికి శోభానమె శ్రీపతికి శోభానమె శోభానమే శౌరికిని శోభానమెలక్ష్మికిని శోభానమెనగవరోద్ధారునికి నగసన్నిభకుచయుగళు గగనవర్ణునికి గగనమధ్యకునుశోభానమె శంబగరూపునకు శంబరనయనకు అంబుజనాభునికిఅంబుజగేహకునుశోభానమె త్యాగేశమిత్రునికి త్యాగేశసోదరికి భోగిశశాయికిని భోగేశవేణికినిశోభానమె॥ మంగళం॥

గద్య:-ద్వి. శ్రీలోలుపేర నాశ్రితపాలుపేర
నీలవర్ణునిపేర నిరుపముపేర
నారాయణునిపేర నగధరుపేర
వారిజోదరుపేర వైకుంఠుపేర
పల్లకిసేవ ప్రబంధరత్నంబు
పల్లవాయుధసను ప్రభగలవాఁడు
భూపాలమణియేక భూధవపత్ని
దీపాంబగర్భాబ్ధి దివ్యరత్నంబు
సత్యభామా హరిశ్చంద్రుఁడుత్తముఁడు
సత్యాగరాజాంఘ్రి సన్నుతిపరుఁడు
వాసుదేవచరిత్ర వర్ణనారతుఁడు
భోసలకులశాహ భూపాలమౌళి
విరచించెసత్కృపుల్ విస్మయమంద
ధరణిలోనాచంద్ర తారార్కముగను.

ఇంద్రజిత్తువాలు (618 ప్రతి)

618 (M 651), 619 రెండు ప్రతులు.

## (15)

## శంకరపల్లకి సేవాప్రబంధము

మొదలు:-

ద్విపద. శ్రీకరిముఖుని పోషితచతుర్ముఖుని,
ఏకదంతునిదురితేభకేసరిని
తారకదైత్యవిదారినిగుహుని,
గారవంబునగన్నగౌరిశంకరుల
పల్లకిసేవప్రబంధంబుగాను,
ఉల్లాసమునచతురోదధివలయ
సర్వసర్వంసహాచక్రంబునేలు,
సర్వపాదాంబుజ సన్నుతిపరుఁడు
వాసరవల్లభాన్వయరాజమౌళి,
భోసలశ్రీశాహభూపురందరుఁడు
విరచించెకవులెల్ల వేనోళ్లఁబొగడ
ధరణిలోనాచంద్ర తారార్కముగను.

తుది:— మాపాలిదేవునికి మంగళం మముగన్నతల్లికిమంగళం॥ పల్ల॥
గంగాధరునికి కరుణాబ్ధికిదివ్య మంగళదేహునికిమంగళం సంగీత
రసికకుజలజాక్షికి సర్వమంగళకు దేవికిమంగళం ముదిత
శంకరునికి మోహనాకారునికి మదనసంహారునికి మంగళం సద
యాపాంగకు స్మరజవనదాయినికి మదవతిగిరిజకుమంగళం రహి
గలత్యాగేశుకు రాజమౌళికి శాహమహీపాలదేవునికి మంగళం
గజముఖులను కూరిమితోగన్న మహితగుణాఢ్యకు మంగళం.

గద్య. శ్రీశంకరునిపేర శ్రీగౌరిపేర,
వాసవార్చితుపేరపార్వతిపేర
కేశవనుతిపేర, గిరిసుతపేర,
ఈశునిపేర సర్వేశ్వరిపేర
భోగిభూషణుపేర పూబోణిపేర,
త్యాగేశుపేరకాత్యాయనిపేర

పల్లకిసేవాప్రబంధంబుదివస
వల్లభాభాన్వయుఁశేశ వసుధేశధర్మ
వర్ధిదీపాంబగర్భసింధురజేట్టి.
రత్నంబు శ్రీశాహరాజదేవేంద్రుఁ
డొనరించెకవులెల్ల నుల్లసిల్లంగ,
దనరుచునాచంద్ర తారార్కమగను.

620 (M. 650) నుండి 524 వఱకు 5 ప్రతులు.
628 అనంతయ్య లిఖితము

## (16)
## శచీపురందరము

మొదలు :- శ్లో. నాటరాగం. ఝంపెతాళం

జయపార్వతీ రమణజయమనోభవహరణ, *

సూత్రధారవచనం॥ అప్పురా యీవిధంబున నభీష్టదేవతావందనంబుగా వించి సభానాయకాదుల నభివర్ణించ శ్రీశాహమహారాజ ప్రణీతంబైన శచీపురందరంబనెడు నాటకంబు కథాక్రమంబుగా వినుపించెదమువినవవధరించనయ్యా.

తుది:- పావనుండై, తగుసేవకనిధియగు శివునికిని, భోసలశాహాజి భూవిభునిభాసిలు ప్రేమలుపాలించు వాసిగశోభనమై భవనసంతతి ధీసంపదలిడు దేవునకు.

*వ్య. ఇతి శ్రీభోసలశాహమహారాజ విరచిత శచీపురందరకల్యాణము మహానాటకం సకలరసిక విద్వజ్జనప్రీతిము సకలశ్రేయసే శ్రీత్యాగేశ సాంబశివార్పణమస్తు.

"ఈయులేఖమునందు ప్రథమనాటకం గణపతి రెండోది సరస్వతి మూడోది పార్వతి నాలుగోది సీత అయిదోది రామపట్టాభిషేకం ఆరోది యీనాటకం దీనికిపేరు శచీపురందరం సంపూర్ణముగు నట్లు వ్రాసిన తాలేకులు రం వెంకటరంగయ్య వ్రాశినా...
625 (M. 548) నుండి 627 వఱకు ప్రతులు.

## (17)

### శాంతాకల్యాణం

**మొదలు :-** జయపార్వతీ రమణజయమన్మథవహరణ * * *

అనిమొడికథలచే నమరివేడుకను, దనరుచుండు శాంతాపరిణ
యము ఘనుడుశాహేంద్రుండుగావించెభువిని, వనివశికూరంగ
భరితుండైనచాల సరసత్కవివరుల్ సన్నుతిచేయ, ధరణిలోనా
చంద్రతారార్కముగను.

628 (M. 619) నుండి 630 వఱకు మూడుప్రతులు.

## (18)

### సతిదాన శూరము

**మొదలు:-** తోడెం. జయపార్వతిరమణ జయజానకీరమణ x జనాభరణ

... ... ...

అనిమొడికథలచే నమరిరాజిల్లు
చునుమించు సతిదానశూరనాటకము
విరివిగాశాహభూవిభుడుగావించె
ధరణిలో నాచంద్రతారార్కముగను.

సూ. అవురా యీవిధంబున శ్రీశాహమహారాజ ప్రణీతంబైన సతిదాన
శూరనాటకంబునందు.

**తుది:-** అవురా యీవిధంబునం బరమేశ్వరుండు బ్రాహ్మణునికి
సాయుజ్యమును, మాదిగవానికి సారూప్యమును, సుతంగభామి
నికి సామీప్యమున్ను విద్యార్థికి సాలోక్యమును యిచ్చినయా
తదనంతరంబున నారదకిన్నర కింపురుషాదులు మంగళంపాడే
మార్గం.

638 (M. 622) నుండి 643 వఱకు 7ప్రతులు.

640 లేఖరి. రామయ.

## (19)

## సతీపతిదాన విలాసము

మొదలు:- జయ దేవకీపుత్ర జయదివ్యనుతిపాత్ర × జయజితామిత్ర.

... ... ... ...

అనియొడి కథలచే నమరి వేడుకను
దనరుసతీపతిదాననాటకము
సరసశుభోక్తుల సంతసంబునను
విరివిగా శాహంభూవిభుఁడుగావింప
నరకవీశ్వరులెల్ల వర్ణనసేయ
ధరణిలోనాచంద్ర తారార్కముగను.

తుది:- అవురా నీవిధంబున నీరీతి నారదుండు స్తుతిసేయునవుయంబున సురలు నారదకిన్నర కింపురుషులు మంగళంబులు పాడేమార్గం వరాను.

దరువు. మందరధరునికి మాధవునికి
శోభానమే, శోభానమే
భోసలశాహాజీ భూవిభుని...
వాసిగశోభన వైభవసంతతి
ధీసంపదలిచ్చు దేవునికి శోభానమే.

644 (M. 624) నుండి 650 వఱకు 7 ప్రతులు.

## (20)

## సీతాకల్యాణము

స్రగ్ధర. రామంశ్యామాభిరామం రవిశశినయనం కోటిసూర్యప్రకాశం
దివ్యందివ్యాస్త్రపాణిం శరముఖశరధిం చారుకోదండహస్తమ్
కాలంకాలాగ్నిరుద్రం రిపువనదహనం విఘ్నవిచ్ఛేదదక్షం
భీమంభీమాట్టహాసం సకలభయహరం రామచంద్రంభజేహమ్.

తోడి. నాటరాగం ఝంపెతాళం

జయదశరథపుత్ర జయదివ్యనుతిపాత్ర
జయజగదైక సుహితలేశ్వర జయజయోదార
భోసలశాహరాజ...........

పా॥ వ॥ అపురా యీవిధంబున నభీష్టదేవతావందనంబుగావించి సభానాయకాదుల నభివర్ణించి, శ్రీశాహమహారాజ ప్రణీతంబైన సీతాకల్యాణంబనెడు నాటకంబు కథాక్రమంబుగా వినిపించేము. వినవాధరించరయ్య.

తుది:- మారామభద్రునికి మంగళం నిత్యం
మాసీతాదేవికి మంగళం
వనజాతనేత్రునికి వరకీరవాణికిని
మనసిజరూపునికి మంగళం
భానుకులేశునకి పరమకల్యాణికి
మానవేంద్రునికిని మంగళం
విహగవాహనునికి, విరిబోణికి శ్రీ
శహామహీపాలదేవునికి మంగళం.

సీతాకల్యాణనాటకం సంపూర్ణం.

6631 (M 515) నుండి 672 వఱకు 10 ప్రతులు.

ఇంతవఱకును శ్రీశహాజీ స్వయముగా రచించినకృతులు. ఈ క్రింది 'సరస్వతీ కల్యాణనాటకము' శహాజీమహారాజా స్థానీయుగు శేషాచలకవి రచించి గ్రంథకర్తృత్వము శాహజీకారోపించియున్నాఁడు కావున శాహజీ కృతులలోనిది చేర్చబడినది.

సరస్వతీ కల్యాణము

ప్రారంభము:- జయదేవకీపుత్ర, జయదివ్యనుతిపాత్ర, జయజితామిత్ర.
అన్నాఁడుగనుక అపురాయీవిధంబున నభీష్టదేవతానందనంబు

గావించి సభానాయకాదుల నభివర్ణించి శ్రీ శాహమహారాజ ప్రణీతంబైన సరస్వతీకల్యాణం బనెడు నాటకంబు కథాక్రమం బుగా వినుపించేమువినసాధరించరయ్యా.

అగుచోళ నాథ మహామాత్యనాథ
సుగుణసత్పుత్రుండు సుజనమిత్రుండు
చిరపుణ్యవరమతి శేషాచలపతి
వరశాహవిభు పేరవహించినదైవార
చారుశృంగారరసంబులదీరు
శారాయనుచు మెచ్చ హర్షంబు హెచ్చ
మొల్లపుప్వులపొట్లములువిప్పినట్లు
చల్లగాపన్నీరు చల్లినతీరు
పరగుసరస్వతీ పరిణయంబనెడు
సరసనాటకములాస్యములరంజిల్ల
భావముల్ తగు వేషభాషాదులమరు
గావించెభరతులు గాయకుల్ మెచ్చ
అచక్రవాళా చలాచలాచక్ర
మాచంద్రతారార్క మైయొప్పగాత.

గ్రంథాంతము:—వాణికిపల్లవపాణికి వీణాప్రియకవివేణికిని, ఏణనయనకు నెలమిపద్మజునిరాణికి శ్రీకల్యాణికిని, భోసలశాహజిభూవిభుని భాసిలుప్రేమనుపాలించు, వాసిగశోభనవైభవ సంతతిధీసంపదలిడు దేవునకు, సకలజగములకుసంతసము అకలంకాప్తతనమరించు. సుకృతిసంతతి శోభనసిధికిని అకలుషమతియగు అజునికిని॥ శోభానమె.

దీనికి 651 నుండి 657 వఱకును ఏడుప్రతులుగలవు. ఇందులో వెంకటరంగయ్యగారి, వేంకటనృసింహుడను వేఱొకలేఖకునిగుకూడ గలదు.

## శహాజీ యాస్థానమందలి యాంధ్రకవులు.

### —: ఆంధ్రపాణిని శేషాచలకవి :—

శహాజీరాజాస్థానమున ప్రథమగణ్యుఁడు శేషాచలకవి. ఈతనిని నెల్లూరి శివరామకవి 'కామకళానిధి' యను గ్రంథమున తనగురువుగా నిట్లు పేర్కొనినాఁడు.

మ. సకలాంధ్రోక్తుల కాంధ్రపాణినియనన్ శాస్త్రంబుగల్పించి, తత్
ప్రకృతిప్రత్యయనిర్ణయంబుకొఱకై భాష్యంబుగావించి, దే
శికుఁడై రాజులచేతఁ బూజఁగొనునా శేషాచలర్షిన్ నివృ
త్తికులస్వామిని మద్గురున్ గొలుతు భక్తిన్ మానసాబ్జంబునన్

పై పద్యమునుబట్టి 'ఆంధ్రపాణిని'యని పేర్కొనఁబడిన యాతఁడు నివృత్తికులజుఁడనియు, శేషాచల నామధేయుఁడనియు రాజులచేఁ బూజింపఁబడిన వాఁడనియు, సంస్కృతభాషకుఁ బాణినీయమువలె నాంధ్రభాషకు సూత్రములుగావించి, దానికి భాష్యముకూడ వ్రాసిన వాఁడని స్పష్టమగుచున్నది.

శహాజీమహారాజునకుఁ గృతిగా కవిరచించిన "[1]భోసలకోసలీయము" అను నముద్రితసంస్కృత కావ్యమునుండి కవినిఁగూర్చి యీ క్రిందిరీతిని గలదు.

శ్లో. నాయాసం కవనే తతోఽపి కథనం కావ్యం తతో నాటకమ్
తస్మాద్ధ్వన్యమతః పదధ్వరనస్సైః వాగ్వైఖరీ జీవితమ్
తద్రామాయణభాసి మజ్జయకథం జల్పాంధ్రవాక్పాణినే
శ్రీశేషాచలపత్యమాత్యకుశలోఽస్తీత్యాహ శాహానృపః

శ్లో. శాహేంద్రదత్త శిబికాకనకాభిషేక
సంభావనారుణబిధ ప్రతికారహేతోః
యత్సావహానం విరచయే నను తత్రవాచః
స్వత్తోఽధికం ప్రతిభువం కలయేననూనమ్.

---

1. Descriptive Catalogue of Samskrit Manuscripts, Tanjore Saraswathi Mahal Library Kavyas Vol. VIII Concluded No 4238, Pages 3275-77.

ద్వితీయ సర్గాంతగద్య.
శ్రీభోజనిజగోత్రకారణ భరద్వాజాన్వవృత్త్యాన్వయా
ద్య శ్రీ వేంకటపత్యమాత్యశీలకాజ్జాతోఽక్కదేవీవిభో
శ్రీశేషాచలపత్యభిఖ్యకృతినా స్తస్యాంధ్రవాక్పాణినే
కావ్యే భోసలకోసలేంద్రచరితే సర్గేద్వితీయోఽభవత్

పై యుదాహృతులనుబట్టి 'ఆంధ్రపాణిని' యనఁబరగిన శేషాచలకవి శహాజీమహారాజుచే, కనకాభిషేక మహాసత్కారమును నాందోళికాది విశేషబహుమానములను పొందినవాఁడనియు, నీతని గోత్రము భారద్వాజగోత్రమనియు, తల్లి, అక్కను, తండ్రి వెంకటపతి యనియు స్పష్టమగుచున్నది సంస్కృతాంధ్రభాషలయందే కాక, అష్ట భాషలయందీతఁడు కవిత్వ మల్లగలఁడని యీ క్రింది పద్యమునలనఁ దెలియుచున్నది.

గీ. లలితగతి శాహరాజవిలాసమనెడు
నాటకము సేయు బుధులుసంతసమునొంద
ధిచమత్కృతి వెలయ శేషాచలపతి
అష్టభాషావిశేషంబు లమరుసుకృతి

ప్రస్తుతమీతని కృతులు మూఁడుకానవచ్చుచున్నవి. 1. శాహరాజవిలాసము 2 సరస్వతీ కల్యాణము 3 ఆంధ్రవ్యాకరణము. ఇందులో మొదటిరెండు తెనుగు. మూఁడవది సంస్కృతము సరస్వతీకల్యాణము తానురచించినను గ్రంథకర్తృత్వము శహాజీమహారాజు పేరఁ బెట్టినాఁడని ముందు తెలిపితిని.

—: శాహరాజ విలాసము :—

గ్రంథప్రారంభము

శా. శ్రీమద్గారికటాక్షమీనముఖ రాజీవంబున్ షట్పద
స్తోమంబాతరినిచ్చె నెచ్చెలియగ్రందుర్ లజ్జయూతల్లికిన్
ప్రేమన్ సమ్మతిసేయసంగతముఖాప్తిన్ మీరునాదంపతుల్
నేమన్ లబ్ధమమూరుఁజేయుతస్వరీతిన్ శాహభూవల్లభున్

సీ. శ్రీకరగుణశాలి యేకేంద్రసుతమాళి
స్వారిరాగానొక్క సరసిజాక్షి
చూచిమోహించుచు శుకముఖ్యదూతిక
లంపిమన్మథ వివశాత్మయగుచు
వనకేళిమీనకేతను పూజలొనరించి,
శుభసూచకంబైన సూక్తివలన
అవిలంబముగ చెలుల్ ప్రాణేశుఁడౌ శాహ
విభునితోఁగూర్చిన విభవమెల్ల

తే. లలితగతిశాహరాజ విలాసమనెడు
నాటకమురచించు బుధులుసంతసమునొందు
ధీచమత్కృతి వెలయు శేషాచలపతి
అష్టభాషాకవిత్వంబు లమరుసుకృతి.

* * *

"భవ్యపరమాయురస్తు దీపాతసూజ
సర్వసంపత్సదాస్తు తే శాహరాజ"

వ॥ ఈరీతి కథాసూత్రంబునకు పాత్రంబగు భోసలగోత్రావతార చారిత్రంబెట్టిదనిన.

"శ్రీకరుండగు చంద్రశేఖరుకరుణ
చేకీర్తితములైన శ్రీకీర్తితతులఁ
బరగిశంకరు పాదపద్మముల్ మోద
సరణిచేఁబూజించి సంపదల్ గాంచి
హరిమహారాష్ట్ర మనుమహారాష్ట్ర
ధారుణిభూషించ తనరజనించె
భోసలకులసింధు పూర్ణచంద్రుఁ
డై సదామించు ప్రఖ్యాతులుగాంచు
శ్రీశాహరాజు భాసితకీర్తితేజుఁ
డై సార్వభౌముఁడింపలరు శ్రీరాము

పగిదిదుర్నామాది పాపవిభేది
సగుణశాసనుఁడతి చండశాసనుఁడు
ఆతనినందనుఁ డతులశౌర్యంగాఁడుఁ
డార్జవగణోదారు ..........
డాతఁడీభూలోకమున నుండుదాక
ఖ్యాతిగా నేకాతపత్ర సంజాత
శీతలచ్ఛాయగాఁచి సుఖింపచేయు
నాతరిభూరాజులనిరి యారాజు
యేకమైధరలోన నిరవొందుగాన
యేకరాజనభూమి నెసఁగునాసామి
తనకులాంగనలందు తగుఖ్యాతిఁజెందు
వినయావలంబ శ్రీవెలయుదీపాంబ
యందునందనుల శివాభివందనుల
మందరోన్నతుల సన్మార్గసన్నుతులఁ
గాంచెకావన్నృపాలు కమనీయశీలు
అంచితవిభవేంద్రుడగు శరభేంద్రు
తుళుజభూపాలుని స్తులదానశీలు
చెలగిరివారలూర్జిత లక్ష్మిమీర
అందగ్రజుండు పర్వవిత్తాగ్రజుండు
కందర్పరూపుఁడు ఖండితాటోపు
దరజుప్రతాపుఁ డాహవదిలీపుండు
అరజుకుసమదానుఁడ సమానమాను

*　　　　*　　　　*

యవనామకుల నెల్లనరికొనభల్ల
జవనతశిక్షించి జగతిరక్షించి
సంగమ్ముగాంచె ద్రవిణోర్విని గాంచె
మంద్రంబాక్రమించె

వంగభూమిభరించె వపకాశిమించె
జాలిగలంబేలె పాంచాలోర్విగ్రాలె
సౌరాష్ట్రిమెట్టెను శకభూమికట్టె
నారట్టకముచేరె నాంధ్రోర్విమీరె.

గ్రంథాంతము

సింగి॥ నల్లనిమేనును నారయుకొంగనలి
పల్లవెండ్రుకలు బల్లికడుపును
కల్లుబుంగయును నల్లకట్టిగును
చిల్లగోలయును చేయమర
వెంగలినడయును వేలమూపులును
కొంగజెక్కలును కుండబొజ్జయును
చొంగయుమీఱంగ సింగిచేయుగును.

శుభమస్తు. హరిః ఓమ్.

శ్లో. శ్రీశం దేవముపాస్య శేషసుమతీన్నార్యాంశ్చ భాషావిదః
కావ్యాదివ్యవహారచారు చతురాంమత్వాగ్రభాషాంచిరాత్।
తాంవ్యుత్పాదయదంగ్రపాణిని సముత్జ్ఞోపకారీభవన్
ఆంధ్రవ్యాకరణంకరైక్యని సుహైస్వాంస్యతానీకృతిమ్॥
శ్రీపాణినిమునిభ్యోనమః హరిః ఓం అఇఉణ్ ఋఌక్ ఏఓఙ్
ఐఔచ్ హయవరట్ లణ్ ఞమఙణనమ్ ఝభఞ్ ఘఢధష్ ఖఫఛఠ
థచటతవ్ కపయ్ శషసర్ హల్ ఇమానిత్రయోదశసూత్రా
ణిప్రత్యాహారార్థానివర్ణ పరత్వాస్సంస్కృతప్రాకృతసమా
నాన్యపిసంస్కృతమితి ప్రసిజ్ఞాస్సంతే. ఏషామంత్యమిత్సంజ్ఞంవి
ధాస్యతే. హకారాదిష్వకారస్సుఖోచ్చారణార్థః.

సూ. అథాంధ్రశబ్దానుశాసనమ్ ॥అథశబ్దోమంగళార్థః ఆరంభార్థ
కోవా. ఆంధ్రశబ్దానామనుశాసనమారభ్యత ఇత్యర్థః.

శ్లో. నిషేదివాన్కంసకృషస్సవిష్టరే ॥ఇయ్యాదాలౌకికవాక్యానాం వక్తు ర్వివత్సౌధీనమ్. ఆంధ్రకృతౌ భావివస్వంతపాఠేన నిషేదివాంసుం డుదూర్వాసస్స ప్రాగ్వినామదుర్వాసనుండు ప్రచేతుల్ సదాగ తుల్ ఇతిభావి, తత్సాన్వదిశక్త్యాచర్త్యవస్థిత్యేవ సానజశాంరువి సర్గస్యచనిరాసః. సుపికింవాగ్ఘాటి యశఃప్రతాపముతత్సమాసా న్యేవేహాపిప్రాతిపదికమ్యాత్ ॥నపుపధాయాదీర్ఘః॥ వస్వంతస్య ఉపధాయాః దీర్ఘస్స్యాత్ విద్వాప్ × సుఇతిస్థితే॥తద్ధితనుక్॥ తద్ధి తస్యాత ఉపధాయాః చాద్యసుపదాయాశ్చనుక్ స్యాత్ అకిస్థ ఏవముపొప్యధాబవేన పరమేనశ్రీమంతి, బంధుమంతి తథావి ధ్వాంసజలగడగి.. ......

ఆంధ్రవ్యాకరణము

ఇదియే శేషసుమతి ప్రణీతముగా తంజావూరి పుస్తకశాలలో నున్నది. పైనియుదహరించిన శేషాచలపతి విషయములనుబట్టి యీ శేషసుమతి, శేషాచలకవియని స్పష్టమగుచున్నది గదా!

—: గి రి రా జ క వి :—

శహాజీ మహారాజాస్థానమున ప్రసిద్ధికెక్కిన కవులలో గిరిరాజకవి యొకఁడు. ఈతనిసోదరుఁడు వెంకటకవి తన ద్విపద రుక్మాంగదచరిత్ర మున వంశక్రమమిట్లు తెలిపియున్నాఁడు.

లోహితగోత్రము ఆపస్తంబసూత్రము
దర్భవంశము.

గో[illegible]ంత్రి (చెంగమాంబ)

ఓబళన్న (జానకమ్మ)




వెంకటగిరి (విచిత్రరామాయణ వతంసుడు)

పై వారిలో మొదటియాతని వృత్తాంతము మనకు తెలియదు. రెండవవాఁడు ప్రసిద్ధుఁడగు గిరిరాజకవి. ఈతఁడు "మార్తాండకుల శాహి మహీపాలు సభను, కీర్తికెక్కినవాఁడు గిరిరాజసుకవి" యని కీర్తింపఁబడినవాఁడు. ఈతఁడు సంగీతసాహిత్యముల రెండింటను సిద్ధహస్తుఁడు. శహాజీ సోదరుఁడగు శరభోజీ యాస్థానమున కూడనుండినవాఁడు. తాళపత్రగ్రంథములలో పదములను శీర్షికలో 448, 449, 451 సంఖ్యగల పదము లీతని రచనములున్నవి. 'గిరిరాజనుతుండు అందమునమా,' 'గిరిరాజసుత నీరొమ్మున చెదరినగంధము అందము ముదముల శాహేంద్ర' ముగుదలు గూడిన చందము; 'శ్రీపగత్తె గిరిరాజనుత శరభోజి నృపా,' అనుముద్రలు పైయంశమును రుజువుచేయుచున్నవి. ఈతని కృతులు.

శాహేంద్ర చరిత్రము

ఇదియొక యక్షగానము శాహాజీయొక కన్యనువలచి యామెను పెండ్లియాడుట యందలి యితివృత్తము.

మొదలు:—

కం. వాణీంద్రుతవశ్యాంత
ర్వాణీస్తుత మధురకీర్తనాశి సకియ
ర్వాణీకృతనానాగీ
ర్వాణియ విహరించు శాహవరుముఖవీథిన్.

. . . . . . . . . . . . . . .

ద్విపద అప్పుడయ్యింతి కాయజుబాణవహ్ని
గప్పడెప్పరమైన కాకఁగా క
శాహంమహీపాలు చంద్రునిమీద
మోహంబుమిక్కిలి మోహింపగ
అలుకుచుమిక్కిలి యసురుసురనుచుఁ
గలఁగుచుఁజంద్రునిఁ గాంచియిట్లనియె.

దరువు. చందమామపదము

వలనొప్పచల్లనివాఁడవు గదవోయి చందమామా
వలనున్న యింతులవలచనేటికి చందమామా

వ॥ యీరీతిని యాకలికి చంద్రునిదూఱుచుండు సమయంబున అంత ప్రభాతంబైన శాహామహారాజ దేవేంద్రుండు నామెమూతకు హేమాదులొసంగి సంతోషితురాలింజేసి యాకన్యనుగూడి విలాసంబుగా నుండునంత.

గద్య ద్వి. శ్రీకరుపేర యాశ్రితరక్షుపేర
ఏకేంద్రుసుతుపేర యినవంశ్యుపేర
సరససాహిత్యలక్షణవిదుపేర
నిరవొంద శాహదేవేంద్రుని పేర
కండచక్కెరలీల గల్పించుకుచుల
గండుమీఱిన యక్షగానంబుమిగుల
గరిమను గిరిరాజకవిరచియించె
ధరణిలో నాచంద్రతారార్కముగను.

496 (M. 649-a) ఏకప్రతి.

—: రామమోహనకొఱవంజి :—

ప్రారంభము:—

ద్విపద. శ్రీసుతతుల్యుఁడై చెలువొందునట్టి
భోసలకులశాహ భూపాలుమీఁదఁ
జెన్నగా మోహితచిత్తయై రాజ
కన్యకామణి సరికాంతలుగొలువఁ
గరిమతో మనమున్న కదలివచ్చుటయు
విరహాభరంబుచే వెతలఁ జెందుటయు
నెఱుకతవచ్చి దా నెఱుకఁ జెప్పుటయు
సురుతుగా శాహేంద్రుఁగూడి యుండుటయు

ననియెడిరాజమోహనకొలువంజి
పనుపడిశాహేంద్రుఁ పైనంకితముగ
ఘనతతో గిరిరాజకవిరచియింప
జనులెల్ల మేలని సంతసిల్లగను.

తుది: సూ. ఈవిధంబున రాజకన్యక శాహమహారాజ దేవేంద్రునికూడి యుండగా నద్దనుండే చెలికత్తెలు శోభానమంగళంపాడేమార్గం ఏకేంద్రసుతునికి భోసలేంద్రునికి శోభానమే, శోభానమే.

దీపాంబతనయునికి, గిరిరాజపాలునికి, సరసూనికి.....
సరిసాటిలేనట్టి శాహేంద్రునికి
తంజాపురీశునికి, తరుణిపాంచాలునికి, మంజులభాషునికి మంగళం
వాసవనిభునికి వరసాహిత్యభోజునికి మా శాహరాజేంద్రునికి
మంగళం.

500 (M. 524) నుండి 510 వఱకు 3 ప్రతులు.

509 నాగమయ్యలేఖరి.

పైయుదాహరణనుబట్టి యితివృత్తము స్పష్టము.

## లీలావతీ కల్యాణము

ఇందు కల్యాణపురాధీశ్వరుఁడగు కీర్తిచంద్రరాజు కుమార్తెయగు లీలావతిని శరభోజీ పెండ్లియాడిన కథవర్ణితము.

ప్రారంభము.

ఉ. ... ... ... ..
ద్దేవకిరీటకోటిమణిదీధితి దీప్తపదాంబుజద్వయిః
పావనశేషతల్ప ......... తానువర్తిరా
జీవదాళాక్షుఁడీవుత శుభేక్షణభాళిశరీభశారికిన్.

క. కవులాధునికులు శరువాన్
కవితకుమాధుర్య ధుర్యగరిమముదీర్చన్
కవికాళిదాస బిల్హణ
భవభూతిమయూరభట్ట బాణులఁదలఁతున్.

ఉ. పన్నుగఁగానిపోని పదపద్యములూరకెయూరవేసియ
భ్యున్నతిఁగాంచి మంచిబుధులుండినచోటికి వచ్చుకాకవుల్
కన్నపుటచ్చరావళుల గంతలుగట్టి మహీశతాళికిన్
చెన్నుగనమ్ము జూచు జడచిత్తులకున్ సయిదోడులేకదా !

ద్విపద. శ్రీజన్మభూమియై చెలువంబుకలిమి
రాజిల్లునల <u>మహారాష్ట్రదేశమున</u>
ప్రజలపాలిటివాడు పరమపావనుఁడు
రజనీకరాన్వయ రాజరత్నంబు
తాలిమిఁగలవాఁడు ధర్మతత్పరుఁడు
మేలిమిగనిమెచ్చు మేలైనదాత
కీర్తిచంద్రికలు మిక్కిలి తేజరిల్లు
<u>కీర్తిచంద్రాహ్వయక్షితి పాలమౌళి</u>
కలిమియుబలిమియుఁ గడలుకొనంగ
పాలుపార కల్యాణపురి నేలునపుడు.

దరువు. లీలావతి వెడలె హొయలుమీఱ
పటువగుపయ్యెదఁ జనుగవపొదల
నటునిటుముత్యపుహారము గదల
సుచరితరమయని సుదతులుఁజూడ
కచకుచభారము కౌనసియాడ
అందెలరొద రాయంచలఁబిలువ

ఉ. పూచెనుమాధవీలతలు పూవులతేనెలు త్రావిజుమ్మనన్
లేచెనుగండుతుమ్మెదలు లేమలయిూలువుగొల్లలాడఁగా
చూచెనుపంచసాయకుఁడు సోమరితెమ్మెర పిల్లలెల్లెడన్
వీచెనుచూడవమ్మ వనవీథులతాంతవసంతవైఖరుల్.

తు॥ :—గిరిరాజనుత శరభోజిభూపాల సురతకేళినన్నుచొక్కఁజేసితివి.

యోగిని. ద్వి. శ్రీసద్గుణోదార సింధుగంభీర
భోసలాన్వయచంద్ర భూమిదేవేంద్ర
జననాథదినరాజ శరభోజిరాజ
వినుమునీదాన నావిన్నపంబొకటి

ఆచంద్రతారార్కమై యుండవయ్య.

587 (M 630) ఒక ప్రతి

—: వాదజయము :—

ప్రారంభము :—

ద్విపద. శ్రీగిరిజానాథు జితరిపుయూథు
నాగచర్మాంబరు నాగకేయూరు
ఈశునశ్వేశు త్యాగేశుసేపొందు
భాసురముగమనః పద్మంబునందు
తలఁచిసద్భక్తిచే దనరినధీర!
జలనిధిగంభీర శత్రుసంహార!
రతిపతిసమరూప రవికులదీప!
సతతశుభాచార సద్గుణాసార!
చోళమహీపాల సురుచిరశీల!
లాలితకవిపాల రమణీయలీల!
వాసవసంపూర్ణ వైభవవిమల!
భోసలకులశాహ భూపాలచంద్ర!

పొంకంబుమీర పెంపొందనీమీాన
అంకితంబుగ నతులమై ఖరిని
వాదజయంబను వరనాటకంబు
మోదంబుతోఁ దముగుకొనియిపుడు
గావించెద గనేను కవులునుతింప,
భూవలయంబున పూజ్యమైపొగడ.

సూ॥ వ॥ అవురా యీావిధంబున గిరిరాజకవి శాహరాజ దేవేంద్రుపై అంకితంబుగ నొనర్చినవాదజయంబను నాటకమునందు కథాసం విధానముగా వినిపించేము విననవధరించరయా.

కుది:—సరిసాటిలేనట్టి శాహేంద్రునికిని శోభానశోభానమే.
మంగళం॥ మహారాజశాహేంద్రునికి మంగళం మిగుల, మహానీ యశీలునికి మంగళం ఘనధిగంభీరునికి వనజలోచనునికి, మనసిజ రూపునకు మంగళం శ్రీజాపురీంద్రునికి తరుణీపాంచాలునికి, మం జులభామణునికి మంగళం వాసవనిభునికి వరసాహిత్యభోజునికి, మారాజశాహేంద్రునికి మంగళం.

598 (M 648) నుండి 601 వఱకు 4 ప్రతులు.

—: సర్వాంగ సుందరీవిలాసము :—

ప్రారంభము:— తోడెం సాటరాగం జంపెతాళం
జయదేవకీపుత్ర జయదివ్యచరితపాత్ర.

వ॥ ఈవిధంబున నభీష్టదేవతానందనంబుగావించి సభానాయకుల నభివర్ణించి సర్వాంగసుందరీ విలాసంబనెడు నాటకంబు కథాక్రమంబు గావినిపించెదమవిన నవధరించరయ్యా

ద్విపద. అనియెసి కథలచే నమరినశాహ
ధవుని సర్వాంగసుందరి వివాహంబు
ననవై ఖరులు మీాఱనాటకంబుగను
గరిమతో గిరిరాజకవిరచియించె
ధరణిలోనాచంద్ర తారకంబుగను.

తుది: సూ. అవురా యీవిధంబుగ పలికినకన్నను శాహేంద్రుండు అంగీకారముచేసిన భావం తెలిసినద్దాన్న చెలులుమంగళం పాడేమార్గం.

మంగళం శాహరాజాయ మంగళం నిత్య
మహితకల్యాణాయ మంగళం
భోగదేవాంద్రాయ భోసలకులదీపాయ
వాగీశపాండిత్యాయ మంగళం
భూధరధైర్యాయ భువనైకవీరాయ
మాధుర్య నిలయాయమంగళం
శ్రీచోళనాయకాయ శ్రీవాసుదేవకవి
వాచాసంతుష్టాయ మంగళం.

658 (M. 555) నుండీ 662 వఱకు 5 ప్రతులు.

లేఖకుడు మంత్రమూర్తి వెంకటరంగయ్య కాలము తారణ సంవత్సరము.

—: కవిగిరిలేక వేంకటగిరి :—

గిరిరాజకవి తమ్ములలో ప్రసిద్ధుడు కవిగిరిలేక వేంకటగిరి కవి. తనయన్నవలెనే సంగీతసాహిత్యములలో మంచిప్రవేశము గలవాడు. శహాజీమహారాజు బంధువులలో నొకడును, విచిత్రరాయనికుమారుడును నగు ఖండోజీరాయని యాస్థానకవి. ఈతని కృతులన్నియు నాతని యాదేశానుసారము రచితములైనవి. విచిత్రరాయావతంసుడని యాతని బిరుదునామము. ఈతనిపోషకుడగు ఖండోజీ, యీబిరుదునామముతో సంబోధించిన గన్నివేళములను బట్టిచూడగా, కవిగిరి ఖండోజీ తండ్రినాట నుండియు నాతని యాస్థానమున నుండెననియు, నందుచే తన తండ్రిపేరి తోనున్న బిరుదముతో ఖండోజి సంబోధించెననియు స్పష్టమగుచున్నది. ఈతని కృతులు.

## రుక్మాంగద చరిత్ర

ప్రహ్లాదాది పరమభక్తులలో ప్రస్తుతుఁడగు రుక్మాంగదుని చరిత్ర మిందు వర్ణితము. ఇది మూఁడాశ్వాసములుగల ద్విపదకృతి ముందు నేనుదాహరించిన వంశక్రమమీగ్రంథమునందలిదే. ప్రారంభమున

"శ్రీరుక్మిణీనాథు జితదైత్యనాథు
నారూఢకారుణ్యు నఖిలశరణ్యు
పారికాంక్షిస్వాంత పద్మసంచారు
చారుచమూరువాంఛకమితనేత్రు
ప్రణుతబర్హాకలాపు ప్రణవస్వరూపు"

నమస్కరించి. శ్రీరాజగోపాలసేవాధురీణుఁడు, ఆయతమాళివంశాబ్జ విచిత్రరాయపుత్రుఁడు, ఖండోజీరాయడు ప్రార్థింపగా, రుక్మాంగదచరిత్ర రచియించినాడు. తరువాతవంశక్రమము ఆవెనుక కథాక్రమము. గ్రంథాంత గద్య.

"ఆనిలోకవినుత దర్భాన్వయ జలధి
జనితుఁడౌబళమంత్రి జానకాంబయును
క్రమమున మన్నింప కడకదీవింప
కమలాంబికాదేవి కరుణపోషింప
పంకజాక్షునిపాద భక్తియుక్తుండు
వేంకటగిరికవి విష్ణునిపేర......
...          ...          ...
శ్రీసతీపతిపేర జిష్ణునిపేర
అంకితంబుగను రుక్మాంగదుచరిత
మంకురింపఁగఁ దృతీయాశ్వాసమయ్యె.

ఈ గ్రంథముముద్రితము. సంఖ్య 353.

ఈకవికి ముందుగా నీరుక్మాంగద చరిత్రమును చదలువాడమల్లన ప్రశస్త ద్విపదకావ్యముగా రచించినాఁడు *

---

* విప్రనారాయణ చరిత్రపీఠిక, పుట 31. ఈ గ్రంథకర్తచే సంపాదితము ఆంధ్రసాహిత్యపరిషత్ ప్రకటితము.

## అభినయదర్పణము

ఇది నందికేశ్వర కృతమగు నభినయదర్పణమునకు పద్యానువాదము. ఇందలి భాగములకు 'అనుబింబములు' అనిపేరు. ఇందు మూఁడనుబింబములుగలవు. ఇది ఖండోజీరాయనికృతి. ఇతఁడు ఖండోజీరాయఁడు; కౌశికగోత్రుఁడనియు, ఖండోజీరాయని పుత్రుఁడగు, విచిత్రరాయావతంసుని కొమరుఁడనియు, తల్లి భాగాంబయనియు, నాతనివంశమునకు సంబంధించిన విషయము తెలుపఁబడినది. ఇందలి యనువాదమున కొకయుదాహరణము.

కం. ఎనయఁబతాకకవిశయుగ
మునస్వస్తికమొప్ప రెండుభుజములనిడిసే
ర్పుననొకుగాంతుం జూపఁగ
మను హేమంతాభినయము మదగజయానా.

అనుబింబాంత గద్య :— ఇది శ్రీ కమలాంబికా విమలకృపాలబ్ధసాహిత్యకళావతంసస లోహితగోత్ర యాబళార్యపుత్ర దర్భకుల పావన గిరిరాటకవివరానుజ విచిత్రరాయావతంస ప్రణీతంబైన యభినయదర్పణంబను మహాగ్రంథంబున ద్వితీయానుబింబంబు. సంపూర్ణము. తృతీయానుబింబమున గద్యకానరాదు. ఇందు గ్రంథకర్త బిరుదునామముతో వ్యవహరించినాడు.

గ్రంథసంఖ్య 718. ఇదియేకైకప్రతి.

## ఘటికాచల మహాత్మ్యము - కృత్యాది

సుప్రసిద్ధుఁడగు తెనాలిరామకృష్ణకవి రచించిన కృతులలో ఘటికాచలమహాత్మ్య మొక్కటి. ఇది నేఁడు చిత్తూరుమండలమున గల 'షోలింగర్' అను పేరబరగు పుణ్యస్థలము యొక్క మహాత్మ్యము వివరించును. ఇందలి దైవతము నృసింహస్వామి. ఈ మహాత్మ్యమును నీతరువాత కీర్తిశేషులు కొక్కొండ వేంకటరత్నము పంతులుగారును,

[1]లాక్షిణికకవులు శ్రీరావూరి దొరసామిశర్మగారును పద్యకావ్యములు రచించియున్నారు.

రామకృష్ణకవి గ్రంథమును రచించి, తగినకృతిభర్త లభింపక పోవుటచే నెవ్వరికి కృతినీయకుండ యుంచెననియు, నింతలో నాతను గతించుటచేత, నాతనిమనుమడు ఖండోజీరాయనికి నాగ్రంథము తెచ్చి యిచ్చెననియు గ్రంథావతారికలోనున్నది. అందు మనుమని పేరు లేదు. అతడును రామకృష్ణుడే కావచ్చును. ఖండోజీరాయడు తన యాస్థాన కవియగు వేంకటగిరికవికృత్యాద్యపద్యములును వంశావళియు వ్రాయుమని కోరినట్లుగా నీ క్రిందిపద్యములలో చెప్పబడియున్నది.

[2]మ. పదసందర్భవిశుద్ధి, ప్రౌఢతరశబ్దప్రక్రియాబుద్ధి, సా
రదగంభీరచతుర్విధ ప్రథితధారాసిద్ధి, ప్రాపంచసం
పదభిద్యద్గిరిరాజ సోదరత హెచ్చన్ మించుపుంభావశా
రద వీవేగదవన్న వేంకటగిరీంద్రా! సాంద్రమేధానిధీ!

క. విదితప్రబంధములు వే
డ్కఁ దనరఁగ మదంకితముగఁ గావించినను
మొదలఁబవిత్రముచేసితి
సదయాత్మా! విచిత్రరాయ చంద్రదనంసా!

తే. ధరణిఁదొమ్మిదిలిబ్బులు దాచికొన్న
వానికైనను ధనకాంక్ష పోనియట్లు
కృతులుపదివేలుగైకొన్న కీర్తికాముఁ
డైనవానికిఁ జనదు కావ్యాభిలాష.

---

1. మొదటి గ్రంథముద్రితము. ఆంధ్రపత్రికా కార్యాలయమునయున్నది. రెండవది ముద్రితమైనది. గ్రంథకర్తవన్న లభించును. రామకృష్ణకవి ఘటికాచల మహాత్మ్యము 'కళావతీ' పత్రికలో క్రీ శ. 1902 లో ముద్రితము.

2. ఈ పద్యము 'ఉదయాంచత్స్తనగంబు........ పరమార్థబోధఘటనాహేలా పరిష్కారశారద నీరూపము రామకృష్ణకవిచంద్రా సాంద్రకీర్తీశ్వరా!' అను పాండురంగమహాత్మ్య పద్యమునకుఁ బ్రతిబింబము.

ఉ. కావునరామకృష్ణకవి కల్పితకావ్యముకంకుదెచ్చి స
ద్భావముతోడనాకతని పౌత్రుడొసంగె మదంకితంబుగా
నీవిక హారనాయక మణిప్రతిమానముగా మదీయవం
శావళి చెప్పి కూర్పుము యశంబుభృశంబుగ సంఘటిల్లగన్.

గ్రంథావతారిక, వంశావళి వేంకటగిరికృతముగా ముద్రితగ్రంథ మునగలవు. తక్కిన యాశ్వాసాంత పద్యములు సక్రమముగా లేవు. ద్వితీయాశ్వాసాది నొకకందపద్యమును, గ్రంథాంతమున నొకమాలిని వృత్తమును మాత్రమేగలవు. కవిగిరి కవితాశైలి దెలియుటకుపై పద్యములే చాలును.

(బాలకవి సుబ్బన్న)

లీలావతీ శాహరాజీయము

ప్రారంభము :—

సీ. శ్రితజనస్వాంతవారిజమత్తరోలంబ
గురువరస్తవనీయగుణకదంబ
హారహీరపటీరశారదాభ్రనిభాంగ
విమలకృపాపాంగ వృషతురంగ
త్రిపురదానవ మదద్విరదమృగాధీశ
భాసురహాసకైలాసవాస
కరధృతశూలమార్కండేయనుతిజాల
వహ్నిలోచనఫాలవ్యాఘ్రచేల

తే. భుజగకేయూర దుష్కృతాంబుదసమీర
శైలరాట్చాప నూతనశశికలాప
అఖిలలోకేశ కోటిసూర్యప్రకాశ
నీకువందనమొనరింతు నీలకంఠ.

కై వారం॥ శ్రీమన్మహాదేవ సేవాధురీణ, సీమంతినీనూతనపంచబాణకన కనగధైర్య * * *
నిరుపమసుహాదాన దీక్షాధురంధర దీపాంబికాగర్భశుక్తిస్ఫుర న్మౌక్తికాకార, దిక్కీశరకేయూర, చోళభూమండలాఖండల, సుకవిరాజమండల, యేకమహారాజకలశ పారావారపూర్ణిమా సుధాకర, హితపరశ్రీకర, సంగీతసాహిత్య విద్యావిలోల శాహాజీ మహీపాల, పరాకు సరికవులెన్న బాలకవిసుబ్బన్న మేలిమి మీరంగా వర్ణించిన లీలావతీశాహరాజీయను బరు నాటకంబు నటన పటిమవినుపింప వినుపించెదము దత్తావధానుండవై వినవవధ రింపుము.

తుది:— ఇవ్విధంబున రాజవ్వనులు శోభానలుపాడునా సమయంబున భేరీమృదంగఢక్కాహుడుక్కాది వాద్యధ్వనులు నింగిముట్టిచేలం గనుప్పొంగిలీలావతిమంగళంబుపాడుచు నటియించెనెటువలెను.

శాహారాజేంద్రునికి జయమంగళం
సహజాలంకారునికి జయమంగళం
విలసితాకారునికి వీరాధివీరునికి
జలనిధిగంభీరునికి జయమంగళం,

గద్య. ఇవ్విధంబున మన్వంబుమీద వార్తాచమత్కృతి వెలయ సరి కవులెన్న బాలకవి సుబ్బన్న మేలిమిమీర వర్ణించిన లీలావతీ శాహారాజీయంబను నాటకంబున కధిశ్వరుండు. ......

588 (M. 629) 589 రెండు ప్రతులు.

—:శహాజీ సరస్వతీమహలు గ్రంథభాండాగారాభివృద్ధి:—

నేడు శరభోజీపేర వెలయుచున్న సరస్వతీమహలు గ్రంధాలయ మున తెలుఁగు గ్రంథములను విశేషముగ భద్రపఱచిన యశస్సు శహాజీమహారాజుదేనని చెప్పనగును. ఈతఁడనేక లేఖకులనేర్పఱచి,

పెక్కుప్రాచీనగ్రంథములను వ్రాయించెను. ఆతఁడానాఁడు ప్రతులువ్రాయింపనిచో నేఁడీపాటికి కొన్ని యమూల్యగ్రంథములు నామమాత్రావశిష్టములై యుండెడివి. ఆంధ్రసాహిత్య ప్రపంచంబు నుజ్జ్వలింపఁజేయించిన నన్నెచోడ మహాకవి కుమారసంభవ ప్రతి యీమహారాజుకాలమునసే వ్రాయబడినట్లు, చతుర్థాశ్వాసము చివరఁగల "శ్రీశహాజీభూపాల సంతుష్టార్పణమస్తు" అనువాక్యము విశదముచేయుచున్నది. మఱియు తెనుగుభాషయందు పెద్దద్విపదగ్రంథములు రెండిటిలో నొకటి యగుద్విపద భారతమంతయు నీమహారాజునాజ్ఞచే వ్రాయబడినట్లు క్రింది విరాటపర్వాంత ద్విపదలు తెలుపుచున్నది.

"భోసలాన్వయ సుధాంబోధి చంద్రునకు
భాసురకావ్యాను భావహృదయునకు
భవసముత్కట జటాభరణాయమాన
ధవళకీర్తిమనోజ్ఞ, తరగాంగభంగ
గాహనైకపవిత్ర గంధర్వగాన
మోహితామరవధూ ముఖకాంక్షణీయ
మనుజభావునకు రామామనోజునకు
ననఘు సన్నుతికి శాహావనీపతికి
నింబాజి వ్రాయించె నఖిలార్థవితతి
సంగ్రాధియగుచుండునట్టి భారతము
పటుచిత్తుఁడైన కుప్పయమంత్రిచేత"

ఈమహాగ్రంథము పదునెనిమిది పర్వములను, నింబాజీయను నాతఁడు శాహామహారాజు కొఱకు కుప్పయమంత్రిచేత వ్రాయించెను. ఈగ్రంథమంతయు నేఁడీవ్రాతప్రతినిబట్టియే ముద్రితమైనది.

గ్రంథవిలేఖకుల పోషణయందు శహాజీరాజునకు ప్రీతిమెండు. కాబట్టియే యాతని రచనలకు విలేఖకులు పెక్కుప్రతికలను తయారు చేసియున్నారు. తంజావూరి పుస్తకశాలలో గల రెండువందలనాటక

ములలో సగముభాగము అనగా నూఱునాటకములు శాహాజీరాజకృతములగు నిరువదినాటకముల ప్రతికలే! మిగిలిన నూఱింటిలో శహాజీ యాస్థానకవుల కృతులప్రతులు 15 పోగా తక్కిన 85 మాత్రమే నాయకరాజులకు నితరులకు సంబంధించినవని తెలియవలెను.

శహాజీకాలమున నట్టువచక్రవర్తి గట్టునరసింహులు, నాగమహాస్య వేంకటరంగయ్య, ప్రసంగి గజసింహులు, మద్దాలి వల్లభుఁడు మొదలగు లేఖకులు పెక్కురువెలసినట్లుగా నాయాగ్రంథము చివరగల వ్రాతలను బట్టి తెలియుచున్నది.

తంజాపూరి యాంధ్రవాఙ్మయమున నాయకరాజులలో రఘునాథనాయకుఁడెట్టివాఁడో, మహారాష్ట్రరాజులలో శహాజీ యట్టివాఁడు.

## మొదటి శరభోజీ :—(1712-1728)

క్రీ. శ. 1684 - 1712 వఱకు నభినవభోజుఁడని చెప్పఁదగిన శహాజీమహారాజు రాజ్యము పాలించినవెనుక నాతని తమ్ములు మొదటి శరభోజీయును, తులుజాజీ యను నామాంతరముగల తుక్కోజీయును క్రమముగా రాజ్యపాలనముగావించిరి. వారిరువురు శహాజీ మహారాజొనర్చిన కట్టుబాటుల ననుసరించి, శహాజీమహారాజువలె భాషాపోషకులై ప్రఖ్యాతిఁగాంచిరి. వారిలో మొదటి శరభోజీ క్రీ. శ. 1712 మొదలు క్రీ. శ. 1728 వఱకు రాజ్యము పరిపాలించెను. ఈతని కాలమున సంస్కృతభాషాభివృద్ధియే విశేషముగ గానవగును.

మొదటి శరభోజీ దానధర్మశీలుఁడు. భక్తిపరుఁడు. ఈతని ధర్మానికారి బ్రాహ్మణులకు నీ మహారాజుపేర శరభోజీరాజపురమను నగ్రహారమును, మంగుమటమను మఱియొక యగ్రహారమును దానమొసఁగినాఁడు. తన యన్నయగు శహాజీమహారాజు కాలమునుండియు మత్రిగనున్న యానందరాయమఖి తన 'విద్యాపరిణయణ' మను నాటకమును నీ శరభోజీ కాలమునందే రచియించినట్లు విద్యాపరిణయము నందలి యీ క్రింది శ్లోకములవలనఁ దెలియుచున్నది.

'సకల రాజ్యధురంధరస్య శరభమహారాజ మంత్రిశిఖామణేరస్య జనకసనక... ధౌరంధరేయమితిమే మహదాశ్చర్యమ్.

ఆబాల్యాదపి పోషితో౽జని మయా ప్రేమ్ణా తయా లాలితః
తేనాసౌ సరసాము పైతు కవితామానందరాయాధ్వరీ,
ఇత్యేకక్షితిపాలవంశజలధిర్దేవ్యా గిరా జాతయా
ధీర శ్రీశరభావనీంద్రవపుషానూనం ప్రసాదః కృతః.'

ఈ నాటకము తంజాపూరునగల ఆనందవల్లియను దేవత యుత్సవ సందర్భమున నీ మహారాజు సమక్షమునఁ బ్రదర్శింపఁబడెను. దీనింబట్టి యీతని భాషాభిమానము సువ్యక్తమగుచున్నది. ఇంతియగాక యీతఁడు సంస్కృతమున 1 రాఘవచరిత్రమను కావ్యమొకటి రచియించినాఁడు. ఇది పండ్రెండు సర్గలుకలిగి రామాయణకథను సంగ్రహముగ దెలుపుచున్నది. గ్రంథావతారికయందేమి, సర్గాంతగద్యలయందేమి యీ కావ్యము శరభోజీకృతమని స్పష్టముగఁ దెలియుచున్నను ద్వితీయ సర్గాంతమందుగల "ఇది పంచరత్నకవికృతౌ రాఘవచరితే ద్వితీయస్సర్గః" అను గద్యచే నిది పంచరత్నకవి రచియించి యీ మహారాజు పేరు పెట్టియుండునని పాశ్చాత్య విమర్శకులు తలంచుచున్నారు. శరభోజీ యాస్థానమున నరంతనారాయణుఁడన్న కవికి పంచరత్నకవి యను బిరుదముగలదు. ఆతఁడే యీ కృతిని మహారాజు పేరఁ జెప్పియుండునని వారనుకొనినంతమాత్రముచే శరభోజీ యీ గ్రంథము రచియింపలేదని చెప్పుట యసమంజసము. పంచరత్నకవి తోడ్పాటు గ్రంథరచనమున రాజుగారికినుండి యుండవచ్చును. మఱియు పై పంచరత్నకవి గద్య యొక్క ద్వితీయ సర్గాంతమం దుండుటచే నాసర్గ మొకటియే యాతఁడు రచించిచెనేమో యని శంక పొడముచున్నది. అంతమాత్రమున శరభోజీ గ్రంథకర్తృమునకు లోపము చూపట్టదు. గ్రంథమునందలి సర్గాంతగద్య యిది—

1. A Discriptive Catalogue of Sanskrit Manuscripts, Tanjore Palace Library (No. 3723), Pages 2641-2644.

"ఇతి శ్రీమదభిజాత భోసలకులకలశజలధి సంపూర్ణ తుహినదీధితే, రఖిల ధరణీపాల ముకుటతటీ నిబిడిత మణికిరణపటల మంజరీ పింజరిత చరణపంకజస్య సకల కల్యాణగుణ శేవధే రేకమహారాజస్య తనయేతరదుర్లభ గుణమధిక శుభగుణ మణిగణ మహోదధేః సకల భాషాద్భుత సరళసందర్భ గుణగరిమ రసభివ్యంజిత నిజసరస్వతీపురుషావతారభావస్య, శహాజీ మహీవలారే రనుజన్మనా శరభోజీరాజేన... సంగ్రహ రామాయణే రాఘవచరితే మహాకావ్యే ద్వాదశస్సర్గః."

సంస్కృతమున రతిమన్మథనాటకమును రచియించిన జగన్నాథ కవి శరభోజీ యాస్థానకవి. ఈతఁడీ నాటకమునేగాక తనపోషకుని చరిత్రమును నతని పూర్వులచరిత్రమును శరభరాజవిలాసమనుపేర[1] క్రీ. శ. 1722-లో సంస్కృతమున నే రచియించి ప్రఖ్యాతిఁగాంచినాఁడు. పరమానంద కవీంద్రుని శివభారతమను ప్రసిద్ధచారిత్రక గ్రంథము నీ మహారాజులకాలముననే రచియింపఁబడినది. అయ్యది శ్రీ శివాజీ ఛత్రపతి వృత్తాంతమును దెలుపుచున్నది. దానికీ మహారాజుకాలములో నొక తమిళానువాదము గూడ[2] వెలువడెను. శరభోజీమహారాజుకాలమున నాంధ్రభాషాభివృద్ధి విశేషముగ గాలేదు. శహాజీ కాలమునందున్న గిరిరాజకవి శరభోజిపై రచియించిన కొన్ని పదములు, కీర్తనలు గన్పట్టుచున్నవి.[3] పై విషయముల ననుసరించిచూడ, శరభోజీ విద్వత్పోషకత్వముఁ గన యన్నయగు శహాజీమహారాజును నాదర్శప్రాయముగ గొని, యా కీర్తిప్రతిష్ఠలను నిలువబెట్టినవాఁడని తెలియుచున్నది.

1. Descriptive Catalogue of Sanskrit Manuscripts, Tanjore Palace Library (No. 4241), Pages 3291-3293.

2. The Maratha Rajahs of Tanjore, Page 60.

3. Descriptive Catalogue of Telugu Manuscripts, Tanjore Palace Library.

## తులజాజీ లేక తుక్కోజీ :—(1728-1736)

ఈతఁడు శరభోజీ వెనుక క్రీ. శ. 1728-1736 వఱకు తంజాపూరును పాలించెను. ఈతనిని తుక్కోజీయని చరిత్రకారులు వాడెదరు. ఈతఁడు తన యన్న లిద్దఱవలె భాషాపోషకుఁడు. ఈతఁడు సాహిత్యమునందే గాక సంగీతశాస్త్రమును నెఱింగిన ప్రతిభాశాలి. తనరాజ్యమున హిందూస్థానీగానపద్ధతుల నెలకొల్పుటయేగాక 'సంగీతసారామృత' మను నొక గ్రంథముఁగూడ రచియించినాఁడు. అందీతనికిగల శాస్త్రజ్ఞానము విశేషముగఁ దెలియుచున్నది. ఈతఁడు శబ్దశాస్త్రమున పరిశ్రమఁ జేసినవాఁడు. ఈతని కాలమున ప్రఖ్యాతిఁ జెందినవారిద్దఱు సంస్కృతపండితులుండిరి. ఒకఁడు మనమభట్టు. రెండవవాఁడు ఘనశ్యాముఁడు. మనమభట్టు పండితుఁడేగాక సంస్కృతభాషయం దమూల్యములగు గ్రంథములను సేకరించినాఁడు. ఘనశ్యాముఁడు తుక్కోజీప్రధామాత్యుఁడు. రమారమి యిరువదినాలుగు గ్రంథములు రచియించినాఁడు. ఈతనికి సుందరి, కమల యను భార్యలిద్దఱు. వారును సంస్కృతనాటకములకు వ్యాఖ్యానములు వ్రాసినారఁట! ఈతఁడు మానభార్గవ వంశీయుఁడు కాశీమహాదేవుని పుత్రుఁడు. ఉత్తరరామచరిత్రవ్యాఖ్య, దశకుమారచరిత్ర టిప్పణము, నీలకంఠవిజయవ్యాఖ్య, అన్యాపదేశశతకము, రామాయణచంపువు యుద్ధకాండము తద్వ్యాఖ్యానము, ప్రబోధచంద్రోదయ వ్యాఖ్యానము మున్నగు గ్రంథము లెన్నియో నీతనివిగాఁ నునివి పరిశోధకుల కెఱుకపడి యున్నవి.[1]

తులజాజీ తెలుఁగున 'శివకామసుందరీ పరిణయము' అను నాటకము రచియించినవాఁడు. ఈతనికవనశైలి రసికజనహృదయంగమముగ నుండు ననుటకు శివకామసుందరీ పరిణయమునుండి యీక్రింది పద్యము లుదాహరించుచున్నాఁడను:—

1. Journal of Oriental Research Madras Part III Volume II. పై సంచికయందు ఘనశ్యామ పండితునిగూర్చి ఘనమగు వ్యాసముగలదు.

కం. విలసిత కిసలయ సమసుమ
ఫలపరిమళ శోభితములు, భానజచాపో
జ్జ్వలగుణ శుకపికముఖరవ
మలయానిల భాసురములు మధువాసరముల్.

చ॥ సురుచిర పుణ్యశీలురసఖాయులు సర్వవిదుల్...దయా
పరులు కృతజ్ఞులుత్తములుపావనులీ సభవారు మెచ్చభా
సురతుళజ క్షితీశకృత..........శివకామసుందరీ
పరిణయరూప నాటకముబాగుగనాడుద మీసభాస్థలిన్.

---

గ్రంథమంతయు సంపూర్ణముగ తంజావూరు భాండాగారమునం
గలదు.

రెండవ యేకోజీ:—(1737)

తుక్కోజీ వెనుక నాతని తనయుండు రెండవ ఏకోజీయొక సంవత్స
రముమాత్రమే పాలించినను నాతండు, తనతండ్రి పెదతండ్రులవలె సం
స్కృతాంధ్రభాషాపోషకుండై కృతికర్తయగుట ప్రశంసనీయము. ఈత
నికి 'బానాసాహే'బని నామాంతరము. ఈతండు తెలుంగున ద్విపదలలో
రామాయణమును రచియించినవాండు. చరిత్రకారులేగాక గ్రంథవిమ
ర్శకులుగూడ నీరామాయణమును క్రీ. శ. 1676-1683 వఱకుం దంజా
పురరాజ్యమును బరిపాలించిన మొదటి యేకోజీ రచియించెనని భ్రమ
పడిరి; కాని నేను మొదటి యేకోజీనిగూర్చి వ్రాయునపుడు డిందలిగద్య
నుదాహరించి, యది రెండవయేకోజీ రచితమని నిరూపించితిని. ఆవిష
యము నిశ్చితమగుటకును, నీతనశైలి గమనించుటకును నీక్రింది యవతా
రికా భాగమును పొందుపరచుచున్నాండను. ఇందారుకాండలు సమగ్ర
ముగ గలవు.

"శ్రీగణనాథు నాశ్రితపారిజాతు
బాగుగనుతియించి వాక్కెపుడు
శ్రీశారదాదేవి చిత్తాంబుజమున
భాసిల్ల ప్రార్థించి భక్తి మీరఁగను
వాసవప్రముఖ గీర్వాణవందితుని
భోసలాన్వయరాజ పూజితపదుని
ఫాలనేత్రుని భక్తపాలుని చంద్ర
మౌళీశ్వరుని దయామానసుఁ దలఁచి
ధరణి రామాయణం బాద్యాసనసంచా
వరకోకిలంబైన వాల్మీకి దలచి
వ్యాసశుకాదుల వర్ణించి కాళి
దాసాది కవులకుఁ దగఁ గేలుమోడ్చి
కులదైవతమ్ములఁ గొనియాడమని
పాలుపొందు సత్కృతి బుధులసమ్మతిని
భోసలకలశాబ్ధి పూర్ణచంద్రుండు
భాసురమాలోజి పార్థివసుతుండు
సాహసాంకుఁడను నిస్తుల సద్యశుండు
శాహభూపాలుండు చతురమానసుండు
అతని తనూజుఁడే కాపనీపాలుఁ
డతని బాలకుఁడు శాహజీక్షితిపాలుఁ
డతనిసోదరుఁడు మహాకీర్తిశాలి
చతురుఁడౌ శరభరాజన్యదేవేంద్రుఁ
డారాజసోదరుం డతులవిక్రముఁడు
ధీరుఁడు నయశాలి గీసాంద్రపోషకుఁడు
చోళభూపాలుండు సుగుణాకరుండు
పాలితసుజనుండు పరమపావనుఁడు
పనుపడి తుళజభూపాలుఁడా రాజ

తనయుండునౌ నేకధరణిపాలకుఁడు
యతులప్రాసంబుల నర్థసంగతుల
ప్రతిలేని నవరసభావముల్ దనర
నిరుపమాలంకార నియమముల్ దనర
సరుదుగా వాల్మీకి యల రామకథను
రచియించినట్లు సారముగాఁగ ద్విపద
రచియింపఁ దత్కథాక్రమ మెట్టిదనిన
ఘన తపస్స్వాధ్యాయ కలితమానసుని
మునినారదునిఁజూచి ముదమునఁ బలికె.''

పై యుద్ధృతాంశమునను సరించి రెండవ యేకోజీయే గ్రంథకర్త యని నిశ్చయముగఁ జెప్పనొప్పును.

ఏకోజిరామాయణమునుండి యీ క్రింది భాగముద్ధృతము :

''ఓరిరాక్షసులార! యుర్విపై నేను
శూరతవిలసిల్లు సుగ్రీవుబంట
శ్రీరాముదూతను క్షితినివాయుజుఁడను
శ్రీరాము సేమంబు సీతకో జెప్పి
పోవుచున్నాఁడని పురిరాక్షసులకు
వావిరిమ్మత్యులై వచ్చియున్నాఁడ
ననిబల్కి దైత్యుల నందఱఁగూల్చి
దనరుచుతోరణ స్తంభంబునుండె
హంత శేషముఖమున నావార్త దెలిసి
ధృతిబూనికోపించి దేవతారాతి
గురునొనిపింగళాక్షుని దీర్ఘజిహ్వు
వరవక్రనాసాశ్మ వక్షశార్దూల
ముఖులనేపురబంప మొనసివారప్పు
డఖిలాస్త్రములనొప్ప హనుమంతుఁడలిగి
ధనువులు నిశితని కేతనములుకూల్చి
పనువడిరథముల భగ్నంబు జేసి.''

ఈతని రెండవగ్రంథము 'విఘ్నేశ్వర కల్యాణ' మను నాటకము. ఇది శాహాజీ మహారాజు రచియించిన విఘ్నేశ్వరకల్యాణ నాటకము ననుసరించి వ్రాయబడినది, సంస్కృతాంధ్రభాషామయము. ముందు చూర్ణికయందు రామాయణమునంతయు వర్ణించినట్లే తన వంశక్రమమును నేకోజీ వర్ణించినాడు. గ్రంథనామ మిందలి యితివృత్తమును దెల్పు చున్నది. ఈతని తల్లి పేరు రాజహంసాంబికయని యీగ్రంథమువలన దెలియుచున్నది. ఇందు సంస్కృతాంధ్ర గద్యలు రెండుగలవు.

తెలుగు

ద్వి. రాజేంద్రశరభోజ రాజనందనుండు
రాజహంసాంబికా రమ్యసుతుండు
శ్రీకరగుణముల చెలువొందునట్టి
యేకేంద్రవిరచిత మీచరిత్రంబు
ఎలమితో తుళజేంద్ర యేకేంద్రునికిని
బలములు సంతానభాగ్యసంపదలు
ప్రణవస్వరూపుడు భక్తపాలకుడు
గణనాయకుండిచ్చు గణనమీరగను.

సంస్కృతము

ఇతి శ్రీమద్భోసలకుల కలశాంబోధి సుధాకర, తుళజమహారాజ తనూజ ఏకమహారాజ ప్రణీతం విఘ్నేశ్వర పరిణయమునాటకం సాంబశివప్రీతియే విఘ్నేశ్వర ప్రీతియే.....స్తు దే సకలశ్రేయసేఽస్తు.

ఈతనిపేర నీతిపదములు అనుశీర్షికతో కొన్నిపదములు తంజావూరి పుస్తకశాలలో సంఖ్య 40–42 లో గలవు.

రెండవ యేకోజీవెనుక నాతని భార్య సుజనాబాయి 1737–1738 వఱకును నావెనుక 1738–1739 వఱకు షాహుజీ యను నాతడును తంజావూరు రాజ్యమును బరిపాలించిరి. వీరసమర్థులగుటచేతను, రాజ్యము

నందరాజక మేర్పడుటచేతను నీకాలమున భాషాభివృద్ధిగాలేదు. వీరితరువాత రాజ్యమున కధిపతియైనవాఁడు ప్రతాపసింహుఁడు.

## జయసింహుఁడు-నెల్లూరి శివరామకవి. క్రీ. శ. 1740

ప్రతాపసింహుని యగ్రజులలో రెండవవాఁడు జయసింహుఁడు. ఈతఁడును కవిపండితపోషకుఁడు. నెల్లూరి శివరామకవి యీతనియాస్థానమున నుండెను. శివరామకవి 'కామకళానిధి' యను కామశాస్త్రవిషయిక గ్రంథమురచించి జయసింహుని కంకితమొనర్చెను. అందులో నవతారికాభాగమంతయు తంజావూరి మహారాష్ట్రరాజుల వంశావళికి సంబంధించినది.[1] ముందు నేనుదాహరించిన వంశవృక్షము నీగ్రంథమందలిదే.

జయసింహుఁడు తన్నుపిలిపించి యీవిధముగాఁ బలికినట్లు కామకళానిధిలో శివరామకవి వ్రాసియున్నాఁడు.

చ. హితుఁడవు పాకనాటనుతికెక్కిన నెల్లురివంశజాతుఁడీ
వతులితసాహితీపటిమ యాదవరాఘవపాండవీయమన్
కృతిగలవీరరాఘవకవీంద్రసుతుండవు కొద్దివాడవే
తతమతి సంస్కృతాంధ్రకవితా నిరతా శివరామసత్కవీ.

శివరామకవి తండ్రి వీరరాఘవకవి యాదవరాఘవపాండవీయమను త్ర్యర్థికావ్యమును రచియించిన మహాకవి. ఈతఁడీనడుమనే కవులచరిత్రకెక్కినవాఁడు. వసుంధరాపరిణయమను నీతని కృత్యంతరము ముద్రితమైనది. సంస్కృతమున నీతఁడు వ్రాసినది విశేషణరామాయణము తంజావూరిపుస్తకశాలలోనున్నది. అదియముద్రితము. శివరామకవి గురువీనడుమ సూచించిన, యాంధ్రపాణిని శేషాచలకవి.

---

1 తంజావూరి మహారాష్ట్రరాజుల చరిత్రకు మిక్కిలి యుపకరించు నీగ్రంథము తొలుత క్రీ. శ. 1931 లో నవతారికభాగము లేకుండ 'శృంగారగ్రంథమాల' వారిచే ప్రకటితమైనది, ఈగ్రంథము తాళపత్రప్రతిగాని వ్రాతప్రతిగాని తంజావూరి పుస్తకశాలలో లేదు. మదరాసు ప్రభుత్వప్రాచ్యలిఖిత పుస్తకశాలలో R 420 సంఖ్యగానున్నది- అవతారిక ప్రత్యేకముగ ముద్రణమునందు నున్నది.

కామకళానిధి నాలుగాశ్వాసముల గ్రంథము. సంస్కృతమున కొక్కోకకవి రతిరహస్యము ననుసరించినది. గద్య: "ఇది శ్రీగురుచరణారవింద మిళిందాయమానమానస, నెల్లూరి వీరరాఘవామాత్య తనూభవ సూరమాంబాకుమార సంస్కృతాంధ్ర సాహిత్యసార్వభౌమ శివరామనామ ప్రణీతంబైన కామకళానిధి యను కామశాస్త్రంబునం జతుర్థాశ్వాసము.

శివరామకవి రామగీతలను తెనిగించి, మట్ల కృష్ణభూపాలుని యాజ్ఞానుసార మాగ్రంథమును రామకృష్ణపురధామమ్మైన రామున కంకితముగావించెను.

సీ. శ్రీమట్లకులవార్ధి శీతమయూఖుండు
జనకులగోత్ర విస్తారకుండు
నలకృష్ణవిభునకు నాసర్వమాంబకుఁ
బౌత్రుండు సద్గురు......
వేంకటకృష్ణభూవిభునకు వేంగమాం
బకుఁదనూభవుఁడువై భవనదాజుఁ
డగు కృష్ణభూపాలుఁ డాత్మనామాంకిత
పురవాసియైన రామునకునంకి

గీ. తమ్ముఁగాగ......తత్త్వబుద్ధి......
నక్షరసువర్ణమయపంక్తి నర్చచేసి
యీమహాకృతి సభలలో నెన్నికగని
జగతినాచంద్ర తారార్కముగఁ జెలంగు.

ఈగ్రంథము ముద్రితమైనది. చూడుడు ఆంధ్ర వాఙ్మయ సూచిక పుట 167.

—: ముద్దుపళని-రాధికా సాంత్వనము :—

దక్షిణదేశాంధ్ర వాఙ్మయములో విజయవిలాసము వెనుక [illegible]పుల ప్రచారముగలది రాధికాసాంత్వనము. యువకలోకము నుఱ్ఱూతలూగిం

చుచు విద్వద్రసికుల నతివేలముగ నాకర్షించిన యీశృంగారకృతి ముద్దుపళనిరచనము. ఆంధ్రకవయిత్రులలో నీమెకొక విశిష్టస్థానముగలదు.

ఇళాదేవీయమను నామాంతరముగల రాధికాసాంత్వనము రచియించిన ముద్దుపళని వేశ్యాంగన తంజావూరి మహారాష్ట్రరాజగు ప్రతాపసింహేంద్రుని కాలమున వెలసినది. తనవంశక్రమమును విద్యావిశేషము నిట్లు తనగ్రంథమున తెలుపుకొన్నది.




1, 2 వీరిరువురిని తంజానాయకి యనునామె దత్తుగాగొనెను. ముద్దుతంజనాయకి కుమార్తెయగు రామామణినిగూర్చి యిట్లున్నది.

ఈరామామణి సౌందర్యవతి యగుటయేగాక భగవద్భక్తురాలై యగ్రహారాది దానధర్మప్రవణశీలయై ప్రసిద్ధికెక్కినది.

సీ. ఏరామ గట్టించి యిడెనగ్రహారంబు
  వుడమిరామాంబాఖ్య పురమనంగ
సమరనేథన్యదివ్యాలయం బొనరించి
  తిరముగాఁగ శివప్రతిష్ఠ జేసె
నెంచి యేపుణ్య పెట్టించె నందనవని
  కొఱలేనివిరుత్తి కొమరుమిగుల
నేమాన్యజీవనం బెసఁగఁ దటాకంబు
  ఘటియించె నేతుమార్గంబునందు

గీ. మేటిమొవ్వాతె గండరకోటలోన
మఱియునిత్యాన్నదానాది మహిమలంది
పార్వతీశుల నిత్యోత్సవములోనర్చ
నట్టిరామామణి వధూటి నలవెహాగద.

ముత్యాలుపోటిబోటిని పెండ్లియై సంతానవంతుఁడయ్యెను.




పై సంతానములో తొలిచూలు, వంశమునకెల్ల తులలేపికీర్తి తెచ్చినది ముద్దుపళని.

ముద్దుపళనిపేరు దేవక్షేత్రముపేరు. దక్షిణదేశములో వేలాయుధుని పూజాక్షేత్రము పళని. "చాలచోట్ల బిడ్డలకు దేవస్థలముల పేరులే ఉంచుచుండుట వాడుక ఉన్నది." అను శ్రీమతి బెంగుళూరి నాగరత్నా నార్శిరోమణి మాట ననుసరించి పేరుసమంజసముగానేయున్నది. ఈమెగ్రంథావతారికలో తన్నుగూర్చి చెప్పుకొన్నవిషయములన్నియు నతిశయోక్తులుకాక యన్వర్థములై యలరారుచున్నవి.

సౌందర్యము. సీ. చెన్నుందురంభ గాకున్నచోను ప్రతాప
సింహేంద్రు పెంపును జెందనేల ?
ఆకారము. ప్రతిలేనియలకల్పలలితక గాకున్నచో
లలిముద్దులక్ష్మితో వెలయనేల ?
శరీరకాంతి. తగుదివ్యపుగుణరత్నంబు గాకున్నచో
ముత్యాలలోనుండి పొదలనేల ?
సౌరభము. యిలసుగంధప్రద మిదియ కాకున్నచో
శ్రీనివాసప్రాప్తిఁ జెలఁగనేల?

కళాప్రౌఢ. గీ. నీకుఁగలచంద్రరేఖయె కాకయున్న
లలితసకల కళాప్రౌఢి వెలయనేల
యనిపొగడమేటివైయె మీాజెనతనుఘోటి
భవ్యవాగ్ఘాటి శ్రీముద్దుపళనిబోటి.

రామభక్తి. సీ. ఏనాటియీారీతి నెంతోభక్తిచెలంగ
వ్రాయించెజయధాటి రామకోటి
విద్వత్సమ్మాననము. ఏనారి యీాదారి నెలమివిద్వచ్ఛ్రేణి
దనియించె నెఱమెచ్చిధనములిచ్చి
కృతిభర్తృత్వము ఏకలికీనీపోలిక నిలకీర్తికెక్కెఁ
గబ్బముల్ చేసఁది ఘనతఁజెంది
ఘనత. ఏబాలనీలీల నిటుఁబరాబరులచే
బాగడొందెగడిదేటి పొలుపుమీాటి

వైష్ణవప్రపత్తి. గీ. తలపనేధీరనేమేర తాతయార్య
పాదములవ్రాలెమదినెంచి ప్రస్తుతించి
కలరెనీపాటి ముత్యాలుకన్నమేటి
ప్రబలగుణపేటి శ్రీముద్దుపళనిబోటి.

కవనశక్తి. సీ. ఘటియింపనేర్తువు కవనచాతురులెఱింగి
పలుకులకలికి వెల్వెలనఁగాఁజ
దాతృత్వము. నీయఁగానేరుతువిలఁగోరినవరాలు
నగరాజు సుకుమారి నగముగాఁగ
సతీధర్మము. చెల్లింపనేర్తువు చెప్పినరీతిగా
గనిద్రౌపదీసతి కానకేగ
నాట్యకౌశలము. నటియింపనేర్తువు నవరసంబులునంటి
తగఁరంభ యనివిషత్వమువహింప

సరసత్వము. గీ. నీదెమనయుక్తిపరికింపనీదెశక్తి
నీదెనెఱపద్దునరయఁగా నీదెముద్దు
సరసముగఁజేరి రాధికాసాంత్వనమ్ము
భక్తిహారికిమ్ము శ్రీముద్దుపళనిబోటి.

ముద్దుపళని కృతినందిన కృతులునేక కానరావు. ఆమె నోటిరచనములు కూడ కానరావు. కాని స్త్రీలలో, కవయిత్రులు కృతికర్తలుగలరుగాని, ముద్దుపళనివలె కృతిభర్తలెవ్వరును వేరు. కావున నీవిషయమున నీమె ప్రత్యేకవిశిష్టత యెన్నదగినది.

ఈమె చిన్నికృష్ణుని శృంగారభక్తురాలు. ఇంకను నీమెవిద్యానైదుష్యము క్రింది యాశ్వాసాంతగద్యనుండి గ్రహించవచ్చును.

"ఇది శ్రీచిన్నికృష్ణకరుణాకటాక్షవీక్షణాక్షణప్రవర్ధమానానూనశృంగార రసప్రధాన సంగీతసాహిత్య భరతశాస్త్రాదివిద్యాపారంగత శ్రీమత్తిరుమల రాతయాచార్య పాదారవింద మిళిందాయమానమానస, చోళసింహాసనాధ్యక్ష ప్రతాపసింహ మహారాజ బహుకృతానేకచామీకరాంబరాభరణ, ముత్యాలుగర్భశుక్తి ముక్తాయమాన ముద్దుపళని ప్రణీతంబైన రాధికాసాంత్వనంబను శృంగారప్రబంధంబునందు ప్రథమాశ్వాసము.

ఇందు ప్రథమాశ్వాసమున 154, ద్వితీయాశ్వాసమున 147, తృతీయాశ్వాసమున 171, చతుర్థాశ్వాసమున 113, మొత్తముమీద 585 గద్యపద్యములు గలవు. షష్ఠ్యంతములు ఆశ్వాసాద్యంతములు, మొదలగు వానియందుతప్ప, తక్కిన గ్రంథమునందంతట, తెలుగుపలుకుల మెలకువలు, జాతీయములు నిండారియున్నవి. ఈనాలుగాశ్వాసములలోను కథాంశములు స్వల్పమే.

శ్రీకృష్ణుని యశోదానందులు గారాబముతో వ్రేపల్లెలో పెంచుకొనుచుండిరి. నందుని చెల్లెలు రాధ శ్రీకృష్ణునికి గానవనము వచ్చిన నాటనుండి, యాతనిమోహించి, తనవశముచేసికొని, తుదకు ప్రాణపదమైనది. యశోదతోబుట్టువు కుంభకుడు. అతనికూతురు యిళ. మొదటినుండి యిళ మేనత్తవద్ద వ్రేపల్లెలో రాధ పోషణలో పెరిగినది పెద్దమనిషియైనది. ఇళను శ్రీకృష్ణునికిచ్చి వివాహముచేసినారు. ఇళవయసులో చిన్నదియైనను, తెలివితేటలలో మిన్నగావున శ్రీకృష్ణునియను రక్తునిగావించుకొన్నది.

కొన్నాళ్లకు కృష్ణుడు అత్తవారింటికి నీళాదేవితో మిథిలకు వెళ్లినాడు. అప్పటినుండి రాధ కృష్ణువిరహవేదన భరింపలేక సవతి మత్సరముపూని యొకచిలుకను మిథిలకు రాయబారమంపినది. చిలుక యిళామాధవుల సంగతిచూచి, వచ్చి రాధకుచెప్పసరి కామెచాల తూలిపోయినది.

ఇంతలో కృష్ణుడు రాధనుచూచుటకు తహతహలాడి వ్రేపల్లెకు వచ్చినాడు. రాధ 'ఉక్రోషముతో' మండిపడి శ్రీకృష్ణుని యెన్నోవిధములుగా మాటలనినది. పదములంటిన తన్నినది. చివఱకు నేడ్చినది. శ్రీకృష్ణుం డామెనూరార్చి, సాంత్వనవచనములు పలుకగానే కృష్ణుని కౌగిలిలో నైక్యభావన యందినది. రాధసంబంధమైన సాంత్వనము ప్రధానముగాన నీకృతికి రాధికాసాంత్వనము అని పేరువచ్చినది.

ఇది ప్రధానముగా శృంగారకావ్యము. అందును దాక్షిణాత్య శృంగారకావ్యములకు సంబంధించినది. కావున నిందు బాహ్యాభ్యంతర రసురతవర్ణనము గోప్యాంగవర్ణనము విశృంఖలముగా చేయబడినవి. ఇట్టివి యానాటికావ్యములలో సర్వసాధారణములే. మఱియు నీ గ్రంథములో చాలాభాగము. సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు రచించిన రాధికాసాంత్వనమునుండి గ్రహింపబడినదని వేంకటకృష్ణప్ప నాయని చరిత్రయందు వెనుక వివరించియున్నాను. గ్రంథవిస్తరభీతి నిచట ముందు చూపలేను. ఇందలి శృంగారమత్యుత్కటమై, యీ తరువాత యాంగ్లేయప్రభుత్వమువారి నిషేధమునకు పాత్రమైన గ్రంథములలో ప్రథమముగానిలిచినది. అయినను, ఆనాటి శృంగారాభిరుచులనుబట్టిచూచిన యంతవిపరీతముగ గన్పట్టకపోవచ్చును.

ముద్దుపళని వేశ్యయేయైనను విద్వత్కవయిత్రి. పడుపుబోటియే యైనను భగవత్ భాగవత కైంకర్యపరురాలు. సానియేయైనను సంగీత సాహిత్య విద్యావిశారద. వెలయాలేయైనను విద్వత్సమ్మానిత. ఇన్ని విశిష్టగుణములీమెయందుటచేతనే, యీకావ్యము ప్రజాదరణకు పాత్రమైనది.

ఈమె శృంగారపాండిత్యము 'అనవిల్తుశాస్త్రంపు మినుకులా నర్తించుచువని వెన్నతోడబెట్టినది' అను వాక్యమునకు స్మారకము.

అపాండిత్యమైన శుశ్రూషచేసి నేర్చినట్లుగా :—

"గణనసేయదొమరు సాముగమనములకుఁ
దానునాచేతఁబడిన బెత్తంపుఁబెట్లు." (3-7)

అను పాదమువలన తెలియుచున్నది.

ఈ గ్రంథములో రాధికాపాత్రలో ముద్దుపళని యంతర్భావముఁ జెందినది. తనప్రభునగు తంజావూరిరాజు ప్రతాపసింహుఁడే శ్రీకృష్ణుఁడు. తాను ముద్దుపళనిపేరున వెలసినరాధ. ఆమె శృంగారానుభవములను నీ గ్రంథరూపమున వ్యక్తమొనర్చినట్లుగా నిందలిశృంగార సన్నివేశములయందలి మెలకువలుపట్టి యిచ్చుచున్నవి. "దక్షిణనాయికాధ్యక్షుడైన గోపాలదేవుఁడు" అని యవతారికలో నీమెచెప్పుటయే పై విషయమును స్పష్టపఱచుచున్నది. ఇళాపరముగా దక్షిణనాయకుడు శ్రీకృష్ణుడు. ముద్దుపళనిపరముగా దక్షిణసింహాసనాధ్యక్షుడగు తంజావూరి మహారాష్ట్రరాజు ప్రతాపసింహుఁడు.

ముద్దుపళనిరచన జాతీయములతో నానుడులతో ముద్దులుగులుకుచుండును. "చల్లకైవచ్చి ముంతదాచంగనేల (2-126). నిన్నఁగుప్పయు నేడాళ్లు (3-7). పిచ్చుకమీదిరి కాట్లాడవచ్చినట్ల (3-8). తాను పెంచిన పొట్టేలుతనమచే సన్నఁబడుట (3-9). వేలువాచిన రోలంత విరివియైన రోలువాచినది యెంతబొలు (3-10). కుట్టతేలుకుట్టకున్నఁ గుమ్మరబూచి (3-12). ఎంతమానువచ్చి యెంతఖానునుద్రుంగె (3-13). వెన్నకుపండ్లు వచ్చువితము (3-16). అర్ధరాత్రి గొడుగు తెమ్మన్నకత (3-18). కొన్నంగడిలోవలనే మారుబేరము (3-22). కుమ్మరికి చూడనొకయేడు గుదియకొక్కపెట్టు (3-24). అత్తనెత్తి చేతులంగడిలోఁగన్నులు (3-28). ఇట్లొకయాళ్వాసమునందే యివి కుప్పతిప్పలుగనున్నవి.

ఈ గ్రంథమున ముక్కుతిమ్మన పారిజాతాపహరణము, రామరాజభూషణుని వసుచరిత్ర పోకడలు గలవు.

చ. అనవిని వ్రేటుబడ్డ యురగాంగనయుంబలె. 1-82. పారిజాతాపహరణము.

అనఁగుబుసంబునూడ్చిన మహాభుజగాంగనగా. 4-68. రాధికా.

శా. మాయాశీలురు చంచలాత్ములనుకంపాశూన్యులాత్మీయకా
ర్యాయత్తుల్ హృదయానుకూలసమయ వ్యాపారగోపాయనో
పాయజ్ఞుల్ మగవారలాపయిని భూపాలుర్ మహావైభవ
శ్రీయోగాంధులు చెప్పనేల మగవారిన్నమ్మగావచ్చునే?
వసుచరిత్ర 3.

చ. కపటులుక్రూరచిత్తులు స్వకార్యపరుల్ కరుణావివర్జితుల్
చపలులసత్యభాషణు లిలన్మగవారలు ........

చ. నిలుకడసున్న, తాల్మినహి, నేస్తముదబ్బర, మాటపద్దులే
వలపుహుళక్కి యానలుసివాపులు పైపయిమేల్మినీదు నీ
తులు మెఱమెచ్చులాదరణదూఱుదయల్ సటనమ్మవచ్చునే
యిలమగవారిఁ దన్మహిమలెన్నగ శక్యమెయందులన్ హరీ!
రాధికా (4-70-71)

ఇట్టివియున్నను, భాషాశుద్ధి పదములపొందిక, గలిగి, తెలుగుదనముగల రచన యిందుచాలఁగలదు.

"ఉ. మాటలుముద్దుపల్కులును, ముక్కవకెక్కులు మ్రొక్కుసొక్కులున్
గాటపుఁగౌగిలింతలువగల్ గిలిగింతలుమీటు వింతలున్
మాటిమాటికిం గలియుమాలిమి మేలిమిఁజూచినట్టియే
యాటది వానివీడునకటా! కడురక్కసినన్నుఁదక్కఁగన్! 2-59

అనునది పై రచన కొకమచ్చుతునక, గ్రంథమంతయు నిట్లె సాగినది.

ప్రకృతపద్యమున నభివ్యక్తముకాఁదగిన యభిప్రాయమును గీతి లోని చివర రెండుపాదములును బైటపెట్టినవి. అందువలన వ్యంజన లోని చమత్కారమూలములగు గూఢత చెడిపోయినది. కావున యుధ్వనికాదు.

కావకధ్వని - పుట 275.

3. వె. సొమ్ములియ్యవచ్చు సొమ్ములందమియవచ్చు
నియ్యరాని ప్రాణమియ్యవచ్చు
తనదువిభుని వేడి తరుణిచేతికిచ్చి
కాళవశమెట్టి దానికైన. (1-116)

సీ. ఏటుకాళనున్నదో యీకొమ్మకెమ్మోవి
కైటభారాతి పల్గాటులకును
ఎటులోర్వనున్నవో యీకన్నెచన్నులు
గోపసింహునిగోటి కుమ్ములకును
ఎటులాగనున్నదో యీయింతినునుమేను
దంతిమర్దను కౌగిలింతలకును
ఎటులాగనున్నవో యీతన్వి వేదోడల్
చాణూరహరుమూరు పాదనలకు

అంచునను గేలియొనరించు మించుబోండ్ల
గాంచితలవంచిసిగ్గుచే కలకఁబాఱు
వాఁజాసనవీనుల వద్దజేరి
బుద్ధిగానిట్టులనురాధ బుజ్జగించి. (1-107)

ఇందు ప్రాసాభాసోపస్కృతమును, శృంగారాంగమునగు హాస్య నర్మవ్యంగ్యము. ప్రథమచరణమున కెమ్మోవి యుపమవ్యంగ్యము ద్వితీయ చరణమున గోపసింహుఁడు అను విశేషణమువలన వ్యంగ్యము తృతీయచరణమున 'దంతి' మర్దనుఁడు అను విశేషణమువలనస్ఫూర్తి వ్యం

గ్యము. చతుర్థచరణమున మల్లలోకైక శ్రేష్ఠునితో శ్రీకృష్ణునికి సామ్యము నట్టిదే........ఇట్టి వ్యంగ్యములగు నుపములును దద న్వీలితమగు శ్రీకృష్ణుని యభిలాషయు, ప్రముఖవ్యంగ్యములు పరికరా లంకృతమును, శ్లేషాభాసోపస్కృతమును నగు హాస్యమునకంగములై దాని నధికరసాస్వాదనీయ మొనర్చును. (వివరములకు 275-277 పుటలు చూడుడు)

ఇట్లే "చెలిమినిచిన్ననాఁడె"(4-55) అనుపద్యమును "వారిమో ముఁజూచి నేనేలబేలనైతి" అనుపద్యమును ద్వితీయోద్దేశమునకుదా హృతములైనవి, దీనినిబట్టియే రాధికాసాంత్వనము శృంగార కావ్యముల యందెట్టి విశిష్టత గలదో యెఱుఁగవచ్చును.

ముద్దుపళని పాశురములు-సప్తపదులు.

ద్రావిడభాషలో గోదాదేవి (ఆండాళ్) రచించిన తిరుప్పావై అనే ముప్పది పాశురములకు సప్తపదులు గేయరూపమైన తెనుగుసేత. తెలుగులో 14 చరణముల పాటగానున్నది. ఆముప్పదింటిలో పది మాత్రమే ముద్దుపళని కృతములుగా దొరికినట్లు, శృంగార కావ్యగ్రంథ మండలివారు తాము 1936 లో ప్రకటించిన రాధికాసాంత్వనములో ననుబంధముగా కీ. శే. వెంపటి నాగభూషణముగారి పీఠికతో ప్రకటించిరి. అంతకుముందే కీ. శే. ప్రభాకరశాస్త్రులవారు 1925లో తక్కినవానిని పూరించి సప్తపదులను పూర్తిగ 'స్వధర్మప్రకాశిని' లో ప్రకటించి ప్రత్యేక గ్రంథరూపమున వెలువఱిచిరి. కాని ముద్దుపళని గ్రంథకర్తృత్వమును గూర్చి సందియముగలిగి ప్రసిద్ధవిద్వాంసులగు శ్రీబులుసు వేంకటరమణయ్యగారు, మూలప్రతులను పరిశీలించగానందు మొదటి చరణములోనే.

"శ్రీనివాసగురుని విష్ణుచిత్తుకూర్మి యుద్దపట్టి
పూనిచేయు ద్రవిడ పాటలోనిభావమూ
చెలగి తెలియఁగ నా నాఁడు జిహ్వకొనను నిలచియుటుల

పలికెతిరుప్పావు సప్తపదిపదంబుగా... అనియు
చివర. వావిరిలగనిటుల శ్రీనివాసదేశికుంకు తిరు
ప్పావు భావమెల్ల సప్తపదులు కూర్చిరి."

అని యుండుట కనిపెట్టిరి. ఈ గ్రంథము సుపుర సంస్థానవిద్వాంసులగు శ్రీనివాసదేశికులను మహాపండిత కవులు రచియించినదని వారే గ్రహించి యది ముద్రితముగుట నెఱింగి దాని తెప్పించి, గ్రంథకర్తృత్వము ప్రామాణికముగ ముద్దుపళనిది కాదని నిశ్చయించిరి. పూర్వపారము ముద్రణములలో "శ్రీనివాసగురునిందలంచి చిత్తమునను

పూః చేయు ముద్దుపళని ద్రవిడ పాటలోః భావము" అని మాటుటచే వచ్చిన యీ యనర్థకపారమును శ్రీవేంకటరమణయ్యగారు బహిష్కరించి, నిజస్థితిని 'సప్తపదులు' అనువ్యాసమున భారతి (సం. 15. సం 3 మార్చి 1938) లో నిర్వివాదముగా నిరూపించినారు. (పుటలు 236-241)

అయిన నేటివఱకు వాఙ్మయచరిత్రకారు లీపాఠకములను ముద్దుపళని కృతిగా వ్యవహరించుట శోచనీయము.

రాధికాసాంత్వనము - ముద్రితాముద్రితప్రతుల వివరము

కాగితపు ప్రతి సంఖ్య 707.

సంఖ్య 708. Note by C. P. Brown

The Radhika santwanam

or

The melting soul of Radhika (or Ila)
Adopted daughter of Radha
Favourite misterss of Crishna

An amatory Poem written by Palani, a dancing girl mistress to the Raja of (Tanjore) named Vira Batapa simha.

This poem is excessively rare. I at last obtained three manuscripts all imperfect but luckily deficient in different places and from third Venkatanarasu under my directions and formed this Complete edition.

It does not seem probable that the lady herself composed the whole poem; part of which display much learning. Her name and the other names she introduces as relations appear to be maharatta utterly different from telugu appellations. Her tutor Vijayaraghawachari probably assisted her; but her composition in other parts evince a female hand, and it may be observed that she uses only the changing meters those being the easiest to compose in. She also uses the easiest and loosest rhymes such as అఖండయతి and నబ యోరభేద యతి etc

709. బ్రౌనుదొరవారి ప్రతి. పాఠభేదములతో నున్నది.

711. రాధికాసాంత్వనము. సటీక. వాడుకభాషలో నీ గ్రంథమునకు సంపూర్ణవ్యాఖ్యానము వ్రాయబడినది. వ్యాఖ్యాత పైడిపాటి వెంకటనరసు.

712-13. మొదటి రెండాశ్వాసము లొకసంపుటము, మిగిలిన రెండాశ్వాసము లొకసంపుటము. బ్రౌనుదొరవారి ప్రతి.

పై యంశములవలన మొదట నీ గ్రంథమును సంపాదించి వ్యాప్తిలోనికి దెచ్చినకీర్తి బ్రౌనుదొరవారిదియని చెప్పదగును. ఈ క్రింది ముద్రితప్రతుల కాధారము పై ప్రతులే.

1887. శ్రీధామ ముద్రాక్షరశాల, మదరాసు.

1907. శ్రీపారిజాత ముద్రాక్షరశాల, మదరాసు.

1910. ఇండియా ముద్రాక్షరశాల, మదరాసు. శ్రీమతి బెంగళూరి నాగరత్నముచే ప్రకటితము. ఇందు విపులపీఠిక గలదు. ఈ ప్రచురణయే ప్రభుత్వనిషేధనమునకు కారణమైనది.

1936. శృంగారకావ్య గ్రంథమండలి మచిలీపట్టణము. కే. జి. మూర్తి.

1937. శ్రీసత్యనారాయణ పబ్లిషింగు హౌస్, రాజమహేంద్రవరము.

1950. శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్. శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులవారు శృంగారగ్రంథములపై నిషేధము తొలగింపజేసి ప్రథమముగ దీనిని ప్రకటించిరి.

—: అమరసింహుఁడు-మాతృభూతకవి :—

ప్రతాపసింహుని కుమారుఁడగు నమరసింహుఁడు తండ్రివలెనే భాషాపోషకుఁడు. ఈతఁడు రెండవతులజాజీ వెనుక నొకసంవత్సరము (క్రీ. శ. 1788-1789) తంజావూరిని పాలించినవాఁడు. ఈతని నామాంకితముగా మాతృభూతయ్య అనుకవి 'పారిజాతాపహరణము' అను నాటకము రచించియున్నాఁడు. అది అమరసింహమహారాజు మంత్రియగు శివరాయమంత్రి ప్రోత్సాహమువలన జరిగినది. కాబట్టియే గద్యయిది. "ఇది శ్రీచోళసింహాసనాధ్యక్ష భోసలప్రతాపసింహరాజ పూర్వపుణ్య పరిపాకస్వరూప యమునాంబికా గర్భశుక్తిమౌక్తికాయమానామరసింహ మండలాధీశ్వర నామాంకితంబైన మంత్రిమార్తాండ శివరాయమంత్రి కారితంబైన శ్రీమత్సుగంధి కుంతలేశ్వర కరుణాకటాక్షవీక్షణ సుధాసారసంజనిత చతుర్విధకవితానిర్వాహక, శాండిల్యగోత్రపవిత్ర, కవిరంగయార్యపుత్ర విద్వజ్జనవిధేయ మాతృభూతకవినామధేయ ప్రణీతంబైన పారిజాతాపహరణ నాటకమందు సర్వంబును పంచమాంకము."

గ్రంథకర్తయగు మాతృభూతయ్య తనవంశమునుగూర్చి కృతిప్రేరకుఁడైన శివరాయమంత్రి వంశమునుగూర్చి యిట్లు గ్రంథముఖమునఁ జెప్పియున్నాఁడు.

" జయజగత్పరిపాల, జయసుకీర్తిశీలోల
జయమధురవాగ్జాల, జయకృపాపాల
జయఘనాఘననీల, జయసురామరసాల

జయదళితశిశుపాల, జయజయగోపా

ప్రకటమహానుగ్గుణు స్వామినిఁ దలంచి
గురుతరశాండిల్య గోత్రపావనుఁడ
వరకవిరంగార్య వరతనూభవుఁడ
గురుకృపాసౌగంధి కుంతలాదేవి
వరముచేఁ జనియించి ప్రబలినవాఁడ
మాతృభూతస్వామి మహితకటాక్ష
చాతుర్యపరిలబ్ధ సరససాహిత్య
సంగీతమధుర వాగ్ధురిఁ గల్గువాఁడ
శృంగారరసము దెల్పిన మేలువాఁడ
కవిమాతృభూత నాఖ్యానంబుచేత
భువిలోపలఁ ప్రసిద్ధిఁ బొందినవాఁడ
గరిమచే లోక విఖ్యాతంబుగాను
సరవిమీఱఁగఁ బారిజాతాపహరణ
మనుమహానాటకం బందఱు మెచ్చ
వినుపింతు త్రైలోక విఖ్యాతముగను.

పై వానినిబట్టి మాతృభూతకవి, "శాండిల్యగోత్రుఁడు రంగార్యుని పుత్రుఁడు, సంగీతసాహిత్య విద్యావిశారదుఁడు సుగంధికుంతలాదేవి వరప్రసాది" అను విషయములు తెలియుచున్నవి. 'మాతృభూతయ్య' అని పేరుండుటచే నీతఁడు దక్షిణదేశమున నెలకొన్న తెలుఁగుకవి. అరవములో మాతృభూతేశ్వరుని యాలయమునకు "తాయిమాన్ గోయిల్" అనిపేరు ఈతనిభార్య సుగంధికుంతల. ఈ యాలయము పుదుక్కోటలో నుండుటచే నీకవి పుదుక్కోట నివాసియని యూహింపనగును. మఱియు 'సంగీతసంప్రదాయ ప్రదర్శిని' యందుదాహరింపబడిన మాతృభూతయ్య పదములీతని వేయని చెప్పనగును.

ఈతని ప్రోత్సహించిన శివరాయమంత్రి కృష్ణరాయలచెంత యుప్పాజీవలె యమరసింహునియొద్ద నుండెడివాఁడు. ఈతని తండ్రి శంభాజీ. శంభాజీకిగల నలుగురు పుత్రులలో నీతఁడు రెండవవాఁడు.




ఈ వృత్తాంతము గ్రంథావతారికయం దిట్లు చెప్పఁబడినది.

వ॥ అని * * * కృతిపతినభివర్ణించెద నెట్టులనఁగా.

ద్వి. శ్రీభోసలకులాబ్ధి శీతాంశుఁడనఁగ
ప్రాభవం బందిన పరమపుణ్యుండు
శ్రీకరమై... లునుభాసిలు చోళరాజ్య
మేకచక్రంబుగా నేలెడువాండు
మకరంద ముఖ్యసమంచితబిరుదు
లకలంకముగ బూనియమరినవాండు
పొలుపైన శ్రీతంజపురభేదనమను
తెలిదీవికిని విష్ణుదేవుడౌవాఁడు.

* * *

నిరతంబు తుళజావనీ మహీపాలునికి
కరమొప్పు పౌత్రుండై కడగినవాఁడు
మరియు ప్రతాపసింహక్షితీంద్రునికి
సాదిపుత్రుండై శోభిల్లువాఁడు
న్యాకృమైతగు యమునాంబికాగర్భ
శుక్తిమౌక్తికముగా సొంపొందువాఁడు
సార్వజ్ఞుఁడౌ తుళజావనీంద్రునికి
కూరిమియనుజుండై కొమరొందువాఁడు

* * *

రవిచంద్రమౌళీశ్వర ప్రసాదంబు

బహుళంబుగాఁగల్గిభాసిల్లువాఁడు

* * *

యింతటియమరసింహేంద్రుఁడౌ నృపతి
చెంత బాయకయుండి శివరాయమంత్రి

* * * *

రమణకెక్కిన కృష్ణరాయలచెంత
విమలుఁడై యప్పాజివెలసినరీతి
విహితధర్మముచేత వెలసిశంభాజి
రాయనితనయుఁడై రాష్ట్రంబునందు
నాయతకీర్తిచే నమరినవాఁడు.
అల్లత్రియంబకమంత్రి కనుపుఁడౌవాఁడు
కలితనాగోజి శంకరులకగ్రజుఁడు
మెలమినియమరసింహేంద్రునిసభను
నలుగురుమెచ్చంగ ననుబిలిపించి
యాచంద్రతారార్కమౌనట్టుగాను. * *
భవ్యమైతగుగద్య పద్యాత్మకముగ
నలపారిజాతాపహరణంబుముద్దు.
... ... ... ...

తుది:- వ॥ అనిగోపస్త్రీలు మ్రొక్కిరటమెటువలెనూ.

గుమ్మకాంబోధి. ఆది

చేరిమ్రొక్కిరిగోపాలాంగనలు చేరిమ్రొక్కిరి
చేరిమ్రొక్కిరిసిగ్గుచేత కనులుమూసుక
సారెశిఖరగిరీశుసఖుఁడైన శ్రీహరికి
మొనగుబ్బలుకరహార బాహుమూల
రుచులుపొదలకనకపు పళ్లెములనగతత
తవనునవిలుతుదివాణములు తెలియగాచేరి.

వ॥ ఇట్లు మ్రొక్కిన సమయంబున గోపాలమూర్తి గోపస్త్రీసర్వాం
గదర్శన సంజాత కుతూహలుండై చీరలొసంగిన ధరియించుకొని

సంతుష్టాంతరంగలై గోపస్త్రీలు స్వామిని పరివేష్టించుకొని యేమనికొనియాడుచున్నారు.

శ్లో. తవకథామృతంతప్తజీవనం, కవిభిరీడితంకల్మషాపహమ్।
శ్రవణమంగళం శ్రీమదాతతంభువిగృణంతియే భూరిదాజనాః.
అంగనామంగనా దేవకీనందనః.

గ్రంథాంతగద్య 206 వ పుటలో నీయబడినది.

పారిజాతాపహరణ కథలో గొల్లలగూర్చి విశేషముగ చెప్పబడినది.

క. శ్రీవిలసద్భోగకుల
పావనమకరందబిరుద భావజరూపా
శ్రీవనితాంచిత వీక్షణ
సేవకరిపుభూప! యమరసింహామహీపా!

గీ. అవధరింపుము నీపేరనంకితముగ
పారిజాతాపహరణంబు బాగుమీఱ
నాటకముగాను రచియించినాను వేడ్క
నెలమినందున ప్రథమాంక మెట్టిదనిన.

గొల్లవాక్యం.

ఉ. ముక్కరనిచ్చె కృష్ణుఁడిచ్చె నయమొప్పగ గమ్మలుసూర్యుఁడిచ్చె పెం
పెక్కినతారహారములు పేర్మినిచందురుఁడిచ్చె నింద్రుఁడున్
యెక్కువలైన కంకణములిచ్చెను పాపటబొట్టుశంభుఁడున్
చక్కనిసూర్యచంద్రులును శారదయిచ్చెను నాదుచల్లకున్.

ద్విపద. శ్రీరమ్యమైనట్టి చిక్కనిచల్ల
సారస్యమైనట్టి చక్కటిచల్ల
కూరిమికొనరమ్మ కొమరైనచల్ల

## —: జైమినిభారతము :—

ఇది యయిదాశ్వాసముల వచనకావ్యము. ఇది సంస్కృతమున, జైమినిభారతమని పిలువఁబడు నశ్వమేధపర్వమునకుఁ దెలుఁగు. సంస్కృతమున జైమినిభారతమున నశ్వమేధపర్వమొక్కటియే మిగిలినట్లును, దక్కినపర్వములన్నియు నశించినట్లును, గానున్నచో జైమిని భారతమని పేరేలవచ్చుననియుఁ గొందఱు తలంచెదరు. జైమిని భారతములో మిగిలినపర్వములు కొన్ని కలవనిగాని, యవి నశించినవని గాని యశ్వమేధపర్వముఁ దెలిఁగించిన పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి గాని యీ వేంకటకృష్ణప్పనాయఁకుడు గాని, నెందును జెప్పియుండలేదు. అశ్వమేధపర్వమునఁ గొన్ని విశేషాంశములను జెప్పఁదలఁచి వ్యాసుని యశ్వమేధపర్వము కంటె వేఱుగా వ్యాసశిష్యుఁడగు జైమిని యీ యశ్వమేధపర్వ మొక్కటియే రచియించియుండునని మఱికొందఱు తలంచెదరు. ఎట్లున్నను మఱికొందరు భాగవత సంప్రదాయములు వైష్ణవమతము వ్యాపించినతరువాత వ్రాయబడినగ్రంథమని గ్రంథస్థ విషయమును పురస్కరించుకొని చెప్పుచున్నారు. ఎట్లున్నను జైమిని భారతమను పేర నీయశ్వమేధపర్వ మొకటియే లోకమున విఖ్యాతి గాంచినది.

ఈకవి యీయశ్వమేధపర్వమును వచనముగా రచియించున ప్పుడు "ఇది శ్రీసుముఖమీనాక్షీ నాయకతనూభవ వేంకటకృష్ణప్పనా యకప్రణీతంబయిన జైమినిభారతంబునం దశ్వమేధపర్వంబునందుఁ బదునాల్గవయధ్యాయము" అనునట్లుగా నధ్యాయక్రమమున గద్యములను వ్రాసియున్నాఁడు. దీనినిబట్టి చూడఁగా మూలగ్రంథమునీతఁడు చూచెనని తెలియుచున్నది.

వేంకటకృష్ణప్పనాయకుఁడు మూలమును చూచినను, నాతని రచనయంతయును, పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి తెలుఁగు జైమినిభారత మను ననుసరించినట్లు క్రింది యుదాహరణములనుబట్టి తెలియఁగలదు.

పినవీరభద్రుఁడు. గీ. పంకనిర్మగ్నమగు గోవుపరికరించి
సుకరముగ నుద్ధరించు గోపకునిమాడ్కి
ముదముద్రైవార నుద్ధరింపుముపుగాక
పంకనిర్మగ్ననన్ను గోపాలతిలక! (1-130)

వేం. కృ. నాయకుఁడు

పంకనిర్మగ్నంబైన ధేనువును గోపాలకుచందంబున శోకమగ్నుల మైన మమ్ముద్ధరింపుము. (పుట 17)

క. కలనన్ మనవారెల్లను
బాలిసిరి నీదుర్నయమునఁ బోయినయవి పె
ద్దలె నాకును "స్త్రీబుద్ధిః
ప్రలయాంతక" యనెడుపలుకబద్ధంబగునే. (4-57) వీరభద్రుఁడు

నీదుర్నయంపుబోధనచే యుద్ధంబునకుంబోయిననాకుం గలవారెల్లను సమసిపోయిరి. "స్త్రీబుద్ధిః ప్రలయాంతక" యనెడుపలుకే యథార్థం బయ్యె. వేం. కృ. నాయ.

క. అతిమించి చొచ్చినిల్లటు
చెతిచితి వికఁబుట్టినిల్లు చెఱిచెదనియే
పఱతెంచితి రెండిండ్లకుఁ
'జెఱపనచేఁట' వయితేమినే నెసీదనుచుఁ. వీరభద్రుఁడు (4-69)

సాహాత్ములారా! చొచ్చిన యిల్లు చెఱచినదియుంగాక పుట్టిన యిల్లునుం జెఱుప వచ్చితివే? నీవంటి చెఱపనచేఁట మాయింటనుండ దగదు. వేం. కృ. నాయకుఁడు.

చ. పుడిసెఁడు నీటిచేనడఁగిపోయెడు ధూళికిఁ గాలమేఘముల్
దొడరునె జొన్నవేయఁజెడుదోమలమీఁదనపక్షుఁడెత్తిపోఁ
గడఁగునె యీషధన్వరథిక ప్రభుఁడెన్నఁగ మీకు నీడుగాఁ
డుడుగుఁడుసంభ్రమం బితనినోర్చెదఁ దచ్చెద నధ్వరాశ్వ
మున్. వీర (5-66)

పుడిసెండు నీళ్లు చల్లిన నడంగిపోయెడు ధూళికిఁ గాలమేఘంబులు వర్షింపవలెనే? తెప్ప వేసినం బడిపోవు దోమలకుఁ గరుడస్తంభం డెత్తి రావలయునే! ఈరాజు మీకు సమానుండుగాఁడు. మీ రితని మీఁదఁ జేయిచేసికొనం బనిలేదు. నేనె యీతనిం గెల్చి యశ్వరాజంబుఁ దెచ్చెద. వేం. కృ. నాయకుఁడు.

క. చిలువపదళవాయు లప్పుడు
"తలబీకనకాయ" లై "యథాయథ"లై కూ
ఱలువత్తులునై మొనతల
నిలువక శేషాహి కడకునెటు చెడి పాఱెన్ - వీరభద్రుఁడు (7-102)

చిలువపదళంబులు తలబీకనకాయలు యథాయథలు కఱాకికలునై మొనగట్టంజాలక శేషాహిచెంగటికిం బఱచిన.
వేం. కృ. నాయకుఁడు. (పుట 239)

క. పొరిది ననాచారంబుల
మురు వగుచున్ బ్రథమపాదమునఁ గలియుహిమం
బెరుగుపు వల్లుగలిపిన
కరణిన్ వర్ణాశ్రమములు కర్తరి గలయున్.
వీరభద్రుఁడు. (8-214)

అందులోనఁ బ్రథమపాదమున దురాచారంబులు సదాచారంబులు సమ్మిశ్రంబులై పెరుగువల్లు గలిపిన కరణి వర్ణాశ్రమధర్మంబులు సంకరంబులగు. వేం. కృ. నాయకుఁడు (పుట 326)

పైవిధముగా పినవీరభద్రుని సమాసములు, జాతీయములు సామెతలు నన్నింటిని యథామాత్రకముగా కృష్ణప్పనాయకుఁడు వచనము నందనువదించియున్నాఁడు. ఈపద్ధతి పద్యకావ్యములనుండి ద్విపదల కనువదించిన వారందఱును ననుసరించినదియే.

ముద్రిత గ్రంథమున, పిన వీరభద్రకవి పంచమాశ్వాసమున 19 పద్యములలో (5-105) నుండి (5-124) వర్ణించిన స్త్రీమండలవృత్తాంతము యొక్క వచనభాగము ముద్రితము కాలేదు. ఇందు ప్రమీల యర్జునిని రాకవిని యాతని గామించుటయు, యుద్ధముచేసి యతనివశపఱచుకొని యింటికిఁదీసికొనివచ్చి యాతనితోఁ గ్రీడించుటయు విపులముగా వర్ణితమైనది. నవీనాభిరుచులకు భంగకరమని పరిష్కర్తలు దీనిని ముద్రింపలేదు. ఈభాగమంతయు, శృంగారకావ్యగ్రంథమందలి ప్రబంధ పరంపరయందు మూడవదిగా ముద్రితమైన 'అహల్యాసంక్రందనమున' యనుబంధముగా ముద్రితమైనది.

—: రచనావిశేషములు :—

ఈగ్రంథమున శైలియందలి, భాషయందలి విశేషము క్రింది వివరింపబడినవి.

(1) కథాసందర్భమునుబట్టి కథాపాత్రముల నామములకు సర్వనామ వాచకపదము లుపయోగించుటచే సరిపోవుచుండఁగా మరల నాయాపాత్రముల నామములనే తఱుచుగా నుపయోగించుట (2) యమకవృత్త్యను ప్రాసాదిశబ్దాలంకారములకై కథాప్రసక్తకథ్యంతరముగా విశేషణబాహుళ్యమును గల్పించుట (3) గ్రంథమునందామూలాగ్రముగా నెఱసున్నలే కాని యరసున్న లుపయోగింపకుండుట, (4) అసమాపకక్రియలు పెక్కులుపయోగించి చివరకొక సమాపకక్రియతో పెద్దవాక్యములు వ్రాయుట.

(5) 'నేను' అనదగినచోటఁ "దా" ననుట (6) 'చెప్పెను' అనఁదగినచోట్లఁ 'బలుకరించె' ననుట, (7) వానితోడ అనుటకు "వానితోడంకూడ" ననుట నీకావ్యంబున కనుపట్టును.

ఈగ్రంథము వ్రాఁతలో నెట్లున్నదియు, నచ్చులో నెట్లున్నదియు జూపుట కొరకు యుదాహరణము నిచ్చుచున్నాఁడను.

వ్రాతప్రతి

అనిన విని ధర్మనందనుండు
కృష్ణ ద్వైపాయన నుంగ్గనుంగ్గొని
మహాత్మా! నాతంమ్ముంలు భీమా
ర్జున నకుల సహదేవులు యుద్ధం
బ్బున మిగులండస్సి యున్న వారు!
మహాబలుండైన! కర్ణసూనుం
డును! నగునృప కేతుండు బాలుం
డు! ఘటోత్కచుండు మాకార్యం
బున హతుండయ్యె నతనితనయుం
డగు మేఘవర్ణుండు డత్యంత
బాలుండు గావున! వారల నీవున్న
కయ్యంబ్బునకుం బంప్పుట యయు
క్తంబ్బు యవ్వాని ప్రాపునం గ్గవ్వశీ
వైరిరాజులం బ్బరాజయంబు గొ
ద్గించె నాగోపాల దేవుండు దూరం
బ్బున నున్నవారు గావున
నియ్యాగం బ్బెవ్విధంబ్బున జేయం
గలవారము! అనిని విని భీమసేనుండు
అగ్రజు నవలోకించ్చి శ్రీకృష్ణదే
వుండు సర్వత్ర పరిపూర్ణుండు
యిచ్చట లేండనవేటికి! యద్దేవుని
ద్దలంచ్చిన మాత్రంబ్బున పాపం
బ్బులు రూపణంగ్గు! సుకృతంబ్బులు
లభంచ్చు! నదియునుంగ్గాక! యొక్క
రహస్యంబ్బు వినుము! శ్రీవాసు
దేవునిమానతి ప్రకారంబ్బున మన
ము కయ్యంబ్బొనచ్చి = జ్ఞాతివధం
బ్బొనచ్చిరితి! మింత్తియ కాని స్వ
తంత్రంబ్బుగా జేశిన వారము గాము.

ఆచ్చుప్రతి

అనినవిని ధర్మనందనుండు కృష్ణ
ద్వైపాయనునుం గనుంగొని. మహా
త్మా! నాతమ్ములు భీమార్జుననకుల
సహదేవులు యుద్ధంబున మిగుల
డస్సియున్నవారలు. మహాబలుం
డును, కర్ణసూనుండును వృష కే
తుండు బాలుండు, ఘటోత్కచుండు
మాకార్యంబున హతుండయ్యె.
అతని తనయుండగు మేఘవర్ణుం
డత్యంత బాలుండు, గావున వారల
నీవును కయ్యంబునకుం బంపుట
యయుక్తంబు. ఎవ్వాని ప్రాపునం
గవ్వశీవైరిరాజులం బరాజయంబు
నొందించె నాగోపాల దేవుండు
దూరంబుననున్నవాఁడు. కావున
నీయాగంబెవిధంబునఁ జేయఁగల
వారము. అనినవిని భీమసేనుండ
గ్రజునవలోకించి "శ్రీకృష్ణదేవుండు
సర్వత్ర పరిపూర్ణుండు. ఇచ్చట
లేఁడనవేటికి, అద్దేవుం దలంచిన
మాత్రంబునఁ బాపంబులు రూప
డంగు. సుకృతంబులు లభించు.
అదియునుంగాక యొక్క రహ
స్యంబు వినుము. శ్రీవాసుదేవుని
యానతి ప్రకారంబున మనము
కయ్యంబొనర్చి జ్ఞాతివధంబొనర్చి
యింతియ కాని స్వతంత్రంబుగఁ
జేసినవారము కాము.

## —: జైమినీభారత ప్రతులు :—

జైమినీభారత ప్రతులాంధ్రసాహిత్య పరిషద్భాండాగారమున నున్నవి. వానిసంఖ్య 142, 308. సాహిత్య పరిషత్తువారే తమ గ్రంథ మాలలోనే రెండవగ్రంథముగాఁ దీనినిఁ బ్రకటించిరి. వీరి కాకర్తలు అభినవవాగనుశాసనమల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు. ఇది నాలుగు ముద్రణములందినది. అందు చతుర్థముద్రణము నేనుపయోగించితిని. ఆవీరికాకర్తల కెంతయుఁ గృతజ్ఞుఁడను. మఱియునిది మదరాసువిశ్వవిద్యాలయములో పఠనీయగ్రంథమైనది.

## —: అహల్యా సంక్రందనము

ఇది మూఁడాశ్వాసముల ప్రబంధము. ఇందు (1-131 2-123, 3-149) 403 గద్యపద్యములుగలవు. అయిన నిందు గద్యములు మూఁడేయున్నవిగాన నిది కేవలము పద్యప్రబంధమనియే చెప్పనగును.

ప్రథమాశ్వాసమున నవతారిక షష్ఠ్యంతములు నడచినపిదప నమరావతీపురమున నింద్రుడు పేరోలగంబున నున్న ఘట్టముతో కథా ప్రారంభము. ఆసభలో తక్కిన దిక్పాలకులును మునీంద్రులును నుండిరి. అప్పుడింద్రుఁడు తన కొలువుకూటమునకు వచ్చిన యప్సరసలను చూచి, సభవారితో వీరిలో నెవరుచక్కనివారో తెల్పుడని యాజ్ఞాపించెను. వరుణుడును సూర్యుడును నూర్వశియని చెప్పిరి. పురూరవుఁడు దానిని సమర్థించెను. నలకూబరుడు రంభచక్కనిదనెను. అంత మునులలో మృకండుమౌని ప్రమ్లోచయని, విభాండకుడు హరిణియని, మాండకర్ణి మదాలసయని, పరాశరుఁడు దాశకన్యయని యిట్లెవ్వరికి దోఁచినట్లు వారుచెప్పిరి, వాక్కలహముచెలరేగెను. అంత నీవివాదము దీర్పనలువయగుబ్రహ్మయే సమర్థుడని సభవారు తీర్మానింప యింద్రుడు తనపరివారముతో బ్రహ్మలోకమున కేగెను.

ద్వితీయాశ్వాసమున నింద్రుడు బ్రహ్మమ్రోల నీవివాదమును జెప్పగా నాతఁడీ యచ్చరపూబోండ్ల నందఱిందలదన్ను నొకయతిలోక

సౌందర్యరాశిని సృజింతునని చెప్పి తత్క్షణమే యహల్యయను నొక కన్యను సృష్టించెను. ఆమెసౌందర్యమును చూచి జగమంతయు సమ్మోహితమైనది. ఇంద్రుడును నామెకైమరులుగొని, బ్రహ్మను నాకన్యను తనకిమ్మనికోరెను. అహల్యయు తొలుత నింద్రునేవలచి యుండెను. కాని బ్రహ్మనీకు నీవే వద్దించుకొనదగదని చెప్పి పరమ నైష్ఠికుడగు గౌతమునకిచ్చి పెండ్లిచేసెను. అహల్యయు గౌతమాశ్రమము ప్రవేశించి, కులవధూధర్మములు నెఱపుచుండెను. కాని యప్పుడప్పుడు మహేంద్రుడు మనసును కలవరపెట్టుటచే, నాతనిం దలచుచుండును. ఇంద్రుడును, నహల్యావిరహమునకుఁ దాళజాలక, కొంగుదాకిన కొంతవాసియని గౌతమాశ్రమమున కప్పుడప్పుడు వచ్చి యాతిథ్యము గొనిపోయెడివాడు. అంతకంతకు నహల్యపై విరాళి యాతనికి హెచ్చు కాజొచ్చెను.

మూడవయాశ్వాసము నింద్రుడొక యోగినిని రాయబారిగా బంపి, యహల్యకొతనమనోరథమును నివేదించుటతో ప్రారంభమగును. అహల్యయు తనమనసులో నింద్రునిపైగల మక్కువదెలుప నాదూతిక యునాసంగతి యింద్రునకు నివేదించెను. అంత యింద్రుడొకనాడు కోడిరూపమును ధరించి గౌతమాశ్రమమునకువచ్చి. యాతని తన కూతచే, తెల్లవారినదని భ్రమపెట్టి, యాతడిలు వెడలగానే, అహల్యతో సౌఖ్యమననుభవించి తనకోర్కె నెఱవేర్చికొనెను. కాని యాతడు తిరిగి వెడలునప్పుడు గౌతముడతని యెదుట ప్రత్యక్షమై, చేసినపని నెఱిగి యాతని షండహీనుడవు కమ్మని శాపమొసగెను. ఇంటికి వచ్చి యహల్యాసంభోగచిహ్నములను కనిపెట్టి యామెను పాషాణరూపము నొందుమని శాపమిచ్చెను. యామె దుఃఖితమై కాళ్లపైబడ శ్రీరాముడా ప్రాంతమునకు వచ్చినపుడతనిపాదరజస్పర్శచే మోక్షముగలుగునని నిజస్వరూపమువచ్చునని శాపావధిని తాను తపస్సుచేయుటకు వెడలెను. అపైని యారూపముతో నామెపడియుండగా శ్రీరామచంద్రుడువచ్చి యామెకు పూర్వరూపము నొసగెను.

వేంకటకృష్ణప్పనాయకుఁ డీకథను చక్కఁగా సంతరించియున్నాడు. ఇందలి యితివృత్తము, వేదకాలమునుండి వెలసి రామాయణకాలము నుండి రసికుల నాకర్షించినది. కాని కవియిందు చక్కని సన్నివేశములు కల్పించి, ఔచితీభంగము లేకుండ కథను రసవత్తరముగా దిద్ది తీర్చినాడు. శ్రవ్యమగు నిది ప్రబంధమేయైనను దృశ్యమగు నాటకమని చెప్ప నొప్పును. ప్రథమాశ్వాసమున నింద్రసభారంగమున నహల్యాసృష్టి కొఱకు ఋషుల తగవుపెట్టి వివాదనాటకమాడించి, కవి ద్వితీయా శ్వాసమున, నహల్యాపురందరుల మోహబీజములనాటినాఁడు. గౌతముని యహల్యాశృంగారకళా లతికవసివాళ్లువాఱినది. గార్హస్థ్యములో పతి మీఁది భక్తి, పరునిపై వలపుచేత గతాగత కాంక్షయైన యువ్యోంతరోత్త హృదయము క్షోభించినది. మూఁడవ యాశ్వాసమున ఇంద్రదూతిక సమాగమము వాడిపోయిన మోహలతికను చివురింపజేసినది. చివరకు నవధిగా నింద్రాహల్యా సమాగమును క్రమపరిణామమును జెందించిన వెంకటకృష్ణకవి దార్శనికత, శిల్పము ప్రశంసనీయములు.

నాటకీయముగ నీప్రబంధము రచితమగుటయే నిందలి విశిష్టత యని యీక్రింది సంభాషణపద్యములను బట్టి చెప్పవచ్చును.

చ. ఎవరది యింటిలోపల, నదెవ్వరు, శక్రుఁడ చెల్ల మీరలా  
యివలికిరండు, నీదుమగఁ డెక్కడ మూలఫలార్థమేగెఁగా  
నువిదరొ తామసమంబగునొ ఉండుఁడు పూజలుగాంచిపొండు నే  
యవలయుపూజనీవెఱుగనా? యనసిగ్గున నేగు నవ్వుచున్ (2-116)

ఇంద్రుఁడు – ఎవరది యింటిలోపల?

అహల్య – నదెవ్వరు?

ఇం – శక్రుఁడ;

అహ – చెల్ల! మీరలా! యివలకురండు,

ఇం – నీదుమగఁ డెక్కడ?

అహ – మూలఫలార్థమేఁగె,

ఇం - రా నువిదరో తామసంబగునో?

అహ - ఉండుండు; పూజలుగాంచిపొందు

ఇం - సేయవలయుపూజ నీవెఱుంగవా? అన

అహ - సిగ్గుననేఁగు నవ్వుచున్.

ఉ. దేవ! శచీమనోరమణ దేవరవచ్చిన దేమి నీదుశో
భావిభవంబుఁజూడ, వనవాసిని కేమిటి చెల్వు రత్నమే
తావుననున్న నేమి వనితాననమన్మథ! నాపయిన్ గృపో
ద్భావననానతిచ్చెదవు భావజునాన నిజంబుపల్కితిన్.

అహ - దేవ! శచీమనోరమణ ! దేవరవచ్చినదేమి

ఇం - నీదుశో భావిభవంబుఁజూడ

అహ - వనవాసిని కేమిటి చెల్వు

ఇం - రత్నమే తావుననున్న నేమి

అహ - వనితాననమన్మథ! నాపయింగృపోద్భావననానతిచ్చెదవు

ఇం - భావజునాన నిజంబుపల్కితిన్.

'వైదికుని చేతివిడెమామె వనికబ్బును' అను నానుడిని వేంకట కృష్ణప్పనాయకుడు విపులముగా వర్ణించియున్నాడు. స్వర్గలోకమున నింద్రుని కొలువుకూటమునకు నప్సరసలు వచ్చినప్పుడు, వైదికవ్యవహార ఛాందసపరిభాషలో, వారితమకము నెంతయో సరస హాస్యరసస్ఫోరణితో నిట్లు ప్రపంచించినాడు.

సీ. సోమయాగఫలంబు సుదతీనీకిచ్చెను
మొగమిటు ద్రిప్పవే ముద్దుగుమ్మ
సోమపానఫలంబు భామనీకిచ్చెను
ఆనంగనాథునీ యధరమీవె
కలికిరో సాన్నాయ్య కలశాలఫలమిత్తు
బటువైనకుచముల బట్టనీవె
రమణిరో నామహావ్రతఫలమిచ్చెను
రతులనన్నేలవే బ్రతికిపోదు

గీ. ననుచుశాండిల్య కౌండిన్యమునిపరాశ
రాత్రి.........................
........................పర్వతాది
ఋషులుమోహింప నప్సరస్త్రీలు మఱియు (1-68)

సీ. అషుఇషుబోవకే యిషువులచేనన్ను
విషమాస్త్రుఁడేచీని వెఱ్ఱిపడుచ!
వాజిసేయఫలంబు వలదషే యోయోష
యింద్రుడేమిచ్చిని యిటునిలువవె
మేముశుంతలమటే మీరునేర్చినపాటి
యెఱుగమటే వేదమెల్లఁజదివి
యతివనిపుద్వరోష్ట యయ్యో దినములయ్యో
నగరికిఁబోవకే నడుమనెటులో!

గీ. అనుచుఛాందసులగు సోమయాజివటులు
వెంటనంటగ.........
.......................... ...
విడలిరప్పుడు వేలుపు వెలవెలఁదులు. (1-69)

ద్వితీయాశ్వాసమున నీక్రింది పద్యమరుకమునగల ద్వితీయ శ్లోకమునకు ననువాదము. నాలవపాదమున భావము వేఱైనది.

చ. కలఁగిచలించుముంగురులు కర్ణములన్నటియించుకమ్మలున్
చిలికెడు చిన్నిక్రొంజెమట చెక్కులనించుకజాఱుకొంచెపుం
తిలకమునొప్పఁబౌరుషరతి శ్రమతాంతవిలాసనేత్రియా
కలికిమొగంబు నెన్నటికిఁ గన్నులపండువుగాఁగఁజూతునో

కాని యితడు స్వతంత్రకల్పనలయందుసిద్ధహస్తుఁడే. మచ్చునకు.

ఉ. అంబుజగంధిచక్కదనమల్లనఁగన్గొని విస్మితాత్ముఁడై
యంబుజనేత్రుఁడప్పుడు త్ర్యంబకభావముఁగోరె నాతఁడ
ష్టాంబకలీలఁగోరె, మదినాతడుఁగోరె సహస్రలోచన
త్వంబునతంకనంతనయనత్వముఁగోరె మఱేమిచెప్పగన్.

"వేంకటకృష్ణప్పనాయకుని ప్రబంధము ఏవిధమైన అనౌచిత్యానికిన్ని యెడమీయదు, పాకమాముదికటువుపడదు; శృంగారమా! సభ్యతనుముంచివేసి ఉచ్ఛృంఖలముగా అతివేలముకాదు : కల్పనలాలింకము తప్పదు. సర్వమధురమైన సద్గ్రంథము"

మధురవిమర్శన రచనాప్రథితులైన మల్లాది[1] వారి పై వాక్యములు గ్రంథసమీక్షకు కలశముపెట్టినట్లున్నది.

—: సారంగధరచరిత్ర :—

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి జైమినీభారత పద్యకావ్యము నెట్లననుసరించివచనకావ్యముగా రచించినాడో, ఆవిధముగనే చేమకూర వేంకటరాజకవికృత సారంగధర చరిత్రను వచనకావ్యముగా వేంకటకృష్ణప్పనాయకుఁడు రచియించియున్నాఁడు. ఇందుల కుపబలముగా సముద్రితమగు వచన సారంగధర చరిత్రమునుండియు, పద్యసారంగధర చరిత్రమునుండియు రెండుఘట్టముల నుదాహరించుచున్నాను.

1. సారంగధరుడు పావురముకొఱకు చిత్రాంగియింటికి వెడలెదనన్నప్పుడు పద్య సారంగధర చరిత్ర ద్వితీయాశ్వాసము 4 మొదలు 7 వఱకు సుబుద్ధిప్రబోధము.

వెంకటరాజు.

ఉ. వెంగలిడంగ నెంటి యిటువెంటినిఁ గానగ తేలిపోయి; చి
త్రాంగివిచిత్రరత్నభవనాంగణ సీమను డేలరా లెనా
బంగరుముద్దుపావురము బాపురె! యంతిపురంబులోని కే
భంగుల నన్యులన్ వెదకఁబంపఁగరాదిక నేమిసేయుదున్,

1. శృంగారకావ్య గ్రంథమండలి ప్రబంధపరంపర 3 అహల్యాసంక్రందనము భూమికపుట 18 మల్లాది, రామకృష్ణశాస్త్రిగారు, ఈభూమికలో వేంకటకృష్ణమనాయకుని గ్రంథము లన్నింటిని గూర్చి విపులసమీక్ష చదువతగినది గలదు.

గీ. తామసముసేయఁదగదింక దీమసమున
నేరుపరిమైననేఁబోక తీరదనుచుఁ
బోవమతిమంతిసుతుఁడు సుబుద్ధి దీర్ఘ
దర్శిగావున సారంగధరుని కనియె.

ఉ. మున్ననచేసిమీరు బహుమానముతో ననునేలినారు, నేఁ
గన్నదితెల్పకుండిన నఘంబగుకాదని వెగ్గలింపకే
విన్నపమాలకింపుము వివేకివిగాని మఱొండుగావు నీ
కెన్నఁడులేని యోజయిది యేమెటుపోయిన హానియయ్యెడున్

ఉ. రాజొకఁడూరలేఁడు, చెలిప్రాయపుబిత్తరి, నీవురూపరే
ఖాజితమన్మథుండ వటుకావునఁబోఁదగదయ్య, నీకునో
రాజకుమార! యెక్కడిపరాకిటు నూడఁగదయ్యభామినీ
రాజులచిత్తముల్ తెలియరాదెటుపోయెటువచ్చునో కదా.

వెంకటకృష్ణప్పనాయకుఁడు.

అవధరింపు మక్కపోతంబు చిత్రాంగిశాతోదరినగరిలోన వాలుటయుఁ జేరికల నున్న రాణివారలు సారెసారెకుఁ గేకలువేయ వ్యాకులంబగు మనంబునఁ గలవరపడుచు మత్పారావతంబు పెంటిఁగానక చిత్రాంగి విచిత్రాంగణంబున నేటికి వ్రాలె, నాబంగరుపావురంబు దొంగిలెబ్బంగి సుందు, పోతుటేఁగ కేలియుం (జొరఁ) గూడని యంతింపురంబునకు నెవ్వరిఁబనుతు. దీమసంబునఁ దామసంబుసేయరాదు. తక్కొక్కరి నాయమయింటికిఁ బంపుట నాయకముగాదు. ఏనె పోవలయునంచు నెంచియూ... నగరికభిముఖంబుగఁ జనుచుండ నుతిమంతుఁ డను మంత్రిసుతుఁడు, తనకు హితుఁడును, వివేకిసుతుండునగు సుబుద్ధి బుద్ధిమంతుండుగావున సారంగధరుంజేరంగ నేగి, పోవలదుపోవలదు, పరాకు రాకుమారా! నన్ను మన్ననచేసి యున్నివితంబులనేలు నేలికవు గావునఁ గన్నకార్యంబు విన్నవింపక యుండిన దోషంబు. కనుక తోచినవిధంబు విన్నపంబుచేసెద, వివేకివిగాని మఱొకండవుగావు, ఎన్నండులేని యోజనసేయుదురే. ఈ

కార్యంబొనర్చిన హానివాటిల్లు, నిష్కార్యంబు సేయందగదు. ఆత్రావు నకుంబోయిన నిందలువచ్చు. ఆత్రావునకుం బోవంజనదు. పోరానిచోట్టు లకుంబోయిన రారానిమాటలువచ్చు. ఇంతయెఱుంగవె. ఇంతయేమిటి కంటివేని ధారణీవల్లభుం డూరకలేఁడు నీవుచక్కరవిలుకాని ధిక్కరించు చక్కఁదనంబును నివ్వాటిల్లు జవ్వనంబును విలాసినీ విభ్రమకంబులైన విభ్ర మంబులుం గలవాఁడవు. తిమురుకొమరుఁ బ్రాయంపు గర్వంపుసొంపున నింపుమీఱు నాచంపకగంధి. అటుగావున నీవొంటిగ నవ్వాలుగంటి యింటికిఁబోవఁజనదు. అటలా, యేటికి మోమోట, నామాటవినుము. రాజుల వృత్తంబును రాజవదలంచిత్తంబు నెఱుంగం గూడదు''

పైవచనమును జూచిన వేంకటరాజకవి రచనెట్లు పుణికి పుచ్చు కొన్నదియు తెలియఁగలదు. మఱియు నిక్రింది రెండవఘట్టమును చూడుడు ఇది రాజు పెద్దలతో సారంగధరుని నేరముగూర్చి విచారించు సందర్భము లోనిది.

ఉ. ఓన్నృప! నాకుఁజూడ లయుగ్మలి నీసుతునిన్ మనోహరా
కూనవిలాసుఁ జూచి నిలుపోపకపట్టిన లోనుగామి నెం
తేనెగులూని వానిఁబొలియింపఁగ మాయలువన్నినిట్లు కొం
డేనకు, ధర్మరాజలుగు నిక్కముగా మిముఁజెప్పనేఁటికిన్.

చ. పొలఁతుక మీకుఁగానఁబడఁబొందుగఁదెల్పినదే నిజంబుగా
దలఁచెదరీ, రదెంతయును దబ్బఱనూ, 'మగవాడు బొంకెనా
యలదడిగట్టినట్టులగు నాడుదిబొంకిన గోడవెట్టిన
ట్లులవడుమాటనన్న' వినరా వనరాశిపరీత భూభుజా!

గీ. ఇలఁజెరవమూయమూకుడుగలదుగాక
నోరుమూయంగమూకుడెందులనుగలదె
యొరులనుటకేమి సారంగధరునిమీద
నాకుసంశయమొదవదో నరవరేణ్య!

౪. ఏతన్మాత్రుఁడె, చేతో
జాతారికృపాకటాక్షజాతుఁడు సుగుణా
న్వీతుఁడు; తెలియక యాడెద
రాతనికటువంటిగుణములా నరనాథా! (20-248-251)

దీనికివచనభాగమీక్రింది పొందుపఱచుచున్నాను.

“కొండెమునకు ధర్మరాజును నగునను నెడమిమ్ముం జెప్ప నేమిటికి అడియాలంబులు కనుపఱంజేసి నీకునిజంబగునట్లుగాఁ గలికి పలికినదెంతయు దబ్బఱసుమీ: మగవాండు బొంకినం దడిగట్టినట్టులు. ఆండది బొంకినం గోడబెట్టినయట్లన్నమాట వినమా మనమరసిచూడవలయు. చెఱవమూయ మూకుడుగలదు గాని నోరుమూయ మూకుడుగలదా? ఎవ్వరేమన్ననేమి సారంగధరుంటట్టివాండుకాండు. నీతనూజుండేతన్మాత్రుండా ఈశ్వరవర జనితుండు. పరనారీసహోదరుండు.

ముద్రితసారంగధరచరిత్రయందలి పాఠభేదములను సరిచూచుటకీ వచనసారంగధర చరిత్రయెంతయు నుపయోగకరమగును. కాని దీనికి పరిషత్పుస్తకభాండాగారమున నొక్కటే (ప్రతిసంఖ్య 62) గలదు. అది శిథిలమైనది. అయినది పూర్తిగాశిథిలముగాక మునుపే, దానినుపయోగ పఱచుట మంచిది: అయుపయోగమెట్లో యీక్రింద తెలుపుచున్నాను.

సారంగధరుఁడు చిత్రాంగి యింటిముందఱకు వెళ్లినప్పుడక్కడ చెలికత్తెలు వెలువఱచిన యభిప్రాయములు గల భాగమునకు పద్యభాగము లేదు. ఇట, రాబోవు సారంగధరునిహానిని సూచించునా చెలికత్తెలాడిన మాటలు, రాజాస్థానములయందలి విశ్వాసపాత్రులగు సేవకులు, తమ యేలికల మేలుగోరి యాడుకొనునవిగానున్నవి. రాజాస్థానమర్యాదల నామూలాగ్రముగ నెఱిగిన చేమకూరకవి దీనిని విడిచియుండడు. మఱియు నాతని పద్యములకు యథానువాదములుండగా నీభాగమునకునుండి యుండ వలెను. లేఖకులు ప్రమాదవశమున విడిచిరేమో యెఱుగరాదు. తాళ

పత్ర ప్రతులింకను జాగరూకతోఁ బరిశీలింపవలసిన యవసరము సిఘట్టము నిరూపించుచున్నది. ఆభాగమిది.

"అప్పుడు ప్రోడలగు చేడియలా చేడియంజూచి యక్కుమారుని చక్కదనంబ్బును యీ చక్కెరబొమ్మ యక్కరయుం జూచిన నిక్కిం బ్బాటికె మోహపాటువచ్చునని తోంచుచున్నయది. ఇత్తెరి యీచిత్తిరికింత్తి తత్తరం బేమిటికి నూటిగాని చోట మోహంబు పాటించుటం బాతిగాదు. యివ్విధంబు మానుమని పలికినంబ్బగ...యీవనిత మనము మానుప లేము. దైవగతి విపరీతంబయ్యెనని తోంచుచున్నయది. మనమేమి శాయంగ్గలవారమాయమ్మ యిమ్చ్చి చందంబ్బున నుండుదమటమీద నెట్టులయ్యెనట్టు కాగాకయని గుసగుసలంబోవును నటునిటు నడియాడు చుండ్గ చిత్రాంగి విచిత్రంబైన మేడమీదికతనిం దోడ్కొని తనపాదపద్మ రాగంబ్బులు సోపానపద్మరాగంబ్బులు పరస్పరంబును సాధింప.

పరిమత్ గ్రంథసంఖ్య 62. పుట 76-77.

ఈభాగమును 'గద్యచింతామణి' యందు గిడుగుపంతులుగారి చ్చియున్నారు. మఱియు, ముందు పేర్కొన శృంగార కావ్యగ్రంథ మండలివారహాల్యాసంక్రదనమున దీనిని ముద్రించిరి.

—: రాధికాసాంత్వనము :—

సత్యభామా సాంత్వనము ననుసరించి వేంకటకృష్ణప్పనాయకుఁడీ రాధికాసాంత్వనమును రచించి గోపాలదేవుడు కుఁ గృతినొసగెను. కవియే దీనిని 'చాటుప్రబంధమని' గ్రంథాంతగద్యయం దిట్లు చెప్పియున్నాడు.

"ఇదిశ్రీమత్పాండ్యమండలాధీశ్వర శ్రీవిజయరంగ చొక్కనాథ కటాక్షలబ్ధాఖిల సంపత్సారంపర సమేధమాన సముఖమీనాక్షీనాయక తనూభవ మీనాక్షీదేవీకటాక్ష లబ్ధకవితా సంప్రదాయక, వేంకటకృష్ణ ప్పనాయక ప్రణీతంబైన రాధికాసాంత్వనంబను చాటుప్రబంధంబు సర్వంబు నేకాశ్వాసము.

ఇందాశ్వాసారాంభమున మూడుపద్యములు. నాశ్వాసాంత మున మూడు పద్యములుపోగా గ్రంధమున 120 పద్యములున్నవి. నడుమ చిన్నచిన్న వచనములు చివరనొక పెద్దవచనముకలదు. శ్రీకృష్ణుడు రాధను ననునయించుట యిందు యితివృత్తము. శృంగారరసపూరితము. ఇదివరలో సూచించినట్లిందలి చివరివచనము (సంభోగవర్ణన) అహల్యా సంక్రందనము నుండి గ్రహింపబడినది.

ఇదివఱలో వాఙ్మయచరిత్రకారులు ముద్దుపళని 'రాధికాసాంత్వ నము' ను మాత్రమే యెఱుఁగుదురు కాని యంతకు నూరేండ్లున్ముందుగా వ్రాయబడిన వేంకటకృష్ణప్పనాయకుని కృతినిగూర్చి యెఱుఁగరు. దీని యునికిని యాంధ్రసాహిత్య పరిషత్పత్రిక[1] తెలుపువఱకును లోకమెఱుఁ గదు. ఇటీవల యీగ్రంథము ముద్రణభాగ్యము నందినది[2].

ముద్దుపళని వ్రాసిన రాధికాసాంత్వనమునకు మాతృక వేంకట కృష్ణప్పనాయకుని కృతియని చెప్పవచ్చును.

1. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. సం. 4 పుట. గ్రంథసంఖ్య 177. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము కాగితప్రతి సంఖ్య. 199.

2. శృంగారకావ్యగ్రంథ మండలిపరంపర 3 అహల్యాసంక్రద నముతో గూడ నీగ్రంథమును, వచనసారంగధర చరిత్రలోని కొంతభా గమును జైమినీభారతమున ముద్రితమునవిడిచిపెట్టబడిన భాగము ను ముద్రితములైనవి. ౧౯౩౮.

ఏకాశ్వాసమగు నీకృతిని నాలుగాశ్వాసముల ప్రబంధముగా ముద్దుపళని రచించినది. వేంకటకృష్ణప్పనాయుని కృతియందలి పద్యము లింకు పొందుపఱుపబడినవి. ఆవిషయము స్పష్టపఱచుటకు నీకిందియుదా హారణముల నొనగుచున్నాను, పద్యముల మొదళ్లను మాత్రమే యొస గెదను.

| వెంకటకృష్ణనాయకుఁడు. | పద్య సంఖ్య | ముద్దుపళని. | ఆశ్వాస పద్య సంఖ్య |
|---|---|---|---|
| చ. చిలుకవజీరుఁడంతటను | 9 | చ. చిలుకవజీరుఁడంతటను | 2-102 |
| క. ఇన్లేసినమది ఝల్లని | 10 | క. ఇన్లేసినమదిఝల్లని | 2-103 |
| ఉ. శౌరినిఁబిల్వఁగాఁజనిన | 11 | ఉ. శౌరినిఁబిల్వఁగాఁజనిన | 2-104 |
| సీ. తడవుఁజూచినదృష్టి | 12 | సీ. తడవుఁజూచినదృష్టి | 2-116 |
| సీ. మదదంతిపై నెక్కి | 15 | సీ. మదహస్తిపై నెక్కి | 2-108 |
| గీ. హరునుదుటి కంటిమంటల | 19 | గీ. హరునుదుటికంటిమంటల | 2-12[illegible] |
| క. ఇటులేతెంచిన చిలుకన్ | 20 | క. ఇటులేతెంచినచిలుకన్ | 2-122 |
| గీ. అటులముంజేతిపై వ్రాలు | 21 | గీ. అటులముంజేతిపై వ్రాలు | 2-123 |
| ఉ. దేవకిచిన్నికుఱ్ఱవసు దేవుని | 22 | ఉ. దేవకిచిన్నికుఱ్ఱ వసు | 2-125 |
| గీ. ఎంతవేఁడినబదులాడ | 24 | గీ. ఎంతవేఁడినబదులాడ | 2-127 |
| గీ. అనినవినిచిల్కయుల్క | 26 | గీ. అనినవినిచిల్కయుల్క | 2-126 |
| క. తెఱవా! యేమని చెప్పుదు | 27 | సీ. తెఱవా! యేమని చెప్పుదు | 2-128 |
| సీ. పన్నీరుమేరువుల్ బాగాలు | 19 | క. పన్నీరుమేరువుల్ బాగాలు | 2-138 |
| సీ. కొసరుపల్కులగమ్మిగోటి | 30 | సీ. కొసరుపల్కులగమ్మికోటి | 1-146 |
| సీ. కిలకిలనవ్వులు గిలిగింతలు | 31 | సీ. కిలకిలనవ్వులుగిలిగింతలు | 2-140 |
| క. నానావిధభావాకర | 32 | క. నానావిధభావాకర | 2-144 |
| చ. పరవశుఁడైన శౌరిఁగని | 33 | చ. పరవశుఁడైనశౌరిఁగని | 3-4 |
| శా. ఏమేమే వెఱపింతలేకయె | 35 | శా. ఏమేమే వెఱపింతలేకయె | 3-6 |
| సీ. మఱచెనో నాచేత | 36 | సీ. మఱచెనో నాచేత | 3-7 |
| గీ. నిన్నగుప్పయు నేఁడాళ్ళు | 37 | గీ. నిన్నగుప్పయునేఁడాళ్ళు | 3-8 |
| గీ. పొలమెఱుంగనినిన్నటిపులికి | 40 | గీ. పొలమెఱుంగనినిన్నటిపులికి | 3-10 |
| గీ. కానిపదఱుకుమిఁకమీఁద | 45 | గీ. కానిపదఱుకుమిఁకమీఁద | 3-15 |
| సీ. ఆశుకవిత్వంబులల్లి తేనెను | 50 | సీ. ఆశుకవిత్వంబులల్లి | 3-14 |
| క. అనివినిశుకమిట్లనియెన్ | 51 | క. అనివినిశుక. | 3-16 |
| గీ. చూపులోపలనొకవింత | 52 | గీ. చూపులోపలనొకవింత | 3-17 |
| గీ. లేనిపట్టింపు | 53 | గీ. లేనిపట్టింపు | 3-18 |
| క. నిన్నెఱుఁగుదు నెదురు | 54 | క. నిన్నెఱుఁగుదు నెదురు | 3-21 |

ఇంకను నిందు 13-వ పద్యమునకు 2-113, 83 పద్యమునకు 3-87 పద్యములలో ఛాయలును 112-వ పద్యమునకు 4-16 లో నర్థ సమానత్వమును గానబడుచున్నవి. మొత్తముపై సగము భాగము వేంకటకృష్ణప్పనాయకుని గ్రంథమిందు పొందుపడినది. కాని యంతమాత్రమున ముద్దుపళని గ్రంథమునకు ప్రత్యేకత లేకపోలేదు. అది ముద్దుపళని కృతినిగూర్చి వ్రాసినపుడు ముందు తెలిపితిని.

అహల్యాసంక్రందనంబునందువలె నిందును సంభాషణరూపకమగు పద్యముగలదు. రాధికా మందిరము ప్రవేశింపబోవునప్పుడు వాకిలి యడ్డమునిలిచిన చెలికి, కృష్ణునికి జరిగిన సంవాదము.

కృ. పొలతిరో?
చె. ఏమి?
కృ. త్రోవ విడు పోవలె
చె. నెచ్చటి
కృ. కింతి చెంతకే
చె. తొలిరుచి వీడవో
కృ. విడను
చె. త్రోతుము
కృ. ద్రొబ్బుదు పొమ్ము
చె. పోను
కృ. మాటలు కెడమూను
చె. కానివికటానకుఁజొచ్చితి
కృ. కౌను.
చె. యెవ్వరో
కృ. బలిమిమిటారి
చె. రమ్మిదిగో
కృ. వచ్చితి
చె. రాకలమానసాహారి!

ఇది యీక్రిందిపద్యము:—

చ. పొలఁతిరో! యేమి? త్రోవవిడుపోవలెనెచ్చటికింతిచెంతకే
తొలిరుచివీడవోవిడను తోతుము ద్రొబ్బుదుపొమ్ము పోనుమా
టలకెడమౌను కానివికటానకుఁజొచ్చితి నౌనుమెవ్వరో
బలిమిమిటారిరమ్మిదిగొ వచ్చితిరాకలమానవోహరీ!

ప్రత్యేకమువరాంగవర్ణన మొదలగునవి లేకుండిన నీచాటుకావ్యము మనోహరముగనున్నది.

## విజయరంగచొక్కనాథునిపై చాటుపద్యములు

### వేంకటకృష్ణప్పనాయక రచితములు

క. రమ్మనెరా తనదేనే
రమ్మనెరా పంచశరుని రాపోర్చుట భా
రమ్మనెరా నీవే తన
సొమ్మనెరా విజయరంగ చొక్కవజీరా!

క. రావేరా? జిగిపచ్చల
రావేరా? యొసఁగితల్లి రమణికి నాతో
దావేరా? రేపేరా
చూపేరా? విజయరంగ చొక్కవజీరా!

క. ఇమ్మనఁగనమ్మనిపీడెము
కొమ్మని కొమ్మనిపుడేలు కొమ్మనిశముకో
పమ్మేరా యాచెలినీ
సొమ్మేరా విజయరంగ చొక్కవజీరా!

క. వలరాజును నెలరాజును
నలరాజును......నీతుల నీ
తులరాగలరా? యిలరా
జులరాజా ! విజయరంగచొక్కవజీరా !

క. సరసానికి దొరసానికి
.........నొసగితివిభళీ
సరసాలా! కవిగాయక
సురసాలా ! విజయరంగచొక్కవజీరా !

క. మాటికిమాబోటిని నొక
చోటికి రమ్మనియునెనయఁజూచితి...

జూటరా? విజయరంగ చొక్కవజీరా !

క. ఎక్కడనేర్చితివగలను
నిక్కముపలుచినదికొమ్మ ! నీపేరంటే
మ్రొక్కనురా స్రుక్కనురా
సొక్కనురా విజయరంగ చొక్కవజీరా !

చాటుపద్యరత్నాకరము, తృతీయతరంగము 140-141 పుట.
విద్వత్కవిదీపాల పిచ్చయశాస్త్రి సంపాదితము.

—: శేషము వేంకటపతి శశాంకవిజయము. :—

విజయరంగచొక్కనాథుని కాలమున విలసిల్లి నకవులలో వేంకటపతి ప్రసిద్ధుఁడు. సముఖము వేంకటకృష్ణప్పనాయకుని కీతఁడాప్త మిత్రుఁడని యింతకు ముందే తెలిపియుంటిని. ఈతని కృతియగు శశాంక విజయము (తారాశశాంకవిజయమని వాడుక పేరు) దాక్షిణాత్య కృతులలో విశేష వ్యాప్తిగలది. ఈకృతిచంగల సీనయామాత్యుని కంకితము సీనయామాత్యుని వంశక్రమమిది.




ఈవంశమున తొలివాడగు వేంకటకృష్ణయనుగూర్చి.

" మంత్రిమాత్రుండె యతండు దుర్మంత్రిగంధ
సింధురోదగ్రజాగ్రన్నృసింహమూర్తి
చెంజివేంకటనృపతి సాచివ్యకారి
కీర్తిగుణహారి వేంకటకృష్ణశౌరి"

అని తెలుపబడినది. ఈచెంజివేంకటేంద్రుండు. వేంకటపతిరాయలచేత క్రీ. శ. 1586 ప్రాంతమున చెంజీదుర్గపాలకుడు[1]గా నియమితు

---

1. In 1586 he (Krishnappa) rebelled against Venkata, who captured him and had him put in prison. During his imprisonment, Gingee was ruled by one Venkata who was sent against him by Venkatapatiraya.

(The Nayaks of Tanjore, Page 75. F. N. 43.)

డైనాడు. కావున వేంకటకృష్ణయ యీకాలమువాఁడేయని తెలియ నగును.

ఈతని కొమారుడు కృష్ణుడు. శాత్రవరాజు కాంతల కబరిభార ములకు (కొప్పెరలను) హరించుటచే, 'కొప్పెర కృష్ణుడ'నిపేరువహించెను. ఆవెనుక నీవంశమున వెంగన్న రెండవతమ్ముఁడు కళ్ళకృష్ణుడు కవితా ధురీణుఁడయ్యెను. ఇక కృతిపతితాత "పండిత మండలీహృదయ పంకజ భానుఁడు" తండ్రియగు వేంకటరాఘవాధ్వరి

సీ. ఋగ్యజుస్సామాది రీతులేర్పడ జేసి
పాఠశాలలుపెట్టి వ్యాసులట్ల
ప్రాకారమణిమంటపాది కైంకర్యముల్
పరకాలుగతి రంగపతికొనర్చి
చాయలుగల్పించి జలధరప్రౌఢిమ
శాలలువేయించి జనులకెల్ల
బుధులకు నవరత్న భూషణాంబరములు
కల్పవృక్షంబుల కరణినొసగి

గీ. వెలయు నారదవరదున కలఘుభక్తి
నిష్టభోగంబులొనరె ఫణీంద్రులీల
భజనతోషితఖగ సార్వభౌమవాజి
నుగుణవేంకటరాఘవ సోమయాజి.

అనిప్రశంసింపబడినాఁడు. కృతిపతిసీనయ దానధర్మములచేత తండ్రినిమించుటయేగాక సంగీతసాహిత్య విద్యావేత్తయై విలసిల్లినవాఁడు. ఈతడు శ్రీవిజయరంగచొక్కనాథ మహీనాథ కృపాకటాక్ష వీక్ష ణానుక్షణవర్ధమానుఁడు. మఱియు

సీ. సకలసామాజిక సంఘంబుమదికి నిం
పుగ బృహస్పతిలీల బుద్ధిచెప్ప
కార్యఖడ్గక్రియా ఘటనాఘటనశక్తి
దొరనుప్రమోదంబు దొరయఁజేయు

జననంబు మొదలుగా సకలజనోపకా
రంబు వ్రతంబుగా రహినొనర్చు
జనకుని వైఖరి జ్ఞానకర్మ ప్రప
దనభక్తిగురునిష్ఠలొనర మెలఁగు

గీ. ధరనుపనయన కన్యకాదానశతము
లన్నదానంబు జలదాన మాదియైన
దానములొసంగు ఘను డభిమానధనుఁడు
శ్రీపతినిభుండు వంగలసీనవిభుఁడు.

అని యీతని ప్రతిభావిశేషము, దాతృత్వము వర్ణితములైనవి. ఇతఁడు వాధూలవరదదేశికుని శిష్యుఁడై యుభయవేదాంత సిద్ధాంతము లను గ్రహించిన వైష్ణవశిఖామణి.

సాహిత్య విద్యావేత్తయగు సీనయ "రామానుజదివ్యచరిత్ర ప్రబంధ సాహితీ మోహితా నల్పసంతోషవి శంకట వేంకటనగాధీశ్వ రుడు". అనగా విశిష్టాద్వైత మతప్రవర్తకులగు శ్రీ రామానుజాచార్యుల వారి చరిత్రను సీతఁడు ప్రబంధరూపమున రచించి శ్రీ వేంకటేశ్వరునకు కృతినిచ్చినాడని వివరణ. ఇదియే షష్ఠ్యంతములలో "రామానుజవిజ యాంక గవీ మధుర శమోదమాన వేంకటపతికిన్" అని చెప్పబడినది. ఈతని కవితాశక్తి యసమానమని 'అలంకారిక సమ్మతోజ్జ్వల కవిత్వా గాధ' అని యాశ్వాసాంతమున పేర్కొనబడినది. 'సరసగద్య పద్యరచనా భోజుండు' అను విశేషణ ముపయుక్తమైనది.

ఇతడు సంగీతశాస్త్రపారగుడు. వీణావాదనమున నేర్పరి "ఘన నయదేశీయ కమనీయ గ్రామమూర్ఛనా బహువిధన్యాస ధన్యాసమాన తాళమాన నానానూన తానవితాన భంగీతరంగిత సంగీతవిద్యావిశార దుండును, వీణానినాద వినోదభూలోకనారదుండును" అని యవతారిక యందుగలదు. ఈతని సంగీతవిద్యానైపుణ్యము హాహాహూహూ గంధర్వుల మించినదని యిట్లు వేంకటపతి ప్రశంసించినాడు.

శా. హాహాహూహూలు గానగర్వమున నాహాహూహూవంచున్ స్వరా
రోహ ప్రక్రియ.............................వృథా
సాహంకారులు మర్త్యగాయకులు జోడా ? నీకుపాండేశ్వర
స్నేహాలంకృతవంగలాన్వయమణీ ! నీనాకవిగ్రామణీ !

ఈతడు మన్నారురంగనిగూర్చి పదములు చెప్పినట్లుగా "శ్రీమన్నరురంగాధిపనామాంకిత గేయకల్పనా సుతమణికిన్" అనియు "శ్రీమన్నరురంగాధిపరామానుజగుణ గణాంకరచనాముదితా" అనియు కవిషష్ఠ్యంత సంబోధనలలో చెప్పియున్నాడు. మన్నారు రంగముద్ర గల పదములు నేడు లభించుచున్నవి. ఈపదము లీతని చివరి నివాసస్థానమగు [1]మన్నారు పోలూరుగ్రామమున వెలసియున్న మన్నారు రంగని పై రచితములైనవి. సురవంజిరాగమున నున్న 'శివదీక్షాపరురాలనురా' అను మనోహరపద మీతని రచితమే.

ఇట్టిమహనీయునకు శశాంకవిజయమును కృతినిచ్చి ధన్యుడైన వెంకటపతికవిగూర్చి విశేషములు మనకంతగా తెలియరాలేదు. కృతిపతి తన్నుగూర్చి యీక్రిందివిధముగా చెప్పినమాటలలో నీతడు శ్రీరంగేశ్వరభక్తుండనియు, శేషము కృష్ణసుధీతనయుడనియు నింతకుమున్నుకొన్నికృతులు రచియించెననియు తెలియుచున్నది.

క. నను రంగేశ్వర పదయుగ
ఘనతరభజనానిరూఢ కవితాసామ్రా
జ్యుని శేషము కృష్ణసుధీ
తనయునిఁబిలిపించిపలికె దయదయివాఱన్.

1. మన్నారుపోలూరు గ్రామము ఉత్తరార్కాటుజిల్లా యందున్నది- ఈతని మొదటి నివాసమీమండలములోని చెట్టిపట్టణము.

The Carnatic Music Composers T. S. Vasudevan. Journal of the Madras University Vol. X Pages 146-147.

2. చూడుడు. తిమ్మావఝ్ఝలకోదండరామయ్యగారి వ్యాసము భారతి.

చ. ఆసదృశభక్తి సద్గురుకటాక్షముగాంచి సమంచితాత్మతన్
బిసరుహమాకరందరసపేశలకౌశలవన్మృదూక్తులన్
రసికులకింపుగాఁగృతి పరంపరలన్ రచియించికీర్తిచే
నెసగితివయ్య వేంకటపతీ! భళి! శేషము వంశసత్కృతీ!

కాని యీతని కృత్యంతరములేవియు లభింపలేదు. ఇష్టదేవతాస్తుతిలో కందాళరామానుజాచార్యులను తనగురువును పేర్కొనినాడు. గద్యయందుగూడ విశేషములు లేవు.

"ఇది శ్రీజానకీరామచంద్ర చరణారవిందవందన కందళితానంద కందాళరామానుజ గురుచరణసేవాసమాసాదిత సాహితీవైభవ శేషము కృష్ణయార్య తనూభవ సుకవిజనవిధేయ వేంకటపతి నామధేయ ప్రణీతంబైన శశాంకవిజయంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము"

శశాంకవిజయము

కథాసంగ్రహము

పరమపవిత్రుడగు నత్రిమహాముని తనభార్యయగు ననసూయతో సంతానము బడయుటకొఱకు హిమవత్ పర్వతప్రాంతమునకువచ్చి, యనసూయ కచ్చటివిశేషముల నెఱింగించెను. అచటనుండి ముందునకు వెడలుచుండ బదరికాశ్రమము వారికి గోచరించెను. అచటనే యత్రి మహాముని నిలిచి ఘోరతపస్సు చేయసాగెను.. హరహరబ్రహ్మలాతనికి ప్రత్యక్షమై వరముఁగుమని కోరిరి. అంతనాతడు త్రిమూర్తుల వంటి ముగ్వురు కొమారుల నిమ్మనెను. అప్పుడు త్రిమూర్తులు తామే పుత్రరూపములనుధరించి యనసూయకు జన్మించెదమని చెప్పి యంతర్హితులైరి. అవెనుక, విష్ణునంశమున దత్తాత్రేయుడు, శివునియంశమున దుర్వాసుడు, బ్రహ్మయంశమున చంద్రుడును జన్మించిరి. బ్రహ్మయు తన యంశమున జన్మించిన చంద్రుడు దినదినప్రవర్ధమానుడై యుండ నొకసారివచ్చి యాతనికి గాండీవాద్యాయుధములనొసంగి, రాజపట్టము

నిచ్చి, యాతడు పాలించుటకు ప్రతిష్ఠానపురమను నొకపట్టణము నిర్మింప విశ్వకర్మకు నియమించెను ఇది ప్రథమాశ్వాసకథ.

ద్వితీయాశ్వాసమున విశ్వకర్మ నిర్మించిన ప్రతిష్ఠానపురవర్ణనతో ప్రారంభము. అచట చంద్రుడు నివసించుచుండెను. గురునియొద్ద చదివినగాని వివేకముగలుగదనియెంచి, అత్రిమహాముని చంద్రుని బృహస్పతి వద్దకుపంపెను. బృహస్పతియు చంద్రుని రూపవినయగుణంబులకలరి, తన భార్యయగు తారను బనిచి, యీ క్రొత్తశిష్యుని యాదరముతోనన్నపానాదులనిడి పోషణ సేయుమనియప్పగించెను. చంద్రుడు శ్రద్ధగా గురుముఖమున సకలశాస్త్రములును త్వరలోనేర్చెను. ఇంతలో క్రమక్రమముగా నాతనికి యౌవనవసంతోదయమయ్యెను. తొలుతనే యాతడు చక్కనివాడు, ఆ వెనుక యౌవనోదయమైనవాడు. సకల కళారహస్యములను నెఱిగినవాడు. ఆయన గురువునింటనుండుటచే నితరాంగనలకు వాని చక్కదనము పూచినసంపెగ మధుకరాంగనలకుఁబోలె నంటరానిదయ్యెను. బృహస్పతిభార్య తార, తానింటనేయుండునదిగావున చంద్రునిజూచి మోహమున తత్తరింపుచు, నాతనికి శృంగారచేష్టలమూలమున తన మనోభావము వ్యక్తముసేయుచుండెను. వయసులోనున్న చంద్రుఁడును తారనుజూచి మోహించియు, గురుగృహమగుటచే తనమనసులో దానినణచి, ప్రవర్తింపుచుండెను. ఇరువురును క్రమక్రమముగా సమాగమమున కువ్విళ్లూరుచుండిరి. ఇంతలో వారికోర్కెలీడేరెనన్నట్లు వసంతకాలమువచ్చెను. ఇంద్రుడు యాగముచేయదలచి బృహస్పతికి కబురంపెను. బృహస్పతి యింద్రునియాజ్ఞగాన, తాను పోయివచ్చెదనని యంతవఱకు చంద్రుని జాగరూకతతోఁ జూడమని చెప్పి వెడలిపోయెను.

తృతీయాశ్వాసము తారాచంద్రసమాగమ ఘట్టము. తార, చంద్రునిఁజేరి తనమనోరథమునుదెల్పఁగా చంద్రుడామెకు, కులవధూధర్మములెఱింగించి, ధర్మశాస్త్ర సంప్రదాయములుదెలిపి, యా వెనుక నామెపొందెడి బాధలనుదెల్పును. కాని యామె చంద్రునికన్న నాలుకాకు లెక్కువచదివినది యగుటచే, నాతని నోడబఱచి, మన్మథ

సౌఖ్యాంబుధి నోలలాడును. అప్పటినుండి గురువు తిరిగివచ్చువఱకు వారిసౌఖ్యమునకే యంతరాయమును గలుగలేదు.

నాల్గవయాశ్వాసమున బృహస్పతి యజ్ఞము నిర్వర్తించివచ్చి, తారాచంద్రులవైఖరి నీక్షించి, తనభార్యపై కోపించి చేసినపని చెప్పమనెను. ఆమెసత్యము పలుకగా నాతడు శాపమీయబోయెను. కాని కాళ్లపై బడుటచే, నామెనువదలి చంద్రుని శపింపఁదలచి, యదియు సరికాదని యాలోచించి, చంద్రునితో చదువుపూర్తియైనది, గనుక స్వగృహమునకు నేగుమని దీవించిపంపెను. చంద్రుడును ఖిన్నమనస్కుఁడై వెడలిపోయెను.

ఆనాటినుండి తార చంద్రవిరహము నోర్వలేక యాతనిసమాగ మెప్పుడైన నగునాయని కాంక్షించుచుండెను. ఇంతలో నామె స్నేహితురాలగు నొకతాపసి చూచుటకు రాగా చంద్రునికామెచేత కబురంపెను. ఆమెచంద్రుని చూడబోవగా నాతడును తారావిరహమున నతి ఖిన్నుడైయుండెను. తాపసి తారచెప్పిన సందేశమును విని యామె చెప్పినప్రకారము నొకసాంకేతికస్థలమునకువచ్చి, తారకొఱకు నిరీక్షించుచుండెను. తాపసిచేసినపనికి మెచ్చుకొని తార యచ్చటికి తనభర్తను కికురించి, వచ్చి చంద్రునితోగూడి చంద్రునిరాజధాని కేగెను.

బృహస్పతియు తారయింటలేమి కనుగొని తనదివ్యదృష్టివలన జరిగినదంతయు నెఱింగి, చంద్రునికి తగినశాస్తియొనర్చెదనని చెప్పి, యింద్రునివద్దకేగి చంద్రునిపై యుద్ధమునకుబోవ నాజ్ఞాపించెను. ఇంద్రుడు తొలుత యుద్ధముచేయకుండ నొకదూతను పంపెను. కాని చంద్రుడు వానిమాటలను లక్ష్యపెట్టక యుద్ధమునకు సన్నద్ధుడయ్యెను.

పంచమాశ్వాస మింద్రచంద్రు లిరువురును ఘోరముగా పోరుచుండు ఘట్టముతో ప్రారంభము. ఆ యుద్ధము మిక్కిలి విపరీత స్థితికిరాగా త్రిమూర్తులు ప్రత్యక్షమై వారిని విచారించి చంద్రునితో తారను తిరిగి గురునకిమ్మని యాజ్ఞాపించిరి. అంత నప్పుడే గర్భ

చిహ్నలు కన్పించుచున్న తారను గురునకొసంగెను. బ్రహ్మయు నమృతరశ్మియగు చంద్రునిపొందినదిగావున యామెపరిశుద్ధయని వెల్లడించెను. బృహస్పతి స్వీకరించెను. అంత నవమాసములు నిండినవెనుక తార బుధుడను పుత్రుని గనెను. పుత్రోత్సవము సేయుటకు చంద్రుడు రాగా బృహస్పతి యాతడురావలసిన యగత్యములేదని నివారించెను. తనకొమారుడేయని చంద్రుడు పలికెను. వారికి వాదమయ్యెను. బ్రహ్మ తిరిగివచ్చి తారనడుగగా నామె బుధుడు చంద్రునికొమారుడే యని చెప్పెను. చంద్రునికి బృహస్పతిచేత బుధుని నిప్పించి బ్రహ్మయాతనికి గ్రహమండలాధిపత్యము నొసంగెను. చంద్రుడు తారాబుధులతో తనపురి కరుదెంచి సౌఖ్యముననుండెను. అప్పుడు దక్షప్రజాపతి యశ్విన్యాదినక్షత్రరూపములైన తనయిరువదియేడుమంది పుత్రికలను చంద్రునికిచ్చి వివాహముగావించెను. ఆతడు వివాహమైనవెనుక తనరాజశబ్దము సార్థకముగావించుటకు రాజసూయయాగ మొనరించెను. తారకా సార్వభౌముఁడుదారరీతి ధరణిఁ బాలించునపుడంచితంబుగ ప్రపంచ మంతయు నమృతమయమై మించెను.

వేంకటపతి మృదుమధురరీతిని నీకావ్యమును రచించెను.

"లోకములోన కొందఱబలుల్ సతులన్ దనియింపలేక న
స్తోకమనీష నన్యపురుషుల్ తమభామలనంటకుండఁ దా
టాకులలోనవ్రాసిరి పరాంగనఁగూడిన పాపమంచు న
య్యాకులపాటు జూచి యిపుడాకులపాటొదవెన్మనంబునన్.

అనుపద్యమును,

"ఎన్నిపూవులన్వ్రాలదు తేటియట్లె మగవాడనువానికి దోస మున్నదే" యనుపద్యపాదము నెఱుగనిచదువరులు తెనుగునాటలేరు. కావ్యముశృంగారరస ప్రధానమైనను వరాంగవర్ణనమొదలగునవి లేవు. ఈకథను నంతకుమూడుశతాబ్దుల పూర్వము శ్రీనాథ మహాకవి కాశీఖండమున రచియించియున్నాడు. ఆందుచతుర్థాశ్వాసమున 194 నుండి 230 వఱకును 36 గద్యపద్యములలో నిది ప్రౌఢతమరీతిని రచితమైనది.

ఈకథకు మూలప్రాయమైన తారాశశాంక ప్రణయపరిణామ మమును శ్రీనాథమహాకవి యొక్క పద్యమున నిట్లు చెప్పియున్నాడు.

గీ. చదివెచంద్రుండు ధర్మశాస్త్రంబుఁదొలుత
పరమతాత్పర్య విశ్వాసభ_క్తిగరిమఁ
జదివె చంద్రుండు కామశాస్త్రంబు పిదప
తలిరుఁబాన్పున ననుర_క్తితారయొద్ద.

అయినను నందే నీతిబోధకమును నిరవద్యమునగు నీ క్రింది పద్యము రచియించియున్నాడు.

సీ. భువనైకధన్విచే పుష్పాయుధునిచేత
ప్రసవా_స్త్రమున నేటుపడనివాఁడు
అతిగాఢమైన క్రోధాంధకారమ్మునఁ
గన్నులనంధుండు గానివాఁడు
నిర్నిబంధనలోభ నిద్రాభరంబునఁ
పారవశ్యంబు చేపడనివాఁడు
లక్ష్మీకటాక్షలీలాసీధుమదమున
మనములోపల నన్నుకొననివాఁడు

గీ. నేఁడుభూపతిగలిగెనావాఁడు నృపుఁడై
విశ్వధాత్రీజనులపాలివేల్పుగాక
బాహ్యశత్రులఁ బరిహరింపంగవచ్చు
సంతరారుల నిర్జింపనలవిగాదు.

వేంకటపతి తారాశశాంకమునందే కాక, యాకాలమునఁబుట్టిన ప్రబంధములలో నీనైతికదృష్టి కొఱవడుటచేత వానిని కేవలము కామ శృంగార ప్రబంధములని విమర్శకులు నిరూపించినారు. ఆయన బహు ప్రజారంజకములగు నీప్రబంధము లాకాలమున సాంఘికాభిరుచులను చక్కఁగఁదెలుపుటచేత వాఙ్మయచరిత్రమున శాశ్వతస్థానమును సంపా దించినవి.

బ్రౌనుదొరవారి నాకర్షించిన గ్రంథములలో నీప్రబంధమొకటి. వారు దీనికి 'చకోరీయము' 'తారకము' 'తారాభావప్రకాశిక' అను మూడు వ్యాఖ్యానములు రచియింపఁజేసిరి. గ్రంథమును ప్రతులతో సంప్రతించి పాఠభేదములను నిర్ణయించిరి. ఆంగ్లేయభాషలో సూచికలు వ్రాసిరి. మఱియు నిందలి పదముల కకారాది యనుక్రమణిక వ్రాయించిరి. వాని నిందు పొందుపఱచుచున్నాను.

—: తారాశశాంకవిజయము - ప్రతులు :—

బ్రౌనుదొరగారి వివరణములు

సంఖ్య 807. The Tara Sasancavijayam.

This copy contains the fair transcript of the correct text accompanied by the various readings.

808. At the end of the manuscript seven pages contain short notes and illustrations by C. P. Brown.

809 & 810. Two volumes.

By striking out extranous matter this poem might be greatly abridged and thus rendered more popular. Thus begin at Book I verses 97-105, 94, 121.124.

What title shall I give the commentary తారాప్రకాశిక ? తారాభావప్రదీపిక ? The name of the Advaita Comm. on Bhag and this would be consentaneous to *the*......humor of the poet. This name the Tarabhava Dipika is greatly landed by... ...A practical commentary. I since invented a name still more apt and which he prefers చకోరీయం This name wholly unprecedented and singularly adopted to the title Chandra.

810-817. Copies of the work.

818. (1) The manuscripts I used are thus discriminated.

A, My large quarto paper copy from which this one was transcribed,

B. Manuscripts on palm-leaves belonging to Venkut Ramaya in the College.

C. A small paper copy different in the middle since comparing the above. I have obtained four other manuscripts which have established the text finally 1829.

The Tara Sasanciyamu
An original Telugu poem
By Candala Venkatabati.

The text of the present copy is given as arranged by my very learned friend Advaita Brahmaya Pandit of the Zilla Court of Masulipatam. The interlineations show the various readings that appear in other manuscripts collated by me.

Much of this book is not intelligible to any but very good scholars without a comment which is yet to be made.

I wrote the above note in 1827 and since that time a Complete Commentary has been written and an Index subjoined.

819. The tale of Tara Complete with commentary in three volumes 1830.

This copy has been revised by the very learned Zuluri Appaya; and the chief corrections are either in his handwriting or my own. Much has been blotted out with a view to shortening the notes by excluding needless repetitions.

Motto from ,Manu Smr. 2-93 etc. 93. A man by the attachment of his organ to sexual pleasures incurs certain guilt but by wholly subduing them he thence attains heavenly bliss.

Or as a motto given in Smriti verse entered under IV-18.

నారీశతాపరాధాంవాపుష్పేణాపిన తాడయేత్
దోషాన్నగణయే త్స్త్రీగుణానేవ ప్రకాశయేత్

820. Incomplete with Chakoriya Commentary.

821. Complete with do
Brown's Note.

The adventures of Tara ; or Stella and the Genius a celebrated fairy tale, written in Telugu verse and illustrated with a commentary composed under the direction of C. P. Brown by the learned Narasimhachari in the yēar A. D. 1828. In the present copy the voluminous dedication, preface etc. omitted 1843.
822. Sasanka vijayamu with Taraka Vyakhyanasahitamu.

తారాశశాంక విజయము

Tarasasankavijayamu

or

Adventures of Venus and Adonius

a Celebrated Telugu Poem

This is a new edition of the Poem. The commentary was written in the year 1827. And in 1853 it was strongly revised. Hence corrction made in every page.

The present volume contains the learned Editor's final corrections. The comment is named తారకం.

823 శశాంకవిజయశబ్ద సూచిక - శశాంకవిజయమునఁ బ్రయుక్తము లగు పదము లిందు వర్ణానుక్రమణికగా వ్రాయబడినవి. ఆశ్వాస పద్యసంఖ్య తెలుపఁబడియున్నది. ఇది బ్రౌనుదొరగారి యాజ్ఞననుసరించి చేయబడినది. గ్రంథాంతమున,

“ఈ తారాశశాంకమును గురించన సూచిక మహారాజరాజశ్రీ బ్రౌనుదొరవారి హుకుంప్రకారము మచిలీపట్నమందు ౧౮౩౦ సంవత్సరంలో యిదికుదిర్చేటందుకుగాను నలుగురిమనుష్యులకు నాలుగు మాసములు తగిలి ఉన్నది.

అంక - అవతారిక పం ౨౦

అంకము - పం ౧౨౪ అంకమున ప్ర. ౪౫.

అంకస్థితి చ. ౧౪౬.

An alphabetical index of words used in the Sasankavijayam the number of the verse and the counts where they occur are also marked opposite to each and every word. The index was prepared in the year 1830 at Masulipatam under the instructons from C. P. Brown. If is stated that four men were engaged to complete this concordence which was completed in four months.

—: కుందుర్తి వేంకటాచలకవి :—

విజయరంగ చొక్కనాథుని యాస్థానమున వేరొక ప్రసిద్ధకవి వేంకటాచలకవి. ఆతని వంశక్రమము.




పై వారిలో నహోబలకవి గజపతి యశ్వపతుల సభలో పండిత శ్రేణిని జయించెను. గోవిందయ కుందుర్తిని వాసస్థలముగాఁ జేసికొనెను. మఱియు నాతఁడు భారతీపరిణయమను కావ్యమును వీరవేంకటపతిరాయలకు నొసంగి యాతనిచేత సమ్మానముగాంచెను. అది యిప్పుడు గాన వచ్చుటలేదు. రామయ పాండ్యవసుధాధ్యక్షుని మంత్రియైనాడు. వీర

వెంకటపతిరాయలు క్రీ. శ. 1680-1700 ప్రాంతముల నున్నవాడు. వెంకటాచలకవి తన్నుగూర్చి చెప్పుకొనునప్పుడు క్రీ. శ. 1704-1732 వఱకును మధురను పాలించిన విజయరంగ చొక్కనాథుడు తన్ను బహూకరించినట్లుగా నిట్లు చెప్పుకొన్నాడు.

చ. కవిజనకల్పకం బఖిలకావ్యరసజ్ఞుఁ డఖండపాండ్య భూ
ధవుఁడు మహానుభావుఁడతి ధార్మికుఁడర్యగవజ్రధారియై
న విజయరంగ చొక్కనరనాథుఁడు నీకవితాసమగ్రవై
భవములు మెచ్చి నీకొసగె భర్మమణీశిబికాదిసంపదల్.

దీనిఁబట్టి యీతఁడు క్రీ. శ. 1732 వెనుకనే గ్రంథరచనము గావించినట్లూహింపవచ్చును.

ఇక వెంకటాచలకవి 'కథాశుకవి యని కీర్తిఁగన్నవాఁడు. ఇతడు పెద్దచదువరి. ఆశుమధుర చిత్రవిస్తరములను చతుర్విధకవితలు చెప్పుట యందు నేర్పరి. నాటకములు చాటుకృతులు పెక్కులు రచియించినాడు. ముఖ్యముగా భారతభాగవత రామాయణములు వచనకావ్యములుగా రచించినాడు. కాని నేడవి యేవియుఁ గానరాకున్నవి. ఈ విషయ మీక్రింది పద్యములలో నీతఁడు రచించిన మిత్రవిందా పరిణయము అను ప్రబంధావతారికవలన తెలియుచున్నది.

గీ. అతఁడు సామాన్యుఁడే షట్సహస్రకుల స
రిత్పతుందు ర్తి ధవళాంతరీపదీప్తుఁ
డాగమాంచలపద్యావిహారకారి
విశ్వపరితోషకారి గోవిందశౌరి.

చ. పటుతరగోస్తనీ మధురపాకసమంచితమూరసోర్మి ప
ర్యటమగు భారతీ పరిణయంబను కావ్యమొసంగి వీర వేం
కటపతిరాయలందనిపికాంచె మణీకనకాభిషేకము
తక్కటగతినమ్మహామతి ముఖస్థితిశోభియశోభిరాముఁడై.

సీ. చదివినావేమేమి చదువ యోగ్యంబులో
యవియెల్ల నిస్సంశయంబుగాఁగ
వచనకావ్యములుగా రచియించినావు భా
రత భాగవతములు రామకథయు
ఘటియించినావు ద్రాక్షాపాకముగబహు
నాటకంబులు సమున్నతి సెలంగ
జాటించినావు దిక్కోటరంబుల బుధ
కోటిమెచ్చనపారచాటుకృతులు

గీ. అర్థగుంఫసముజ్జృంభితాశుమధుర
చిత్రవిస్తరకవితాప్రసిద్ధినీకు
సహజమేకద పాండ్యభూజానిసభఁగ
ధాశుకవి యనఁగీర్తిఁ జెన్నలరినావు.

క. అటుగానఁదలఁప నీకే
మిటనింతకొఱంత లేదు మేల్మేలు భవ
త్పటుకావ్యహారమునకును
ఘటియింవుము నాయకమణి గా రంగపతిన్.

సీ. ఘనుఁడు మీ ముత్తాత కవ్యహోబల మంత్రి
గజపతి సభ నుతుల్ గాంచి మించె
మీ తాత గోవింద మేదినీసురుఁడు రా
యలచేతఁ గాంచె స్వర్ణాభిషేక
మనఘుఁడు మీ తండ్రియును పాండ్యచొక్క నా
ధావనీశ్వరున కత్యాప్తుఁడయ్యె
నీపూర్వవంశజుల్ నెలకొని రాయసం
స్థానంబున నెకీర్తినవధరించి

గీ. రనుచులోకప్రసిద్ధులై తనరిరిగద
నీవువారలవలెనె యనేక కావ్య
నాటకసమగ్ర రచనలమేటివైతి.........
కార్తికమహాత్మ్యమను కృతిలో నిట్లు చెప్పియున్నాఁడు

సీ. ఆంధ్రభాషనె ప్రోడయనుమాత్రమేకాదు
సంస్కృతంబుననీవు సరసమతివి
లక్షణగ్రంథసారము తెలుంగుదువైన
లక్ష్యముల్ నీకులాలాజలములు
తతచతుర్విధకవిత్వప్రౌఢి నీసొమ్ము
నవరసప్రతులు నీనవ్యకృతులు
నీదీవనలుసమున్నిద్రసంపదలిచ్చుఁ
బూజలందితివి భూభుజులచేతఁ

గీ. జాటుకృతులును బహువిధనాటకములు
బంధురతరార్థపూర్ణప్రబంధములును
రచనగావించి దేవతార్పణముచేసి
పాండ్యవిభుచేఁబ్రభుత్వసంపదలుగనితి.

గీ. అనఘకార్తికమహాత్మ్యమాంధ్రభాషఁ
గబ్బమొనరంచిమదభీష్టకలనచెలఁగ
బంధురకృపాలహరికి గోపాలహరికి
సంకితమొనర్చుమిదియ మాయభిమతంబు.

అనిచెప్పినట్లు వ్రాసికొన్నాఁడు. కాని కవి కృతులలో నేటికి లభ్యమైనవి పై రెండే - వానివివరము.

—: మిత్రవిందాపరిణయము :—

ఇదియాఱాశ్వాసముల ప్రబంధము మిత్రవిందాకృష్ణుల వివాహమిందుల యితివృత్తము. అశ్వాసాంతగద్య.

"ఇది శ్రీమదలమేలుమంగనాథ వేంకటనాథ దయాసమేధమాన చతుర్విధ కవితాధురంధర, మంత్రియుగంధర కుందుర్తి రామయ మనీషిపుత్ర ఆపస్తంబసూత్ర శాండిల్యగోత్రపవిత్ర నిరసూయాపర కవివరవిధేయ కథాశుకవి వేంకటాచలకవి నామధేయ ప్రణీతంబైన మిత్రవిందాపరిణయంబను మహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

ఈతఁడు తనగురువగు రేవూరి కాళహస్తిదేశికు నిట్లు నుతించి నాఁడు.

సీ. అష్టభాషామహితాశు ప్రబంధని
ర్మితచాతురీధుర్య శతసహస్ర
లేఖనీలేఖ్య కలితకవిత్వాపాద
నాహృతవ్యస్తాక్షరాది చతురుఁ
జలజిహ్వాకాచలాచల జిహ్వాకాచల
జిహ్వాకారచనా విశేషనిపుణు
నోష్ఠ్యనిరోష్ఠ్యవర్ణోదర్ణకల్పనుఁ
గఠినత్రిపాద సంఘటనకుశలు

గీ. నఖిలలక్షణ లక్ష్యసిద్ధాంతపాణి
నీయకాణాదకాపిలానేక తంత్ర
కోవిదుని రేవురి కులాబ్ధికుముదబంధుఁ
జెలఁగి మది కాళహస్తి దేశికుభజింతు.

ఈ కాళహస్తిదేశికుఁడు గాధేయోపాఖ్యానాది మహాప్రబంధములు రచియించిన రేవూరి అనంతయకగ్రజన్ముఁడు అనంతయచరిత్రమున నీతని యుదంతము తెలియగలదు.

మిత్రవిందాపరిణయమున కథాక్రమము.

శ్రీకృష్ణుఁడష్ట మహిషులలో నొకర్తెయగు మిత్రవిందను పెండ్లియాడుట యితివృత్తముగల మిత్రవిందాపరిణయమున, ప్రథమాశ్వాసమున, అవతారిక, కవివంశానుక్రమణిక, షష్ఠ్యంతములు, కథాప్రారంభము, అవంతీపుర వర్ణనము, పుష్పలావికాజనవర్ణనము, రాజవర్ణనము, రాజనీతి, వెంకటాచల వర్ణనము, శేషాద్రివర్ణనవచనము, గ్రీష్మఋతువర్ణనము, వర్షర్తు వర్ణనము, శరదృతువర్ణనము, శేషశైలాధినేతృవర్ణనము గలవు.

ద్వితీయాశ్వాసమున దౌహృదవర్ణనము, మిత్రవింద బాల్యక్రీడాభివర్ణనము, యౌవనదశాభివర్ణనము, వసంతవర్ణనము, వనవిహారము, వనవిహారరగడ యనునవి గలవు.

తృతీయాశ్వాసమున కాసారవర్ణనము, కాసారవర్ణన వచనము, జలక్రీడాభివర్ణనము, మనోజపూజాభివర్ణనము, చిలుకరాయబారము అనునవి గలవు.

చతుర్థాశ్వాసమున మురహరువర్ణనము, జయసేన కుమారికా వర్ణనము అనునవి గలవు.

పంచమాశ్వాసమున అస్తమయవర్ణనము, జ్యోత్స్నాభివర్ణన వచనము, చంద్రదూషణ సూర్యోదయ వర్ణనమును గలవు.

షష్ఠాశ్వాసమున మిత్రవిందాభివర్ణన వచనము, వసుదేవకుమార వర్ణనము, రణాభివర్ణనము, రణరంగవర్ణన వచనము, రత్నాకరవర్ణనము, మిత్రవిందా వివాహము అనునవి గలవు. ప్రథమాశ్వాసమున 149, ద్వితీయాశ్వాసమున 121, తృతీయాశ్వాసమున 75, చతుర్థాశ్వాసమున 147, పంచమాశ్వాసమున 86, షష్ఠాశ్వాసమున 145, మొత్తము మీద 723 పద్యములు గలవు. ఇందు గద్య సంప్రదాయములుగల వచనములు తప్ప వేరులేవు. ప్రాచీనకవుల పోకడలు ముఖ్యముగా రామరాజభూషణునివి పెక్కులు గలవు. మిత్రవింద స్వయంవరము నందలి రాజవర్ణన నైషధము ననుసరించినది. దీనిని వర్ణనప్రబంధమని చెప్పనగును.

ఇందు లక్షణ విరుద్ధములైన, కరఁగినీరై పడీని, ఎల్లానుకూర్చేది మొదలగు ప్రయోగములున్నను నవి యుత్తరాంధ్ర కృతులలో సామాన్యమే.

ఈ గ్రంథము క్రీ. శ. 1888 సంవత్సరమున "అముద్రిత గ్రంథ చింతామణి" పత్రికాధిపతులచే నెల్లూరిలో ముద్రితమై ప్రకటితమైనది.

మఱియు నీకవి తీర్థపురపాలకుఁడును బలగోలు లింగారెడ్డికుమారుఁడును నగు వేంకటాచల నృపునియానతిచేఁ "కార్తికమాహాత్మ్యము" గోపాలస్వామి కంకితముగా నొనర్చెను.

—: కార్తిక మాహాత్మ్యము :—

ఇది యాఱాశ్వాసముల పద్య ప్రబంధము

ఇతఁడు గ్రంథావతారికలోఁ దన్నుఁగూర్చి వ్రాసికొనిన విషయమీావఱకు నుదాహరించితిని - మఱియు నిందే కవి యిట్లు చెప్పియున్నాఁడు.

సీ. ఏ రాజధానికి నిరుచక్కి గోపాల
 వేంకటాచలపతుల్ వెలయుచుందు
రేపురి మధ్య సందీపితుండగుచు నం
 దీశ్వరుండు వసించు గృపను మనుప
నే పట్టణం బయోధ్యాపురంబునకు జో
 డై పరాభేద్యమై యలరుచుండు
నేపుట భేదనం బాపూర్ణ రుచి రాష్ట్రి
 లక్ష్మీ నివాసమై లలిఁజెలంగు,

గీ. నట్టి తీర్థపురీ పాలనాతివేల
ధర్మపథవర్తి చంద్రికా ధవళకీర్తి
తార్క్ష్యవాతాత్మజ ధ్వజాద్య ఖిలబిరుద
విజిత చక్రాయుధార్జున విభవుఁడతఁడు.

...పాండ్య గజకేసరి బిరుదాంకుండు ... రాయవేశ్యాభుజంగుఁడు...పంటకుల కలశ పాథోనిధాన రాకాతమీాన బలగోలు లింగ నృప పుంగవకులపాలికా పేర్యంబికా నిర్భరగర్భ శుక్తి ముక్తా యమానుండునగు...వేంకటాచల మహీమహేంద్రుండు...నన్నుఁ బిలిపించి యిట్లనుచుఁ బలికె,

ఈ తీర్థపురి తిరుచినాపల్లి జిల్లాలో తిరుచనాపల్లి కుత్తరముగా నిరువదియేడుమైళ్ల దూరములో నున్నది. ఇప్పుడు "తురైయూరు" అని వాడఁబడుచున్నది. ఈ తురయూరునుగూర్చి కృతిభర్తకుఁడగు లింగారెడ్డినిఁగూర్చి యనుబంధముఁ జూడుఁడు.

కవిత్వ విషయమున - ఈతని కవిత్వము తాను వర్ణించికొనినంత ప్రౌఢమును నిర్దుష్టమును ధారాళమును గాదుగాని దక్షిణ దేశమందలి యాంధ్రకవిత్వములోఁ గొంత మెఱుఁగుచూపకపోదు. శైలి తెలుపుటకు రెంటినుండియు రెండు పద్యము లుదాహరించెదను.

చ. చిందిల తేనియల్ చినిఁగి చీలికలౌ చిగురాకు లెంతయున్
గందిన పూవు గుత్తులు వకావకలౌ ఫలమంజరుల్ పెనల్
చెందిన లేఁత తీవులు చలించిన పుల్గులు ప్రేలుకొమ్మలై
డిందియుఁ బొల్చెనవ్వని కడింది మిటారులకేళి వైఖరిన్-మిత్ర.

ఉ. ఎందుకుఁ గోపమోసరసి జేక్షణ యెక్కడ డాఁగినావయో
యిందు ముఖీవతంసమ యొకించుక ముందరవచ్చి నిల్వవే
బృంద సుధారసం బొసఁగవే పికవాణి చలించుచున్ననా
డెందము చల్లసేయవె కడింది తనంబులు మాని మానినీ!-కార్తి.

—: బద్దెపూడి ఎట్టిభూపతి - యువజన హృదయానందము :—

విజయరంగ చొక్కనాథుని కాలమునే, శేషము వేంకటపతి తారాశశాంకవిజయము వెలయించిన కాలమునే, బద్దెపూడి పురాధ్యక్షుడగు నెట్టిభూపతి యాకథను 'యువజన హృదయానందమను' పేరిట నొక ప్రబంధముగా రచియించి యున్నాడు. ఇందు రెండాశ్వాసములు మాత్రమే లభించినవి. ప్రథమాశ్వాసము నవతారికనుండి యీ క్రింది విశేషములు తెలియుచున్నవి.

ఈతడు చతుర్థకులజుఁడు - కలువకొండ గోత్రుఁడు




పై విషయము లీ క్రింది పద్యములవలనఁ దెలియుచున్నవి.

క. శ్రీ రమ్యసారవైభవ
గోరాణ్ణిభ కలువకొండ గోత్రపవిత్రున్
సూరిజన స్తుతిపాత్రుని
భూరి గుణు......పోతన నెంతున్

క. ...............
......మూర్తి పార్థివధుర్యున్
శ్రీ వరపాద సరోరుహ
సేవానిధి రిపుమదేభ సింహునిఁ దలఁతున్

గీ. .................. ...
అతుల ఘనకీర్తినమిత శౌర్యాష్టమూర్తి
మూర్తి నృపవర్యు నుతియింతు ముదము మీఱ

గీ. ............
...ఎఱ్ఱ భూవరతనూజు
మజ్జనకు కృష్ణమహీకాంతు మదిఁదలంతు

క. వినుతింతు మీనమాంబన్
జనసన్నుత శుభచరిత్ర.....

తక్కినకవులవలె, తమపూర్వులింతటి వారంతటివారని చెప్పక వారినందఱిని నిష్టదేవతాస్తుతిలో దేవతలవలె స్తుతించుట యెంతయు సమంజసమై యున్నది. మఱియు నీదృశరచన క్రొత్తయనియే చెప్ప వచ్చును.

ఇక కవిస్తుతిలో నొక్క రేపూరి యనంతయజ్వను మాత్రమే యిట్లు పేర్కొన్నాఁడు.

ఉ. పాయనిభక్తిమద్గురుల పాదసరోరుహయుగ్మమున్నుపా
ధ్యాయతనొప్పనప్పరధరామరవర్యుఁదలంచి, భారతీ
నాయకతుల్యు రేపురి యనంతకవీంద్రునిగొల్చి, భూరితే
జోయుతులైన సత్కవుల సొంపుదలిర్పనుతింతునెప్పుడున్

ఈ రేపూరి యనంతయజ్వ గాధేయోపాఖ్యాన, శ్రీముష్ణ మహాత్మ్య శివరహస్యఖండకృతులను రచియించిన మహాకవి. ఈతని గూర్చి మైసూరి వాఙ్మయమునఁ జూడనగును.

ఈగ్రంథమంతయును లభ్యము కాలేదు. కాని యుపలబ్ధమైన దానిని పట్టిచూడ, కవిత్వము జాతీయమై, జటిలత్వము కలిగి యుండును.

క. పొలువగునని మదిఁ బొగడుచు
కలికొకతఱినతనినెలమిఁ గవయఁగదలఁచున్
..............................

క. మననేకన్నికపై నీ
కెనసున్నది చెప్పితేని యిప్పుడెదానిన్
నినుఁగూర్చి పెండ్లి చేసెద
ననిమల్లనఁజంద్రుతోడ హాస్యమొనర్చెన్.

చ. వనితయుఁదాను నేఁగి హిమవత్ప్రముఖాఖిల భూధరంబులనీ
వినుతసరస్తటంబులను విష్ణుపదీముఖపుణ్యనిమ్నగా
ఘనపులినంబులన్ బదరికాగహనాది మహావనంబులన్
మునులరుదందునట్టి తపముల్ సలిపెన్ గడునిష్ఠమీఱఁగన్,

ఉ. అక్కజమైనధైర్య మహిమాతిశయంబులుకల్గునింద్రునిం
గుక్కుటమై యహల్యకడఁగూయఁగఁ జేసెఁ బ్రతాపశాలియై
మిక్కిలినొక్కుదర్పకుఁడు మెత్తనివాని సుధాంశువేడ్కనా
ప్రక్కనుజొక్కపావురపుఁ బల్కులుపల్కఁగఁ జేయజాలఁడే.

గద్య:— ఇది శ్రీమద్రామభద్ర పాదారవిందసుందరమకరంద పాన
తుందిలేందిందిరాయమానమానస, నిత్యసమారాధిత ప్రభాకర
చరణసారస, నిరంతరావార్యశౌర్య, మహదౌదార్య, సము
పార్జిత సంగ్రామార్జున జగనొబ్బ గండ, గండరగండ, నిశ్శంక
మల్ల, చౌహత్తమల్ల, దోహత్త నారాయణ, గుజ్జరిదళవిదారణ
సుకవిజనస్తుత్య, పల్లవాదిత్య, కలియుగ బేతాళ, గాయగోవాళ
జాళియామాళియాబందీకార, చంచుమలచూఱకార, బసవ
శంకర కేతనాంక, సమరనిశ్శంక, బలాత్కారాపహృతపాండ్య
రాజసప్తాంగ, త్రిభువనరాయ వేశ్యాభుజంగ, ధనకనకమణి
గణప్రపూరిత బుధజననికేతన, పరభయదగరుడకేతన, కేళాది
రాయ కనకకర్పూర వసంతరాయాది మహనీయ బిరుదవిచక్షణ,
శ్రితజనసంరక్షణ, పంటవంశపయఃపారావార తారకాకళత్ర
కృష్ణమహీమహేంద్రపుత్ర, దినేశసంకాశప్రకాశ, మధురదేశా
ధీశ, విజయరంగ చొక్కనాథధరానాథ వితీర్ణసువర్ణదండప్రకీర్ణ,
ధ్వజచ్ఛత్రపల్యంకికాప్రముఖ బహువిధ రాజలక్షణానుషంగ,
బుధవిధేయాంతరంగ, బద్యపూఁడి పురవరాధ్యక్ష యెఱ్ఱ
భూపాలహర్యక్ష ప్రణీతంబైన యువజనహృదయానందంబను
శృంగారప్రబంధంబు..........

ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తక భాండారము-గ్రంథసంఖ్య 390.

రౌద్రిసంవత్సర వయ్యాశినెల ౧౮ తేది గురువారము పద్యభాండారము వేంకటకృష్ణరాజువారి స్వామిరాజు వారితమ్ముడు తిరుపల్లిని వ్రాసినది.

## —: వెలఁగపూఁడి కృష్ణయామాత్యుఁడు :—

భానుమద్విజయము

ఈతఁడు తనగ్రంథమున నిచ్చిన వివరములు.

వెలఁగపూఁడి వారివంశవృక్షము.

లోహితస గోత్రము



(7) రామలింగము　　　నరసింహము (భార్య ఏలూరి అన్నయ కూతురు నారణమ్మ)

(9) నరహరి　　　అప్పమంత్రి　　　(8) వెలిగొండయ
భార్య బొప్పూడి శేషాద్రిమంత్రి కూతురు తిరుపతమ్మ

రామలింగము　　నరసింహము　　కృష్ణయ　　శ్రీరాముడు　　సాంబయ
(ఈతడే భాను మద్విజయ కృతికర్త.)
విజయరంగ చొక్కనాథుని దళవాయి యగు బొప్పూడి సాంబయ కృష్ణయకు మేనమామ. బొప్పూడి శేషాద్రి



సాంబయ (10)　　　　తిరుపతమ్మ కృష్ణయ తల్లి.

పై వంశవృక్షమునకు సంబంధించిన చరిత్రాంశములు.

1. ఈవంశమున తొలివాడగు 'అన్నయ' జన్నావులవారి మంత్రి. ఈజన్నావుల వారివంశమున కసవానాయనింగారు క్రీ. శ. 1414 లో మాచెర్ల చెన్నకేశవ దేవాలయమున వరుపుంబనిచేయించి నట్లు శాసనమున్నది.[1] క్రీ. శ. 1515 లో కృష్ణరాయలకాలమున కొండవీటి దుర్గరక్షకులలో జన్నావుల కసవాపాత్రుడు గలడు.

2. అన్నయకొడుకులలో మొదటివాడగు నాబళుడు విశ్వపతి రాయ మంత్రియై ధనము గాదెలను నింప నాతని వంశీయులు గాదె వారైరి. ఈతడు మధురరాజ్య సంస్థాపకుడగు విశ్వనాథనాయకుడు కాదగును.

3. ఎఱ్ఱమంత్రి చింతపల్లి సొంతముగ నేలుటచేత యాతని వంశీయులు చింతపల్లి వారైరి.

---

1 No 580 South Indian Inscriptionrs Vol.10, Page 32.

4. రామరాజు 'వెలఁగపూఁడి' కాణాచిగా చేసికొనుటచే నావంశీయులు వెలగపూఁడివారైరి. కృతికర్త యీవంశీయుఁడే.

5. గోపన, ఉత్కళదేశాధీశుఁడగు ప్రతాపరుద్రగజపతి దండెత్తి వచ్చినపు డాతని బలమును పిడుగువలె సంహరించుటచే నాతనివంశీయులు పిడుగు[1] వారైరి.

6. అన్నయపౌత్రుఁడు గౌరన పలనాటిలో 'దేశపాండ్య' అధికారమునుబొంది, తన యన్నకుమారుఁడగు రామరాజున కొసగెను.

7. హనుమంతునికొడుకు రామలింగము, పలనాటిసీమకు 'దేశపాండ్య' యై మిక్కిలి పేరుగడించెను. ఈతఁడు వెలుగోటివారి వంశీయులలో దరిసికుమార యాచమహీపతికి నాప్తమిత్రుఁడై యుండెను.

8. కృతికర్త పినతండ్రి 'కొండయ' మిగుల పరాక్రమశాలియై పాండ్యమండలమున పాళెగార్లచే కప్పములు గొనెను.

9. కృతికర్త తండ్రి నరహరి విజయరంగ చొక్కనాథునిచే నీ క్రిందివిధముగా సమ్మానితుఁడయ్యెను.

క. శ్రీవిజయరంగచొక్కమ
హీవరకరుణాకటాక్ష వీక్షణగురు సం
భావితగజాంతవరల
క్ష్మీవిభవుఁడునై నరహరి మీఱున్ వేడ్కన్.

క. బంగరుమొలాముగంటము
సింగారపువెండియొరయు శ్రీతిబిరుదుగమీ
ఱంగని సముఖముసంప్రతి
యంగుగఁ గావించె నరహరయ్యచెలంగన్.

10. నరహరి బావయగు బొప్పూడిసాంబయ్య పాండ్యరాజుల దళవాయి నలుబదినాలుగు లక్షలవఱలెడి పాండ్యభూమినేలిన విజయ

1. పిడుగుమల్లన కుమారుఁడు వేంకటకవి రచించిన విప్రనారాయణచరిత్రమను నొకప్రబంధము (అసమగ్రము) తంజావూరి పుస్తకశాలలోఁగలదు. కవి యీవంశీయుఁడే కాఁదగును.

రంగ చొక్కనాథుని చేత బహుముఖముగ సన్మానింపఁబడినవాఁడు.
ఈతని ప్రశస్తి; బలపరాక్రమములు.

సీ. సరిబేటి యార్కాటి సాదులాఖానుతో
ఘటియించె నెవ్వాఁడు ఘనతమీఱ
పేర్మి తంజావురీపేషువా ఆనంద
రావునునెవ్వాఁడు రహినణంచె
మయసూరి నంజరాజయగారి ప్రియవాక్య
సంధికినెవ్వాఁడు శక్తిఁదాల్చె
నలువదివేల్వంట్లు నాల్గువేల్గుఱ్ఱంబు
కనికొల్చె నెవ్వాని కలిమిబలిమి

గీ. నతఁడుతగు నాజిజితవైరి యత్యుదారి
సత్త్వసంయుక్తగుణహారి సత్త్వసీరి
తిలకితపురారి బొప్పాడికులబలారి
సదుపకారి శ్రీదళపతిసాంబశౌరి.

మ. తనభేరీనినదంబొకింత వినినంతం జెంజి తంజావురీ
ఘనపూర్వాంబుధి తీరపట్టణములార్కాడాది శ్రీరంగ ప
ట్టణముం గేరళపట్టణంబులను జిట్టాడంగను త్తుంగ కీ
ర్తిని గాంచెన్ క్షితిసాంబసైన్యపతి యుద్దీప్తప్రతాపోన్నతిన్.

ఆతని దానధర్మములు :

సీ. వేదశాస్త్రపురాణవేది ధరామర
లసితాగ్రహారంబులను ఘటించి
హరిహరదేవాలయస్థిరగోపుర
ప్రాకారసన్మంటపములొనర్చి
సర్వవిద్యాభ్యాస సంవత్సరగ్రాస
రక్షితపాఠశాలలురచించి
సకలదేశాగతజన మనోరంజన
ప్రవరాన్నదాన సత్రములనుంచి

గీ. రమ్యపానీయశాలికారామకూప
దీర్ఘికాతటాకాదుల దివ్యముగను
కరమునవరించె కీర్తిదిక్తతులమించఁ
బాండుదళవాయిమేటి సాంబయ కిరీటి.

గ్రంథావతారికలో కృష్ణయ పై సాంబయదళవాయి కుమారుఁడగు గోవిందామాత్యుఁడును, శాసనరచయితయు మంత్రియు నాతని కుమారుఁడునగు శివరామయ్య[1] యును తన్నీగ్రంథము రచింపుమని ప్రోత్సహించినట్లుగా నీ క్రిందివిధమునఁ జెప్పియున్నాఁడు.

సీ. పాండ్యభూమండ లాఖండలుండైన వి
జయరంగచొక్కభూజానికాప్త
మండనుండగుసాంబ దండనాథాగ్రణి
తనయులలోమేటి తంత్రియగుచు
సంగీతసాహిత్య సంస్కృతాంధ్రకవిత్వ
మర్మజ్ఞుఁడై మేనమఱదియగుచుఁ
గామరొప్పబొప్ప్వాడి గోవిందయామాత్యుఁ
డనుపమ విద్యాధికార్యసభను

గీ. నిండుకొలువుండెనపుడు నేవండఁజేరి
సరససల్లాపములుమీఱ చతురమతిని.

. . . . . . . . . . . . . . . .

1. క్రీ శ. 1739 సంవత్సరమున (9. 2. 1739) మీనాక్షి పరిపాలనాకాలమున తిరునల్వేలి మండలమున శివలప్పేరి లేక ముద్దువెంకటలక్ష్మిపతి భూపాలసముద్రము గ్రామమునగల దానశాసనము వ్రాసినది, శివరామయ. ఇది తెలుగుశాసనము. అను బంధములో దీనిని ప్రకటించినాడను.

No 81. A Telugu Copper-plato grant of Queen Minakshi Saka 1660. Travancore Archæological Series Vol. VI, Part II Pages 229-234.

ఈ గోవిందప్పయ్యగారును తండ్రివలె, దండనాథుఁడై మీనాక్షీదేవి, బంగారు తిరుమలరాజుపై యుద్ధమునకు వెడలినప్పుడు, సైన్యాధిపత్యము వహించి యాతనోడించెను. పై అధస్సూచిక నివేదికపుట 231.

క. శ్రీవిద్యానిధియగు ల
క్ష్మీవరగోవిందమంత్రి శివరామయగా
రేవేళఁబొగడవినుమా
నీవైఖరి యేకవీంద్రునికి లేదైనన్.

ఉ. నీవుఘటించుసత్కృతికి నేఁబతినయ్యెదనంచుశంకరుం
డేవివరించె నింకనొక టేమిదలంచగ నున్నదట్లనే
భావముమీఁఅనల్పునవారియనుజ్ఞయ నీశ్వరో క్తియున్
కేవలభు క్తిము క్తులకుఁ గీ ర్తికికారణమంచునెంచునున్.

ఆవెనుక నాత్మకులంబువారలను ప్రస్తుతిసేయుట సంప్రదాయమని పై వంశమును, విపులముగా వర్ణించియున్నాఁడు.

వాఙ్మయచారిత్రకాంశములు

భానుమద్విజయావతారికయందు కవి, తనపూర్వులు పెక్కు కృతులు రచియించి నట్లీవిధముగాఁ జెప్పియున్నాఁడు.

క. భూనుతగాంగేయోపా
ఖ్యానసుమంతోదయాంధ్ర కర్ణామృతముల్
మానతవజ్రభుజోపా
ఖ్యానముశుభహేతుసేతు మాహాత్మ్యంబున్.

క. దత్తాత్రేయచరిత్రన్
స త్తగుమర్యాద రామసచివచరిత్రన్
చి త్తరపు గృతులుచేసిన
యు త్తమకవులెల్ల మీఁకులోద్భవులగుటన్.

పై కృతులలో 1. గాంగేయోపాఖ్యానము, 2. సుమంతోదయము, 3. ఆంధ్రకర్ణామృతము, 4. వజ్రభుజోపాఖ్యానము, 5. సేతుమహాత్మ్యము, 6. దత్తాత్రేయచరిత్రము, 7. మర్యాదరామనచరిత్రము

అనువానిలో 'ఆంధ్రకర్ణామృతము' అనునదిమాత్రమే లభ్యమగుచున్నది. ఇదియే శ్రీకృష్ణకర్ణామృతము. లీలాశుకయోగియని నామాంతరముగల బిల్వమంగళుని సంస్కృతగ్రంథమునకుఁ దెలుఁగుసేఁత. దీని రచయిత వెలఁగపూఁడి వెంగయామాత్యుఁడని యాశ్వాసాంత పద్యములవలనఁ దెలియుచున్నది.

ఇదికృష్ణాశ్రమయోగిపుంగవ కృపాపీయూషసారస్వతా
భ్యుదయ శ్రీవిభప్రభావచిదచిద్బోధక్షమాశాంతి స
త్యదయాభూమణ వెల్లపూఁడి మణిపెద్దామాత్య వెంగాగ్రణీ
గదితాశ్వాసమగున్ తృతీయమగుచున్ గర్ణామృతశ్రీకృతిన్

పై పద్యమునుబట్టి యీకవి వెలఁగపూఁడి పెద్దయామాత్యుని కుమారుఁడని మనకుఁ దెలియుచున్నది. పై వంశవృక్షములో నీ పెద్దయామాత్యుఁ డెవరో గ్రహించుటకు వెంగనామాత్యుని కాలమును తొలుత తెలుసుకొనవలెను. ఒక కృష్ణకర్ణామృత ప్రతియందు విలేఖకుఁ డిట్లు వ్రాసియున్నాఁడు.

క. శ్రీమత్కర్ణామృత కృతి
ప్రేమంబున వెల్లపూడి వెంగన తెనుగున్
గామాల్యుఁగూర్చె దీనిన్
రామబ్రహ్మేంద్ర మౌనిరాట్టు లిఖించెన్.

గీ. శాలివాహనాఖ్యశక వరుసములు వె
య్యన్ని యాఱునూఱు నిరువదేడు
పరగ చనిన పిదప పార్థివ వత్సర
మార్గశీర్షమందు వ్రాసినాము.

శాలివాహన శకము 1627 అనగా క్రీ. శ. 1705 సంవత్సరమున రామబ్రహ్మము దీనిని వ్రాసి యుండుటచే నీతఁ డంతకుఁ బూర్వుఁడు. కాని కృష్ణకర్ణామృతమును క్రీ. శ. 1560 ప్రాంతముల

సుప్రసిద్ధలాక్షణికుఁడు లింగమగుంట తిమ్మన తన సులక్షణ సార మున నుదాహరించుటచే నీతఁడు క్రీ. శ. 1530 ప్రాంతము వాఁడు కావలెను. పై వంశ వృక్షములో నీకాలపువారు, గౌరమంత్రి, అతడు కొడుకు పెదసర్వయ. వెంగామాత్యుఁడు పెద సర్వయనే పెద్ద యామాత్యుఁడని పేర్కొని యుండును. పెద్ద యామాత్యుని నాల్గవ తరమువాడైన హనుమంతుడు క్రీ. శ. 1690 ప్రాంతము వాడగుటచే తరమునకు ముప్పదియేండ్లు లెక్కించిన నీకాలము సరిపోవుచున్నది.

ఆంధ్ర జనతా కర్ణామృత స్యందియగు కృష్ణకర్ణామృతమునుండి యొక పద్య ముదాహరించుచున్నాను.

శా. బాలున్మంజులతాలవాల చపలాపాంగోల్లసల్లీలునిన్
గాళిందీపులినాంగణ ప్రణయ శృంగారైక ఖేలున్ శుభ
శ్రీలోలున్ కరుణావలోకనసుధాశీలున్ వినీల ప్రభా
జాలున్ గొల్చెద రామణీయక రసస్వారాజ్య పాలున్మదిన్.

ఈ గ్రంథమునకు వచనము మహిమల్వారి రంగయామాత్యుని కొడుకు వేంకటకృష్ణుఁడు వ్రాసెను. ఈతఁ డాపస్తంబ సూత్రుఁడు, శాండిల్య గోత్రుఁడు, పరమహంస పరివ్రాజకాచార్య సదాశివ తీర్థ పాదుని శిష్యుఁడు. వేణుగోపాల భక్తుఁడు. దక్షిణ ద్వారక యగు మన్నారుగుడి నివాసుఁడు.

భానుమద్విజయ కర్తయంతకుమున్ను తానీ క్రింది గ్రంథములు రచించినట్లు చెప్పుకొనియున్నాఁడు.

సీ. మహిలోన మాలినీ మాధవీయమనంగ
శృంగార కావ్య మొసంగఁ జేసి
గాళికా శాస్త్రంబు కడు లోకహితముగా
నెనయ నేకాశ్వాసమున రచించి

పరిఢవిల్లగఁ గంద పద్యపు శతకంబు
నాల్గు యోగంబుల నసువు పఱచి
మీఱిన వేదాంతసార సంగ్రహ శాస్త్ర
మమరంగ వచనకావ్యంబొనర్చి

గీ. చాటు కృతులను మఱి కొన్ని సంఘటించి
మామకాకింత మొనరించి మంచిపుణ్య
శాలియనఁ గీర్తి గైకొన్న సత్కవీంద్ర!
మధుర వాక్సాంద్ర! కృష్ణయామాత్య చంద్ర!

వీనిలో గాళికా శాస్త్రమును బల్లిపలుకు శాస్త్రము ముద్రిత మైనవి. అందీ కవి పేరు లేదు. కాని కృతి యాతనిది. తక్కినవి లభ్యము కాలేదు.

## —: భానుమద్విజయము :—

ఇది యుత్తర కాశీఖండమందలి కథను గైకొని వర్ణన కథా ప్రధానముగ రచితమైన యైదాశ్వాసముల ప్రబంధము. భాను మంతుఁడగు విప్రకుమారుఁ డుజ్జయిని రాజు కుమార్తెయగు పద్మావతిని పెండ్లియాడుట యందలి యితివృత్తము. ఈ ప్రబంధమున యోగశాస్త్ర విషయ మైదవయాశ్వాసమున విపులముగా నున్నది. గ్రంథకర్త దక్షిణా మూర్తి యవతారమని ప్రసిద్ధిఁ జెందిన రామచంద్ర పరమహంస శిష్యుఁడు. దక్షిణామూర్తి మంత్రోపాసకుఁడు. అద్వైత వేదాంత వేత్త. ఈ విషయములు గ్రంథాద్యంతముల నుండి యిట్లు తెలియు చున్నవి.

ఆది :—

శా. శ్రీ విద్యాకరమై, ప్రమోదకరమై, సిద్ధాంత సంసేవ్యమై
కైవల్యస్థితి భవ్యమై, విమల విజ్ఞానైక సంవేద్యమై
జీవాత్మైక కృదాద్యమై, శ్రుతి శిఖాసిద్ధాంత శుద్ధాంతమై
ప్రావీణ్యంబున శాంకమై తగు పరబ్రహ్మంబు భావించెదన్.

అంతము :—

మ. సకలాధారున కప్రమేయునకు నాసాగ్రస్థిరీభూత దృ
ష్టికి గ్రంథిత్రయ భేదనాతి చతుర శ్రీ రాజయోగాది స
త్తకు విజ్ఞానిక ఖండ సౌఖ్యద సుషుమ్నామార్గ ముఖ్య ప్రచా
రికి సంరక్షిత దేవమౌని తతికిన్ శ్రీ దక్షిణామూర్తికిన్.

ఇందలిగద్య :—

ఇది శ్రీ మద్దక్షిణామూర్తి కటాక్ష లబ్ధచతుర కవితాచిత్రసు కవి జనమిత్ర ఆపస్తంబసూత్ర, లోహితగోత్ర, వెల్గపూఁడి నార సింహార్య పౌత్ర నరహరి మంత్రి పుత్ర కృష్ణయామాత్య ప్రణీతంబైన భానుమద్విజయంబను మహా ప్రబంధంబు నందును సర్వంబును పంచమాశ్వాసము.

భానుమద్విజయ టీక :—

ఈ గ్రంథమున కథ శృంగారమైనను గ్రంథకర్త యోగవేదాంత విషయములను చేర్చి రచించుటచే, టీక యావశ్యకమైనది. ప్రస్తుతము దీనికి గల టీక, గ్రంథకర్తయే రచియించి యుండవచ్చును. ఏల ననగా గ్రంథమున సులభమైన ఘట్టములకు వ్యాఖ్యలేదు. క్లిష్టమైన పద్యములకు, ముఖ్యముగా యోగపద్ధతి ప్రపంచితమైన పంచమా శ్వాసమునకు టీక విపులముగా నున్నది. సరళమైన వ్యవహారిక భాషలో నున్నది.

మొదటి పద్యము టీక. శ్రీ = పూజ్యమైనటువంటి, విద్యా = బ్రహ్మ విద్యకు, ఆకరమై = ఆధారమై, ప్రమోదకరమై, ఆనందకరమై, సిద్ధ = జ్ఞాన పరిపూర్ణులయొక్కయు, ఆళి = పరంపరలకు, సంసేవ్యమై = ఉపాసన చెయ్యతగ్గదియై, కైవల్య, స్థితి, భవ్యమై = మోక్షార్హమై నటువంటి, ఉనికిచేతను మనోజ్ఞమై; విమల = స్వచ్ఛమై నటువంటి, విజ్ఞాన = విశేషమైన తెలివిచేతను, సంవేద్యమై = తెలుసుకోతగ్గదై, జీవ = చేతనకున్నూ, ఆత్మ = పరాత్మకున్నూ, ఐక్యకృత్ = ఏకీభావము

చేసుటకు హేతువైనదై, ఆద్యమై=మొదటిదైనదై, శ్రుతిశిఖా=ఉపనిషత్తుల యొక్క, సిద్ధాంత=రాద్ధాంత మార్గములకు, శుద్ధాంతమై=అంతఃపురమై ప్రావీణ్యంబున=నైపుణ్యముకోటి, కాంతమై=ప్రకాశించేటిదై, తగు=ఒప్పేటి, పరబ్రహ్మంబు=పరతత్త్వ స్వరూపమును, భావించెదఁ=ఉపాసన చేసెదను.

ఈ కృతి తమిళ భాషలోనికి భాషాంతీకరింపబడినదట. భాషోద్ధారకులు బ్రౌను దొరగారీ కావ్యమునుఁ గూర్చియు టీకను గూర్చియు నిట్లు వ్రాసిరి.

Tho nuptials of Padmavati also called the adventures of Banumantha written about the year 1740 or 1760 A. D,

This entertaining and useful book is extremely rare as it belongs to the saiva creed, where as the vishnu creed prevailing in the Telugn country. Fragments of it occur everywhere, but I never met with more than two manuscripts.

This poem is translated into Tamil, perhaps from Telugu. The title is affixed to it Tannul Ariyum Perumal.

This is a learned and usefnl commentary and sufficient as regards the more difficult passages; but the easier passages are omitted, the minute commentary on the Transcendental Philosophy, (Yogasastramu contained in 5th canto is placed in another volume ప్రా. భా. సంఖ్య 606-612.)

—: శ్యామరామకవి :—

రామాయణ వచనము

శ్యామరామకవి రచించిన రామాయణములో బాల, అయోధ్యా కాండములును, అరణ్యకాండము పూర్తి 75 సర్గలకునుఁ దెనుగు వచనము లభ్యమగుచున్నది. కవిం గూర్చి గ్రంథమున నిట్లున్నది.

"......సాహిత్య విద్యాగోష్ఠి ప్రసంగంబున నాశ్వలాయన సూత్రుండును, వాసిష్ఠగోత్ర సంభవుండును, కృష్ణయామాత్య పుత్రుండును, షడ్దర్శనీ పారంగతుండును, లక్ష్మీపతి నామధేయాగ్రజు

ననుజుండును, సంస్కృతాంధ్ర భాషాకవితా నిర్వాహక సకల పారంగ తుండును, అసహాయ శ్యామరాయ విద్వత్కవియగు నన్నుం బిలిపించి చతుశ్శాస్త్ర పండితుండవు, కవికుల తిలకుండవు......కళావల్లభుండని కొనియాడి కర్పూర తాంబూలం బొసంగి" కృతిపతియైన సుబ్బరాయ శెట్టి పలికినట్లున్నది. సుబ్బరాయశెట్టి "శ్రీ కాంతిమతీ శాలి వాటీశ్వర కరుణాకటాక్ష ప్రశమిత సకలాంత రాయుండును, సేతు హిమాచల మధ్యవర్తి విద్వత్కవి నికరసంస్తూయమానుండును, దక్షిణ కాశీతట తామ్రపర్ణీతీరస్థిత నిరంతర సత్రాన్నదాన సమ్మోదమాన భూసురాశీర్వాద సంప్రాప్త సమేధమానోత్తుంగ శతాంగ మాతంగ తురంగ పదాతి సంగత నవరత్న విరాజిత మందిరుండును, చతురుదధి ముద్రిత విశ్వ విశ్వంభరావలయ పరిపాలన రాజాధిరాజ సన్మాని తుండును సకల గుణగణాలంకృతుండును, వాసవకన్యకా వరప్రసాద శాశ్వతైశ్వర్య విలాసుండును, వైశ్యకుల రత్న రత్నాకరుండు పరిసెట్ల గోత్ర సంభవుండును, తుమ్మలపాటి మన్నారుశెట్టి పౌత్రుండును, మణ ప్పార వేంకటశావిశెట్టి పుత్రుండును, నిజసుకృత విశదీకృత మహనీయ పాతివ్రత్యాది గుణకదంబయగు కృష్ణమాంబావధూ గర్భశుక్తి ముక్తా ఫలుండును............గురుమూర్తి సహోదరుండును......... శ్రీ విజయరంగ చొక్కనాధ మహీవర కరుణా కటాక్ష వీక్షణపాత్రుం డును, వణిగ్గ్రగణియగు సుబ్బరాయ వైశ్యధౌరేయుండు"

ఈ శ్యామరామకవి విజయరంగ చొక్కనాథుని కాలములోని వాడై యుండియు సుబ్బరాయశెట్టితో "......శ్రీ మద్రామా యణంబు వచన కావ్యంబుగా జేయుమని పలికితివి, నీవు కృతార్థుండ వైతివి. తొల్లి వాల్మీకీయ రామాయణ మహాకావ్యంబు భాస్కరకవి పద్యకావ్యంబుగా రచన చేయించె; రంగనాథకవి ద్విపదకావ్యంబుచేసె. నితరు లెవ్వరును వచన కావ్యంబుగా రచనచేయనిది నీవు నేను చేసిన పుణ్యంబుగా నీ పేరనంకితంబుగా రచన చేసెదనని" (కవిపలికి)... నవరసాలంకారంబుగా చాతుర్వర్ణాశ్రమజన సంఘుంబులు పఠియింప యోగ్యంబుగా శ్రీమద్రామాయణంబు......చేయం బూనినాఁడు,

ఈ గ్రంథము వ్రాతప్రతిలో నారణ్యకాండ మొక్కటియే యున్నను, బాలకాండము మొదట నుండఁదగిన యీక్రిందిపీఠిక కృత్యాది పద్యములు నిక్కడఁ జేర్చుట మనకీ యొక్క కాండమేకాక యన్ని కాండములును దెనిఁగింపఁ బడినవి స్పష్టమగుచున్నది. కృత్యాది పద్యములు వ్రాసిన 12 పత్రములలోని వ్రాత యొక్కనిది. తక్కిన కథా భాగము వ్రాత వేఱొక్కనిది. ప్రతి సర్గమునకును "ఇది శ్రీ మదారణ్యకాండంబునందు అసహాయ శ్యామరాయ విరచితంబను వచన కావ్యంబునందు పదారున్నొకటవ సర్గార్థము" అని యిట్లు కలదు. అరణ్యకాండము సర్వమును డెబ్బదియైదు సర్గలున్నది. సప్తసంఖ్యను దెనుఁగులో "ఏడు" అనినరోదన సంఖ్య యని పేరుపెట్టి ఛాందసముగా ఆఱున్నొక్కటి యనుట కలదు. అట్లే యిక్కడియుఁ బదారున్నొక్కటి యని చెప్పినాఁడు. ఆయా సర్గముల ప్రారంభమునను

క. జాయా హరణా నంతర
కాయజ సంతాప జాత ఘనతరచింతా
భూయోన్వేషణ లక్ష్మణ
ధీయుత వచనాభిరామ తేజోరామా 13 సర్గము

క. రాక్షస కృపాణ విదళిత
పక్షిద్వయ పాదజాను పార్శ్వ కరోటీ
కుక్షివిలోచన చంచూ
పక్షీక్షణ మోక్షదాన భాగ్య నిదానా 67 సర్గము

క. భీకరక బంధబంధన
సాకల్య భుజ ప్రసార సంగ్రహ వార్తా
స్వాకన లక్ష్మణరాజ
ద్రాకా శశికీర్తి జాల రామనృపాలా 20 సర్గము

ఇట్లాయాతావుల కథాసూచనము విషయసూచిక వలెఁ బద్యములు చేర్చినాఁడు. మొదట శ్యామరాయకవి పద్యకవిత్వముం గొంత చూపి తర్వాత వచన రచనఁ జూపెదను.

క. శ్రీ తులసీ దామోజ్జ్వల
వాతాత్మజ సేవితాంఘ్రి వనరుహ యుగళా
కాతర నత జన కైరవ
శీతల గుణసాంద్ర సోమ ! శ్రీ రఘురామా !

సీ. ఎవ్వని మదినెంచ నిందిరా దేవియు
మందిరంబుననుండి మహిమ లొసఁగు
నెవ్వని నుతియింప నీప్సిత కవనంబు
నిచ్చి శారదయు సన్నిధి యొనర్చు
నెవ్వని బింబంబు నీక్షింప నింద్రియ
గ్రామంబు లన్నియు గదలకుండు
నెవ్వని నామంబు నెన్నుచో జనులకు
బహు పుత్ర లాభంబు పరఁగు చుండు

గీ. అతఁడు శ్రీ రాముఁ డఖల సన్నుత చరిత్రుఁ
డాశ్రిత వనవసంతుండు నబ్జజాని
వినమ దమర ముకుట తట వివిధ రత్న
కాంతి కలిత పదయుగుండు కాంతి నొసగు,

సీ. ఎవ్వనిప్రాయంబు మవ్వంబుఁదోఁటకు
దీర్ణాంగతాటకదృష్టియెము క
కెవ్వని కరకరికిత్తుఖండముగదా
చండీశుకోదండ దండవరము
ఎవ్వనిబాణాగ్నికింధనమ్ములు గదా
యతికాయకుంభకర్ణాసురతతి
యెవ్వని విశిఖదారేందీవరాక్షికిఁ
బంక్తికంఠునితలల్ బంతులాట
లతఁడుశ్రీరాము ..............

శా. శ్రీమత్కోసలరాజు ప్రేమనిజలక్ష్మీకాంతికై సేయఁగాఁ
గామార్థంబులు ధర్మమోక్షములు లీలంగాంక్షింపదానీయఁ గా
సీమాతాతీత దయావిశేషఘనుఁడై చేదోయిపద్మంబు చే
ధామశ్రీసరు సుబ్బరాయకృతి నేతంబ్రోచి శ్రీలీవుతన్.

క. శ్రీవేంకటాద్రి నేతయు
భావంబునదన్నుఁదలఁచు భక్తుండగు నా
ధీవరుని సుబ్బరాయని,
కావిశ్రుత...కీర్తికాంతులనొసఁగున్.

మ. శరమావిష్ణువు బ్రహ్మసారథియు నశ్వంబుల్మహావేదముల్
పరగన్ ధారుణి తేరు సూర్యశశులుంబండ్లొప్పధానుష్కుఁడా
పురముల్ గూల్చినజోదు నాసుకృతినిన్ బొందొప్పశ్రీలాదిగా
సిరిమాణిక్య మహాధనాఢ్య జయలక్ష్మిప్రాప్తుగాఁ జేయుతన్.

సీ. తీగచెంగటనున్న తిలకవృక్షముమాడ్కి
బలువిల్లుమూపునఁ బరగువాఁడు
కాడతోఁజెలువొందు కమలంబు తెఱఁగున
గరమునఁ జెన్నొందు శరమువాఁడు
కరుణారసమ్ములు కనుఁగవనలరంగ
జిఱునవ్వుమోమునఁ జెలఁగువాఁడు
పాదసేవకుఁ జేరు పవనజుకరమునఁ
గైదండగైకొని కదలువాఁడు

రాజపుత్రుఁడొకఁడు వత్స! రార! యనెడి
పలుకులను నను బిలువఁగ భక్తితోడ
వేకువనుగలలోనను వెలుగునంది
యేమిపనియనంగను దానునిట్టులనియె.

"నాదుచరిత్రము నీవును నాదరమునఁ దెనుఁగుఁ జేయు" మని చెప్పి నాఁడఁట. వచనశైలికి :— ఏకాదశమసర్గప్రారంభము :—

క. సీతాసాంత్వనపూర్వక
ఘాతుకరక్షస్సమూహ ఖండనవార్తా
జాతాదరవన్యాచర,
చేతోనయనాభిరామ! శ్రీరఘురామా!

దండకారణ్యంబునఁ జనుచున్నప్పు డగ్రభాగంబున శ్రీరామదేవుండు మధ్యంబునందు సుమధ్యమయగు సీతాకాంతయుఁ బిఱిందిదెస బాణ బాణాసనంబులను పాణిఁ జేరాణించు లక్ష్మణుం డనువర్తించి చనునపుడు నారాజకుమారులిరువురు నానావిధములగు పర్వతములమధ్య ప్రదేశములు వనములు వింతవింతలై రమణీయంబగు నదులం జూచుచు సీతా కాంతామణితోడం గూడి చనునపుడు ఆనదీమధ్యభాగమునఁ జెలువలరు నిసుకదిబ్బలందు సంచరించు బెగ్గురులు జక్కవలు జలంబునందు జనతములగు నీరుకోళ్లు, నీరుకాకులతోడఁగూడి తామరలచే తనరారు కొలంకులు గుంపులుగుంపులుగా సంచరించు జింకలను మదగర్వితులై గొప్పలగు కొమ్ములచేఁ గొమరొప్పు వృషభములను గారెనుపోతులను వన వరాహములను జెట్లనువిఱిచి పడవైచు వేశండములను నవలోకించుచు దూరంబగు మార్గంబునుంగడచి సూర్యుండస్తగతుండగు సమయంబున సహస్రదళములచే సంకులంబగు పద్మములు నూఱురేకులచేఁ గాలు పారు పుష్కరంబులనెడి తామరసహితంబున సమీపదేశంబున సంచరించు సామజములచే సమలంకృతంబును......యోజనదూర విశాలంబగు తటాకంబునందు గీతంబు వాదిత్రంబు నాట్యవీణ మర్దలంబు పిల్లగ్రోవి కంచుతాళంబనెడు చతుర్విధవాద్యముల నాదంబు వినంబడునపుడు నచట నొక్కనింగానక...ఇట్లు 151 పత్రములలో నారణ్యకాండము గలదు.

ఆంధ్రసాహిత్యపరిషత్తులో బాలాయోధ్యాకాండములును నరణ్యకాండమును పుస్తకభాండాగారమున గలవు. గ్రంథసంఖ్య 168.

—: వెలిదండ్ల అళఘురికవి :—

కవులచరిత్రమున కెక్కని యీ దాక్షిణాత్యకవి సుదంతాపరిణయ మను ప్రబంధమును రచించెను. ఈతఁడు విజయరంగ చొక్కభూపాలుని యాస్థానములోని వాఁడయినట్టు నాతనియానతిచేఁ దా నీకృతి శ్రీరంగస్వామి కంకితముగా నొనర్చినట్లును దసతండ్రి యారాజునొద్ద మంత్రిగానున్నట్లును గ్రంథావతారికలో వ్రాసికొనిన యీక్రిందిపద్యము వలనఁ దెలియుచున్నది.

సీ. ఆద్యస్వయంవ్యక్త మైనరంగస్థలం
బేనృపతికి రాజధానియయ్యె
నధికచంచలమైన యలమహాలక్ష్మి యే
విభునిపూజలకిలువేలుపయ్యెఁ
బ్రత్యక్షవిరజయై పరఁగుకావేరి యే
ప్రభునికోటకు మహాపరిఘయయ్యె
రాజార్హమైన చిరత్నరత్నంబులే
దంటపీమకు మిట్టపంటయయ్యె

గీ. నట్టినృపపాలిత......సమిద్ధ
పంచతిరువట రాజసప్తాంగ పాలి
శాత్రవీకంఠసూత్రశాసన...శాలి
శ్రీవిజయరంగ చొక్కధాత్రీపమౌళి.

...నిందుకొలువుండి వేడ్క నన్నిలువనంపి.

గీ. నాకునారోగ్యభాగ్యముల్ నీకుఁ బ్రతిభ
విన్నవారికిహర్షంబువిస్తరిల్లఁ
గృతినొనర్పుము శ్రీరంగపతికి నవిన
నాఁటినెమ్మది నొకహాయినాఁటి రేయి.

సీ. పాండ్యేశపరమాప్త పారిషద్యవరుండు
  గోపాలచరణ సేవాపరుండు
నిఖలదిక్తటవర్తినిజకీర్తివిస్ఫూర్తి
  షట్సహస్రకులీన చక్రవర్తి
మధురాంధ్రకవన గుంఫనకళాచతురుండు
  సాధురక్షణ విచక్షణకరుండు
జ్ఞాతిబంధుసుహృన్నిరాంతంక శుభకారి
  సత్యోక్తినూతనా జాతవైరి

గీ. సకలధనికౌఘవర్ణ్య భూషాయమాన
లలితనిరవద్యనిజగుణా కలితపద్య
శతసహస్రుండనంగ సన్నుతివహించె
ఘనుఁడు వెలిదండ్ల పెద్దరాఘవవిభుండు.

విజయరంగ చొక్కనాథుఁడు క్రీ. 1704—1731 నడుమ వాఁడగుటచే నీ కవియు నప్పటివాఁడై శేషము వెంకటపతి సముఖ వేంకటకృష్ణప్ప నాయకాది కవులకు సమకాలికుఁడని స్పష్టపడుచున్నది.

మఱియుఁ గవి తన పితామహాదుల నిట్లువర్ణించెను.

చ. అలతిరువేంగళార్యుఁడు మహాద్భుతచర్యుఁడు కీర్తిధుర్యుఁడై
యలరిప్రసూనమార్దవ శుభాంగిని గోనమయన్వధూమణిన్
లలితగతిన్ వరించి కమలాసతిఁ జక్రినిపట్టె చుట్టువా
ల్చెలియునికై వడిన్ బరఁగెబంధువులందఱు సంతసింపఁగన్.

సీ. శృంగారరసముఖోచిత సితాంధ్రోక్తి ప
  ద్ధతిపోషి వేంకటపతిమనీషి
సకలదేశాధీశ సమ్మతపేశల
  కవనుండు పెద్దరాఘవఘనుండు
జననమనోరంజన సరససల్లాపధా
  రలవన్నెఁగన్న చిన్నాఘవుండు
మధురవాక్ప్రౌఢను నిరస్తభారతి
  సఖముఖరితశంత్ర సరసమంత్రి

గీ. లలితవార్తాచమత్కృతి లక్ష్మిపతియు
ననఁగ నేవురుగల్గిరి వినయులైన
తనయులైతిరువేంగళార్యునకు జగతి
దనువులందిన పంచతత్త్వములనంగ.

కం. అందగ్రజుఁ డర్చితగో
విందపదుండచ్చతెనుఁగు వేంగన వెలసెన్ ...

సీ. అమేయరామేశ్వరావని విఖ్యాత
మేనేతశుద్ధాంధ్ర కృతిసహస్ర...

గీ. అతఁడు తెలుపొందుఁ దిరువేంగళార్యగర్భ
జలధికమలాదిదుహ్మ విస్మయవిదారి
యనవరతతోషి గానవిద్యాభిలాషి
బంధుపరిపోషి వేంకటపతిమనీషి.

దీనినింబట్టి యితనిపితామహుఁ డగువేంగళార్యున కీతనితండ్రి యగు పెదరాఘవార్యుఁడుగాక యింక నలువురు విద్వాంసులగు పుత్రులు గలరనియు, వారిలోఁబెద్దవాఁడయిన వేంకటపతిమనీషి యనేక శుద్ధాంధ్ర గ్రంథములు రచించి యచ్చతెనుఁగు వెంగన యను బిరుదువడసె ననియుఁ దెలియుచున్నది. మఱియు రాధామాధవ సంవాదము రచించినట్లుగాఁ గవులచరిత్రలోఁ బేర్కొనఁబడిన వెలిదండ్ల వేంకటపతి యీయచ్చతెనుఁగు వెంగనయేయనియు స్పష్టమగుచున్నది. కాని, యితనికాలనిర్ణయ మందు విస్పష్టముగా లేకపోవుటయే కాక యీతని తండ్రిపేరు తిరువేంగళాచార్యుఁడని కనబడుచున్నది. ఇది యిట్లుండఁగా దనపెదతండ్రి వేలకొలఁది యచ్చతెలుఁగు కావ్యములు వ్రాసెనని చెప్పుచు వానిలోఁ గొన్నిటినైన మనకవి పేర్కొనకపోవు టయు విచార్యమే.

గ్రంథవిషయము—అష్టమహిషులలో నొక్కతెయగు సుదం తకును శ్రీకృష్ణునకును జరిగిన వివాహము ప్రబంధోచితవర్ణనలతో

నించుఁవి స్తరింపఁబడినది. గ్రంథము సంపూర్ణముగా నున్నది. కవిత్వము చక్కఁగానున్నది. శైలి తెలియుటకుం గొకపద్య ముదాహరించెదను.

చ. లలితరసాలసాలపరిలంబి మహీతలచుంబివల్లి కాం
చలయుగళంబులం బెనచి చయ్యన నుయ్యల లూఁగువేళలన్
గులుకుమిటారి జవ్వనపుఁగొమ్మలు పోల్చిరి పంచకాండకుం
డలితధనుర్లతాంతరకనత్కనకాంబకరేఖలోయనన్,

—: తిరుమలకవి :—

విజయరంగచొక్కనాథుని కాలమున వెలువడిన యక్షగాన నాటకములలో తిరుమలకవి విరచితమగు చిత్రకూటమహాత్మ్యమనునది ప్రశస్తమైనది. ఈతఁడు బాలసరస్వతి పౌత్రుఁడు. వెంకటాధ్వరి పుత్రుఁడు. ఈబాలసరస్వతి యసమసాహిత్య విద్యాచతుర్ముఖుఁడై భారతమున సభాపర్వము ద్విపదగా రచించెను. తిరుమలకవి తన్నుఁగూర్చిచెప్పిన గ్రంథభాగముసుదాహరించుచున్నాను.

గ్రంథప్రారంభము.

సీ. శ్రీలచేననుపమలీలచేనెంతయు
నలువొందుద్వారకా నగరమునను
కాంతమైసుతవై జయంతమై జిగిమీఱు
మెఱుగారుబంగారుమేడమీఁది
పొందుగాఁగనుదోయి విందుగాఁగనుపట్టు
డంబైనకొలువుకూటంబునందు
కెంపురాసంతన నింపురాణించు కుం
దనపుగద్దియనుండు దైవరాయ

తే॥ రంగకృష్ణముద్దుల వీరరాజసుతుఁడు
శ్రీవిజయరంగచొక్కనాథావనీంద్రుఁ
డెలమి కోరిన కోరికలిచ్చు దేవ!
నీకుమ్రొక్కెదనిరవద్య! నిగమవేద్య!

కై వారం॥ ** నీయెదుటనుదుటువగ కోవులమరనమరనాయక సభాం
తరమున నటియించు తెఱగంటితెరవల తెఱంగుప్రకటించునించు
బోణులు నటియించు, చిత్రకూటమహాత్మ్య మహానాటకసంవిధా
నంబు చూడనవధరించు నాస్వామి, జయీభవదిగ్విజయీభవ.

తుది:— ద. రామకలి. అట.

జలకేళిచాలించికొలను వెల్వడివచ్చి
చెలులతోజతగూడి వలువధరించి
చలువగంధమలందిసతియు శంకరుఁడు
నలువొందనిజసదనము చేరిరెలమిన్.

ద. కల్యాణి. ఝంపె.

గౌరియును.....నలకడనసభనఖిలభోగంబు లనుభవింపుచుండి
రచటన్.

ద్విపద. అనియనివార్య శౌర్యాన్వితు పేర
అనుపమసత్కీర్తియగుశౌరిపేర
కృష్ణచారిత్రకీలితుఁడైన రంగ
కృష్ణముద్దులవీర నృపపుత్రుఁడగుచు
జయశాలియ...నెసంగినశ్రీవి
జయరంగచొక్కరాయాధీశునగర
నెవరుమీరవసించి నిరుపమానంద
మనుభవింపుచునుండు ననఘునిపేర
శ్రీలచేఁదనరుచు నృపవరనిత్య
లాలితుండయిన బాలసరస్వతిమఖి
సుతముఖ్యుఁడగుచు నిస్తులకళాప్రౌఢి
నతనిమించినవెంకటాధ్వరిసుతుఁడు
తిర్మలకవి పార్వతీపతి భజన
నిర్మలమతి విష్ణునిత్య సేవకుఁడు

సంగీత సాహిత్య చతురుఁడౌ విజయ
రంగ చొక్కావనీరమణు కృపను
కర్ణభూషణములు ఘనభూషణములు
స్వర్ణాంబరంబులు సరిపెనల్ తాళి
యనువొందు నందలం బగ్రహారాది
ఘనబహుమానముల్ గాంచినవాఁడు
వచనచమత్కార వైఖరిమీర
రచన సేయఁగను నర్తన యోగ్యముగను
గానబుమీఱిన చిత్రకూటమాహాత్మ్య
మనునాటకమును విద్యల రాశిఁగన్న
కవులెన్న నానిశాకర తారకముగ
నవనీశ్వర సభార్హమై యొప్పఁగాత.

చిత్రకూటమాహాత్మ్యము. సర్వేశ్వరుఁ డొకనాఁడు ప్రమథగణంబులఁగూడి కొలువుండి వారినిపార్వతి జాడయడుగ వారలామె చిత్రకూటమున తిల్లయను పేరును గాంచి యున్నదనిరి. అప్పుడీశ్వరుఁ "డాపల్లవాధరను చూడక సొంపు సంధిల్లదు. ఆమె నాట్యమున తన వన్నెవాసి ధరణిలోఁ బొగడ, నన్నెదఁబాసి యొంటిగా దిల్లవనినిం బొందె. ఆ వాలు గంటిని తలంచు కొంటిని" యని వేఁటాడు నెపంబున నచట వెడలి తిల్లవనిని నాలుగు దినంబులుండి పార్వతిని గలసి తమ కుందనంపు మేడకు వచ్చుట యిందు వర్ణితము.

తంజావూరి పుస్తకశాల ప్రతి సంఖ్య 520 (M 671) గ్రంథాంతమున "తిల్ల గోవిందరాజ నాటకము తెలుంగు లిపిని ఆకులు 35 ట్కీ పుస్తకం ౧ట్కీ హుజూర్ నుంచి వచ్చింది మానాజి గుజార్తినభా అశన్ వర్షం సఫర్ నెల 9 తొమ్మిదవ తేదీ మహాల్ ప్రవేశం...తిరుచినాపల్లి ముఖాంహరకార వైద్యనాథుండి సంబంధం"

మధుర నాయక సంస్థానమునుండి యీ గ్రంథము తంజావూరి పుస్తకశాలకుఁ జేరినట్లు పై దానివలన తెలియుచున్నది. గ్రంథము ముద్రితము.

## —: శ్రీపతి రామభద్రకవి :—

ఈతఁడు హాలాస్య మాహాత్మ్యమును వచన కావ్యముగా రచించెను. ఇం దెనిమిది యాశ్వాసములు గలవు. ఆశ్వాసాంత గద్యలో "ఇది శ్రీ మీనాక్షీ సుందరేశ్వర సాంద్ర కృపారసలబ్ధకవితా మాధురీ ధురీణ కాశ్యప గోత్రాశ్వలాయన సూత్ర శ్రీపతి కులపవిత్ర చరిత్ర శ్రీ గిరియమాంబా సత్కళత్ర సూరయామాత్యపుత్రకవి రామభద్ర ప్రణీతంబైన హాలాస్య మహాత్మ్యంబను వచన కావ్యంబున ప్రథమాశ్వాసము.

పై గద్యవలన నీతడు మధురాపుర నివాసియనియు బ్రాహ్మణుఁడనియు, కాశ్యపగోత్రుఁ డనియు, గిరియమాంబా సూరనలపుత్రుఁడనియు తెలియుచున్నది. ఈతని గ్రంథమునం దెచ్చటను విజయరంగ చొక్కనాథునిపేరుదాహృతము కాకపోయినను నితడు మధురాపురి నివాసి యగుటయు వచన గ్రంథము రచించుటయు నీతడు విజయరంగ చొక్కనాథుని కాలము వాఁడని తెలియఁజేయుచున్నవి. మఱియు నిందలి వచన రచనయు, శ్రీరంగమాహాత్మ్య, మాఘమాహాత్మ్య రచనల పోలికనున్నది. దక్షిణాంధ్ర వాఙ్మయమును గూర్చి క్రీ. శ. 1916 లోనే వ్రాసిన హరి నేతురామయ్యగారు తమ వ్యాసమున పై యభిప్రాయమునే వెలిబుచ్చి యున్నారు (చూ. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక 7 వ సంపుటము పుటలు 84-92)

ఇందలి వచన రచనకు మచ్చు :—

"అశ్వినీ దేవతలు చూచి యిది యపరిహార్యం బనినవారు నిరుద్యోగులై జాగులైరి. తద్రోగ పరిహారార్థంబుగా నొక్క యుపాయంబు దేవరానతీయ వలయుననిన వరుణ ముఖావలోకనంబుచేసి వాసవుండు, "విను! మోసంబులేదని సుధాసార సమాన వచనంబులు" పలికినపుడు ఏమహావ్యాధి పీడితులై, పాపకృత్యులై, యపమృత్యుపీడితులై, కాలమృత్యు వశమైన వారెవ్వరో వా రందఱు సుందరమూర్తి

సందర్శనంబునం బునీతులగుదురు. కావున మనోవాక్కాయ పరిశుద్ధుండవై యీ యభిషేక పాండ్యరాజాగ్రణీ! భక్తి ప్రభావంబును యీ దేవుని మహిమాతిశయంబును నీవు లెస్సగఁ బరీక్షించి తెలిసి తల్లింగార్చనంబు గావించితి వాయెనా నీ రోగంబు దొలంగు నిందులకు సందియంబు లేదు " 1

కుందుర్తి వెంకటాచలకవి గూర్చి వ్రాయుచు కార్తిక మహాత్మ్య కృతిపతి గూర్చిన విశేషములు వ్రాసెదనని చెప్పితిని. వాని నిట దెలుపుచున్నాను. వీనివలన మధురనాయక రాజ్యమునగల చిన్న సంస్థానికులు గూడ నెట్లు తెనుగుభాషను పోషించిరో దెలియఁగలదు.

1. తురయూరు.

దక్షిణదేశమున నేఁడు తిరుచినాపల్లికి (త్రిశిరఃపుర) నిరువది మైళ్ళ దూరమున తుఱైయూరు అను సంస్థానము గలదు. దీని పూర్వ నామము 'తీర్థపురి.' ఈ సంస్థానికులైన రెడ్డిరాజులు శ్రీకృష్ణరాయల కాలమున నా ప్రాంతమునకు పాలకులై వెలసిరి. వారిలో వేంకటాచల రెడ్డి అను నాయకుని ప్రోత్సాహమువలన కుందుర్తి వేంకటాచల కవి "కార్తికమాహాత్మ్యము" అను నాలాశ్వాసముల పద్య ప్రబంధము రచియించెను.

ఈతఁడు కార్తికమాహాత్మ్యమున తీర్థపురిని తత్పరిపాలకుని నిట్లు వర్ణించియున్నాఁడు :

సీ. "ఏ రాజధానికి నిరుచక్కి గోపాల
వేంకటాచలపతుల్ వెలయుచుండు
నేపురిమధ్య సందీపితుం డగుచు నం
దీశ్వరుండు వసించు గృపను మనుప
నే పట్టణం బయోధ్యాపురంబునకు జో
డై పరాభేద్యమై యలరుచుండు
నే పుటభేదనం బాపూర్ణరుచిరాష్ట
లక్ష్మీనివాసమై లలి జెలంగు

1. ఆంధ్రసాహిత్యపరిషత్తు. గ్రంథసంఖ్య 170. పరిషత్పుస్తకభాండాగారము ద్వితీయభాగము. పుట 78-79.

గీ. నట్టి తీర్థపురీపాలనాతి వేల
ధర్మపథవర్తి చంద్రికాధవళ కీర్తి
తార్క్ష్యవాతాత్మజధ్వజాద్యఖిల బిరుద
విదిత చక్రాయుధార్జున విభవుఁడతఁడు."

వ. పాండ్యశత్రు గజకేసరి బిరుదాంకుండు రాయవేశ్యాభుజంగుండు పంటకుల కలశపాదోధి రాకాతమీన బలిగోలులింగ నృపపుంగవ కులపాలికా పేర్యంబికా నిర్భరగర్భ శుక్తి ముక్తాయమానుండును నగు... వేంకటాచల మహీమహేంద్రుండు నన్ను బిలిపించి యిట్లనుచు బలికె."

మెకంజీ దొరవారి సంగ్రహములందును స్థానిక చరిత్రలయందును నీ తుర్రెయూరు సంస్థాన చరిత్ర చక్కఁగా తెలియవచ్చుచున్నది. ఆ చరిత్ర ననుసరించి తుర్రెయూరు రెడ్డిరాజుల వంశ వృక్షమును, వారు పాలించిన కాలపరిమితిని యీ క్రింద చూపుచున్నాను.

ఈ రెడ్డిరాజులు పంటరెడ్లు—నెల్లూరి మండలమున పల్లవోలి సీమ వీరి కాపురము. శ్రీకృష్ణరాయల కాలమున, అన్నారెడ్డి, సూరారెడ్డి అను నిరువురు సోదరులాతనికడ నాయకులై యుండిరి. కృష్ణదేవరాయలు దక్షిణదేశము జయించిన వెనుక కొల్లడమున కుత్తరముగ నుండు ముత్తైనాడు తీర్థగిరి ప్రదేశములలో దోపిడిగాండ్ర యొత్తిడి యధికముగ నుండుటచే నీ యన్నదమ్ము లిరువురిని వారి నణచుటకు పంపెను. వీరా ప్రదేశమున నిశ్శేషముగ దొంగలభయము లేకుండ చేసినందున యా తీర్థగిరి ప్రదేశమును వీరికి సర్వమాన్యముగా రాయలవా రొసగిరి. సోదరు లిరువురు నా ప్రదేశము నభివృద్ధిపఱచి సంస్థానముగా నేర్పఱచిరి. సోదరు లిరువురిలో సూరారెడ్డి వెనుక యీ క్రింది వా రా సంస్థానమును పాలించిరి.

(1) కుమార యెఱ్ఱమరెడ్డి క్రీ. శ. 1547-1582
|
(2) పాపిరెడ్డి క్రీ. శ. 1582-1597
|
(3) ఎఱ్ఱమరెడ్డి క్రీ. శ. 1597-1632
|
(4) లింగారెడ్డి క్రీ. శ. 1632-1667
|
(5) నల్లపరెడ్డి క్రీ. శ. 1667-1696
|
(6) లింగారెడ్డి (భార్యపేరమ) క్రీ. శ. 1696-1708
|
(7) వెంకటాచలరెడ్డి క్రీ. శ. 1708-1740

పై వంశవృక్షమున నాఱవవాడగు లింగారెడ్డియే వేంకటాచల కవిని పోత్సహించిన వేంకటాచలరెడ్డి తండ్రి. వేంకటాచలరెడ్డి కుమారుఁడు—కుమార వేంకటాచలరెడ్డి క్రీ. శ. 1740 లో రాజ్యపాలన ప్రారంభించినాఁడు. ఈతఁడు క్రీ. శ. 1772 వఱకు రాజ్యముచేసిన వెనుక నీతని కుమారుఁడు విజయ వెంకటాచలరెడ్డి క్రీ. శ. 1820 లో మెకంజి దొరవారికి తమ సంస్థానచరిత్రను[1] రచియించి పంపినాడు. అది తమిళ భాషలో నున్నది. దానినుండియే పై విషయములను గ్రహించితిని.

వెంకటాచలరెడ్డియు విజయరంగ చొక్కనాథుఁడును సమకాలికు లని స్పష్టపడుచునేయున్నది. కార్తికమహాత్మ్యము ముద్రిత మైన యింకను విశేషములు తెలియగలవు. ఇందు నీతిదాయకములును భక్తిప్రదములునగునుపాఖ్యానములు కార్తికమాసమహాత్మ్యముతోగూడ ధారాళశైలితో వర్ణితములైనవి.

వెంగనూరు:—

పై వంశీయులలో క్రీ. శ. 1632—1667 వఱకు తురయూరు పాలించిన లింగారెడ్డి తిరుచినాపల్లిమండలమున పెరంబలూరుతాలూకా

1. Macklenzie Collections 17-6-10 Section 5. Account of Turaiyur Samstanam.

యందలి వెంగనూరుగ్రామమున నొక ప్రత్యేకసంస్థానము నెలకొల్పెను. లింగారెడ్డిభార్య మెత్తాంబిక. ఈమె వృద్ధాచలేశ్వరాలయము కట్టించెను. 1 'గాధేయోపాఖ్యానము' అను శృంగారరసవత్ప్రబంధమును రచించిన బాలకవి బిరుదాంకితుఁడు ప్రసిద్ధవిద్వత్కవి రేవూరి అనంతయజ్వ వృద్ధాచల మహాత్మ్యము' అను నైదాశ్వాసముల ప్రబంధము రచించి యీలింగారెడ్డికి కృతినొసగెను. అందు కృతినాయకుడు బల్లవోల్ శాసనుడు, జగదగోవాళ, రాయవేశ్యాభుజంగుఁడు, పాండ్యగజకేసరి, విశుద్ధపంట వంశపావనుడు" అని వర్ణితుఁడైనాడు. కావున నీతఁడు తురయూరి పాలకవంశీయుఁడగుట స్పష్టము.

లింగారెడ్డి కొమరుఁడు వరదరాజరెడ్డి—ఈతనికుమారుఁడు కృష్ణారెడ్డి ఈ కృష్ణారెడ్డికి, పై రేవూరి అనంతయజ్వ పౌత్రుఁడు, బాలకవి వెంగనూరు అనంతయజ్వ 'శ్రీముష్ణమహాత్మ్యము' అనునైదాశ్వాసముల ప్రబంధము కృతి నిచ్చియున్నాడు. అందు వెంగుళమును గూర్చియు కృతిపతినిగూర్చియు గ్రంథావతారికలో నిట్లుగలదు.

"ఏపీటనిరవొందు నే ప్రొద్దు ధారాపు
రీశ్వరనాముఁడై విశ్వవిభుఁడు
ఏపురంబుననుండు కాపురంబుగగౌరి
సౌందరనాయకా సముచితాఖ్య
ఏప్రోలు పాలించు నెలమిఁబెట్టనికోట
యగుచుఁగూత్తండారు జగమెఱుంగ
నే నగరంబున నింపునింపు ననంత
విద్వత్కవిస్తోమ విశదఫణితి

అట్టివెంగుళమాత్మీయమైనరాజ
ధానిగామీఱు నా చంద్రతారకముగ
భరిత జగనొబ్బగండాది బిరుదశాలి
వరదరాజేంద్రు కృష్ణభూపాలమౌళి"

1. Trichinopoly District Gazetter Chapter XV. Page 308.

"శ్రీముష్ణమహత్త్వం బభి
రామంబది తెనుఁగుచేసి రహికెక్కఁ జగత్
క్షేమంకర కృతిమచ్చుభ
నామాంకితముగ నొనర్చి నైపుణిగనుమా"

శ్రీముష్ణమహాత్మ్యము వాఙ్మయమున గల ప్రశస్తక్షేత్రమహాత్మ్యములలోనొకటి.

ఈవరదరాజరెడ్డి విజయరంగ చొక్కనాథుని సమకాలికుఁడు. కావున అనంతకవియు నాకాలపువాడే. అనంతయజ్వ వేఱొకకృతి శివరహస్యఖండము.

తలమల:—

తిరుచనాపల్లి మండలమున నామకల్లు తాలూకాయందలి తలమలయను కొండక్రింద ప్రదేశమును పైలింగారెడ్డికి తాతయగు పాపిరెడ్డి వశపఱచుకొని కొండపై శ్రీవేంకటేశ్వరస్వామి యాలయము గట్టించెను. ఈ వంశీయులకు తలమలవారని యింటిపేరువచ్చినది. వీరిలో క్రీ. శ. 1670-1700 ప్రాంతముల విలసిల్లిన తలమల రామచంద్రారెడ్డికి విశ్వేశ్వరపండితుఁడను విద్వత్కవి 'కృష్ణవిలాసము' అను నైదాశ్వాసముల శృంగారరసోత్తర ప్రబంధము నంకితము గావించెను. ఇందవతారికలో కృతిపతివిషయము విపులముగా గలదు.

కృష్ణవిలాస కృతికర్త విశ్వేశ్వరకవి. కవితార్కిక శిరోమణి బిరుదాంకితుడు. గీర్వాణసాహితీవేత్త. కాని తెనుఁగునమాత్రము భాషానుగుణ్యముగ మృదుపదరచన గావించియున్నాఁడు.

"తలపున నన్ను నిల్పునెల
తా! నెలతాపము హెచ్చివచ్చెనే
యలరులతేనె చిల్కు నవ
లా ! నవలాలిత సూక్తివల్కవే
వలపులు సందడింపఁ జెలువా !
చెలువానఁగఁ గౌఁగలింపవే
తలిరులతావిగుల్కు వనితా
వనితావుల నన్నుఁగూడవే."

"సుజతిరదాళి పేర నును
　　　జక్కులబల్కుల పేర నానుధన్
జదురుగ నవ్వు పేర నవ
　　　చంద్రికలన్ నిటలంబు పేర డా
ల్వాదలగ నుండుమండలము
　　　లో సగ మక్షుల పేర గల్వలన్
గుదువుగనుంచె మోమునకు
　　　గోము సుధాకరుఁ డప్పుఁడీయగన్."

పై గ్రంథములన్నియు నాంధ్రసాహిత్య పరిషత్తునఁ గలవు. దక్షిణాంధ్ర వాఙ్మయమునకు సంబంధించిన కృతులెన్నో యపరిశీలితముగా నందున్నవి. శుద్ధద్రవిడ దేశమున సాహిత్య కళాపోషకులగు రెడ్డి రాజులెట్లు తెనుగుభాషను కవులను నాదరించిరో దిఙ్మాత్రముగ తెలుసుకొనుట కివి చాలును.

## పుదుక్కోట - ఆంధ్ర వాఙ్మయము

తంజావూరు, మధురనాయకరాజుల వెనుక తెనుగు వాఙ్మయమును పోషించిన నాయకరాజులలో పుదుక్కోట రాజులు ముఖ్యులు. వీరికి 'తొండమాన్' అను బిరుదముగలదు. వీరును తొలుత విజయనగర సామ్రాజ్యాధీశులకు సామంతులై, క్రమక్రమముగ స్వతంత్రత వహించిరి. పుదుక్కోట యనగా నవసాలపురమని, క్రొత్తకోట యని యర్థము. ఇది తిరుచినాపల్లి కిరువదిమైళ్ల దూరముననున్నది. ఈప్రదేశము శుద్ధ ద్రవిడ దేశమైనను, పుదుక్కోట రాజధానిగాగల తొండమాన్ రాజులు తెనుఁగున తాము స్వయముగ కృతికర్తలై, కృతిభర్తలై ప్రఖ్యాతిఁగాంచిరి. ఇప్పటికి నీసంస్థానధ్వజమునందు తెనుగులో "శ్రీ బృహదంబా సహాయం" అని వ్రాయఁబడియున్నది. ఈ రాజుల వంశవృక్షము.




వీరిపేరు లిట్లున్నను, వీరాజులందఱును, పుదుక్కోట పురాధిష్ఠాన శక్తియగు బృహదంబాదేవి భక్తులు. తిరుచినాపల్లియందలి మాతృభూతేశ్వరస్వామి (తాయిమాన్ కోయిల్) సేవకులు. కావున శైవులు. వీరియింటిపేరు కోటివారు. కావున వీరు తెలుఁగునాయకులని వేఱుగ చెప్ప నక్కఱలేదు.

ఈ తొండమాన్ రాజులకు వంశపారంపర్యముగా నాస్థానకవులై విలసిల్లినవారు నుదురుపాటివారు. వీరు వెలనాటి వైదికులు. పశ్చిమగోదావరీ మండలమున నరసాపురము తాలూకాయందలి నుదురుపాటి వాస్తవ్యులు. మధురనాయకరాజగు ముద్దుకృష్ణప్పనాయని కాలమున నాతని యాహ్వానమున దక్షిణదేశమునకుఁ దరలివచ్చిన యుత్తరాంధ్ర బ్రాహ్మణకుటుంబికులలో నొకరు. వీరివంశీయులును, సంతతివారును నేడును పుదుక్కోటలో నున్నారు. వీరికిని రాజులకును గల సంబంధము తెలుపుచున్నాను.

నుదురుపాటి సీతారామయ్య

(రాయరఘునాథవిజయ రఘునాథులు పోషకులు)




ఇతనికి 'ఉద్దండకవి' యని బిరుదుగలదు. ఈతఁడు రాయరఘునాథునిచేతను, తిరుమల తొండమాన్ రాజుచేతను, విశేషముగ సన్మానింపఁబడినవాడఁని యీతని కుమారుఁడగు వెంకన్న చెప్పియున్నాఁడు. ఆతఁడు 'మజ్జనకాది ధీమజ్జన విరచిత వివిధప్రబంధముల్ వినుచు' అని తన తండ్రినిగూర్చి వ్రాసినను, సీతారామయ్య కృతులేవియు మనకు లభ్యములు కాలేదు. ఆతఁడు రచించిన చాటుపద్యములు లభించినవి. వాని నీ క్రింద పొందుపఱచుచున్నాను.

---

ఈవంశీయులవృత్తాంతము తెలియుటకు నాధారభూతులు శ్రీహరి సేతురామయ్య గారు. వీరు నుదురుపాటివారి బంధువర్గములోనివారు. పుదుకోట వాస్తవ్యులు. నుదురుపాటి వంశవృత్తాంతమే కాక మఱికొందఱు దాక్షిణాత్యకవుల వృత్తాంతమును మొదట తెలిపినవారు వీరే. క్రీ. శ. 1908 లో రఘునాథ తొండమాన్ విరచితమగు పార్వతీపరిణయమును ముద్రించుటకు మూలప్రతి పంపినది వీరే. క్రీ. శ. 1916 లో వీరు "చోళదేశాంధ్ర ప్రాబల్యము" అను ప్రశస్త వ్యాసమును నాంధ్రసాహిత్యపరిషత్ పత్రికలో ప్రకటించియున్నారు.

ఈతనినిఁగూర్చి కుమారుఁడు వెంకనకవి యిట్లు చెప్పినాఁడు.

క. బలవైరి గంధసింధుర
గళబంధురఘటితఘంటి కారావనిర
ర్గళధాటీపటిమ మనీ
షిలలామా సుదురుపాటిసీతారామా !

## కోటి తిరుమలరాయలు

### ఈతనిపై సీతారామయ్య రచించిన పద్యములు

చ. స్థిరజయసాంద్ర ! కోటికుల తిర్మలరాయధరాధరేంద్ర ! నీ
కరకరవాలఘాతలను గాంచినవైరికిఁ బోటుఁదాన నం
బరమణిమేనఁదూటుఁ బలవైరికిఁ దత్తరపాటు రంభవా
తెఱపైఁగాటు సౌరసుదతీమణి కబ్బురపాటు చిత్రమే ?

చ. అరుదుగదా ! తలంపఁగవులార ! ధరాధిపులార ! వింటిరా?
శరనిధిమేరఁదప్పిన ప్రచండకృశాశనుఁడు చల్లనైన దు
ర్భరకులిశంబు వాడఱిన రాముని బాణము నూటితప్పినన్
ధరణి సుధాపరుల్ గతులుఁదప్పినఁ గోటికులాబ్ధి చంద్రుఁడీ

తిరుమల తొండమానుఁడు మదిన్మఱియాడినమాట దప్పునే?

చ. జరజరవచ్చుబాణముల జల్లకుఁ గొంకక రింగు రింగునన్
మొఱయుతుపాకి గుండ్లకును గ్రుమ్మొక ఖల్లను కత్తిపెట్లకున్
వెరవక సాటిలో రిపుల వేమరుగెల్తువు రాయతొండమాన్
తిరుమలభూపపుంగవుని తిర్మలభూప ! దిలీపవిక్రమా !

చ. నఱుకుదువౌరవైరి నరనాథుల గొగ్గి జిరాలు సింగిణీ
తురకసజీని ఘోడలపదండధణాలు ఘుణీలు ఘుల్లనన్
దురమునఁబెద్దకత్తిగొని దోర్బలశక్తిని రాయతొండమాన్
తిరుమలభూపపుంగవుని తిర్మలభూప ! దిలీపవిక్రమా !

ఉ. ఇట్టటుగోటి తిర్మల మహీపతియూరక కాని వానిఁ జే
పట్టడు పట్టడట్లనక పట్టినచోఁ దన యంతవానిఁగా
గట్టిగఁ జేయుగా కసదుగాదు నిజంబుగనింకజూడుఁడీ
పట్టపురాజులార ! భటవందిపురోహితులార ! వింటిరా !

సీ. చూచితి నేపాళచోళకేరళ పాండ్య
ధరణీధవుల సభాస్థలులనెల్లఁ
గనుఁగొంటినంగ వంగకళింగ కాశ్మీర
వసుధాధిపతుల ప్రాభవములెల్లఁ
దరిసించితి మరాట కరహాట కర్ణాట
జగతీశ్వరుల విలాసంబులెల్ల
గాంచితిగుకురు కొంకణ ఔంకణవిదర్భ
ధరణీధవులశౌర్య ధైర్యపటిమ

గీ. లిట్టిసాగసిట్టి విభవంబు లిట్టిమహిమ
లిట్టియౌదార్య గరిమల నెందుగాన
రాయతిరుమల తొండమాన్ ప్రభుతనూజ !
రమ్యగుణసాంద్ర! తిరుమలరాయచంద్ర !

కళిక. మఱియును దుర్జన, భర్జన,తర్జన, పరిచయకర జయశరజాలునకై
నరపతిలక్షణరక్షణ.........నిజశీలునకై .
హారిదతిహాటకశాటకఝూటకర రుచిరసురచిరగ త్తేజునకై
పరిసరభాసురభూసురవాసర...........
అధికృత-గర్వితగుర్విత రోర్విత, లాధిపసాది పదాతతికై
మధురిమపూరితసారిత గీరిత మంగళ...........
కవిజనదాననిదాననిధాన కరకృత కరకృత పంకేజునికై
అవితతభాషణపోషణ సువదన భువదన.........
నవలాల్కనుగలనాట్యపుతుళుకై హావణిలువరుజలనలరెడుపలుకై
దువలును బూనుకదుముచువశికై ............

శా. స్ఫాయద్దంతి ఘటాఘటోద్భవ మదాసారస్ఫురద్వాహినీ
...............ధారరుహావరస్తోమావనంతభ్రమా
గ్గాయద్భృంగ సమూహనిష్కుటములౌ దారిసుధీ గేహముల్
............ధీరువలనన్ రంజిల్లునెల్లప్పుడున్.

కలిక. మఱియు విబుధుల కలన, గరిమను ప్రభువలన
..................ననివిభువలన
రణధరాధిక చలన, రహితశౌర్యునివలన
గుణధరాధికమిళన, కుతుకధుర్యునివలన
మ......................

కరణంబలిక్కలి తద్గుణైక్యమని తర్కజ్ఞాళి నవ్వంబడున్
హారతుల్య ప్రతిపాద్యచేత.

కలిక. మఱియును గవులను మనుచును విభుచే
నరులను కవులను ననుచును ప్రభుచే

కలనైనను బొంకినిధీరు
..... ...............
గంటిడిగాంచినకైగల దొరచే
గంటిడగాచినకైనగవరుచే
కోటికులావనగుణ వాక్పతిచే
కోటి... ... .....నిజముగగొలిచే
ప్రజతగబొలిచెన్ దినుసునమనిచెన్
మనిమదిమనిచెన్ నెనరుచుదనిచెన్.

తిరుమలరాయని కుమారుడగు విజయరఘునాథునిపై సీతారామయ్య చెప్పిన పద్యములు.

సీ. వలిమలల్లుండును వానికుమారుండు
 సరివత్తు రవనిలో శౌర్యమందు
వనధియల్లుండును వానికుమారుండు
 రూపొప్పదురుదాత్త రూపమందు
పాండేంద్రు నల్లుండు వానికుమారుండు
 జంటౌదురిలలోన వింటియందు
వనజాక్షునల్లుండు వానికుమారుండు
 నీడౌదురుర్విలో నీవియందు

గానవినుఁగొల్చి విఖ్యాతిఁగాంచినట్టి
అల్లుడికుమాళ్ళ కవనిలోననుదినంబు
భళిరతిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ తొండమాన్ విభువజీర.

సీ. దేవతారాజులు స్థిరశౌర్యమహిమచే
 భోగిరాజులు పటుబుద్ధిచేత
గిరిరాజవర్యులు నెఱిధైర్యగరిమచే
 బక్షిరాజులు బహుబలముచేత
కలశాబ్ధిరాజులు గాంభీర్యగుణముచే
 కలువలరాజులు కాంతిచేత
రాజరాజులుతనరారు సంపదలచే
 వలరాజులిలరూప వైభవమున

ధర్మరాజులు నీతిచేఁ దఱచిచూడ
సామినీరాజచంద్రులు జగతిమీఁద
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. గుభగుభాళిని పారు గుంటుకోవిఫిరంగి
 జవురు జంగీలను సరకుగొనక
సరసర చిరచిరజరజరమనివచ్చు
 బాణాలరవళిచే బబ్బరిలక

ఫెళఫెళధమిధమీ పెటపెట 'రొయ్యను,
బలుతుపాకీగుండ్ల కళుకుఁగొనక
ధణధణాంధణధణాంధణధణవత్కార
భేరీభాంకృతులకు బెండగిలక

మెంతలెమ్మని తేర్లపై నెక్కితూరి
చుట్టుముట్టగ బాళెముల్ గొట్టితౌర
భళిరతిరుమలతొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర.

సీ. గజఘంటఘణఘణల్ ధ్వజములపెటపెటల్
గుంటుకోవిఘిరంగి గుభగుభలును
బలుతుపాకీగుండ్ల ఫెళఫెళల్ కత్తుల
భళభళలీలల ధగధగలును
శరముల బిసబిసల్ చక్రాలజరచరల్
బాణాలబిరబిరల్ భటులరథుల
భూరిభేరీధ్వనుల్ వారణఘీంకృతుల్
జననకంఖాణఘోషలు చెలంగ

సళుకు వెళుకును లేక యాహవముసొచ్చి
ఘోరవైరుల శిరముల గూల్చువౌర!
భళిరతిరుమలతొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ - విభువజీర.

## —: రాయరఘునాథరాజు :—

(క్రీ. శ. 1769-89)

పుదుక్కోట రాజులలో నాంధ్రభాషాపోషకులలో నీ రాజగ్రగణ్యుఁడు. ఈతఁడు నుదురుపాటి సీతారామాది యుద్దండకవులను పోషించుటయేగాక, స్వయముగా సంస్కృతాంధ్రభాషాపాండిత్య విశారదుఁడై, కృతికర్తయైన మహాకవి. దక్షిణాంధ్ర వాఙ్మయమునందే కాక, తెనుఁగుదేశమందలి ప్రశస్తరాజకవులలో నితఁడును పేర్కొనఁదగినవాఁడు,

ఈతని యాస్థానముననే, ఆంధ్రభాషార్ణవాది బహు మహాగ్రంథముల రచించి, విద్వన్మహాకవియని, ఉద్దండకవి యని పేరొందిన వేంకన కవీంద్రుఁడు వెలసినది. వెంకన కవీంద్రుని గూర్చి తెలుపుటకు పూర్వ మీ రాజకవినిగూర్చి తొలుత తెలుపుచున్నాను.

ఈతఁడు క్రీ, శ. 1730–1769 వఱకు పాలించిన విజయరఘునాథ తొండమాను వెనుక రాజ్యమునకువచ్చెను. ఆతనికి సంతతిలేక పోవుటవలన నాతనిసోదరుని పుత్రుడగు నీరాయ రఘునాథతొండమాన్ రాజయ్యెను. ఆంధ్రభాషాభిమాన మీరాజునకు నుదురుపాటి యాస్థానకవి వలన నుగ్గుపాలతో నలవడెను. ఈతనికి ముందుపాలించిన విజయరఘునాథతొండమాన్ రాజును నాంధ్రభాషాభిమాని. ఆతఁడు క్రీ. శ. 1732 లో పుదుకోట తిమ్మయము తాలూకాలోని 'కిమనూరు' గ్రామము నొకా నొక బ్రాహ్మణునికి దానమిచ్చుచు, నాదాన శాసనమును తెనుగుభాషలో వ్రాయించియున్నాడు. తక్కిన యీతని శాసనములన్నియు నరవభాషలోనున్నవి. రాయ రఘునాథుఁడును బృహదంబ భక్తుఁడు. సహజమగు నాతని ప్రతిభకు దైవభక్తి గురుభక్తి వన్నెబెట్టినవి. ఆతఁడు రచించిన కృతులు రెండే మనకు కానవచ్చుచున్నవి. వానిలో తొలిది [1] పార్వతీపరిణయము. రెండు కవిజనోజ్జీవిని.

## పార్వతీ పరిణయము

నన్నెచోడ మహాకవి మొదలుకొని నేటికాలమువఱకును కాళిదాస మహాకవి కుమారసంభవకథను పెక్కుమంది కవులు కావ్యములు రచియించియున్నారు. వానిలో క్రి. శ. 1769 నుండి 1789 వఱకును

---

1. పార్వతీ పరిణయము క్రీ. శ. 1907లో సరస్వతీ పత్రికలో ముద్రితమైనది. ఈకవి గ్రంథములనుగూర్చి తొలుత తెలిపినవారు విద్వద్వర్యులు మా రామకృష్ణకవి గారు.

ఆంధ్రరాజకవులు ఆంధ్రపత్రిక ప్రథమ సంవత్సరాది సంచిక, 1910.

పుదుకోట సంస్థానమును పరిపాలించిన కోటి రఘునాథరాయ తొండ మాన్ మహీపాలుడు రచియించిన పార్వతీ పరిణయమొకటి. కవితా రచనయందు సిద్ధహస్తులగు నన్నెచోడ శ్రీనాథాది కవులవెనుక నీకథను నింత స్వతంత్రకల్పనలతో, చతురతతో, జాతీయ స్ఫోరకముగ రచించిన కవి వేఱొకఁడులేఁడని కంఠోక్తిగఁ జెప్పవచ్చును.

పార్వతీ పరిణయమాఱాశ్వాసముల ప్రబంధము. ప్రథమాశ్వాసమున హిమవద్వర్ణనము, హిమవంతుఁడు మేనకాదేవితో గూడి సౌఖ్యమునందుట. అంత సంతానములేనందున చింతించి తపస్సు చేయుటకు భార్యతో నొకగురస్సునకు వెడలుట అను కథలు గలవు.

ద్వితీయాశ్వాసారంభమున భార్యతోగూడ హిమవంతుఁడు తపోదీక్షనుండగా బాలాంబ ప్రత్యక్షమై తాను దక్షునికూతురననియు వారలకు పుత్రికయయ్యెదననియుఁ జెప్పి యంతర్హితమయ్యెను. మేనకయు గర్భవతియై కుమార్తెనుగనెను. మునులు 'ఉమ' యని నామకరణము చేసిరి. పార్వతి దినదిన ప్రవర్ధమానయై శివభక్తిపరాయణయై మెలగుచుండెను. ఇంతలో నామెకు యౌవనోదయమయ్యెను. నారదుఁడొకనాడు వచ్చి పార్వతి యీశ్వరుని యర్ధశరీరమని తలిదండ్రులకుఁ జెప్పెను. పరమేశ్వరుఁ డాకాలముననే, హిమవంతమునకు తపస్సు చేయుటకు వచ్చెను. అంత హిమవంతుఁడు మేనకా పార్వతీసహితుఁడై శివునిపద్దకువచ్చి, పరిచర్యచేయుటకు తన సుతనంగీకరింపవేఁడెను. శివుఁడంగీకరించెను, ఆమెయు నతి శ్రద్ధతో పరిచర్యచేయుచుండెను.

ఇంద్రుఁడు మొదలగు నష్టదిక్పాలకులు నాసమయమున బ్రహ్మవద్దకరిగి, తారకాసురుడు చేయుచున్న దుండగములను వివరించిరి. బ్రహ్మయు, పార్వతీ పరమేశ్వరులకు జన్మించిన పురుషుడుగాని తారకుని చంపలేడుగాన నాతవి యుదయముకొఱకు పార్వతీ పరమేశ్వర

సమాగమము సమకూడునట్లు చేయుఁడని చెప్పెను. దానికి మన్మథుఁ నియోగింప నుపదేశమిచ్చెను.

ఇంద్రుఁడు మన్మథుని బిలిపించి, యా కార్యమునకై నియోగింప మన్మథుడును సంతోషముతో నాకార్యము సాధించుటకు వసంతునితో, తనపరివారబలముతో నీశ్వరునిపైకి ప్రయాణముసాగించెను. అంతమధ్య మార్గమున కళావతియను కన్య హిమవంతమునుండి వచ్చుచుండగా, మన్మథుడామెను, గౌరి వృత్తాంతమడిగెను. కళావతియు, గౌరియెంత పరిచర్యచేసినను శివుఁడామె నెంతమాత్రముకన్నెత్తియైనచూడలేదనియు నాతని వశపఱచుకొనుట కేదైన వశ్యవిద్యను సమకూర్చుకొని రమ్మని పార్వతి తల్లిమేనక తన్నంపెననియు చెప్పెను. మన్మథుఁడామాటల కియ్యకొనక యీశ్వరుని తపోవనమున దండువిడిసెను. ఇది ద్వితీయాశ్వాసకథ.

వసంతుఁడు తపోవనము ప్రవేశించగానే వసంతోదయమయ్యెను, ప్రకృతి యుల్లాసముతో నుప్పొంగుచుండెను. ఆసమయమున తపోనిష్ఠాగరిష్ఠుడైయున్న శివునిరూపముచూచి మన్మథుడు తొలుత తల్లడిల్లి యావెనుక తానుచేసిన ప్రతిజ్ఞ జ్ఞప్తికివచ్చి, యొక చెట్టుచాటున గౌరి రాకకై వేచియుండెను, అంతలో మనోహరాకారమున పార్వతివచ్చి శంభునకు మ్రొక్కు సమయమున మన్మథుడు తన బాణములను శివునిపై ప్రయోగించెను. శివుఁడు తత్క్షణమే, తన్ను కలఁతపెట్టిన మన్మథుని ఫాలనేత్రము తెఱచి భగ్నమొనర్చెను. పార్వతి మూర్ఛపోయెను, హిమవంతుఁడచటికివచ్చి పార్వతిని తీసుకొనివెళ్లెను. అంత మన్మథుని భార్యయగు రతి జరిగినదిచూచి భర్తకై విలపించి, యగ్నిహోత్రమున కాహుతి యగుటకు సిద్ధమయ్యెను. ఆకాశవాణి పార్వతీవివాహసమయమున మన్మథునితో నామెయుండుననియు నితరుల కాతడనంగుఁడై యుండుననియు పలికెను. రతి సమాశ్వాసితయై వెడలిపోయెను. ఇది తృతీయాశ్వాసకథ.

పార్వతియు హిమవద్గిరికి వచ్చిననాటనుండి విరహార్తయై, తపస్సుచేయ నారంభించెను. పరమేశ్వరుఁడును తన కొలువుకూటమున నుండగా నింద్రోపేంద్రాదిసమస్తదేవతలువచ్చి శంకరుని లోకసంరక్షణార్థము గౌరిని భార్యగా పరిగ్రహింపవలసినదని కోరిరి. శంకరుఁడందుల కియ్యకొని మన్మథుని పునరుజ్జీవితునిజేసి వటురూపమునుదాల్చి పార్వతి తపోవనమునకు వచ్చెను. అప్పుడతఁడచ్చటి చెలికత్తెలవలన వృత్తాంతమంతయు నెఱింగి, శివుడు జోగి యనియు విరూపియనియు నిట్టి సుందరాంగిని నాతనికిచ్చుట తగదనియు శివుని నిందించెను. పార్వతియు కోపోద్దీపితయై చెలికత్తెలకా వటువు శివనిందజేసినందులకు తగినశాస్తి యొనర్చుమని యాజ్ఞాపించెను. అంతట శివుడు తన నిజరూపమున ప్రత్యక్షమై పెండ్లియాడమని కోరెను. పార్వతి తల్లిదండ్రుల యాజ్ఞ లేనిదే తానేదియు జెప్పజాలనని చెలికత్తెలతో వెడలిపోయెను. తనకూతురు తపముడిగి మగిడివచ్చి నందులకామె సంతసించెను. పార్వతికి పరమేశ్వర విరహము ప్రారంభమయ్యెను. ఇది చతుర్థాశ్వాసకథ.

పరమేశ్వరుఁడును సప్తఋషులను హిమవంతుని యెద్దకు పెండ్లిమాటలకై పంపెను. హిమవంతుఁడు వివాహమునకు నంగీకరించిన వెనుక పరమేశ్వరుడు పెండ్లికి తరలివచ్చెను. ఆపైని వివాహము. మన్మథుడు రతికి ప్రత్యక్షమగుట, వైవాహికోత్సవము. పార్వతీ పరమేశ్వర సమాగమము. ఇది పంచమాశ్వాసకథ.

షష్ఠాశ్వాసమున షణ్ముఖుని జననము, ఆతడు దేవసేనాధిపత్యమువహించి తారకునిపై యుద్ధమునకు వెడలుట, తారకసంహారము, షణ్ముఖుఁడు వల్లి యను పేరుగల దేవసేనను పెండ్లియాడుట అను నానంద విషయముతో ప్రబంధము సమాప్తమగును.

ఈప్రబంధమున కృత్యవతరణికలో రఘునాథతొండమాన్ రాజు తన యాస్థానకవియగు నుదురుమాటి వేంకనార్యుఁడీ ప్రబంధము వ్రాయుమని ప్రోత్సాహించినట్లు చెప్పినాడు. మఱియు వేంకనార్యుని యాంధ్ర

భాషార్ణవములోని వంశవర్ణన పద్యముల నాతడు చెప్పినట్లేయిందిమిడ్చి యున్నాడు; ఇది యెంతయు సమంజసమే. తన పూర్వుల వృత్తాంతము, తన్నుగూర్చి తాను చెప్పుకొనుటకంటె నితరులచేత చెప్పించుట మేలు గదా! మఱియు నుదురుమాటివారు, కులక్రమాగతముగా వారి యాస్థానకవులు కావున నిచట రఘునాథ తొండమాన్ యొక్క యౌచిత్యమే గాక, యాస్థానకవి యందలి గౌరవాభిమానములుకూడ తేటపడుచున్నవి.

ఇందలి కొన్ని కల్పనలు భావములు మనోహరములై యున్నది.

**గణపతి స్తుతి.**

చ. మంచముఁ జేరిశంభుఁడు కుమారుని తొట్లనుబెట్టినీవు చే
లాంచలమేల పట్టుకొనె దవ్వకడంజను మన్నభక్ష్యమి
మ్మంచనిపోర చంద్రకళ నక్కఱఁగై నిడఁ గేలఁద్రోయుచున్,
ద్రుంచి దోసెయంచ నెడు తోరపుబొజ్జగలానిఁగొల్చెదన్.

పార్వతీదేవికి 'ఉమ' యని పేరువచ్చుటకుఁ గారణము కాళిదాసు తపస్సునకు వెళ్లవలదనుటవలన వచ్చినదని చెప్పగా మనకవి శివమంత్ర పరముగా దాని నిట్లు సమర్థించినాడు.

క. ప్రణవస్వరూపిణియై తగ
నణువుగఁ దదక్షరమ్ము లన్నియునుండం
గణుతించి యంబ కల ముని
గణ ముమ యనియపుడు నామకరణముచేసెన్.

ఓంకారములో అకార, ఉకార, మకారములుగలవు ఉమశబ్దములో ఉకారము, మకారములోని అకారము. మకారముగలవు.

బ్రహ్మవర్ణనమిందు ప్రశస్తముగనున్నది.

సీ. వదనసంఖ్యనెగాదు వాచావిభూతిచే
చతురాస్యభావంబు సంఘటిల్లు
యానంబుననెకాదు, ధ్యానమార్గంబుచే
పరమహంసప్రీతి పరిఢవిల్లు

అధివాసమునఁ గాదు హాసోక్తియందును
సత్యాశ్రయత్వంబు సంఘటిల్లు
ప్రథవరీతినిఁ గాదు పారిశుద్ధ్యముచేత
కమలయోనిత్వంబు ఖ్యాతిఁ గాంచు

గీ. నేమహామూర్తికతఁడు నీవేచరాచ
రాత్మకసమ సలోక జన్మాదికార్య
సంఘటనలేఖవినమిత సర్వలేఖ !
శ్రీవిధాతపదానత శ్రీవిధాత !

ఇట్లేన్నని పద్యములుదాహరింపవచ్చును. ఇందలి కల్పనలు, రసపోషణ, సంభాషణాచమత్కారము, జాతీయ రచన చదివినకొలది చవులూరించును. కేవలైహిక శృంగారరసభూయిష్ఠములగు దాక్షిణాత్య ప్రబంధములలో నుదాత్తముగనున్న కొలది కృతులలోనిది యుత్తమమని చెప్పనొప్పును. ఈ గ్రంథమునుగూర్చి సాహిత్యవిద్యాపోషకులు, సద్విమర్శకులు, కృతిభర్తలు నగు బ్రహ్మశ్రీ యేలూరిపాటి రామభద్రచయనులు గారొక విపులవిమర్శ వ్రాసియున్నారు. ఆది యముద్రితము.

ఇందలి గద్యము:—

ఇది శ్రీమద్బ్రహ్మన్నాయికా కృపాకటాక్ష సంప్రాప్తనిత్య మహాసామ్రాజ్యధుర్య, సర్వమహీపాల స్తూయమాన శౌర్యౌదార్య గాంభీర్యశౌణాయమాన దృక్కోణవిలోకన మాత్ర హస్తగత సామంతదుర్గ నిరంతర పూజాసంతోషితభర్గ కోటి సమాఖ్యాస మఖ్యాతసత్కుల కలశపయోనిధి రాకానిశాశశాంక, ఘంటికా హనుమధ్వజమకర కేతన, తురగ కరవాలవామకృశార్దూలత్తి పల్లాయన సింహాన్య కటకనీలాసపత్రదివాదీపికా నిజోపాంగ నవ విధభేరికాది నిఖిల బిరుదాంక వాత్స్యాయనాది వేదాంత పర్యంత నిఖలతంత్ర నిర్మితగ్రంథసకృచ్ఛ్రవణ విదిత మహాకవి

ప్రబంధనూతన తంత్రకరణ సామర్థ్యనిరంకుశ ప్రతిభావిభాసుర, బహుళాగ్రహార ప్రతిష్ఠాసంతోషితభూసుర, కులక్రమాయాత సాహితీ విద్యానవద్య, సకలసమ్మతనిజబిరుద పద్యదక్షిణాస్య సంసేవనాజీవన్ముక్తామ్నాయ మానమహోద్దండ కవి విధేయ శ్రీరాయ రఘునాథ తొండమాన్ మహీపాలనామధేయ ప్రణీతంబైన పార్వతీపరిణయంబను మహాప్రబంధమునఁ బ్రథమాశ్వాసము.

—: కవిజనోజ్జీవని :—

రఘునాథ తొండమాన్ రాజురచించిన వేఱొక కృతి'' కవిజనోజ్జీవని'' అనునది. ఇందులో నూఱుతెలుగుసమస్యల పూరణముగలదు. ఈగ్రంధమువలన రఘునాథ తొండమానురాజు సంస్కృతాంధ్రభాషా పాండిత్యము ప్రతిభయెంతయో వెల్లడియగుచున్నది. ఈసమస్యల నాస్థానకవియగు వెంకన్న యొసగినట్లును తాను పూరించినట్లును గ్రంథకర్తయే యిట్లుచెప్పియున్నాఁడు.

ఉ. శ్రీకరలీలఁబుష్పమునఁజెందినతావియుఁబోలె దివ్య ర
త్నాకలితంబగున్ శ్రుతివిధంబున, జాబిలిచల్వరీతిగా
నాకపిలాశ్రుతీశ్వరుని యంగమునన్వసియించి సర్వ వి
ద్యాకృతియై చెలంగు బృహదంబనుగొల్తు నభీష్టసిద్ధికిన్.

వ. అనియిష్టదేవతా ప్రార్థనంబుచేసి.

క. విజయరఘునాథభూపతి
నుజుఁడఖిలక్షోణిపాలనుతుఁడనుచుఁగలి
వ్రజమనఁగను మను కవితా
రజనిసుధాద్యుతిని రాయరఘునాథపతిన్.

గీ. వెంకనకవీంద్రుఁడుద్దండ బిరుదశాలి
మమ్ముఁగొలిచియు కఠినసమస్యలొసఁగ
నొప్పుకొనియేము పద్యముల్ సెప్పినంత
నందఱును వినికృతికివి యర్హమనిన

గీ. కవిజనోజ్జీవనియటంచుఁగావ్యమొకటి
దుర్ఘటనసమస్యలకునెల్లఁ ద్రోవఁదెలియ
కవిజనంబులకును నుపకారకముగఁ
జేతుదయచేత బృహదంబ చిత్తగింపు.

ఈ గ్రంథమున రఘునాథరాయని వైదుష్యమెట్లు వ్యక్తమైనది యీక్రింది పూరణమువలనఁ దెలియనగును.

1. అక్షరవంచన

"కలుషగిరి భేదశంబ శ్రీబృహదాంబా"

క. వకుళవననిత్యవాసిని
సకలాభీష్టములనిచ్చు చక్రిణితల్లీ
ప్రకటితముసేయు మీాకృతి
న్వకలుషగిరి భేదశంబ ! శ్రీబృహదంబా

(2) యతివంచన - కతినప్రాస
గ్లావిమలాక్షు వేంకటనగాధ్యక్షు.

క. దిగ్గలలనాకబరీధర
స్రగ్గాలితకీర్తిజాలసద్గుణశీలా
విగ్లపిత రక్షమారాం
డగ్లావిమలాక్షువేంకట నగాధ్యక్షా.

(3) కతిసిప్రాసపునరుక్త రూపవిషయసమస్య
గోగ్రణీగోఅగ్రణీగవాగ్రణియనియెన్

క. అగ్రజగోశబ్దముపై
నగ్రణిశబ్దంబుగూడి నదియెట్లగు సం
ధిగ్రహణఁ దెలుపుమనినన్
గోగ్రణిగో అగ్రణీగవాగ్రణియనియెన్.

(4) కఠినప్రాస సంస్కృతాంధ్రభాషాసంప్రదాయికము.

క. భోఅచ్యుతభోబ్రహ్మన్
భోఅంబరచారిణాంవిభోసర్వేదే
వాఆయాతవ్యాయన
నో ఆగ్రణికెక్కి శివుఁడుగొబ్బునవెడలెన్.

(5) అంతర్లాపి సమస్య.

దొనపులిమొనయమ్ముశాఖ తుదలనిపల్కెన్.

క. వనజాంబకుండు ననుఁగని
గినుకంగనలుచును గనులఁగెంపుజనింపని
ననతూపువేసిరమ్మను
దొనపులి మొనయమ్ముశాఖ తుదలనివలికెన్.

దొన, పులి, మొన, అము, శాఖి, యీపదముల చివరియక్షరములు కలుపగా 'నలినముఖి' యగును. ఒకస్త్రీ తన చెలికత్తెను జూచి దానితో 'ఓ నలినముఖీ' నన్ను మన్మథుఁడు రమ్మనును అని పలికెనని భావము.

(6) వృత్తగోపనము.

నారదవంద్యకాంతి జతనారద కౌఁగిలినీయ వేమిరా

క. మదనుఁడు కోపముచేతం
గదనంబునుఁజేయఁదొడఁగెఁ గ్రక్కుననోనా
రదవంద్య ! కాంతిజితనా
రద! కౌఁగిలినీయవేమిరా! యిదియేరా!

వృత్తగోపనమనఁగా నొక వృత్తపాదమును వేఱొకవృత్తములో నిముడ్చుట. ఇచ్చట ఉత్పలమాలపాదము కందపద్యములో నిముడ్పబడినది.

(7) ఏకపాదపూరణము - అనగా మూడుపాదములిచ్చి నాల్గవ పాదము పూర్తిచేయుట.

చ. చిటికెన వ్రేలియుంగరము చేడియకొడ్డెన మాయె భూవరా
కటక చరత్కరేణుచర కంపితసాలము శీతశైలమున్
కటకట దోసపండ్లనుపకట్లకు తాళునటే తలోదరీ!

పూర్తి:—

చ. చిటికెన వ్రేలియుంగరము చేడియన కొడ్డెనమాయె భూవరా
కటకట దోసపండ్లనుపకట్లకుఁ దాళునటే తలోదరీ!
కటక చరత్కరేణుచర కంపితసాలము శీతశైలమున్
ఝుటితిని గాంతునేనని నిజాంగనతోడను దెల్పువేగమే.

గ్రంథాంతమున :—

క. ఈకృతియతి కఠినసమ
స్తాకృతిఁ జదివినను విన్న నఖిలార్థములౌ
నేకృతికైనను శీఘ్రమె
శ్రీకృతి విజ్ఞాతరయను బృహదంబదయన్.

గద్య: ఇది శ్రీబృహదంబికా పాదారవింద నిరంతర సంసేవనా విశేషలబ్ధ మహాసామ్రాజ్యధురంధర, సకలభూపాల సభాభాసుర యశోబంధుర, హనుమద్గరుడ మకరమత్స్యపతాకాది మహారాజలక్షణ నవవిధాంగభేరీప్రముఖ నిఖలవాద్య గంభీరనినాద శ్రవణమాత్ర విరోధిగర్వ నిర్భేదన విచక్షణ, పాండ్యభూపాల దక్షిణబాహాయమాన, సకలభూపాలసంస్తూయమాన, వాత్స్యాయనప్రభృతి శ్రుత్యంత పర్యంత పరిచయ సముత్తేజిత ప్రతిభావిశేష ప్రబంధశతసమానవచో నిర్జితాదిశేష, ఆశురచనీయ మధురాదికవితాధౌరేయ, కవిజనవిధేయ, రణరంగ విజయ విజయ రఘునాథ తొండమాన్ మహీనాథతనూజ, రసికతాభి నవభోజ కోటికులదీప, శ్రీరఘునాథభూపప్రణీతంబైన 'కవిజనోజ్జీవని' యనుకావ్యంబునందు సర్వంబునేకాశ్వాసము.

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితము - సం. 25. సంచిక. 1.

—: నుదురుపాటి వెంకన్న :—

సీతారామయ్యపుత్రుఁడు వెంకన్న. పుదుకోట కవులలోనేకాక, దాక్షిణాత్యకవులలోనే కాక యాంధ్రదేశమంతట ప్రఖ్యాతికెక్కిన కవి. ఈతనికి తండ్రివలెనే 'ఉద్దండకవి' బిరుదముకలదు. సంస్కృతము ననే కాక, అచ్చతెనుఁగున నీతఁడ సమానుఁడు. సంస్కృతమున నమరమునకు ప్రతిగా తెనుఁగున 'ఆంధ్రామరము' నిర్మించిన జగజెట్టి. నిఘంటు రచనమేకాక, నిరవద్యములగు పెక్కుకృతులు రచించిన విద్వత్కవి. ఈతఁడు క్రీ|| శ|| 1769—89 వఱకు పాలించినపై రఘునాథ తొండమాన్‌రాజుచే, బహుముఖముగా సన్మానింపఁబడిన విద్వత్కవి. ఈతని కృతులు.

ఆంధ్రభాషార్ణవము.

ఇదియే పైని పేర్కొనఁబడిన యాంధ్రామరకోశము. తెనుఁగు దేశమున నకారాది నిఘంటువులురాక పూర్వ మీ నిఘంటువు చాల ప్రచారములోనుండెడిది. ఆంధ్రవాఙ్మయములో నచ్చతెనుగు నిఘంటువులలో నింతకన్న పెద్దనిఘంటువు వేఱేలేదు. ఆకాలపు నిఘంటువులవలె నిదియును పద్యమయము. అమరకోశమువలె నిందును స్వర్గవ్యోమదిక్కాలాదివర్గముల విభాగముతో మూఁడుకాండములు గలవు. ఇది మాతృభూతేశ్వరస్వామి కంకితముగా రఘునాథ తొండమాన్‌రాయని ప్రేరణచే రచితమైనది. ఈ గ్రంథావతారికయందు, కవి వెంకన్న ప్రతిభాదికమేకాక, తెనుగుభాషవిశిష్టతయు, తేటతెల్లము కాఁగలదు. మఱియు నిందు రఘునాథరాయని పూర్వులైదుతరములవారు వర్ణితులైరి. రఘునాథునిగూర్చి చెప్పిన విషయములు చారిత్రకముగ విలువగలవి. కావున నా యవతారికాభాగము నిందుదాహరించుచున్నాను.

ప్రారంభము:—

శా. శ్రీమాతృప్రకటీకృతాంగరుచిసారెంజూచి భాషింపుచో
నామేయైనత్రిలోకమాతయగుట న్వైశ్యాంగనందల్లియై
ప్రేమంబ్రోచుటజూడ వింతయెయనన్ శ్రీమాతృభూతేశ్వరుం
డామోదంబునఁబ్రోచుఁగాత రఘునాథాధీశచూడామణిన్.

* * * *

వ॥ అని యిష్టదేవతా నమస్కారంబును సుకవికుకవిపరిష్కార తిరస్కారంబులుం జేయు నవసరంబున.

సీ.

పాండ్యమహీమండలాధ్యక్ష బాహుదండ
కలితశిత తేజిత చకచ్చకత్కృపాణి
దాన విద్యా సశిష్యసంతానపాణి
రంజితజనాళి రఘునాధ రాయమౌళి.

వ॥ ఒక్కశుభ దినంబున ............ సభాంతరాళంబునం గొలువుండి నన్ను రప్పించి సన్మానంబు సేయుచు సవినయంబున.

క. ఖచరీకచకుచవిచల
ద్విచికిలహార ప్రసన్న వీనమరంద
ప్రచురరుచి పెనుఁగొనుఁ గచా
కచిగా నీకవితలెన్నఁ గవి వెంకన్నా.

తే. ఆంధ్ర గీర్వాణకవనములందు నీకుఁ
గలుగుజ్ఞానం బదేరికిఁ గలుగనేర్చు
నాశ్రితుఁడవంచు నుతియించు నట్లుగాదు
కాని యవియేల యిపుడు వెంకనకవీంద్ర.

తే. దేవతలభాషగావునఁ దెనుఁగుకన్న
సంస్కృతమెమిన్న యాయుక్తి సరియె తెలిసె
రసికుఁడగువాఁడు తనదు జారుసికలోనఁ
దులసినేయిడుకొనునొ? జాదులనెయిడునొ?

తే. కాన నీ యాంధ్రకృతులను గలుగునట్టి
పదములకునెల్ల నర్థమేర్పడెడు రీతి
నద్భుతంబుగఁ గృతిని జేయంగవలయు
నర్థమైన రసస్ఫూర్తియగుటయరుదె.

తే. కృతికినాయకు మాతృభూతేశుఁ జేయ
వలయునన నేనునట్లనేతలఁచితి నసఁ
బసిఁడిసొమ్ములుసేయించి వంటరాలఁ
జెక్కినను మేలె రతనము లెక్కఁకున్న.

వ॥ అనిన నేనునుం దదీయపరమేశ్వరచరణారవిందభక్తికి మెచ్చుచు సత్కులప్రసూతుండవగు నీకు నేతాదృశమనీషావిశేషం బరుదే యని తత్కుల ప్రశంససేయందలంచి.

సీ.

కల్పకమునీడ వినువాక గట్టుతలఁపు
మానికపుఁదిన్నెఁ గిన్నరీగానఫణితి
నాలకింపుచు నానందమనుభవించు
నల్లదేవేంద్రుఁ డలవియే యతనిఁబొగడ.

క. అతఁ డొకనాఁ డొకమానవ
సతిని వరించెను దదీయసౌందర్యం బ
ద్భుతమగుఁగద యా యింతికి
సుతులంతటఁ గలిగి రతులసుగుణాన్వితులై.

క. ఆయన్వవాయమందలి
రాయక్షితిపాలమౌళి రాజిల్లె యశ
శ్శ్రీయుక్తిని బ్రహ్మాండం
బాయెడ నాపాలకడవ యట్లు చెలంగెన్.

క. ఆరాయనృపతిగాంచెఁ గు
మారులరఘునాథరాయమహిపతి సమౌన
తొమ్మరమణుఁడు పచ్చనహాం
వీరుఁడు పేరమవిభుఁడన వీరలలోనన్.

ఉ. ఆరఘునాథభూపతి మహాద్భుతచర్యుఁడటంచు నిచ్చలున్
ధీరజనంబులెల్ల వినుతింపఁగ ధారుణినేలెఁ గాని యా
పేరుకుఁదగ్గ కార్యములు పెక్కువితమ్ములు దెల్పశక్యమె
వ్వారికి శైవధర్మపరిపాలన మొక్కటి మెక్కుడై తగున్.

తే. అతఁడుగాంచెను బెద్ద రాయక్షితీంద్రు
భుజబలవిహారు శ్రీముద్దువిజయధీరు
ధర్మగుణశీలుఁ దిరుమల ధరణిపాలు
రవితులితదేహు విభునిఁ జిన్నాయువిభుని.

క. వారలలోపలఁ దిరుమల
భూరమణుఁడు ఖ్యాతిగాంచె భుజబల దృప్య
ద్ఘోరాహితవారాహిత
సారాహితతీవ్రదీప్తశరజాలుండై.

* * * *

తే. అతడుగాంచెను శ్రీవిజయరఘునాథ
నరపతిశిరోమణిని ముద్దున[మన]రసవిభుని
రాజగోపాలధీరుఁ దిర్మలవజీరు
మఱియు రణభాషికాఖ్యుఁ గ్రమంబుతోడ.

వ॥ ఆ కుమారులందు

* * * *

సీ. త్రిశిరః పురీపరివృఢమనోనలినికి
బాలవిభాకరులీలఁదోఁచి
చోళరాజాస్థానకేళీగృహంబున
మణిదీపికావళిమాడ్కిఁదనరి
మహిసూరినరపాల మానసాంభోధికి
బాడబంబోయను పగిది వెలసి
తత్ప్రియాన్యక్షమాధవ శుష్కవనులకు
దావపావకమనుదారి నెగడి

త్రిపురదైతేయహరణ సంకుపితనిటల
నయననయననటద్ధంజయ జయావ
హంబు శ్రీవిజయ రఘునాథావనీంద్రు
సత్ప్రతాపంబు గనుపట్టు సంతతంబు.

తే. దక్షిణామూర్తి సేవావిచక్షణుండు
సంతతాద్వైత సిద్ధాంతసక్తచిత్తుఁ
డతఁడు తద్గర్భజలధిహిమాంశుఁడీవు
రాయరఘునాథ నృపచంద్ర రణమృగేంద్ర.

ఉ. శ్రీరమణీమణీచరణసింజ సమంజసరత్నపుంజమం
జీరనినాదవద్గృహావిశేషుఁడవౌచు సపుత్రపౌత్రతన్
ధారుణినేలు సౌభరివితమ్మున సర్వమహీపతుల్నినుఁ.
సారెకుఁగొల్చులీల రఘునాథనృపాల విశాలవైభవా.

మ. హృదయాలవాలముచక్కఁ భక్తిరసవారిన్ జ్ఞానబీజంబులో
నుదయంబంది ప్రరూఢపాదమగుచున్గో కర్ణనాథాభిధ
త్రిదశానోకహసంగతిందనరుచున్ శ్రీమద్బ్రహన్నాయికా
ఖ్యఁదగున్గల్పకవల్లి రాయరఘునాథాధీశునిం బ్రోవుతన్.

వ॥ అని తలంచి కార్యంబు నాశీర్వాద పూర్వకంబుగా నెఱిఁగ్చి
మహారాజ నియుక్త ప్రకారంబున,

క. శ్రీమత్సుగంధి కబరీ
కామికిని మునీంద్రహృదయగామికిని క్షమా
భూమికిని మాతృభూత
స్వామికిని నమస్కరించి సద్భక్తిమెయిన్.

వ. అంకితంబుగా నాయొనర్పంబూనిన యాంధ్రభాషార్ణవంబను
మహాకృతికి సందర్భంబనినంత సకలాంతర్యామి గావునం బ్రత్యక్షంబై
యెట్టులని యడిగినట్టులదోఁచె వినుము వివరించెద,

సీ. గట్టులమొకిమీఁదు గన్నవాల్గంటిని
  జెట్టఁబట్టుక యేలినట్టిదిట్ట
మున్నీటిరాచూలి ముక్కఁకెంజెడలోనఁ
  గ్రొవ్విరిగాఁదాల్చుకొన్నమేటి
గబ్బుచెంకమొకంబుగట్టి కళవసంబు
  కుబుసంబుగాఁ జేసికొన్నదంట
ప్రాఁబలుకఁగుత్తములప్పని సిస్తగునట్టి
  పుడమితేరెక్కెడి పోటుకాఁడు

జముపగఱబూచులదొర తొల్జంగమయ్య
వినుసికగలాఁడు ముక్కంటియనఁగనిట్లు
యౌగికంబుగ భవదాఖ్యలలరియుండు
ధాతృనుతపాదజలజాత మాతృభూత.

గ్రంథాంతము:—

తే. శ్రీలు వెలయంగనీపేరఁ జేయుకతనఁ
బరగుశాశ్వతముగ గ్రియావర్గమిట్లు
గైకొనుముదీనిభక్త సంఘాభిమాని
మాతృభూతజగత్త్రియీ మాతృభూత

* * * *

మాలిని. సకలభువన నాథా సంతతస్వావబోధా
మకుటఘటితసోమా మంగళాధారనామా
సుకవిహృదయగేహా సుందరస్వచ్ఛదేహా
యకలుషనిజచర్యా యాశ్రితామోదకార్యా.

గద్య. ఇది శ్రీమత్పరమేశ్వర కరుణాకటాక్ష సంప్రాప్త సర్వజ్ఞత్వాది కతిపయగుణ స్వసామ్య తదితర సకలగుణ నిరౌపమ్యా సేతుహిమాచలఖ్యాత మహోద్దండకవి బిరుదప్రశస్త సీతారామార్య వర్య తనూజాత శౌర్యధైర్య స్థైర్యాదిసకలగుణచిరత్నరత్నాకర కోటి సమాఖ్యావంశ సుధాపయోధిరాకాశశాంక ఘంటికాతు రంగనీలాతపత్ర హనుమద్ధ్వజమకరకేతన దివాదీప నవవిధభేరి

కాదినిఖిల బిరుదాంక బృహదంబికా కటాక్ష సంజాతసామ్రాజ్య ధురంధర విమలయశోబంధుర కర్ణాట పాండ్యచోళమహీపాలాది సంస్తూయమాన శ్రీరాయరఘునాథ మహీనాథ మహాసభాంకణ బిరుదాయమాన ఆర్యనుతచర్య వెంకనార్య ప్రణీతంబైన యాంధ్రభాషార్ణవంబునందు ద్వితీయ కాండము సంపూర్ణము.

క. బృహదంబికా కటాక్షం
బహరహమునుగాంచి సమధికైశ్వర్యముతో
మహి నేలుము శాశ్వతముగ
రహి దిక్కులఁ దోప రాయ రఘునాథనృపా.

ఇట్లే ప్రతివర్గాంతమునను గలవు.

పైని యుదాహరించిన భాగమును బట్టి యీనిఘంటువు ప్రాశస్త్యము తెలియగలదు. ఇందు తత్సమపదములకు సరిగానచ్చ తెలుఁగు పదము లీయఁబడినవి. అందుచేత నేటి తెలుగుకవులకు మిగుల నుపయోగకారిగానున్నది. ఈ నిఘంటువునకె వ్రాతప్రతులు ముద్రితప్రతులు చాలగలవు. వాని నుదాహరించుచున్నాను.

1. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము 1363 సంఖ్య నుండి 1368 వఱకు.

వీనిలో 1368 సంఖ్యలో నాంధ్రభాషార్ణవశబ్దసూచిగలదు.

2. అంధ్రసాహిత్య పరిషత్తు. తాళపత్రప్రతులు.

ముద్రితప్రతులు

1. ఆర్ష ముద్రాక్షరశాల విశాఖపట్టణము, 1898

2. చింతామణి ముద్రాక్షరశాల, 1900

3. వావిళ్ళ ముద్రాక్షరశాల, 1910.

ఈ నిఘంటువు మూడుపరియాయములు ముద్రితమైనను, ప్రామాణికమగు ముద్రణములేనేలేదు. ఈ నిఘంటువునుగూర్చి తొలుత పరిశ్రమచేసినవారు భాషోద్ధారకులు బ్రౌను దొరవారు. వారుదీనికి ఆంధ్ర భాషార్ణవ శబ్దసూచి, అను పదసూచికను తయారుచేయించినారు. అది యెంత జాగరూకతతో చేయఁబడినదీ, ఎంత యుపయోగపడునదియు నీ క్రింది యుదాహృతభాగమునుబట్టి గ్రహింపవచ్చును.

—: ఆంధ్రభాషార్ణవశబ్దసూచి :—

బ్రౌనుదొరవారు వ్రాయించినది

"The Andhra Bhash Arnavam is written in verse being in imitation of Amara Kosha, every verse cantaining the various synonyms forme the object.

"I caused a lfst to de made alphabetically of the words therein: with the meaning, in telugu ; it is arranged in this volume, on the plan used tn my telugu Dictionary."

"This work contains perhaps one - forth of the language, certainly uot more."

ప్రారంభము :—

అ-తృ-౧౨౨-ఏవకారార్థము.
అంకవన్నె-ద్వి-౩౭౪-అశ్వపార్శ్వలంబిరజ్జువు.
అంకకాడు-తృ-౧౬-ప్రధానుఁడు.
అంకు-ద్వి-౨౬౪-దంష్ట్రామూలము.
అంకుసము-ద్వి-౯౬౪-అంకుశము.
అంకె-ద్వి-౫౦౫-గోణ్యర్థము-తృ-౪౭-సమయము.
అంగ-ద్వి-౩౭౧-అసృఙ్ఞదికము.
అంగడి,ద్వి-౧౬-ఆపణము.
అంగద ప్ర-౧౭౩-మనోవ్యథ.
అంగదట్టము-ద్వి-౨౯౪-యోగాంతరీయము.

అంతము :—

హేమాహేములు-త్రి-౨౬_బహువచనముచేత అన్యుల
తెలిపేపట్ల పూజ్యులు.

హైనరే-త్రి-౧_౨౧-యాథార్థ్యము.
హొంతకారులు-ద్వి-౩౯౦-బిరుదువేసిన జెట్టి పరివారము.
హొన్ను-ద్వి-౫౩౦-కాంచనము.
హొమ్ము-త్రి-౩౧-స్థూలము.
హొయలు-ప్ర-౧౭౭-విలాసము.
హొయల్బంటి-ద్వి-౩౭౬-కంబళివ్యాహము.
హొరగు-ప్ర-౧౭౭-విలాసము.
హొరవల-ద్వి-౨౮౫-వన్నెగల కోక.
హొరాహొరీ-త్రి-౧౧౫-అవిచ్ఛిన్నము.

Finished August 1850; signed C. P. Brown ఇది నేటివఱకు ముద్రితము కాకుండుట శోచనీయము.

## —: రఘునాథీయము :—

ఇది నరసభూపాలీయమువంటి యలంకార గ్రంథము. అన్ని యలంకారములును రాయరఘునాథున కంకితముగా రచియింపబడినవి.
విభావనాలంకారము.

గీ. నీవలన నాజిఁగలిగిన భావమెంచి
కలియుగంబున మించె నక్రమమటంచు
నడవులకుఁబొఱు నలికి నీయరులబారు
నమదహితగేయ శ్రీరఘునాథరాయ.

ఇది సంస్కృతచంద్రాలోకమున కాంధ్రీకరణము కాదగును.

## —: పార్వతీకల్యాణము :—

ఇది మీనాక్షీసుందరేశ్వరుల కంకితముగా రచింపబడిన యక్షగానకావ్యము. ఇందు గ్రంథకర్తకుగల 'మహోద్దండకవి'బిరుద మునా

హరింపబడినది. రాగతాళయుక్తములగు ననేకాంధ్రకీర్తనలు, స్వల్పముగా సంస్కృతగేయములు కలవు. పార్వతీ పరమేశ్వరుల వివాహ మిందు వర్ణితము. సంస్కృతగేయ రచన కుదాహృతి:

ఘనమణిదీపే కల్పితధూపే కనదతి చిత్రకలాపే
కనకమయోల్లస దనుపమనైజభవన శుకమధురాలాపే
శ్రీకరవిభవశ్శివయా సమేతశ్శ్వేతే మాణిక్యసౌధే
శ్రీకామహర హరహర హరేతి గీతం ప్రాకారరక్షిణం కుర్వంతు.

—: తొండమాన్ వంశావళి :—

తొండమాన్‌రాజుల వృత్తాంతమును దెలుపు నీవంశావళి 373 సీసపాదములలో మాలికగా రచితమైనది. చరిత్రకారుల కత్యంతోప యుక్తమైనది.

ప్రారంభము :—

సీ. "శ్రీజానకీదరస్మిత సదానీకృత
భాషణుండా శ్రితపోషణుండు
... ... ... ...
నిచ్చలు దయసేయ హెచ్చుచు నానాట
విజయచందురు రీతి వెలసితౌర
... ... ... ...
కోటికులాంబుధి కువలయినీజార
రణరంగధీర వీరాధివీర

రఘునాథభూపాల రమణీయగుణజాల
భవదన్వయంబును బ్రస్తుతింప
నాహ్లాదము జనించె నానతీవర్ణింతు"

అని రాయరఘునాథుని పూర్వు లిరువది తరములనుండి వర్ణించినాడు. ప్రమతియు, పుదుకోట నిర్మాణము. పుదుకోటరాజును, మధుర తంజావూరి నాయకులతో యుద్ధములు, వారి విజయములు విపు

లముగా వర్ణితములై నది. ఇం దంతయు ప్రామాణికమగు చరిత్రయే వ్రాయబడినది.

గ్రంథాంతము :—

విజయలక్ష్మి వరించి వేడుకలనుగాంచి
విదియచందురురీతి వెలసితనుచు
వంశావళులొనర్చి భవదీయసంతతి
... ... ... ...
మత్కృతాశీర్వాద సుహిమపలన

గీ. నలరు గావుత రాయపదాంకధుర్య !
ఆర్యజనగేయ తొండమానాభిధేయ
రాయరఘునాథ నృపచంద్ర రణమృగేంద్ర
ధరణివర్ధిల్లు మాచంద్రతారకముగ.

(ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సం. 2. పుటలు 304-17. 1914 ముద్రితము.)

—: బృహన్నాయికాదండకము :—

ఇది పుదుక్కోట పురవరాధీశ్వరియగు బృహన్నాయికకు నంకితముగా రాయరఘునాథునిగూర్చి తెలిపెడి పెద్దదండకము. ఇందులో వెంకనార్యుని నిరర్గళ సంస్కృతాంధ్ర కవనపటిమ కనబడును.

ప్రారంభము: —

శ్రీమత్ బృహన్నాయికా నామధేయే, మహాదేవజాయే మహావిష్ణుమాయే, నవాంభోధకాయే, .........శ్రీలసన్మేఖలా నూపురాలంకృతే, దివ్యపీతాంబరాలంకృతే యంచనన్ దేవబృందంబుచే సన్నుతుల్ గాంచు శ్రీచక్రరాజంబుపై నిండుకొల్వుండు శ్రీమన్మహారాజరాజేశ్వరైనట్టి మేల్ భక్తచింతామణింగాను రంజిల్లు.........
............సంగీతసాహిత్యలోలుండు సత్కీర్తిశీలుండు శ్రీమన్మహా

రాజరాజాబహద్దర్ రఘూత్తంస నాథుండు బల్హాయిగానంత నానా విధానర్ఘ్య రత్నాంబరాలంకృతుండై .........

దండకము చివర:—

శ్రీమన్మహారాజరాజేశ్వరీదేవి శ్రీమత్పదాల్ వర్ణనారూపమౌ నీకృతిన్ ఆకవీంద్రుల్ నుతింపగనుద్దండ విద్వత్కవిత్వాంకనుండైన శ్రీవేంకనార్యున్ తృతీయాత్మజుంజేయు శ్రీమత్ బృహన్నాయికా దండకంబుర్వి నాచంద్ర మస్తారకాంభోజినీ బంధుబింబంబుగా వర్ధిలున్.

ప్రాచ్యలిఖితభాండాగార గ్రంథసంఖ్య 1992 అముద్రితము.

## మల్లుపురాణము

ఇది మల్లుల యుత్పత్తినిగూర్చి తెలుగు నాల్గాశ్వాసముల పద్యకావ్యము. ఇది మల్లయుద్ధమున ప్రసక్తములగు ముప్పదిరెండు విన్నాణము లిందు పేర్కొనబడినది. పుదుకోట కిరువదిరెండు మైళ్ళదూరమున నున్న గంధర్వకోట నివాసియగు బిరుదు కుప్పాల్ మల్లున కంకితముగా రచితమైనది. ఇది యముద్రితము.

కృతిపతివిషయము- ఈ కవి, బిరుదుకుప్పాలు మల్లుని ప్రేరణచే నాతనికి కృతిగా బ్రహ్మాండ పురాణములోని దేవమల్ల చరిత్ర ము నాంధ్రీకరించినట్లుగానీ క్రిందిపద్యములవలన దెలియుచున్నది.

సీ. శ్రీకరుణారసార్ద్రీకృతభవనుండు
విద్వత్కవిచ్ఛటావినుతకీర్తి
మల్లవంశాంభోధిహల్లకినీపతి
గార్గ్యసగోత్రవిఖ్యాతమౌళి
సురుచిరాపస్తంబ సూత్రక్రియావేది
యభ్యాసిగండ గేహాభిమాని
వేంకటేశ్వరమల్లవీరపుత్త్రాగ్రణి
లక్ష్మణాంబాగర్భరత్నభూష

గీ. సకలరాజాధిరాజ ప్రశస్తముద్దు
వడుగనాథేంద్ర దత్తప్రవర్ధమాన
సకలనిరవధికైశ్వర్యశాలిపుషిత
బాంధవజనుండు బిరుదుకుప్పాల్ ఘనుండు.

ఉ. కొండలవంటి జెట్లకులగోత్రము లేమని తెల్పలేక యే
యుండుదు రందఱుం దెలియ నొక్కకృతిం రచియింపుమీవు బ్ర
హ్మాండపురాణమందుఁగలమల్లకులక్రమ మంధ్రభాష భూ
మండలిఁబండితోత్తములు మానసవీధిఁ దలంచి మెచ్చఁగన్.

ఈకృతినాయకుఁడు జెట్టివంశములోనివాఁ డయినట్లు పైని జూపిన మల్లుబట్లకుల శబ్దములను బట్టియు—

గీ. అల్లఘనునికి నియ్యళగాద్రి జెట్టి
వేంకటేశ్వరమల్లుండు విశదరీతి

అనుచోఁ గృతిపతి పెదతండ్రి తండ్రి పేరులలోనున్న 'జెట్టి, మల్ల' శబ్దములనుబట్టియుఁ దెలియుచుండగాఁ నితఁ డాపస్తంబసూత్రుఁడని కవి వర్ణించుట విచారణీయము. ఇందలి యవతారికను బైపద్యములను బట్టి యీ కృతినేత ముద్దువడుగురాజు మొదలగువారివలన గొప్ప యైశ్వర్య మార్జించిన సేనానాయకుఁడని తెలియుచున్నది. ఈరాజు కాలమున రామనాథపుర సంస్థానమును పాలించుచుండెను. ఆతనిచే గౌరవింపఁబడిన యీ బిరుదు కుప్పాలు మల్లుఁడుమాత్రము గంధర్వ కోట నివాసుఁడని తెలియవచ్చుచున్నది. ఇది పుదుకోటకు 20 మైళ్ళ దూరములోనున్నది.

గ్రంథవిషయము—తారకాసురుని మనుమఁడగు వజ్రదంతుఁడను రాక్షసుఁడు స్వర్గలోకజయంబునకై యీశ్వరునిగూర్చి తపస్సుచేసి వరంబులుగొని మదించియుండఁగా నతని దేవమల్లుఁడనువాఁడు సంగ్రామంబున నోడించుట, యీ మల్లునివంశము నిందువర్ణింపఁబడినవి. అందందు దోషములు గలవు గాని కవిత్వము మృదువుగానుండును,

ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నాంధ్రసాహిత్యపరిష త్కార్యాలయమున దీనిప్రతులు గలవు. గ్రంథప్రారంభము.

శా. శ్రీమజ్జానకి నెచ్చెలుల్పసిఁడిఁబెంచెంబట్టి భార్యాభిధా
దామెల్లన్విన్నఁబల్క నిత్తుమనసీతా దెల్పనంచేవచ
స్సామర్థ్యంబునఁదెల్పఁదెల్పెననివారం తన్నగన్నవ్వినన్
వ్యామోదుండగు రాముఁడీ బిరుదుకుప్పాల్మల్లునిం బ్రోవుతన్.

ఉ. ఏకవిమూలమై తగెనొ యేకవిదుంపయనన్ జెలంగెనో
యేకవులందుమీఁదట ననేకవిధమ్ములఁగొమ్మలుం జిగు
ళ్లాకులు సూనముల్ ఫలములై విలసిల్లెనొ సంస్కృతాంధ్ర భా
షాకవనామరద్రులకు సత్కవిచంద్రములైనయట్టి వ
ల్మీకజ నన్నపాదులకు మేల్మిఁదలంచి నమస్కరించెదన్.

వ॥ అని..............యుండుసమయంబున.

సీ. శ్రీకరుణాకరసార్ద్రి కృతభవనుండు
విద్వత్కవిచ్ఛటా వినుతకీర్తి
... ... ... ...
... ... ...
... ... ... ...
... ... ...
బాంధవజనుండు బిరుదు కుప్పాల్ఘనుండు.

క. ననుఁబిలువనంపివచ్చిన
వినయముతోనొక్కమాట వినవలెననుచుఁ
వనరుహభవ వనితామణి
కనకమణీవలయ నినదకలమధురోక్తిన్.

ఉ. కొండలవంటి జెట్లు ... ... ... ...
... ... ... ...
... ... ... ...
... ... ... ... ...

"క. బలవైరి గంధసింధుర
గళబంధుర ఘటితఘంటి కారావనిర
ర్గళ ధాటీపటిమ మనీ
షిలలామా నుదురుపాటి సీతారామా."

క. అని వినుతిఁ గన్న యతనికిఁ
దనయుఁడవగు నిన్ను మాకుఁ దరమా పొగడం
గను నభినవ సర్వజ్ఞుఁడ
వనఁదగు నీకెట్లుసాటి యన్యకవీంద్రుల్.

క. ఆవాత్స్యాయన తంత్రం
బావేదాంతముగఁ దెలిసినట్టి కవీంద్రుం
డీ వొక్కండె ధరాస్థలిఁ
గావున నీకవిత మిన్న కవివెంకన్నా!

వ. అని తగుపాటి వినుతించి వీటికనకశాటీ ప్రముఖంబు లొసంగ సంగతానందుండనైన నేనును గృతినాయకుని యన్వయావతార క్రమంబు నభివర్ణించెద.

సీ. సకల చరాచరాత్మక జగత్కర్తృ యౌనా
వనరుహాంగర్భుఁ డెవ్వానితండ్రి
... ... ... ...
తద్విరోధి వరచ్ఛట ధారవీర
వజ్రదంత విదారి యెవ్వానిపాణి
యతఁడు చెలువొందు సమరసహాయనితంబ
జాత్తహృదయుండు దేవమల్లాభిదుండు

క. అతనికి సుతదశకంబ
ద్భుతగుణసౌందర్యవీర్య భుజబలవిద్యా
న్వితముగఁ బొడమెను తత్సం
తతి పాల్పొంగినవితానఁ దనరుచు రాఁగన్.

క. అందునఁ గొంపనమల్లుం
డందఱు వినుతింప వెలసె నరవిందభవ
స్యందనపర చందనదర
నందనధరణీజగణ ఫణాయితయశుఁడై.

తే. అల్లఘునునికి నాయళగాద్రిజెట్టి
వేంకటేశ్వరమల్లుండు విశదరీతిఁ
దనయులన వెలయుచున్నారు ధరణిలోనఁ
దలఁచి చూచినభేద మింతయును లేక.

తే. వేంకటేశ్వరమల్లుఁడా వేంకటేశ్వ
రుండు కావున నురమున నుంచులక్ష్మి
పరిచరియఁ జేయఁ జెంతకువచ్చె ననఁగ
నతనికిని భార్యయై లక్ష్మమాంబ వెలయు.

తే. అల్లఘునునికి నాసాధ్వియందుఁ గలుగు
నందనులలోన నగ్రగణ్యత వహించఁ
దగినధీరుండు నీవేర సుగుణహార
వరహృదయభల్ల! బిరుదు కుప్పాలుమల్ల!

మ. కరినిం గన్గొన గుప్పునం దుముకుసింగం బోయటం చెన్నని
బ్బరపుం శౌర్యముఁజూపుచుం బిరుదు కుప్పాశెట్టిపై దాఁకియా
బిరుదుల్గాంచితి వౌర నిన్నుఁగని హంవీరు ల్నుతింపంగ మేల్
పరమండూక ఘటీఫణీ బిరుదు కుప్పాల్మల్ల వీరాగ్రణీ.

... ... ... ... ...

తే. తమ్ములంచనఁ దనకు నుదారరీతి
రామసామియు వేంకటరమణుఁడుండ
సఖలశత్రుల నణగించునట్టి శక్తి
సకల బిరుదమ్ము లెసఁగు శాశ్వతముగాను.

తే. ఇంత ఘనుండవుగాకనా (వున?) నెంచిచూచి
మల్ల కులచక్రవర్తియై మనుచునుండు
పెద్ద కుప్పనమల్లుండు ప్రీతితోడ
నఖిలజనములు మెచ్చఁ గన్యక నొసంగె.

* * *

క. వీరునకు బంధుజనతా
ధారునకు సమస్తమల్ల దర్పాపహాదో
స్సారునకు బిరుదుకుప్పల్
ధీరునకుఁ బ్రబంధకృత్సు ధీమేరునకున్.

వ॥ అంకితంబుగా నా యొనర్పంబూనిన దేవమల్లచరిత్రంబను మహాప్రబంధమ్మునకుఁ గథావిధానం బెట్లనిన.

క. శ్రీముద్దువటుక నృపతిల
లామకృత గజాదిభాగ్య......ట్వ
హైమదళ సింహముఖము
క్తామణి గుచ్ఛాగ్ర కుసుమదామోల్లసితా ?

గద్య. ఇది శ్రీమత్పరమేశ్వర కరుణాకటాక్ష సంప్రాప్త సర్వజ్ఞత్వాది కతిపయగుణ స్వసామ్య తదితర సకలగుణ నిరౌపమ్యాభూత పూర్వతంత్ర సద్యః కల్పన శేముషీనిధాన రాయరఘునాథ-మహీపాల సభాంకణ బిరుదాయమానా సేతు హిమాచల ఖ్యాతి మహోద్దండకవి బిరుదప్రశస్త సీతారామార్యతనూజాత సకలవిద్వత్కుల వినుతచర్య వేంకనార్యప్రణీతంబైన దేవ మల్లుచరిత్రంబను మహాప్రబంధంబునఁ జతుర్థాశ్వాసము.

ఆస్థానకవి సుదురుపాటి వేంకనార్యుఁడు రాయరఘునాథునిపై రచించిన చాటువులు.

శా. గంభీరోద్భట గంధసింధుర ఘటాఘంటాఘణాత్కారముల్
దంభాడంభరభేరికా ధణధణంధాణంధణాత్కారముల్
జృంభింపన్ రణరంగమందు రిపులన్ శిక్షింతువౌ దిగ్జయ
స్తంభ శ్రీరమణీయరాయరఘునాథా ! యోధ యోధాగ్రణీ !

శా. రాజారామసరోజ బాంధవుఁడు ప్రహ్లాదుండు భైరోజి స
త్తోజి ఘోర్పడముఖ్యులైననెఱయోధుల్ తొండమాన్ రాజహే
రాజాభోజసభాసహోభవాతుభాల్లా ! యంచునిన్మెచ్చ బా
బాజీ పండితుఁడా ! సమర్థుఁడు రణంబుం జేయ నీడాకరున్
హాజీవై భళిమేలురాయరఘునాథా ! యోధయోధాగ్రణీ !

మ. గణుతింపన్ వశమా భవద్విజయజాగ్రద్వీర విద్యావిజృం
భణ పాండిత్యమునీకె చెల్లె భళిరా ! భద్రేభఘంటాఘణాం
ఘణనిక్వాణనిరాఘ్య నిర్భరమహాగంభీర భేరీధణాం
ధణధాణంధణధాణ ! రాయరఘునాథా ! యోధయోధాగ్రణీ!

మ. దురమందుం దురగంబు ధైయసుచుజిందుల్ త్రొక్క బాహాసిభీ
కరలీలం...............లపేటీజరా
పెఱఘోడాగజసింగిణీ తరకసానేజల్ ధణారింతునా
తరుణీమన్మథ ! కోటిరాయరఘునాథా! మోధయోధాగ్రణీ.

సీ. నవరసాలంకార నయచమత్కృతులొప్ప
సత్కవుల్ పద్యముల్ సంఘటింప
జమదగ్నిభుజగర్వ శమమహోగ్రభుజశక్తు
లుత్తమక్షత్రియులొగి జెలంగ
విదితసంగరరంగ విజయవిక్రములైన
బిరుదురాతుల పరంపరలుగొల్వ
ననవద్య జనహృద్య ఘనవద్యపదవద్య
గతులొంది వందిమాగధులు పొగడ

నెగడునభినయ విభ్రమాన్వితులువార
వనితలవితరసులభ విద్యనునటింప
నిండుకొలువుండు నాఖండలుండు జగతి
నీవెయనౌర రఘునాథ నృపవజీర!

సీ. మహిలోన గలహంస మండలంబులచెల్వు
 గైకొనిదిక్కులకలయదిరుగు
నారదద్యుతి పరిణాహంబులం జూచి
 నయముమీఱంగ దానవ్వతోడగు
నతిశీతభానుజాహంకార హుంకార
 పటిమ జేకొని వియత్తటినటించు
దశహారకంఠ నిస్సృతరుచిస్ఫూర్తితో
 నవనిఁజూడంగ నందందనలరు

భళిర! నీవైరిరాజన్యకులముకీర్తు
లరయనీభవిష్య సత్కీర్తులమకరిఁప
వచ్చిజిగినల్లనల్లన విచ్చిపఱచు
నిస్తులోదార! రఘునాథ నృపవజీర!

సీ. సమదసైంధవ శరాసన గురూత్తమరాజ
 రాజకర్ణ భయంకరంబులగుచు
గదనభీకరవైరి మదమదావళిపంక్తి
 నదనవైవర్ణ్య కృత్స్యసములగుచు
సమతనిర్భయనిద్విష త్కృతవీర్యము
 లర్గ్వ సర్వంకషక్రమములగుచు
ప్రతిమహీభృన్మహోద్భట పక్షసంతతు
 ణవిచక్షణ తరక్షణమ్ములగుచు

విజయరఘునాథ ! వరశుభృద్విఘుర ! దరని
ర్గళోదగ్రభవ్య దివ్యాయుధోగ్ర
గుణములనుమించు నీభేరి పణఘణమ్ము
లదిర ! రఘునాథచంద్రయాహవ మృగేంద్ర.

సీ. కార్యంబునకు లేక గ్రాసమిమ్మనువానిఁ
బట్టకముచ్చెను గొట్టవలయు
సమరంబనిన బారి చదురుననుండెడు
వారిమీసముబీకి వైవవలయు
బంతికూటికిబోంచి బారుకేగనివాని
వీథిలోనిడిసొడ్ల వేయవలయు
బలియుండుమనుచోట బారివచ్చినవానిఁ
జలమునగొఱ్ఱుపై నిలుపవలయు
ననుచురోషములాడుచు సహితనరుల
నెగ్గిపిగ్గలుదీతురు నీదుభటులు
కోటికులవర్య! రణనిరాఘాటపర్య!
రాయబిరుదాంక! రఘునాథ రాణ్మృగాంక!

సీ. శ్రీరామచంద్రుని గేరుదొరతనమ్ము
రతనమ్ములనుమీరు సుతులకలిమి
కలిమిపూబోడి నిల్కడమైన వరసభ
రసభావసత్కార్య రచన తెలివి
తెలివిప్పటస... తెగనియాలోచన
లోచనానందమై తోచునగరు
నగరుచిరస్తనీనవవిలాస కలన
సకలనరేంద్ర ప్రశస్తమహిమ
మహిమతగలకామినీ మాననీయ
భావమును భావమును మెచ్చి భవుడొసంగుఁ
గాంతకోటి కులాబ్ధినక్షత్రనేత!
రాయబిరుదాంక! రఘునాథ రాణ్మృగాంక.

సీ. గొలకొలమనినంతఁగలకఁ బాఱెడురాజు
జందెంబుతట్టు పచ్చాడిగాదె
స్వామికార్యమునందు జరిగిపోయెడురాజు
పట్టెనామముకొంగ రెట్టగాను
సాళెంబుపోవ జాలాలు చేసెడురాజు
బుఱ్ఱకట్టియుదోటి నఱ్ఱగాదె

యిది దెలిసి......సదరు లెదరు నాదిర
మదవదహితుల నెల్లను జదువవలదె ?
కోటికులవర్య ! రణనిరాఘాటవర్య !
రాయబిరుదాంక ! రఘునాథ రాణ్మృగాంక !

సీ. తనభేరికాధణంధణరవ ప్రవభయ
సూర్జత్ఘనాఘున గర్జితంబు
జృంభితాహిత కుంభికుంభోత్పతత్పత
ద్రుచిరముక్తాఘ వర్షోపలంబు
ప్రతిదళస్ఫుర సితద్యుతి చకచ్చకలస
ద్విద్యుల్లతోదగ్ర విభ్రమంబు
శరవర్ష నిర్మగ్న పరభూధరధ్వాంత
నిర్భరకీలాల నిర్ఝరంబు

గీ. సమరసమయ సముద్భవత్సైన్యవరస
ముదయ పర్జన్యవిలసితంబదిర । భోగ
విజయరఘునాథ మేదినీవిభుతనూజ !
రాయరఘునాథభూతలరాజరాజ·!

సీ. మీసంబుదీటి గంభీరభేరీతతి
భాంక్రియా సంభ్రమభ్రమధురీణ
ఘోట్లాణజరటంక కుట్టకసంజాత
ధరణీరజస్స . . . స్థగితసకల
హరిదంతరుండుగా ననిమొనలోనిల్చి
చిఱునవ్వుతోడబల్ సురియబూని
జిగిజిగాల్ బిగిగురాల్ తెగిభటుల్ తెగినటుల్
బడిసలామిడ సలామడుగుమడుగు

డుడుకునడవడి తడబడి యడుగువిడగ
గడుసుకడివడిబడెడు నీయడుగులందు
నీకెతగుఁగాక! రణజయాన్వితవతాక!
రాయరఘునాథ భూపవిక్రమదిలీప !

## —: సూర్యశేఖర కవి :—

ఈతఁడు రాయరఘునాథుని కాలములోనివాఁడు. ఈతని రచనలలో చాటువులుమాత్రమే లభించినవి.

చ. హరిహరపద్మజాది దివిజాంశము లన్నియుఁగూడిమేటియై
హరిహయమెక్కి మిక్కిలి రయార్భటి నిక్కినదైత్యకోటులన్
దురమునఁద్రుంచి మించిదయతో భువనమ్ముల బ్రోచునట్టియా
పురహరుదేవిదుర్గనిను బ్రోచుదయన్ రఘునాథభూవరా!

చ. సమరతలంబనేమడిని శాత్రవరక్తజలంబు నించి దు
ర్దమకరకుంభ మౌక్తికపరంపర వి త్తనముల్ ఘటించి వ్యో
మమనెడు కాయమానమున మంజులకీర్తిలతాళితారకా
సుమసహితంబుగా ప్రబలఁజూచెదు శ్రీరఘునాథ భూవరా!

సీ. ఖండింతువౌ సముద్దండ దండాదండ
పరిపంథిగంధ సింధురకరాలు
సాధింతువౌజగ్గు జగ్గుగాశరలుఠ
త్కరినారిలోక భీకరపురాలు
భేదింతువౌ పెడాపెటలుగాతళుకు
బెళుకును లేకరిపుల గొంతులసరాలు
సెకలింతువౌ వకావకలుగాజకిలిత
ములఁగుల్కు శత్రురాజులజిరాలు

హౌసు! మర్ఘ్యారె! బాబురే! జౌ! శెబాసు!
రణజయోద్దండ! భుజదండ! రాయదండ
మండలాఖండలతనూజ! దండి తేజ!
రాయరఘునాథభోజ! విక్రమబిడౌజ!

సీ. ఖమ్ములై శశిమయూఖమ్ములై స్మరవిశి
శిఖమ్ములై చంద్రసఖమ్ములగుచు
భమ్ములై ———————— శారదా
భమ్ములై పవిసన్నిభంబులగుచు

సరములై నవసుధాసరములై కుముదకే
 సరములై కుందవిసరములగుచు
శరములై ద్యోధునీశరములై ......
 ......సరమ్మృగీశరములగుచుఁ

దావకీనయశమ్ములు ధరణిలోన
ప్రబలుబలసంపదల పెంపుసొబగునింప
విజయరఘునాథ మేదినీవిభుతనూజ
రాయరఘునాథభోజ ! విక్రమబిడౌజ !

క. నీకీర్తిపుష్పలతకును
లోకస్తుత పుష్పవంతులును వాసింపన్
లోకాలోక ముదంబగు
రాకాశశిపూర్ణవదన రఘునాథనృపా !

సీ. యామినీకామినీ హారకా తారకా
 శరకుంద దరబృంద సమితినొంచి
హరగాత్రసురగోత్ర మరగాత్రమరసింధు
 జరసింధుభవదంతి బరిహసించి
హరికాండ హరకాండ హరిదంతకరిదంత
 శరదభ్ర పటశుభ్ర సరణిగెలిచి
మదజాల పదజాల మందారబృందార
 కాహారబాహార గరిమమించి

అంచితోదారవైఖరి

—: శేషయకవి :—

విజయరఘునాథరాయలపై కొన్ని చాటువులను నొక శతక
మునుఁ జెప్పియున్నాఁడు. వానిలోనుండి కొన్ని పద్యములు,

సీ. శ్రీహరికరుణా విశేషవైఖరులచే
సామ్రాజ్యమేలుము జయమునీకుఁ
ఇంద్రజూటునిదయాసాంద్ర వైభవముచే
సంపదల్ గాంచుము జయమునీకు
వారిజోద్భవు కృపా పారసత్త్వముచే
శౌర్యంబుబూనుము జయమునీకు
మలయకేతన పాండ్యమధురేశు వరముచే
సత్కీర్తిఁజెందుము జయమునీకు

ననుచుఁగని బుధపాఠకుల్ వినుతిసేయ
విక్రమస్ఫూర్తికీర్తుల వెలసితౌర !
భళిర ! తిరుమలతొండమాన్ ప్రభుకుమార !
విజయరఘునాథ తొండమాన్ విభువజీర !

సీ. పైఠాణిపాగపై పైఁడిరేకుతురాయి
చొక్కమైమిక్కిలి సొంపునింప
హురుమంజి ముత్యంపు టొంట్లతో మకరాల
బావిలీల హారంబు వంతగింపఁ
బూర్ణచంద్రునిరీతి బాలుపొందుమోముకై
సిస్తుకస్తురిచుక్క జిగివహింప
మైనిధరించిన మణిభూషణావళుల్
కొమరొప్పకాంతులఁ గ్రుమ్మరింప

నీవుపట్టాభిషిక్తుఁడై నిఖలజనులు
గొలువమాణిక్యపీఠిపైఁ జెలఁగితౌర
భళిర ! తిరుమల తొండమాన్ ప్రభుకుమార
విజయరఘునాథ తొండమాన్ విభువజీర !

సీ. ధారుణీతలమెల్ల దనుదానెయుప్పొంగఁ
బలుచోరజార బాధలుతొలంగఁ
జేరికొల్చినవారి కోరికల్ ఫలియించు
విమతులకెల్లను వెతజనించు

బంధుసంతతికి సౌభాగ్యంబుఁ దనరారెఁ
గవులదారిద్ర్యముల్ కడలిదూరె
సకలసజ్జనులకు సంతోషములుమీరె
గాయకకోటికిఁ గఱవుతీరె

నీవు పట్టాభిషిక్తుఁడై నిఖిలమైన
ధరణిజనులను రక్షింపఁ దలఁచినపుడె
భళిర ! తిరుమల తొండమాన్ ప్రభుకుమార !
విజయరఘునాథ తొండమాన్ విభువజీర !

సీ. సకలసద్గుణముల జానకీపతితోడు
మఱినీకు "నారణప్పరశ" బిరుద !
గాంభీర్యగరిమచేఁ గలశాబ్దినీకెన
"వరవాళ మాలికాభరణ" బిరుద !
శౌర్యవిస్ఫురణచే సవ్యసాచీడౌను
ధరనీకు "వరాకులతర్క" బిరుద !
వితరణఖ్యాతిచే విధుఁడునీసాటియా
"జయవీరమణవాళ" చండబిరుద !

ధైర్యమున నీకు మేరుభూధరముదీటు
తనర "వడశురు కులదండధారి" బిరుద !
భళిరతిరుమల తొండమాన్ ప్రభుకుమార !
విజయరఘునాథ తొండమాన్ విభువజీర !

సీ. కత్తికిఁ బచ్చిపూల్ గలిగిన నెఱయోధ
బొడ్డుగంట గుఱాని కిడ్డజోద
కపి కేతనముగల్గు కదనరంగ కిరీటి
వీరకంకణముచే మీరు మేటి
ప్రతి లేని సింహతలాటంబు గల ధీర
వింజామరంబులు నెలయు శూర
గండపెండేరంబు గైకొన్న దునెదారి
పచ్చగొడ్డులు గల్గు ప్రధనశౌరి

పంచవన్నెల పావడల్ పరగునేత
మానరక్షణ బిరుదంబు బూనుదాత
భళిర ! తిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయ రఘునాథ ! తొండమాన్ విభువజీర !

సీ. మదనుని యాకార మహిమంబు విడనాడి
యనిరుద్ధు సౌందర్య మణఁగఁద్రొక్కి
చందురు నెమ్మోని సారము నిరసించి
మహిని జయంతుని మట్టుపఱచి
నలకూబరుని నిండు చెలువమ్ము ననురెమ్మి
వకులుని శృంగారనయము గేరి
వలరాజు రూపంబు వలఁ జూచి యణకించి
గాంగేయు చందంబుఁ గాకుసేసి

కృష్ణదేవుని యందంబు గ్రిందుపఱచి
సాటి లేకుండ మీాఱె నీ చక్కఁదనము
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార !
విజయ రఘునాథ ! తొండమాన్ విభువజీర !

సీ. తూనిక దాతాయె తొలుదొల్త శిబిరాజు
చంచల దాతాయె జలధరంబు
కఠిన దాతాయెను కాంచ చింతామణి
పీసవు దాతాయె వెలయు విభుఁడు
పరక దాతాయెను పరికింపకి...
పాతికె దాతాయె భానుసుతుఁడు
అరవాసి దాతాయె నంబికారమణుండు
ముక్కాలు దాతాయె మున్నె బలియు

గాన నీపాటి నెరదాతఁ గలియుగాన
నరసి చూడంగ నే గాన హరి సమాన
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయ రఘునాథ ! తొండమాన్ విభువజీర!

సీ. విడిబడి శేషుని పడగలు విడియించి
పాలమున్నీటిని భంగపఱచి
కలువల చెలికాని కాంతులు కరగించి
మరి తారకలనెల్ల మాయఁజేసి
ఆకాశవాహిని నబ్ధిలోపల ముంచి
వెలిదమ్మి విరులను విరియఁజేసి
పూని శంఖంబుల పొట్టలెల్లనుఁ జించి
కల్పవృక్షములఁ జీకాకుపఱచి

హార హీర పటీర నీహార రుచుల
మీరి నీ కీర్తి ధరలోన మెఱసె నౌర
భళిర! తిరుమల తోండమాన్ ప్రభుకుమార!
విజయ రఘునాథ! తోండమాన్ విభువజీర!

సీ. ప్రతి లేని మైసూరి పతి కేతనముమీఁద
నెలకొన్న సింగంబు నీదు కీర్తి
పాచ్ఛాహు శిరముపై భాసిల్లుచున్నట్టి
నింకు చంద్రజ్యోతి నీదు కీర్తి
గడిచోడ భూపతి కంఠదేశంబున
నెలకొన్న హారంబు నీదు కీర్తి
కేరళ భూపాలు కెలకులఁ జేవల
నెగడు వింజామర నీదు కీర్తి

పగగ సామంత నృపతుల పాగలందు
నిలుచు మగరాతి జిగి తురాల్ నీదు కీర్తి
భళిర! తిరుమల తోండమాన్ ప్రభుకుమార!
విజయ రఘునాథ! తోండమాన్ విభువజీర!

సీ. భానుని నాకాశ పథమునఁ బాలించి
బడబానలంబును జడధి కనిపి
కాంచనాద్రిని విల్లు గావించి యాడ్పించి
వేలాయుధుని ముందు వెనుకఁ జేసి

పద్మరాగంబులఁ బట్టి సానలఁబెట్టి
యరుణుని గుంటిగాయడరఁ జేసి
విష్ణు చక్రంబును వేయంచు లొనరించి
వారిజోద్భవు విప్రవరునిఁ జేసి

పరగ నీదు ప్రతాపాగ్ని పద్మజాండ
భాండమెల్లను నిండి యుద్దండ లీల
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయ రఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. జోడవల్ ద్రొక్కును సొగసుగా నొక తేప
మదవద్విరోధుల మస్తకముల
జేదాట్ల దాటును జగ్గుగా నొకసారి
కుటిల విద్వేషుల నిటలములను
వేడముల్ దిరుగును వేడ్కతో నొకమాటు
వీరాధివీరుల వీథులందు
కదలికల్ జూపును ఘనముగా నొకతూరి
సామంత నృపతుల ధామములను

పంచధారలు కనుపించు బరులు వెగడఁ
బూని నీ తేజ నృపరాజి పొగడనాజి
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయ రఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. ఘల్లు ఘల్లు మనంగ గడుసు వైరులఁ గొట్టి
ఘలిఘులీలు మనంగ బలులఁ గూల్చి
ఘణిఘణీలు మనంగ గడివీరులను డుల్చి
ఖచిఖచిక్కు మనంగఁ గరుల నొంచి
ఖంగుఖంగు మనంగఁ గంఖాణములఁ ద్రుంచి
ఖరిఖరీలు మనంగఁ గత్తళములఁ

జించి విదలించి విమతులఁ జీల్చు నార
మేలు నీ కత్తి వైరుల పాలి మిత్తి
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయ రఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. కలనిలోఁ బగవారి ఖచిఖచిక్కనఁ గ్రుమ్మి
ఛేదించు నీదు కైజీత బలము
దురములో రిపులపై దూరి గోరించుచుఁ
జెండాడు నీదు కైజీత బలము
అనిలోన విమతుల నదలించి విదలించి
చించును నీదు కైజీత బలము
పోరిలో వ్రజీల బొడిచి పొర్లించుచు
చేకొద్ది నీదు కైజీత బలము

ఘోర వైరుల బారుల గొట్టి కూల్చి
చెలగు జలమున నీదు కైజీత బలము
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయ రఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. ఘోడాలు తోడాలు కేడాలు బొమిడికల్
ధరఁగూల వ్రజీల నఱికి నఱికి
పేటలు కోటలు బిగువుజంట జిరాలు
స్థిర వాల వైరులఁ జెండి చెండి
చిలుకొత్తు దగళాలు చికిలి చేదస్తులు
చెదరంగ దునెదార్లఁ జించి చించి
సింగాణి తరకసల్ జిగిరేకు వత్తులుఁ
దునియంగ బగతులఁ దునిమి తునిమి

తురగముల మీటి విమతులఁ ద్రుంచి త్రుంచి
గెలిచె భవదీయరాహుత్త దళమువలన
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయ రఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. వికటించు వైరుల వేసి "కో" యని యార్చు
"నదె కయ్య" మన్న నీ యడవకాఁడు
మదవద్విరోధుల హృదయముల్ పెకలించు
"రణ" మన్ననీదు కాళాంజెవాఁడు
కుటిల విద్వేషుల గుండెకాయల జీల్చు
"సమర" మంచనిన నీ జారివాఁడు
గర్వించు విమతుల కంఠముల్ తెగగొట్టి
గడి దురంబునను నీ గోడుగువాఁడు

నీదు సాహాస మెంచి వర్ణింపఁదరమె
వీరమణవాళ బిరుదాంక విక్రమార్క
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయ రఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. నీ భేరి వినదంబు నెగడినయంతనే
మదవద్విరోధుల మతులుఁ గలఁగు
నీ డాలు పెటపెటల్ నిండినయంతనే
ఘోర విద్వేషుల గుండె లదురు
నీ కత్తి నిగనిగల్ సోఁకినయంతనే
విమతుల గర్భ నిర్భేదమగును
నీ ఘోటి ఖురధూళి నెగడినయంతనే
మత్తుల చిత్తముల్ తత్తరించు

నార నినుఁ జూచినప్పుడే యాజి విడిచి
ఘోర వైరులు గుహలలోఁ జేరుచుంద్రు
భళిర! తిరుమలు తొండమాన్ ప్రభుకుమార!
విజయ రఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. మొనసి స్వామిద్రోహ మొనరించు మూర్ఖుల
పై తలమెత్తి నీ చేతి కత్తి
ఏలిన స్వామితో నెదిరించు కుమతుల
నెత్తిపై బలుమేకు నీదు బాకు

స్వామికార్యముల వంచనసేయు కుటిలుల
నిటలంబుపై గొంకి నీదు వంకి
పతి మాట మీఱిన బండలుండీలకు
జముని దాడిర నీదు జమ్ము దాడి

గదర! యుష్మద్భుజాగ్ర జాగ్రత్ప్రతాప
మెన్న శక్యంబె? అల పన్నగేంద్రునికిని
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయ రఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. మఱ్ఱూరె! నీవంటి మహిపచంద్రుఁడు గల్గ
నే వరమందిరో? యిష్టసఖులు
భళ్లారె! నీవంటి ప్రభుశిరోమణి గల్గ
నే పూజ జేసిరో యెల్ల కవులు
మాయురే! నీవంటి మనుజసింహము గల్గఁ
బద్మాక్షుఁ గొల్చిరో బంధుతతులు
చాగురే! నీవంటి జననాయకుఁడు గల్గ
నే వరమందిరో యిష్టసఖులు

మేలు! శహబాసు! నీవంటి మేటి కలఁడె
జలధి వలయిత ధారుణీచక్రమునను
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయ రఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. అల్ల మార్కండేయునంత దీర్ఘాయువు
సూర్యునియంత తేజోభరంబు
శంకరునంతటి శాశ్వతైశ్వర్యంబు
దేవేంద్రునంతటి దివ్యభోగ
మర్జుననంతటి యాహవశౌర్యంబు
భీమసేనునియంత భీమబలము

అలహరిశ్చంద్ర రాజంతటిసత్యంబు
ధర్మరాజంతటి ధర్మవరత
నలరాజునంత పుణ్యశ్లోకతాయుక్తి
మాంధాతయంతటి మహితకీర్తి

అనిలునంతటి సత్త్వతాపాతిశయము
కర్ణునంతటి యీవియుఁగలిగి మనుము
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

క. శ్రీకంఠుని కృపచేతను
నీకీర్తికి దీటులేక నిఖలధరిత్రిన్
జేకొమ్ము శాశ్వతమ్ముగ
రాకాశశిరూప! విజయరఘునాథనృపా!

సీ. కత్తికిపచ్చిపూల్ కలిగినహంవీర
బొడ్డుగంట గుఱ్ఱానికిడ్డకూర
సాంబ్రాణి ధూపవాసలు గైకొనుమేటి!
గండపెండేరంబుగల కిరీటి
పంచవన్నెలుగల్గు పావడల్ గలయోధ
నవబత్తుగలయట్టి యవనినాథ
సింహతలాటంబుఁ జెల్లించువజ్రీఁడ
వేటుపావడగల్గు పోటుకాఁడ

మకరబిబ్బీలుకల్గిన మన్నెరాయ!
చంద్రసూర్యాదివార్యపు సమితిఁజేయ
కోటికులవర్య! రణనిరాఘాటధైర్య!
విజయరఘునాథ! జయభార్గవీసనాథ.

సీ. చేపట్టుసడలక చివ్వనవీడక
తెగువునఁదప్పక తెట్టగిలక
చెలఁగెడితావుల వెలిగాక కడివోక
సుంకులురాలక చుట్టుకొనక

గనుపైన తావుల దడబడినిలువక
  సామానటంచన్న సరకుగొనక
కాదనివంపైన గతిమాడకుండక
  కొనకత్తిమొండైన దునిగిచనక

దానకుడిగియేటు పోటును చినుకునిఱుకు
విసరులను హత్తిబిరుదు కక్కసపుబంట్ల
జిగురుదినిపించు నారసీచేతికత్తి
విజయరఘునాథ! జయభార్గవీసనాథ!

సీ. వడివేయు మీసంబు పట్టునజిక్కగా
  పిడియుడాచేత వ్రేలుతలలు
కరకరిచేతబల్గంటి సేయుచునుండ
  కోర్చిముంజే బట్టుకొనెడితలలు
అటుగంట దెగియుండ నదియెఱుంగకపోర
  రమ్మను నన్నచేవ్రాలుతలలు
బిరుదులుపలుకంగ దొరగియు మధ్యమ
  వైఖరిగాబల్క పడినతలలు

కదియుబొమముళ్లు నెత్తురుగ్రక్కుతలలు
నూపిరెగదీయు ముక్కులజూపిరిపులఁ
గుత్తుకలఁగోయు సేయునికోటిరాయ
విజయరఘునాథ! జయభార్గవీసనాథ!

సీ. ఆధోరణుని విన్ననంటియుండెడి పింజ
  దంతిచుండపుచుట్టు దాఁకనలుగు
భటునకు కుడిజెబ్బబడి కానపడుపింజ
  డాకేలకేడంబు దాకనలుగు
రాహుత్తునెత్తిపై రంజిల్ల దగుపింజ
  గుఱ్ఱమువలచెవిఁ గొన్ననలుగు
రథికులస్తకమున గ్రాలుచుండెడి పింజ
  నాభిదేశంబున నాటనలుగు

గానజడిపట్టు చందానకనులలోన
శరము కలిగించుధాటి దేవరకుసాటి
గాన రిపుకోటి నేను జగానఁ గోటి
గోటివంశసనాథ! సంగుప్తబోధ
విజయరఘునాథ! జయభార్గవీసనాథ!

సీ. చికిలిబంగరుపూఁత చిల్లోడుగేడెంబు
చిప్పలంచును చనుల్ జెనక వెఱచి
ఖేదుమాలెడు జనబ్బిఫరంగు మెఱుంగు
ధారగానెంచి నూగారుకలికి
సరిగెవ్రాహరువుల చాయసూర్యపుటంప
దోనలంచు బిక్కులఁగనఁగ వెఱచి
ఘాటంపులాహురి నౌటకువిల్లని
బొమముడిపాటున భ్రమవహించి

భవదహితపాళి యప్పరప్రతతి కేళి
ఖేదము వహించుగాని సుఖంపదామె
కోటివంశసనాథ! సంగుప్తబోధ!
విజయరఘునాథ! జయభార్గవీనివాస!

సీ. పాండ్య భూపాలుదీప్త ప్రతాపాగ్నికే
శూరునిబరము సమీరణంబు
మధురేశుకీర్తి నిర్మలసుధారాశికే
యున్నిద్రుజయము చంద్రోదయంబు
త్రిశిరఃపురాధి పతిప్రతిజ్ఞామంధ
రమునకే దొరబుద్ధి కమఠరాజి
విశ్వనాథావనీ విభునకు, భవవఘూ
గ్రీవకేభూపాలు సేవబొట్టు

అతడునీవెగదా, పదానతమహారి!
హరికరుణావిహారి! యాహవపురారి!
కోటివంశసనాథ! సంగుప్తబోధ
విజయరఘునాథ! జయభార్గవీసనాథ!

సీ. తేలవై చెడి వేళబాళిచేఁ దొడరిన
వెనుచక్కి మొనబడ్డ విసరివిసరి
కంఠంబుకంఠంబు గదిసియున్నటులైన
దాటించితోడిబడ మీటిమీటి
కావాలపట్టుచోగలయక వగఁజెంది
చెండింపగాఁజేరి జమిరిజమిరి
... ... ... ...మరలించి
పైపైనిజేర్చి వైచివైచి

జోడనలుమించ గుసుచల చుఱుకుఁజూపి
నరికినరికి..............దరిమితరిమి
ఘోటివడిమీటి గురుదాను గొనెఘుకోటి
విజయరఘునాథ ! జయభార్గవీసనాథ

సీ. గరిసిక్కుటమ్ములుఁ గుఱుచ యెల్లెలుబూన్చి
జబ్బపింటనువేసి చంపుకడిమి
కటికను దాటించు గశనైన మరలిన
తేజినేమీటి హత్తెడుచలంబు
కత్తికత్తిన బట్టగద్దాను బోర్చిన
నఱకుచో బొల్ల నేర్పరచు నేర్పు
జీరాలు తెగెనని చేరి మొనల్ జిమ్ము
దప్పించు మక్కిచే గుప్పు తెగువ

నీకులమ్మున కమరెను గాకధరను
గనఁగనేర్తురే? పోటుగాండ్రసికి మకురు
లసికిలగుచేర తిరుమలరాట్కుమార
విజయరఘునాథ ! జయభార్గవీసనాథ !

సీ. జన్యాంగణమున రాజన్య పుంగవులెన్నఁ
గ్రొన్నన విలాకానికన్న మిన్న
సన్నాహమున సముత్పన్న పన్నగవైరి
జనయుతమగు మహాశ్వంబునెక్కి

"ధే"యని యార్చి సందీప్తకాలానల
కీలాకరాళ సంవేలఖడ్గ
ధారాహతానేక వీరారిజనవార
సారశోణితపూర ఘోరనదులఁ

బఱపనోరప్పైన దురము నిర్భరము నేయ
నేర్పునీకబ్బె భార్గవు నేర్పుమీర
గోటివంశసనాథ ! సంగుప్తబోధ !
విజయరఘునాథ ! జయభార్గవీసనాథ !

సీ. గడగడమని కాళ్లువడకఁ జొచ్చినయంత
స్తంభగుణంబు కొంతణచివైచె
బలుకుడగ్గుత్తిక బడి వికారమునొందఁ
బ్రణయమ్ము మానసంపదను నిల్పె
వెలవెలయై మేను వికృతి వహించుచో
రోమాంచలంబు మఱుఁగుబెట్టెఁ
గన్నీటఁ జినుకులు కాలువలై పాఱ
స్వేదప్రవాహంబుఁ జేర్చుకొనియె

దర్కలను ద్రొల్చె రంభపైఁ దనకుఁ బ్రేమ
యనుచు నీవైరి నేర్పుగనతనుదారి
గోటివంశసనాథ ! సంగుప్తబోధ
విజయరఘునాథ ! జయభార్గవీసనాథ !

సీ. చెంగావి పావడరంగుగా మెఱయించి
యదికాక పూదండ లలవరించి
తనమేన చాయచిత్తంబున భ్రమియించి
వలసిన బహుమానములనుఁ జెంది
కేడంబుదెరచాటు వీడి ముందరనిల్చి
క్రమముగా నటనవై ఖరినిఁజూపి
చెంతకురమ్మని చింగున వెనుదీసి
వేగమే కంఠంబుఁ గౌఁగలించి

సురతలీలను గనుపించి సుఖమునించు
నాటవిరిబోణి యనఁగ నీదగుకృపాణి
గోటివంశసనాథ ! సంగుప్తబోధ !
విజయరఘునాథ ! జయభార్గవీసనాథ !

—: శ్రీమన్నారాయణయ్య లేక - మన్నారయ్య :—

పుదుక్కోటకవులలో పేర్కొనఁదగిన కవులలో మన్నారయ్య లేక శ్రీమన్నారాయణ కవీంద్రుఁడొకఁడు. ఈతఁడు క్రీ. శ. 1730-69 లో పుదుక్కోటను పాలించిన విజయరఘునాథునికాలమున నున్నవాఁడు. ఆతని సోదరుఁడగు కోటి రాజగోపాలరాయని కాశ్రితుఁడు.

ఈతఁడు భానుకవిరచితమగు సంస్కృత రసమంజరినాంధ్రీకరించియున్నాఁడు. ఈకృతియు తనకు పోషకులైన రాజులనుగూర్చి చెప్పిన చాటుపద్యములు తప్ప తదితరరచనలేమియు కానరాలేదు. ఈతఁడు విశిష్టాద్వైతి - అప్పయార్యపౌత్రుఁడు - వేంకటాచార్య పుత్రుఁడు భారద్వాజగోత్రుఁడు - ప్రౌఢకవి - సంస్కృతాంధ్రభాషా విశారదుఁడు. ఈగ్రంథమునుండి యుద్ధృతములైన యీక్రిందిభాగము వలన నతని కవితాశైలి తెలియనగును.

ప్రారంభము :—

క. శ్రీరంగస్థల వక్షః
స్ఫార శ్రీవత్సకౌస్తుభప్రభలు తమ
న్నూరులఁ గేరు నిజ్మ్ముఖుక
శ్రీరంగస్థలపతిన్ భజింతున్ భక్తిన్.

ఉ. వల్లభునుల్లమందుఁ గృతవాసయగుందనదివ్యదేహమ
తుల్లసిత ద్యుతిన్వెలికిఁ దోఁచెననం దదురస్థలంబునన్
జెల్లువడి న్నిరంతరముఁ జేరి వసించు సరోజపాణి మ
త్తల్లి యభీష్టసిద్ధి సతతంబునెసంగ నొసంగు నెంతయున్.

క. వినుతి యొనరింతు మలయ
ల్లునికి నటన చలితమకుట లుఠదమరధునీ
ఘనతర తరంగబింబిత
వనజారి కళాసహస్ర వల్గనగతికిన్.

క. కేవల కాంచనకటక వి
భావిష్కృతయుతులు కాళిదాసాదికవుల్
భావింప రత్నకటక మ
హావిభవులు నన్నయాదులాంధ్ర కవీంద్రుల్.

వ॥ అని యెద్దియేని యొక సరసకృతి చమత్కృతి సమున్నతిగ
రచియింప మతిబూనియున్న సమయంబున

సీ. కోటివంశాంబుధి కుముదినీరమణుండు
కువలయానందైక గుణగణుండు

గీ. కలిత నిజనామబోధిత కాంతివిభవ
సమరసాహస సత్యవాక్రమసమాజ
శీలపురుషుండు రాజగోపాలభూప
విజయరఘునాథ వసుమతీ విభుండు భువిని.

మ. ప్రసరచ్ఛాత్రుని యప్పయార్యవర సత్పాత్రున్ ద్విషన్నీరద
శ్వసనస్ఫూర్తిని జియ్యవేంకటమహాచార్యాత్మజున్ విశ్వవి
శ్వసనీయున్ శఠకోపయోగికరుణా సంప్రాప్త సారస్వత
స్వసనాథున్ ద్వయపూర్వ వాక్యముఖమద్వర్ణప్రసిద్ధాహ్వయున్.

మ. ప్రతిభోదంచిత కావ్యకల్పన భరద్వాజీయగోత్రున్ జగ
న్నుత చారిత్రుని నన్నుఁజూచి పలికెన్........

మ. సుకవీంద్రుండవు మద్గురుండవు జనస్తుత్యుండ వత్యాదరుం
డ కళంకాత్ముఁడ వాంధ్ర సంస్కృతకవిత్వాత్యంత విఖ్యాతుఁడౌ
సకలోర్వీనుతరీతి నీవొకకృతిన్ సంతుష్టుఁడై చేసి వే
డుక గావింపు మిలన్మ్మసంకితము ప్రౌఢోక్తిన్ సుధీంద్రాగ్రణీ !

క. శీలితబుధమానస మధు
పాళిరసాసంగహేతువై యలరఁగ వా
కేృళిని నే రసమంజరి
బాళిఁ ప్రకాశింపఁజేసె భానుఁడు జగతిన్.

క. ...రసమంజరి తెనుఁగొనర్పు రసికులు పొగడన్.

అని రాజు పలుకగా నాంగీకరించెను. అవతారికలో కృతిపతి వంశావళి విశేషముగాఁ గలదు. నాలుగాశ్వాసములు ప్రత్యాశ్వాసము గద్యము పద్యరూపముగా రచియించెను. ద్వితీయాశ్వాసాంతమున,

శా. వన్నెల్మీఱఁగ నుల్లసిల్లిన భరద్వాజీయగోత్రాబ్ధిలో
త్పన్నశ్రీఁగొను సూరిచంద్రుఁడు దలిర్పన్ వేంకటాచార్య శ్రీ
మన్నారాయణ సత్కవీంద్రుఁడొనరింపన్ రమ్యమై యీ గ్రంథమై
యెన్నన్నా రసమంజరీ కృతిఁ జతుర్థాశ్వాసముల్పొందగున్.

అని కలదు.

(ఆంధ్రసాహిత్య పరిషత్తు గ్రంథసంఖ్య. 148. పరిషత్పుస్తకభాండాగారము ద్వితీయభాగము, పుట 76, 77.

గ్రంథముచివర. నవసాలపురమునందుండే నడమంటినగరు దొరపై యంకితముగా శ్రీమన్నారాయణయ్యంగారు జేసిన రసమంజరి యను గ్రంథము. వీరి సుబ్బయ్య రాక్షసనామ సం॥ శ్రావణశుద్ధషష్టికి వ్రాత పూర్తిచేసెను.

మన్నారుకవి కృతములు చాటువులు

సీ. ప్రాతరారంభ జృంభత్స్నాన సాంభోజ
రమణీయ మకరంద రసముఁ గెరి
సాయంసముత్ఫుల్ల జాతిప్రసూనాళి
పరిమళ సందోహ పటిమ మీరి
శారదచంద్రికా పారసార పటీర
ఘనసారశీతల గరిమ మీరి
పాణీలసద్వాణి వీణా పరిక్వాణ
కల కలార్భటులతోఁ గలసి పోరి

మధురసురభిళ శీతల మృదభావ
ములను విలసిల్లు నీపల్కు జలముమీఱతి
విజయరఘునాథ మేదినీ విభుతనూజ
రాయరఘునాథభోజ! విక్రమబిడౌజ!

సీ. ఈతడే నాసముదితహిత సముదయ
ములు కొలువఁగ బలుచెలువు తనర
ఘనరశ్మికులగము లనవరతము మది
ముద మొదవగనరు.............
.............మతులగు బుధకవి
గురులును నయమున సరసుఁదనరఁ
గవితలు బలువగ కవిత మధురస మ
ధురిమను గనుగొని మెఱయ వినకి
గొను.................. నత
నమరు నన్నలపతి కరణిధరణిఁ

గీ. దగు విజయరఘునాథేంద్రు తనయుఁడైన
రాయరఘునాథ మానవ............

సీ. ... ... ... ...దురమున
నసరక బెదరక కుదురుకొనిన
మదమునరిపులను గదుముచు గుదుముచుఁ
జదుముచు నదుముచు మొదలనీక
... ... ... ...
గదులను గళముల జిదురుపలుకఁ
బదపడి పుడమిని గదుపుల గెలుపుల
గలుముల చిలుకలకొలికి నెనసి

గీ. విభవుఁడై కీర్తిచేఁ జాల వెలసినట్టి
విజయరఘునాథ తొండమాన్ విభుకిరీటి .....

సీ. కీర్తిచే ధైర్య విస్ఫూర్తిచే సతతంబు
కలధౌత గిరిలీల వెలసినావు
దానంబుచే బూర్ణమానంబుచే సదా
రాజరాజఖ్యాతిఁ బ్రబలినావు
జయముచే నుతదయోదయముచే ననిశంబు
కృష్ణప్రభావంబు గెలిచినావు
చెలువుచే విద్యల నలువుచే సంతతం
బాత్మభూవైఖరి నలరినావు

రాజమాత్రుండవే? నీవు రాజలోక
సన్నుతౌన్నత్య గాంభీర్య శౌర్యధుర్య!
విజయరఘునాథ మేదినీ విభుతనూజ
రాయరఘునాథభోజ విక్రమబిడౌజ.

సీ. రాజకరప్రాప్తి తేజంబు కనుమించి
రిపుభేదన స్ఫూర్తి నతిశయించి
వజ్రధరఖ్యాతి వదలకుండుటఁ జేసి
వృత్ర సంఛేదన వృత్తిఁ బనరి
ధారాధరోన్నతిఁ దనరారుటను రాజ
హంసోదయనటన మమరఁ జేసి
తతసమగ్రస్ఫూర్తి నతిశయించుచునుఁ జాల
కమలాధికస్ఫార గరిమ మీరి

నీవు తరవారి పటువైరి నియతదారి
భూరి శుభకారి సంతతభూరిదారి
విజయరఘునాథ మేదినీ విభుతనూజ!
రాయరఘునాథభోజ! విక్రమబిడౌజ!

సీ. ఆలాగె యనుచు నైజ ననాంభోజముహూ
సౌందర్య [illegible]
చంచరీకచ్ఛటచ్ఛ [illegible]
వడవేయ [illegible] జనీసిపార

నడవులలో దూరి యమ్యెడలను బారి
పోనున్న నడిమూరి పొదలనూరి
ముండ్లీడవగవైరి మూకలంచును దారి
తప్పగమదిగోరి ధారదూరి

యేడ వెడలితిమీసారి యింకసాది
వలదటంచును తనువారివద్దఁ జేరి
తెలుపుకొనకేసి తహాహా! దోర్బలజితారి!
రాయరఘునాథశౌరి! విక్రమవిహారి?

సీ. వెడ కేకవైచి నవ్వీరమణమణిదీప్ర
హాటకఘోలికా కోటికలిత
కుంభికుంభములపై గొరిసెలు మ్రోవంగ
బాలాహజారిని జేరనురికి
దాపునవిడిన నిద్రాశిరంగులఛాయ
ధగదగయనఁగ వైపుగనెదూసి
"అదెపోటులదెమీటు లదెనటు కదెచుటు
కదెకొసరదె విసరదెయదె" యని

కదనమున నెదురుపడెడు నామదవదరులఁ
గదిమిచిదిమెడు మెఱవడి కలదెమహిని
నీకెతరుగాక సమరలీలాకుమార
రాయరఘునాథశౌరి! విక్రమవిహారి.

—: కోటిరాజగోపాలరాయలు :—

క. అదిరా! మహిరథవిశిమధు
మధుమథున కథాసుధానుపథు మధురిమధూ
ర్వ్రధురమతీ! మధురగతీ
కుధరధృతీ కోటిరాజగోపాలపతీ!

క. కోటికదా వితరణ శత
కోటికదా? యరిసహస్ర కోటీరలురత్
కోటికదా! చరణతులా
కోటిభళీ! కోటిరాజగోపాలపతీ!

క. ద్రుపదాయన నీదువనితా
విషమాంబక కార్యకార్య విషమాంబకునత్
విషితసుధ ద్విషితబుధో
ద్ఘుషిత కథాలాప! రాజగోపాలనృపా!

క. మాపాటి వారినెల్లరఁ
గాపాడుము విమలహృదయ కమలాభాస్వత్
గోపాలక గోపాలక
గోపాలకలాప! రాజగోపాలనృపా!

క. అందఱికి దొరకనేరదు
మందస్మందాకినీందు మందారఖగ
స్యందన నందన చందన
కుందయశః ప్రతతి! రాజగోపాలపతీ.

—: నవనప్ప - ఖడ్గలక్షణశిరోమణి :—

తెనుఁగుభాషలో శాస్త్రీయ గ్రంథములు ప్రత్యేక వాఙ్మయ శాఖగా పరిగణింపఁదగిన విలువగలవి. కాని నిన్న మొన్నటివఱకు నీగ్రంథములకు పర్యాప్తమైన పరిశీలనలేదు. ఈశాఖా సంబంధము లైన గ్రంథములన్నియు, పసిగా, చక్కఁగా, పరిష్కృతములై, వ్యాప్తినందినగాని, తొల్లిసర్వాంగ సంపన్నముగా వెలసిన తెనుఁగు సాహిత్యస్వరూపము తేటతెల్లముకాదు. కావ్యలక్షణములును, కవితా రీతులును, కవి ప్రతిభయును వెల్లడికాదు. I

I. ఇట్టిపరిస్థితిలో మదరాసు రాష్ట్రీయ ప్రభుత్వమువారు, దేశభాషలలోని ప్రాచీనగ్రంథము లచ్చుకూర్పించుటకుఁ దలపెట్టుటయు నందు ముఖ్యముగా, సంగీతము, వైద్యము, జ్యోతిషము వేదాంతము చరిత్రమున్నగు శాస్త్రీయ గ్రంథములకుఁ బ్రాధాన్య మొసంగుటయు మిక్కిలిగా భాషాభిమానులందఱును ప్రశంసింపఁదగినది. ఈ ప్రణాళికలో తెనుఁగుభాషలో వెలువడిన శాస్త్రీయగ్రంథములలో నీ ఖడ్గలక్షణ శిరోమణి యొకటి.

## -: గ్రంథప్రశ

ఈగ్రంథము పేరునుబట్టి యిది కత్తులను వానిస్వరూపములను వివరించునది యని తెలియుచునేయున్నది. తెనుఁగులో నింతవఱకు ప్రత్యేకముగా ఖడ్గములనుగూర్చిన పద్యరూపగ్రంథము లేదు. మఱియొక విశేషమేమనగా నీ గ్రంథము దక్షిణదేశమున పుదుక్కోటలో పుట్టినది. కాబట్టి శాస్త్రీయ గ్రంథముగనేగాక, దక్షిణాంధ్రసారస్వతమునకు సంబంధించిన గ్రంథముగాకూడ నిది పరిగణితము కాఁదగినది.

## —: గ్రంథస్వరూపము :—

దీని మాతృకయొక్క వ్రాఁతప్రతి మాత్రమే లభించినది. అది 2667 సంఖ్యగా మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నున్నది. ఆ ప్రతి వివరములివి.

"కాగితము నెం. డి. 2677 (పొడవు 13⅛" వెడల్పు 8⅛)పుటలు 19 పుటకు 26 పంక్తులు. వ్రాఁత చక్కగనేయున్నది. కాని తప్పులు గలవు. పద్యపాదములలో నచ్చటచ్చట లోపములుగలవు. ప్రతి సమగ్రముగనున్నది. ఒక్క ప్రతిమాత్రమే గలదు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు (కాకినాడ) పుస్తకభాండాగారమున 95 సంఖ్యగా కత్తులలక్షణము తెలుపు చిన్న పుస్తకము గలదు. కాని యది యీగ్రంథమునననుసరించి వచనములో వ్రాయఁబడినది. అది నైన సమగ్రముగాదు.

ఈ గ్రంథములో 77 పద్యములు నొక పెద్దవచనము మఱియొక చిన్నవచనమును గలవు. మొత్తం 79. వీనిలో 1 చంపకము, 1 ఉత్పలము, 15 కందములు, 14 గీతములు, 46 సీసపద్యములుగలవు. లభించిన ప్రతియొకటియే యగుటచేతను, సాంకేతిక పదజాలము విశేషముగ నుండుటచేతను, గ్రంథ విషయము లోపింపకుండ స్వల్పసవరణములుచేసి యథామాతృకముగ నిది ముద్రింపఁబడినది.

## —: గ్రంథకర్తకాలము :—

దీనిని రచియించిన కవి నవనప్ప. నల్లపిచ్చయ్య కుమారుడు. ఈతని కులగోత్రములు తెలియరాలేదు. కాని యీతడు ఖడ్గములను గూర్చి పూర్తిగా తెలిసిన యీక్రింది వ్యక్తులనే పేర్కొనుటచేత, నీతడును నావిశ్వకర్మశాఖకు సంబంధించిన వాడని గ్రహింపవచ్చును.

1. తిరుమలచిదంబరుడు-ఇతడు విశ్వకర్మను మించిన ప్రజ్ఞగలవాడు.
2. చిగిలి లక్ష్మరాముడు - సకలఖడ్గముల క్రమము నెఱిగినవాడు.
3. శెంకిసుమాలు - పనివారలందఱిలో పండితుడు.
4. ఆమకుశాయి - ఖడ్గపరీక్షయందు నిపుణుడు.
5. సుభాభక్తుడు - పై లక్షణములన్నియు గలవాడు గొప్పపనివాడు.

నవనప్ప తనతండ్రి నల్లపిచ్చయ్య రాయరఘునాథరాజుచే సమ్మానితుడనియు, తాను రాయరఘునాథరాయలు, తిరుమలవజీరుడును వారల తనయుడైన విజయరఘునాథరాజును నాజ్ఞయీయగా నీ కృతి రచించితిననియు చెప్పుకొన్నాడు. (7-9 పద్యములు) పై వారిలో రాయరఘునాథరాజు, పుదుక్కోటను క్రీ. శ. 1769-89 వఱకును పాలించిన తొండమానురాజు. ఇతడు భాషాపోషకుడగు విద్వత్ప్రభువు. ఈతని వెనుక విజయరఘునాథరాజు రాజ్యమునకువచ్చి క్రీ. శ. 1789-1807 వఱకును పాలించెను. కాబట్టి యీకవియు క్రీ. శ. 1780 ప్రాంతమున నున్నవాడని చెప్పవచ్చును.

## —: గ్రంథవిషయము :—

ఈ గ్రంథమున అసితో మొదలుగా ముప్పది రెండాయుధములును పేర్కొనబడినవి. ఆవెనుక వానిలో ముఖ్యమైన 'ఆసి' యను ఖడ్గమునకు ప్రత్యేకముగా 'లక్ష్మీనారాయణ సంవాదము' అను గ్రంథమున లక్షణములు చెప్పబడియున్నవనియు, తాను దాని ననుసరించితి ననియు కవి చెప్పినాడు, కాని యీగ్రంథ మిప్పుడెచ్చటను గాన

రాదు. ఆవెనుక నూటనలుబదిమూఁడు విధములగు నాయుధములను వానిలక్షణములు తెలిపియున్నాఁడు, కవి నవీనుఁడగుటచేత నితర భాషా పదములను, సాంకేతికపదములను వాడియున్నాఁడు, ఫిరంగి, సైపు (అరబీపదము) బందగు సూర్రై' త్యాగ, ఖండామిశ్రి అబ్బాసి మొద లగునవి ఉర్దూపదములు. ఇవి పారశీకభాషనుండి వచ్చినవగుటచేత, భాషోద్ధారకులు బ్రౌనుదొరవారు వీనిని తమ నిఘంటువులో (1852 ముద్రణము) నిచ్చియున్నారు. పై వానిలో "ఫిరంగు" అనునది, యగ్ని హోత్రసంబంధమగు నాయుధమనియు నది చేతిలో నుపయోగింపఁ బడునది కాదని మనకొక యభిప్రాయము కాని యిదియు కత్తులలో నొక భేదమని యీగ్రంథమునుబట్టి, నిఘంటువునుబట్టి తెలియుచున్నది. ఖండాపదము తెలుఁగుకవులుపయోగించిన పదమే.

తెలుఁగుదేశమున ఖడ్గమున కనేక పర్యాయపదములున్నను, అసిపదము వేదకాలమునాటి ప్రాచీనపదమైనను, "ఖడ్గతిక్కన" "ఖడ్గ నారాయణ" మొదలగు బిరుదనామములు ఖడ్గశబ్దప్రసిద్ధినే సూచించు చున్నవి.

నవనప్ప ఈగ్రంథమును 'అసి' ప్రబంధము అనిచెప్పి ఖడ్గ లక్షణశిరోమణి యని దీనికి పేరుపెట్టుటయే పై పదవ్యాప్తిని రూఢి పఱచుచున్నది.

ఖడ్గముల వివరణము

మొదట 32 ఆయుధములు వివరణము :—

(1) అసి, (2) ముద్గరము, (3) ముసలము, (4) కోహణము, (5) కణయము, (6) కంపణి, (7) సిల్లు, (8) భల్లాతకము, (9) భిండివాలము, (10) కరవాలము, (11) కుంతము, (12) కోదండము, (13) కఠారి, (14) తోమరము, (15) పరశు, (16) త్రిశూలము, (17) వజ్రముష్టి, (18) గద, (19) ఆవుది, (20) అంగల, (21) అంతక, (22) వంగిణి, (23) చక్రము, (24) సబళము, (25)

ఈటె, (26) ఇనుపకోల, (27) సెలకట్టి, (28) పట్టిసము, (29) ప్రకూర్మము, (30) నఖరము, (31) మయూరదండము, (32) నారసము.

కత్తులు సామాన్యరకములు :—

(1) హస్తము, (2) మకరము, (3) జవబల్, (4) ముక్కె, (5) వాజలల్.

ఫిరంగుతరగతి

1. క్రిరమాన్ ఫిరంగు
2. తురా ,,
3. ఎక్కెల్ ,,
4. దోర్యా ,,
5. కుషీక్ ,,

సైపుతరగతి

6. పూత్రికాల్ సైపు
7. సుకాక్ ,,
8. మకరబ్ ,,
9. రుకమ్మి ,,
10. ఇనుపాత్ ,,
11. మళయవారి ,,
12. ఉలాందా ,,
13. జజ్ఞా ,,
14. పుతన్క ,,
15. కుషీక్ ,,
16. ఇపపాత్ ,,

బందరుతరగతి

17. చాందు బందర్
18. గోవా ,,
19. అహమ్మదు ,,
20. బెల్ బందర్
21. నాట్ ,,
22. ఆరా ,,
23. ప్రాంసు ,,
24. జ్ఞా ,,
25. పూతన్ కేసీ ,,
26. మెనా ,,
27. లయిమానా ,,
28. మోనాభి ,,
29. తినాభి ,,
30. పురే ,,
31. పాము ,,
32. ద్యాలు ,,
33. బత్తాళి ,,
34. కాయంతే ,,
35. ఇంగ్లీషు ,,
36. మహమ్మద్ ,,

సురైతరగతి

37. ఇందుస్తానీ సురై
38. మారాషా ,,
39. భుజకా ,,
40. రాజాషా ,,

| | | |
|---|---|---|
| 41. | కంచకా | సుక్రై |
| 42. | పప్పషా | ,, |
| 43. | అంబబా | ,, |
| 44. | వాసికుని | ,, |
| 45. | సాదాల గుబు రాల్ | ,, |
| 46. | సుదాదాలా | ,, |
| 47. | కలకత్తా | ,, |
| 48. | కత్తాను | ,, |
| 49. | సిద్ధోట్కు | ,, |
| 50. | సురతానిశాయి | ,, |
| 51. | కలియకెరాట్ | సుక్రై |

## త్యాగాతరగతి

| | | |
|---|---|---|
| 52. | బండవాన్ | త్యాగా |
| 53. | ప్యహాం | ,, |
| 54. | అంబరీ | ,, |
| 55. | రుమీా | ,, |
| 56. | గుజరాత్ | ,, |
| 57. | బంద్యా | ,, |
| 57-a | హిరాకి | ,, |
| 58. | వరకుసిల్ | ,, |
| 59. | అబ్దాల | ,, |
| 60. | జహాశా | ,, |
| 61. | ముత్తాన్ | ,, |
| 62. | బగ్దా | ,, |
| 63. | బహోరి | ,, |
| 64. | లహూరి | ,, |
| 65. | అకుపరి | ,, |
| 66. | అపరంగజపి | ,, |
| 67. | నిరవరి | త్యాగా |
| 68. | బువాన్ | ,, |
| 69. | అషజ్జా | ,, |
| 70. | మేవళ | ,, |
| 71. | జికర | ,, |
| 72. | దేపగదిచండా | ,, |
| 73. | బంగాళీ | ,, |
| 74. | పట్నా | ,, |
| 75. | హైదరాబాద్ | ,, |
| 76. | మసుధాభా | ,, |
| 77. | సహజాపూర్ | ,, |
| 78. | సేంచా | ,, |
| 79. | సిద్ధోట్ | ,, |
| 80. | కచ్చనా | ,, |
| 81. | డాల్ మన్ కాన్ | ,, |
| 82. | చెంగమా | ,, |
| 83. | అలంగిరి | ,, |

## గురుదాతరగతి

| | | |
|---|---|---|
| 84. | మకరబ్ | గురుదా |
| 85. | జబ్బురు | ,, |
| 86. | మకై | ,, |
| 87. | హాలబ్బ | ,, |
| 88. | తురా | ,, |
| 89. | మక్కు | ,, |
| 90. | డోణ్యురోయ్ | ,, |
| 91. | రుమ్మా | ,, |
| 92. | గుజరా | ,, |
| 93. | అందెబాది | ,, |
| 94. | బాందూ | ,, |
| 95. | గోసా | ,, |

96. తుంకహరు గురుదా
97. బేల్ ,,
98. నాల్ ,,
99. ఆరా ,,
100. ఆలయమాని ,,
101. ప్రాంసు ,,
102. జిఙ్ఞా ,,
103. ప్రతన్కన ,,
104. ఏకనాభి ,,
105. మహమ్మద్ ,,
106. బందర్ ,,
107. అవేమాని ,,
108. దోనాంబి ,,
109. తిరాభి ,,
110. ఫ్యులాందర్ ,,
111. పాము ,,
112. కాండల్ ,,
113. బత్రావి గురుదా
114. కామల్ ,,
115. ఇంగ్లిషు ,,
116. ఎక్కేల్ ,,
117. బాదిషాసురతాన్ ,,
118. శికిందర్ ,,
119. వస్త్రాదిమిరాన్ ,,
120. సమాహిర్ ,,
121. మహమందబాసి ,,
122. విలాడి ,,
123. అబ్బాసి ,,
124. బురాతిసావి ,,
125. సాలువాల ,,
126. ఖండా ,,
127. దుంకుమాయవన్ ,,
128. మొదపు ,,
129. మిశ్రి ,,
130. ఇపి ,,

ఇట్లు 130 కత్తులలక్షణములు చెప్పబడినవి.

ఖడ్గలక్షణములు 18. (1) పాత, (2) క్రొత్త, (3) నిడివి (4) వెడల్పు, (5) ప్రక్కలు, (6) మూరి, (7) కాడి, (8) వాయుదార, (9) పెణకు, (10) గీతలు, (11) ముద్రలు. (12) దోరా, (13) దోర్యాలు, (14) చాయలు, (15) కప్పు. (16) కంజిరు, (17) లఘువు, (18) జహార్వరు.

ఈ ముప్పది రెండాయుధములక్షణములు, కత్తులనుగూర్చి విశేషములు, అగ్నిపురాణ, బృహత్సంహిత, శుక్రనీతి, మానసోల్లాస, శివతత్త్వరత్నాకరాది గ్రంథములలోఁ గాననగును. తెనుఁగునందే కాని

యీశాస్త్రమునకు సంబంధించిన గ్రంథ మితరభాషలలో లేదు. అదియే యీగ్రంథ విశిష్టత.[1]

ఆంధ్రసాహిత్య పరిషత్తులోగల వచనభాగము నిందుతో పొందు పఱుపబడినది.

“ఇందుఁగత్తులపేరులు పొడవు వెడలుపు లక్షణములు ముద్రలు పిడుల వివరము మొదలగునవి వ్రాయబడినవి.

కత్తులు – 1. హిందూస్థాన్, సుర్తై. 2. అభియాబాగు సుర్తై, 3. బల్దవాన్ త్యాగా, 4. న్యహాణ త్యాగా, 5. రుమ్మిత్యాగా, 6. బిందుపాన్ త్యాగా, 7. హీరానత్యాగా. 8. అబ్బాలీత్యాగా, 9. పరన్ సెరీత్యాగా, 10. బద్ధాత్యాగా, 11. సరవరిత్యాగా, 12. మావిపీత్యాగా, 13. హైదరాబాద్ త్యాగా, 14. కుచ్చి త్యాగా, 15. చెంగ్లామాత్యాగా, 16. విలాతి అబాసీ, 17. ఖురాసాణ అబాసీ, 18. మందుమాభీర, 19. అంఙాబాది గురుదా, 20. ఎద్నెల్ అనునవి చెప్పఁబడినవి. ఒక్కదాని కుదాహరణము.

ఖురాణ అబాసీ – కత్తి గడుసుగానుండును. తక్కినలక్షణములు విలాతి అబాబవలెను.

మిశ్రకత్తి - (మిసర్ కత్తి) కాలుతక్కువ నాలుగుజేనలు వెడలుపు మూఁడువ్రేళ్లు పెణికెదగ్గర నొకదోరెము. పెణికెలావు పిల్ల దోరెము ౧/-బీరకాయ పీఁచువలె ఛాయ.

నాలువాలు – నిడివికిజేనలు పెణికి కొనదాఁక సన్నగానుండును నడుమ నొక దోరెము ఉక్కుటల్లు సీరుసల్పు వెడలుపు రెండువేళ్లు.

1. The above work was edited by the present writer with an English & Telugu introduction and was published in the Madras Government Oriental Series No. xiv under the authority of the Government of Madras.

ఖండా - నిడివి కాతుకాలుతక్కువ నాలుగుజేనలు వెడల్పుకి వేళ్లు చూరి ముందు వంగియుండును. అడుగు దుత్తెడు 3 దోరెములు. పెటకె దగ్గెఱ కడవెళ్ళ అటువుముద్దర దుగళం పేరాముదపు గింజవలె కత్తిగడను రండాపట్టు దప్పం కత్తిలఘువు.

ఆయాతావులకత్తియొక్క ముద్రలు చిత్రింపబడియున్నవి. రా జులు, డాల్ లు, కెములపేరులు గుర్తుకొఱకు కొన్ని వ్రాసికొన్నారు.

కెడయములు _ బరువుగానుండును. కొత్తదికోసిన నేరేడుపండు చెక్కినట్లుండును. ప్రాంతగిలిన దోరబీరకాయ బిక్కునఁగోసినట్లుండును. నఱకు దగినఁ గూడిపోవును. నాలుగుతావులను బెట్టునది కెడయము తక్కినతావున పెట్టేది చిలుకట్టు."

ఆంధ్రసాహిత్య పరిషత్తు - పుస్తకభాండాగారము గ్రంథసంఖ్య 95 ఖడ్గలక్షణము (వచనము)

—: నుదురుపాటి సాంబశివ కవి :—

వెంకనార్యుని యార్వురుకొడుకులలో కడపటివాడగు నీ సాంబశివ కవియు, తండ్రితాతలవలె ప్రౌఢకవి. ఈతని కృతులలో మనకు మైనవి మూఁడు.

—: 1. బిల్హణీయము :—

ఇది సంస్కృతబిల్హణీయమునకు దెలుఁగుసేఁత. కథ ప్రసిద్ధమైనదే కావున వివరింపలేదు. ఇది పూర్వభాగము, ఉత్తరభాగము అని రెండు భాగములుగా రచితమైనది. కవిత సారవంతమై శ్రావ్యమై యున్నది. శైలినిఁ దెలుపుటకు రెండుపద్యము లుదాహరించుచున్నాను.

ఉ. కొందఱు లేడియండ్రు మఱికొందఱు చిహ్నమటండ్రు పిన్నటం
గొందఱు యుక్తిఁజేసి కనుగొంటిమి భూప్రతిబింబమండ్రు పో
చందురులోనఁ గానఁబడు చామనిచాయ యదౌను రేలవం
దందతమంబు మ్రింగసది తజ్జఠరంబునఁ గానవచ్చెడిన్.

సీ. అద్దంపుబిల్లయో అల్లజాబిల్లియో
నికసితాంభోజమో వెలందిమోము?
వాలుంగచేపలో వలరాజుతూంపులో
తామరరేకులో తరుణికనులో ?
కవబాయకుండు జక్కవల పూగుత్తులో
బంగారుగిన్నెలో పడంతిచనులో?
నక్షత్రమో నవనవమైన తీగయో
కారుమెఱుంగో వాల్గంటిమేనొ?

గీ. అకట! యేమనుచుం జెప్పెద నాత్మలోన
నిదియనుచు నిశ్చయముచేయ నెవరికైన
వశమె యీరీతినూరక పలుకరింప
నందులో నొక్కటైన నౌను గాక !

ఈతండీగ్రంథ క్రీ. శ. 1825-39 ప్రాంతములలో పుదుకోటను పరిపాలించిన రాయరఘునాథరాజున కంకితముగా గావించెను.

## —: 2. తొండమాన్వంశ ప్రతాపమాలిక :—

తనతండ్రి వెంకనార్యుండు రచించిన తొండమాన్వంశమాలిక క్రీ. శ. 1789 వఱకు రాజులచరిత్రను తెలుపుటచూచి సాంబశివకవి దానిని క్రీ. శ. 1840 వఱకు ననగా తనకాలమువఱకు వెలసిన రాజులను నదేరీతిగా 342 పంక్తుల సీసమాలికగాం జెప్పెను. ఇదియు ముద్రితము. అప్పటికింగ్లీషువారిపాలన ప్రారంభమైనది. రాయరఘునాథునకు "His Excellency" అను బిరుదము నిచ్చినట్లిందు వర్ణితమైనది.

సీ. కలశవారిధి లసత్కల్లోలముల మాఱి-
యే మేటికీర్తి పైపై మెలంగు
సేతుకాశీమధ్య భూతలంబందున
నెవ్వానిరాడ్భావ మెన్న నెగడు

సకలరాజన్య ప్రశంసనీయంబులై
యెవ్వాని బిరుదంబు లెసకమెసగు
కవితాతి ధూర్వహకవి లోకములకెల్ల
నెవ్వాని గుణగణం బెలమిసేయు

గీ. హూణరాజన్య నృపథ విషాణమైన
"ఎక్సలెన్స"ను బిరుదునే నృపుఁడువడసె
నింద్ర వంశాబ్ధిచంద్రుఁడై యెవఁడు వెలయు
నట్టి రఘునాథరాయ భూమౌళి యనువుమీఱ.

ఆ. సా. ప. ప. సం. 6 పుటలు (198-212)

—: చంద్రాననా దండకము :—

ఇది నాగినీదండకము రీతిని పుదుకోట ప్రభువులైనట్టియు కంపెనీ ప్రభుత్వముచే 'హిజ్ ఎక్సలెన్సీ' బిరుదమును మొదట పడసినట్టియు క్రీ. శ. 1825-39 వఱకు పాలించిన రఘునాథ తొండమానురాజునకు కృతిగా నాంధ్రభాషార్ణవకర్త వేంకట కవిపుత్రుడు సాంబశివకవి రచించినది. శృంగారపరము - శైలికి.

శ్రీదక్షిణాభిఖ్యగోకర్ణ వక్త్రారవింద స్ఫురద్దివ్య తేజస్సదా ధ్యానసక్తాత్మభావుండు, భానూద్భవామిత్ర భాలాక్షికీలాసమాన ప్రతాపార్కబింబ ద్విషద్ధ్వాంతవారుండు, వారాశి గాంభీర్యగాఢత్వదాన ప్రవీణాతి గంభీరతాశాలి, శాలీనవిద్వద్ధరా పాలమౌళిస్ఫురన్మంజు రత్నచ్ఛవిచ్ఛన్న చక్రాదిరేఖోల్లసత్పాదపద్ముండు........హూణాదిరాజన్య సంస్తూయమానోల్లసత్కీర్తి.........

సంతానసంపత్తు లింపొంద నుద్దండ విద్వత్కవిత్వాంకనుండైన శ్రీసాంబనాభిఖ్య విద్వత్కవీంద్రుండు కైసేయ చంద్రాననాంకం బగున్.

ఆం. సా. ప. (గ్రంథసంఖ్య. 55) అముద్రితము. 22 చిన్నపత్రములుగలది, పరిషత్పుస్తభాండాగారము, పుట 19.

—: చంద్రాననా దండకము :—

ఇది పై రఘునాథ తొండమానురాజు పుత్రుఁడును క్రీ. శ. 1844నుండి 1886 వఱకు పుదుక్కోట పాలించిన రామచంద్ర తొండమానురాజున కంకితముగా. వేంకన కవిపౌత్రుఁడును. మాతృభూతయ్య పుత్రుఁడునునగు చిదాకారకవి (చిదానంద) చే రచితమైనది. ఈతనికిని నుద్దండకవి బిరుదముగలదు. ప్రౌఢమైన శైలిలో రచితమైనది. మచ్చునకు

శ్రీరామచంద్ర క్షితీశుండు తానొక్కనాటన్ హజారమ్మునన్ ......స్వీయేతరంబైన భూపాలశ్లాఘ మిత్వంబు...కోటిభూపాల వర్యుండితండంచు లోకుల్నుతింపంగ...హాహాతాస్మి హాకో హేతురా సీదిదంకిం వరాకే కిలాహమ్మటంచున్ వినిష్పేషణోద్యుక్త హస్తాబ్జయై...ఉద్దండ విద్వత్కవిత్వాంకనుండైన శ్రీ వేంకనాభిఖ్యధీరేంద్ర పౌత్రుండు శ్రీమాతృభూతాఖ్యధీమంతు పుత్రుండు శ్రీమచ్చిదాకార విద్వత్కవీంద్రుండు కైసేయు చంద్రాననా దండకంబు......

ఆ. సా. ప. గ్రంథసంఖ్య. 61. అముద్రితము. కాగితపుఁ బ్రతి పు. భా. పుట 65.

# మైసూరు - ఆంధ్రవాఙ్మయము

## —: చిక్కదేవరాయలు :—

మైసూరిని పాలించిన మహారాజులలోకెల్ల చిక్కదేవరాయలు మహాప్రసిద్ధుఁడు. ఈతఁడు క్రీ. శ. 1672 - 1704 వఱకును పాలించిన వాఁడు. ఈతని కాలమున, సంస్కృత కర్ణాటాంధ్ర వాఙ్మయములు మూఁడును వర్ధిల్లినవి. ఈతనిఁగూర్చిన చాటువులు గలవు. మఱియు నీతని పేర ప్రస్తుతమున్న గ్రంథముల వివరణమిది.

### 1. చికదేవరాయ విలాసము

ఇదియొక యక్షగానము. అసంపూర్ణము. ప్రశస్తకవిత గలది. యత్కర్తృకమో తెలియరాదు.

ప్రారంభము :—

శా. శ్రీరంగైకవిహారహారి భువనక్షేమంకర ప్రాభవో
దారస్ఫార కృపాకటాక్షములచేతన్ విశ్వవిశ్వంభరా
ధౌరంధర్య కళావిశేషవిలసద్బాహార్గళుండైన మై
సూరి శ్రీచిక దేవరాయలకు నిచ్చున్ శాశ్వతైశ్వర్యముల్.

... ... ... ...

శ్రీ మన్మహా రాజాధిరాజ రాజపరమేశ్వర ప్రౌఢప్రతాపతపన శ్రీవీర చిక దేవరాయ మహారాయ మహామండలాఖండలు పేర షష్ట్యం తంబులు రచియించెనట యెటువలెను,

క. శ్రీమంతున కవిరతనత
సామంతునకఖిల విమతజన వనజవనీ
హేమంతున కత్యద్భుత
ధీమంతున కనుపమాన ధృతిమంతునకున్

... ... ... ...

అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన శ్రీ చిక దేవ రాయ విలాసాభిధానంబను యక్షగానంబునకుఁ గథాప్రారంభం బెట్టిదనిన.........

గ్రంథాంతము :—

సీ. కురువిరాటవరాట కరహాటనృపజూట
తటకిరీటములపైఁ దాఁకిదాఁకి,
చోళనేపాళపాంచాల భూపాలవి
స్ఫాలభాలములపైఁ బ్రాఁకిబ్రాఁకి
అంగవంగకళింగ వంగబంగాళరా
డుత్తమాంగములపై నురికియురికి
కుకురుకాశకరూశ కోసలక్ష్మాధీశ
మాంసలాంసములపై మలసిమలసి

గీ. ఎవ్వనిభుజాల జయలక్ష్మి నెనసియుండు
నతఁడు పొగడొందు నెందును నసమసమర
విస్ఫురమదాంధసింధుర విఘటితారి
రణజయవిహారి చికదేవరాయశౌరి.

మ. అని లోకత్రితయంబునం గలుగువారాకారరేఖాకళా
ఘనకీర్తిప్రతిభావిశేషములు వర్ణింప శ్రీరంగప
ట్టణసామ్రాజ్యధురంధరుండవయి వేడ్కంధాత్రిఁ బాలింపుచున్
మనుమీ శ్రీ చికదేవరాయనృపచంద్రా! సాంద్ర తేజోనిధీ!

పై పద్యములనుబట్టి రచనగుర్తింపనగును. ఇందు కొన్ని చరిత్రాంశములు గలవు. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము. యక్షగాన సంపుటము. సంఖ్య 1880 అముద్రితము.

## 2. శృంగార సీసపద్య శతకము

ఈపేర నొక శతకమున 'చికదేవ'అను పేరుకానవచ్చుచున్నది. దీనికి లోకోత్తర స్వారస్యయుత శతకమని వేఱొక పేరు గ్రంథముపై గానవచ్చుచున్నది. మఱియొక వ్రాతప్రతిలో 'డిండిమప్రహసనము' అను పేరు గాననగుచున్నది. అట్లయిన సంస్కృత డిండిమప్రహసనమున కిది యనువాదము కానోపును.

సీ. వింతగాఁ బొడఁగన్న వెలఁదిఁ నవలీల
సాధించు దేవ వేశ్యాభుజంగ
ముందరపొడగట్టు మొగనాలిసైనను
దొరకించుకొనునట్టి దుంపగీడ
తిరునాళ్లకనివచ్చు పరువంపు చెలఁదుల
దిరిగిపోనీయని ధీరవిటుడ
వేటకుఁబోవుచో వీటనెవ్వతైన
ననుపులఁదేలించు నటనకాండ

గీ. నీకు శృంగారనటనల నేర్పవగల
శతకమొక్కటి వినిపింతు చక్రహస్త
భక్తసురసాల చిక్కదేవ.........

... ... ...

ఇట్లే చివరిపాదము లేదు. తక్కిన మఱికొన్నింటికి మెత్తుగీతినే లేదు. అయినను వానికిఁగూడ నిట్లేయుండునని శతకమను పదమును బట్టి నిర్ణయించవచ్చును. అట్టిపద్యమున కొక యుదాహరణము.

సీ. నీవక్త్రశశిఁజూడ నిందు హర్షాబ్ధికి
నీలీల బాడబజ్వాలయయ్యె
రతిమోహలజ్జచే రాణించు నీచూపు
కెరలు రోషవిషాగ్ని కీలలయ్యె
సరసనిశ్వాసమంధర నాసికావళుల్
చిత్తజాగ్నికి కొల్మితిత్తులయ్యె
ఆననాబ్జమరందహర్షాశ్రు బిందువుల్
తతశోకమున కాజ్యధారలయ్యె

... ... ... ...

—: చాటువులు :—

చిక్కదేవరాయలనుగూర్చి చాటువులు తొలుత క్రీ. శ. 1911లో కాకినాడ సరస్వతీపత్రికయందు ముద్రితమైనవి. ఆవెనుక చాటు పద్యమణిమంజరి ప్రథమభాగమున ముద్రితమైనవి. (ప్రథమభాగము. పుట 46).

—: కంఠీరవరాజు యక్షగానకృతులు - పదములు :—

తెనుగు సాహిత్యములో మధుర కవితాశాఖకు సంబంధించిన కృతులలో యక్షగానములనుగూర్చి యింతవఱకును సమగ్రపరిశీలన జరిగియుండలేదు. ఈ శాఖలోకూడ ముద్రితములు, నముద్రితములు

నగు గ్రంథజాలము చాలగా వెలయుచున్నది. కాని వాఙ్మయ ప్రపంచమున నీ శాఖకుగల యున్నతస్థానము గుర్తింపబడకుండుటచే యక్షగానములనుగూర్చి కూలంకషముగా వ్యాసంగము జరుగలేదు. కొలది మంది విద్వాంసులు [1] మాత్రమే దీనినిగూర్చి పరిశ్రమచేసి యాంధ్ర విద్వల్లోకమును కృతజ్ఞతాబద్ధము గావించినారు. సాహిత్యపథకము యొక్క పరిణామమును సంగీత సాహిత్యములకుగల పరస్పర సంబంధమును వ్యక్తము సేయుచు, సంగ్రథతాముద్రను ప్రదర్శించు నీ యక్షగానములు మిక్కిలి సూక్ష్మముగా పరిశీలింపఁదగినది. అట్టివానిలో నీ వఱకు పరిశోధకుల కెఱుగరాకుండ కాలగర్భము నణఁగియున్న కంఠీరవరాజు యక్షగానకృతులనుగూర్చి పదములనుగూర్చి నేను తెలుపుచున్నాను.

కంఠీరవరాజు మైసూరు పరిపాలకుఁడును కవి పండితప్రియుఁడును మహాయశస్కుఁడునగు చిక్కదేవరాయల కుమారుఁడు. ఇతఁడు క్రీ. శ. 1704 నుండి 1713 వరకును మైసూరును పరిపాలించెను. ఇతఁడు పుట్టుకచే మూగవాఁడును, చెవిటివాఁడునై యుండెను. అందుచే నీతనికి "మూకరసు" అను నామాంతరము. కేవలము హస్తసంజ్ఞలతోడనే రాజకార్యములను నిర్వహించెడివాఁడు. అయితే భగవంతుఁ డేదేని యంగవైకల్యమును గలిగించినప్పు డావ్యక్తికే దే నొక విలక్షణమైన శక్తిని ప్రసాదించును. కంఠీరవరాజునకు కమనీయమగు కవనశక్తియే గాక బహుభాషావేత్తృత్వమును పరమేశ్వరుఁడు ప్రసాదించినాఁడు. ఇతని యక్షగానరచనముల మూలమున నితఁడు సంగీత సాహిత్య నాట్య విద్యలందు నేర్పరి యగుటతోపాటు సంస్కృతమున ప్రాకృతమున మాతృభాషయగు కన్నడమున తెనుగున తమిళమున కవితారచన చేయఁగలవాఁడని విశదమగుచున్నది. ఈతని విద్యావిశేషము మైసూరు చరిత్రకారు లెవ్వరును నీవఱకు గుర్తించియుండలేదు.

---

(1) కీ. శే. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు. (2) కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. (3) శ్రీ చింతా దీక్షితులుగారు. (4) శ్రీ డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు.

ఈ యక్షగాన రచనలవలన నీతడు దక్షిణాంధ్ర వాఙ్మయముననే కాక యాంధ్రవాఙ్మయమునఁగల రాజకవులలో నొక ప్రశస్తకవిగా నెన్నఁదగినవాఁడు. ఇతని కృతుల వివరణము నీ క్రింద నొసగుచున్నాను.

1. కొఱవంజికల్లి—ఇందులో నాలుగుకృతులు గలవు.

a. ఆంధ్రకొఱవంజి. b. కన్నడకొఱవంజి. c. ప్రాకృతకొఱవంజి. d. తిగుళకొఱవంజి లేక తమిళకొఱవంజి.

2. పంచాయుధకల్లి.
3. లక్ష్మీవిలాసము.
4. కలవాణీవిలాసము.
5. నాట్యవిద్యావిలాసము.
6. వసంతోత్సవవిలాసము.
7. విభక్తికాంతావిలాసము.
8. అష్టదిక్పాలకవిలాసము.
9. పావకినాటకము.
10. వైవస్వతనాటకము.
11. నైరుతినాటకము.
12. వారుణినాటకము.
13. వాయవినాటకము.
14. కౌబేరినాటకము.

పై కృతులలో నీ క్రింది లక్షణములు సాధారణముగ గన్పట్టుచున్నవి.

(1) గ్రంథాదిని సంస్కృతశ్లోకము కొన్ని కృతులయందున్నవి.
(2) గ్రంథాదిని తెలుఁగుపద్యము కొన్నిటగలదు.
(3) వచనములు మధ్య మధ్య గలవు.
(4) ద్విపదలు, సీసపద్యములు మొదలగు జాతులుకలవు.
(5) మత్తేభము మొదలగు వృత్తములు గలవు.

(6) దరువులు, జంపె, త్రిపుటలు గలవు.

(7) ఆటతాళము, ఏకతాళము, ధ్రువతాళము, మఠ్యతాళము ప్రయుక్తములైనవి.

(8) కొన్నింట ప్రాకృతమును కన్నడమును వాడబడినవి.

(9) తెనుఁగున లేక, కన్నడమున నున్న సాంగత్య ఛందో పద్ధతి యిందు గలదు.

(10) అన్నింటియందును రచన సరళమును హృద్యమునై యున్నది.

## 1. "ఆంధ్రకొఱవంజి" 1

కంఠీరవరాజు శ్రీ రంగనాథుని దర్శించి తిరిగి వచ్చుచుండగా పాంచాలదేశపు రాచపట్టి కాంచనలత యీతని చూచి మోహించును. ఇంతలో కొఱవంజి ప్రవేశించును. తన మనోరథమును తెలుసుకొని కంఠీరవరాజు తన్ను ప్రేమించి వివాహమాడునని కొఱవంజి చెప్పగా విని సంతోషించి పారితోషికమిచ్చి పంపుట యిందలి యితివృత్తము.

దీని రచనకొక మచ్చుతునక—ఎఱుకత వచ్చుట.

మాళవిరాగము.

పచ్చె నెఱుకత యెఱుక యెఱుకని
వాడవాడలనెంటనూ

హెచ్చుగా తారాకాణలెల్లను
యిదిగొ చెప్పెద ననుచునూ
తళుకుఁజెక్కులఁ బసిఁడికమ్మలు
తళుతళుక్కని మెఱయఁగా

1. దీనినిగూర్చి "తాళపత్ర గ్రంథములు కొఱవంజి" అను శీర్షిక క్రింద వాణిలో తే 7-10-1950 దిని ప్రకటితమైన యస్. యస్. సుంకరేశ్వరరావు ప్రసంగముఁ జూడదగును.

కులుకుగుబ్బలు పైని హారము
వెలసివేడుక మీఱఁగా
పొందుగా రత్నములు నించిన
బుట్టబుజమున నుంచుక
చందముగ తన చిన్ని బుడతను
సరవి వీపున గట్టుకా
ఘల్లుఘల్లున జాళువాగిల
కయుకరంబున మ్రోయఁగా
మెల్లమెల్లనె హంసనడపులు
గల్లసొగసులు త్రోయఁగా

—: సాంగత్య ఛందోపద్ధతి కుదాహరణము :—

సాత్యవతినే నుందు స్వర్గాన నేనుందు
నిత్యమ్ము ధరలోన నుందూ
అత్యంతాద్భుతమైన అమరాద్రియందుందు
సత్యమ్ము సర్వత్ర నుందూ

ఇందు, ఆహిరి, కాంభోజి, ఘంటారవమాళవి మొదలగు రాగములు ప్రయుక్తములైనవి. ద్విపదలు దరువులు కలవు. కంఠీరవరాజు కృతులలో నిదియె పెద్దకృతి—

## 2. పంచాయుధకల్లె.

ఇందు విష్ణుమూర్తి పంచాయుధములు కంఠీరవనృపతిని సంరక్షించునట్లుగా, నాయాపాత్ర నభినయించునట్లు రచితమైనది. ఇందు సంస్కృతశ్లోకములు హెచ్చుగా గలవు. ఇది సంస్కృతశ్లోకముతో ప్రారంభము.

## 3. లక్ష్మీవిలాసము.

ఇదియు నాదిని సంస్కృతశ్లోకము గలది. ఇందు మహాలక్ష్మి కంఠీరవరాజుసభను నృత్యమొనరించి యాశీర్వదించుట చెప్పఁబడినది.

ఇందు దరువు ద్విపద, వచనములు గలవు. ఈ క్రింది గేయముతో సమాప్తమైనది :

రాగం - సౌరాష్ట్ర.

కవితనిరంతర కనకవసంత
వలరిపువైభవ వాజికేవంత
వితరణరాధేయ వినయవిధేయ
శ్రుతిమహితోపాయ శోభనకాయ
రాజకంఠీరవ రాజాధిరాజ
రాజేంద్ర చిక దేవరాజతనూజ.

4. కలవాణీవిలాసము.

ఇందు కలవాణి యనువేశ్య కంఠీరవరాజునుచూచి మోహించు కథ చెప్పఁబడినది. ఇది తెలుఁగుపద్యముతో ప్రారంభము— ఆ పద్యమిది :

శ్రీకాంతారమణుండు భూమిమహిళా
చిత్తాభిరామోత్సవుం
డాకర్ణాంతవిలోచనుండు కమనీ
యాజానుబాహుద్వయుం
డీకంఠీరవ రాజచంద్రునికిదా
నీరంగపద్ధీవరుం
డాకల్పంబొన గూర్చు ధర్మములనే
కైశ్వర్య కీర్త్యాదులన్

5. నాట్యవిద్యావిలాసము.

ఇది నాట్యకర్త్రులు తమ తమ విశేషములను వివరించు కృతి. సంస్కృతశ్లోకముతో ప్రారంభము. ఇందు సంస్కృతభాగము హెచ్చుగా నున్నది. పద్యరచన తెనుగున నచ్చటచ్చటఁ గానవగును.

## 6. వసంతోత్సవ విలాసము.

ఇది ప్రశస్తమైన కృతి. పూర్వము నాచన సోమనాథ మహాకవి వసంతవిలాసమును వ్రాసినట్లు లక్షణగ్రంథములవలన తెలియుచున్నది. కాని గ్రంథము పూర్తిగ లభించలేదు. కంఠీరవరాజ కృతి పూర్తిగనున్నది.

ఇది.

శ్రీమత్పశ్చిమరంగ పట్టణపరే
భోగీంద్ర శయ్యాతలే
శ్రీభూమీకర పల్లవాశ్రితపదా
భోజశ్శయానోహరిః
అవ్యాదాశ్రిత పారిజాతమఖిల
క్షోణీంద్ర చూడామణిం
శ్రీకంఠీరవ భూమిపాల మనిశం
శ్రీదేవ రాజాత్మజం

అను శ్లోకముతో ప్రారంభము—దీని వెనుక నీరీతి నాందిచేసి సూత్రధారుండు తెరదిక్కుఁ జూచుటయు నటి వచ్చే క్రమం బెట్టు వలెనన.

రాగం - ఆహిరి.

వచ్చెను నటి వచ్చెను తమి
హెచ్చైన కంఠీరవేంద్రుని సమ్ముఖమున
ఆటలపాటల తేటలనలరిన
పాటలగంధి నెఱినీటుతో నదిగో.

వల్లవి

వచనం : వచ్చిన నటిని జూచి సూత్రధారుడు. వసంతోత్సవ విలాసంబు వినిపించవలె ననె. నటి, అయ్యా! ఆ వసంతవిలాసంబనే కృతికి కర్తయెవరు? అనుటయు సూత్రధారుం డిట్లనియె:

52

శ్రీసోమవంశాబ్ధిసితకిరణుఁడు మహా
దానధౌరేయుఁడు ధర్మపరుఁడు
అకళంకచారిత్రుఁ డమిత విక్రమశాలి
సకలవిద్యాభ్యాస చతురహృదయుఁ
డంగనాజనమనోహర రూపలావణ్యుఁ
డాత్రజన కల్పకావనిజుఁడు
రాజకంఠీరవ రాజేంద్రచంద్రుండు
చారు కారుణ్య విస్తారయశుఁడు

మధురమృదువాక్య సందర్భమగుచు నెగడి
నవరసాలంక్రియాకల్ప నములఁదనరి
లలితమైనవసంత విలాసమనెడి
నాట్యమేళానగతి ప్రబంధము రచించె.

ఆ వెనుక నటి వసంతసమయమును వర్ణించును. ఇందు రెండు ప్రాకృతగేయములు, నొక తెనుగుపదము గలదు.

గేయము :

సహియరము యుళబాణో
మషుయరన్నిణ దణుహసంకాసో
విరహియణ మణోమియసుం
మియమా శెల్లం కరయికదసో.

తెనుగున మెదుకుల కాంభోజి-ఆటతాళము

ఈవసంతము లింపాయె
భావించిచూడ బాగాయె
రీవితోరాజ కంఠీరవరాయఁ
డీవిధముల వింత లిటువలెనేయ,

పల్లవి

అలరువల్కుల క్రొవ్విరులు తేనెజాఱ
చెలరేగి యాసించి యలులందు జేరఁ
చెలువైన మావిడి చిగురాకుసార
ములమదించిన కోయిలల సొంపుమీఱ......

ఈకృతి కంఠీరవేంద్రుని సమ్ముఖమున ప్రదర్శించినట్లుగా తరు వాత భాగము చెప్పుచున్నది. దానిమొదలు. "ఆసమయంబున రాజ కంఠీరవేంద్రుడు కొలువై యుండు క్రమం బెటులన్నను" అని 22 పంక్తులలో కొలువు వర్ణనగలదు. అపుడు సూత్రధారుడు నటినిజూచి " రాజకంఠీరవేంద్రుఁడు రత్నసింహాసనా రూఢుఁడై నిండు కొలువై యున్నాఁడు. ఈసమయంబు వసంతోత్సవ విలాసంబను నాట్యప్రబం ధంబు వినుపించుటకు వేళ. ఇప్పుడందుకు తగినపాత్రలు ఎవ్వరంటే మల్లిక, మందారిక, మంజుభాషిణి, మధురవాహిని మొదలైన యంగనామణులు ముస్తీబై వచ్చునట్లు సేయుమనునప్పుడే వారు ముస్తీబై వచ్చు క్రమం బెట్లన్న.

"వచ్చెను మల్లిక వరుసతో నిదిగో
హెచ్చైన కంఠీరవేంద్రపరాకు."

దీనినిబట్టి తంజావూరి రంగమునందువలె మైసూరియందు నాటక శాలలో స్త్రీలు స్త్రీపాత్రలు ధరించి నాటకము లాడెడివారని తెలియు చున్నది. ఆ మల్లిక కంఠీరవేంద్రుని మోహించి చేపట్టుమని యీరీతిని ప్రార్థించును. దానితో కథ ముగియును.

ధ్రువతాళము

శ్రీకంఠీరవరాయ శ్రితజనరాధేయ
రాకేందుచంద్రికా రవళికితాళలేను
ఆ కౌముదిజారికి నలసితిచాల

### రూపకము

నిరతము నెమ్మది నిన్నే నమ్మినదాన
పరిపరిగా నన్ను భావించనేల
ఇరవుగా దయతో నన్నేలు కంఠీరవేంద్ర
ధరణీపురందర దానమందార

### ఝంపె

నీపొందు నెడబాసి నిముసమోరువఁజాల
రా పేలజేసి నను రచ్చబెట్టేవు
నీపాదమాన యిక నీ చెలిమి నే మాన
భూపకంఠీరవ శుభోదయవిశాల.

## —: కంఠీరవరాజుపదములు :—

### 1. రాగము భైరవి - త్రివడితాళము.

వారినిధిగంభీర, శారద
నీరదాశ్రిత హారరుచిర వి
హార, మనసిజవీర, శతగుణసార
వితరణశూర, ధర్మవిచార, కుజనవి
దూర, సరసోదార, సుజనాధార, వంశో
ద్ధార, లలితాకార, మైసురివీర
కంఠీరవేంద్ర జయ జయః
గానలోలఘనబుధజాల కవిజన
కలిత లీలా.

### పల్లవి

పందితాఖిలబృంద సుజనానందలసదర
విందపదకనదిందు బంధురవదనభాస్వర
కుందకుట్మల దంతసురవరనందివాహన
నందనప్రియకందళితకురువిందనఖకర
మందరాచలధైర్యసౌందర చంద్రకంఠీర

వేంద్ర జయ జయ.
రాజరాజ సమానభోగవి
రాజమాన మనోజభాసుర
రాజబింబ సమానజౌమర
వేజితామర రాజవిద్యా
భోజ మైసురి దేవభూపత
నూతనవకృతిన్నై జకవితాజాలకూజత
రాజకంఠీరవేంద్రని జయజయ.

2. రాగము ఘంటారవ - వడ్డిమత్య

కొమ్మ నీవదియేమే నాసామినీవెంత
కొదవగా యేంజేసే మే
ఈమహిని రాజ కంఠీరవేంద్రుని
యేమని తెలియలేను.

పల్లవి

ఆటపాటలవింత మాటలతేటల
అందచందములు గలిగినా
మీసైననీటు బలు జాటుపనుబోటుల
మిటుకులాకు లైనట్టి
పాటలగంధులు పదముమోవినగాని
పాన్పు జేర్చనినాడమ్మా
పాటపాడియైన పదుచులనెల్లా
పాటిజేసునకే ఓభామా.
ఏణాక్షి వినవె యిలలోవారికెల్ల
మొక్కైన రూపము.
జాణతనముమంచి జగిబిగితనమున
జగబిరుదందినట్టి
ప్రాణనాయకివేడుకొనినగానిసుమంత
ప్రావుచేయని వాడమ్మా

త్రాణము దెలియని తగినవారివలల
తగిలియుండేవాఁడేమో ఓ చెలియా
సఖగరిమ దెలిసిన ఘనగంభీరముగల
గుణవంతు డితఁడందు
నరపాల జనులలో నాడాడివాఁడంటే నను
బోడి నెంచఁదగునా
నిరతమై గూడియుండువాని మహిమ
నిజమై యెవరు దెలిసేరే
వీరరాజ కంఠీరవేంద్రుఁడు వేరిటి వలపులాడిని
నమ్మినా ఓ కొమ్మా.

3. రాగం ఘంటారవ – ఆటతాళము

అక్కరో ! వినవె యీవేళ వలపుజూడ
యెక్కడనుండి వచ్చెనే
సొక్కుపొడి జల్లెనో సొగసు కంఠీరవేంద్రుని

పల్లవి

అటుగాఁ జూచినవాని అలరుమోములందము
ఇటుజూడ వాని సీటు యింత హీనమై
ఎటుగాఁ జూచినవాని యేమనవచ్చునో యందు.
విటరాయని వగలు వింతవై చినటు నాఁటి
కనుబొమ్మ సన్నలోను కలికిరో రమ్మని
మొనగుబ్బలపై గోరు ముద్దుగానుంచి
అనవరతము నన్ను అంగజకేళినిగూడి
వినయమున కంఠీరవేంద్రు నున్నట్టి నున్నది.

4. రాగం ఘంటారవం – ఆటతాళం

కానిలేర చక్కని సామి కానిలేర
దానశూర కంఠీరవ ధరణిపాల యీలాగై తె

## పల్లవి

పడుచుదానవంటా నడిప్రాయాన నన్ను
జూడక విడిచి దానినే జేరున్న వివర మెఱుంగనా
వడియగట్టినదాన వసుమతి చంద్రావిను నా
జడనుజుట్టిన పూలు చెదరివేయకమా నేన
దురుసుమాటలాడి దూరి ముద్దు బెట్టబోయనంట
బిరుదువని తలచే బలిమి బిగుదందినదాన
బిరుసైనగుబ్బల బిగిసి చక్కిలి చక్కిలిగోరు
వరుసవరుసగా జూడక వరిది విడిచెనాఁడోరోరి
చక్కనైనయ్యా యేరా యిట్టి చచ్చనలాఁకనవచ్చి.
సొక్కించి సోలించి నన్ను సొబగుమీఱఁగ
మక్కువతో గూడినట్టి మైసురికంఠీరవేంద్ర
గ్రక్కున మోవి గంటుశాయకమా నేన

## 5. రాగం – అశోకవరాళి

ఏమే భామినీ ప్రేమము యెంతటిదో కానవమ్మా
కామకోటి రూప రాజకంఠీరవేంద్రునియందు
వలపులాడినీ చెలులు పిలిచినట్టివాని
పేరనికలసి బిలిచి నీలోనీవె తల వంచుకనుండే వేమి
అలవైనదినుదిటనీవు తిలకమున దిద్దినంటా
వలపులోకాని రూపు వన్నె మీఱ దిద్దేవేమె
ఆటపాడలాడేవేళ అందిపొంది యుండేవేళ
బోటిరో కంఠీరవేంద్రుని పొందియుండు భావమిదిగో

## 6. రాగం - తోడి

పదిరి నన్నంటి వచ్చేవేర
మొదటివలె గాదు చాలురా మోహనాకారా !

పల్లవి

కులుకు కుబ్బలాన వెయ్యారి గుమ్మనమారి
గురుతై యున్నదిరా కస్తూరి
అలదానివద్ద నీవు దూరిసారి
ఆటువంటి దినమున మైసూరికంఠీరవేంద్రు
కంటికంటిరా నీ మాయలెల్ల అమ్మనే జెల్ల
కల్లగాదు కామినివల్ల
వింటి వింటి వింటిరా నీమాట లెల్ల అల్ల
వెలఁదియుండే నీ ప్రేమమేల కంఠీరవేంద్రా
అనరానిమాటలాడే వేర అవురాచాలురా
అదే రా నీ కామేరవయ్యారా.
దినమున నేలు దాని భారమూర
దేవరాజేంద్రుని కుమార కంఠీరవేంద్ర.

7. రాగము - తోడి త్రివడి

వారివారి కిట వలచినవాడే
వీర కంఠీరవేంద్రుని వింతలుజూడే

పల్లవి

అలివేణి వినవె అల్లటు జూచెనేనివాని
చెలువైన చెక్కిలి జేరేది ఒకతె
అలరు నీమోవియున్న అమృతమేదిరా యని
వెలయు వంటి నొక్క వింతలాఁడి యొకతె
బారిగుబ్బల మొనల బలిమిరొమ్మున గ్రుమ్మి
బీరముతో జడను బిగిసి జుట్టుకొని
వేత నీకొకతె యేవెలఁది వలరాయని
యీరీతి గూడియున్న యింతినే నొకతె
బారాహు కురులను బాగుగా వై చుక
వారాసిగ పెట్టిన వయ్యారి ఒకతె.
వరా కంఠీరవేంద్ర! ఎవతె కోరినదనీ
గారుచేసే బలు గయ్యాళి యొకతె.

8. రాగము - ముఖారి

విన్నవించరో ఓయమ్మ
కన్నెరో యీ వగలెల్ల కంఠీరవేంద్రునితోన
విడిదికే వచ్చిన పొమ్మనదె నన్నిపుడు విడనాడెదె
విషమాయెగా నందుకోరాదా యింత జేసేదు

దుడుకు లేటికి నాతో వాద దూరుకొనెదే
కడుదుజేసేదే మరుదా కాని నేనేమిసాద
అల్లదని చెట్టబట్టికొంటి
బింకముతోన అటుజూచుకొంటి

మొల్లమొగ్గలవంటి పంటి మోవి యానుకొంటి
ఉల్లాసాన దానియింటనుండి వచ్చెదమాయంటి
గురిగా మైసూరి నేలునంటి
నిజతనంటి ఘన గుణవంతు కంటి

వీరకంఠీరవ వీరుడంటి వద్ద జేరుంటి
నిరతాన ననుగూడి నాడంటి
నే నమ్మియుంటి మెఱసివారనుంటి
మేరగాదని యంటి.

9. రాగము కాంభోది - తాళము నడ్డిమర్య

ఇపుడు జాణవైతివా చెలియా నీ
ఇపుడు జాణవైతివా
అపటిదినమున మఱచి నీవె
పైపయి వారి యందమై నుపరతి నమకేవేమొ

పల్లవి

ముద్దులాడిరో నీవు చిన్న ప్రాయమునాడు
ముద్దుగుమ్మలతో బొమ్మలపెండ్లిండ్లు చేయించి
కొద్దిగా సతిపతి నిద్దతినిగూర్చి కులుకుచు నీవుండగా
అద్దరిపాయనె నేను రాగా కనుగొని

అదరిబెదరి మోము వారజేసుకొంటి
వద్దనున్న చెలులమఱుగుదాగున్నట్టి
వలపులాడి వింతెగదవె నీవప్పుడు.

సామజయాన నాడు పాన్పుపై నేను
సరసమై నిదురమబ్బుగనున్న నాసన్న
ప్రేమతోనుపరతి దిద్దుకొమ్మనంటి భామనాప్రి
యుండగా నేమి జేసునోయని వారజేసుకొంటి
ఇంతిజోడునరీతి నీవు దెలుసుక
మోము వెల్లమఱుగునుంజొచ్చి మేలు మీఱి
ముదముతోడ ప్రక్క జేరి యుంటివే యప్పుడు
చెలియ చప్పడకాళ్ళ మంచముపైని చిక్కించి
అద్దముపై నీడ గనుగొని
తొలుత మదనకేళిలోని రీతింజూచి
తొయ్యలి భ్రమసి నీవు
నెలతగోనా సామి కంఠీరవేంద్రుండు
నేర్పిన నుపరతి జేర్చుకొన్నాడంటి
పలుమారద్దము బారజూపులచూచుక
పదరి చిఱునవ్వుతో నున్న దానవపుడు

'శ్రీ శ్రీ శ్రీ శ్రీశైల గురవే నమః అని వ్రాంతప్రతి చివరకలదు !''[1]

1. కీర్తిశేషులు శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు మైసూరి విశ్వవిద్యాలయమున నధ్యక్ష పురోధారులు (Pro-chanceller) గా నున్నప్పుడు, మైసూరిరాజులాంధ్రవాఙ్మయమున కొనర్చిన సేవనుగూర్చిన విశేషముల నన్వేషింపగోరిరి. అంతియేకాక, మైసూరు పరిపాలకులకు సంబంధించిన తెనుగు గ్రంథముల నన్నింటిని విశ్వవిద్యాలయము తరపుననే ముద్రితము గావించు నేర్పాటు చేయుదుమని నన్నా ప్రణాళికను తయారుచేయుమనికూడ కోరిరి. వారు యనుమతిని నేనెంతయో పరిశ్రమచేసి, పై నూతనవిషయములతో వారికా ప్రణాళికను చరిత్రను పంపితిని. వారు కీర్తిశేషులు కాగానే యాయుద్యమ మంతరించినట్లున్నది. అందలి క్రొత్త విషయములలో నిదియొకటి.

## —: బెంగుళూరునిర్మాత పెదకెంపరాయఁడు :—

## ‘ గంగాగౌరీ విలాసము ’

నేడు మైసూరి ప్రాంతమున, బెంగుళూరిని కట్టించిన “పెదకెంప గౌడు” పేరు విననివారరుదని చెప్పవచ్చును. ఈతని నిజనామము పెద్దకెంపరాయఁడు. కన్నడమున హిరియ కెంపరాయఁడు. గౌడ అను నది యీ వంశీయుల కంటఱకును నొక నాయకపదమును సూచించు బిరుదము. పెదకెంపరాయని పూర్వులు తెలుఁగువారు. కాంచీపుర ప్రాంతములనుండి మైసూరిరాజ్యముననున్న ‘ఆవటి’ యను గ్రామమునకు వచ్చి, యచ్చటనుండి, బెంగుళూరి కెనిమిది మైళ్లదూరముననున్న ఎలహంక అను ప్రాంతమున స్థిరపడిరి. అప్పటికి విజయనగర సామ్రాజ్యమేర్పడుటచే, నా ప్రభువులవలన నాడగౌడతనమును పొందిరి. అందుచేత నీ వంశీయులకు ‘గౌడ’ యను పదమును, ఎలహంక ప్రభువులను పదములును నియతముగా నుండఁ జొచ్చినవి.

వీరిలో క్రీ. శ. 1418 నుండి 1433 వఱకును ఎలహంకను పాలించిన జయగౌడయను నాతఁడు ప్రసిద్ధుఁడు. ఆతని కొమారుఁడు ‘గిద్దగౌడ’. గిద్దగౌడునకు పిల్లలు లేకపోవుటచేత, తమ యిలువేల్పగు [1] కెంపమ్మ నారాధించి, యొక కుమారుని గని యాతని కా దేవత పేరుతో ‘కెంపనంజగౌడ’ అని పేరుపెట్టెను. ఆ నాటినుండి ‘కెంప’ అను పేరే యీవంశీయులందఱికిని గలదు. కెంప నంజగౌడ, తన తండ్రి వెనుక క్రీ. శ. 1443 నుండి క్రీ. శ. 1513 వఱకును తన సంస్థానమును పాలించెను.

ఈ కెంప నంజగౌడ కుమారుడే పెద కెంపగౌడ. ఈతఁడు క్రీ. శ. 1513 నుండి 1569 వఱకు నేఁబదియాఱేండ్లవిచ్ఛిన్నముగా రాజ్యము పాలించినవాఁడు. ఈతఁడు కృష్ణదేవరాయలచేతను, నచ్యుత దేవరాయనిచేతను మన్ననలను పొందినాఁడు. ఈతఁడే క్రీ. శ. 1537లో

---

1. ‘కెంపమ్మ’ అనగా తెనుగులో ‘ఎఱ్ఱమ్మ’ అను దేవత.

బెంగుళూరు పట్టణమును నిర్మాణము చేసియున్నాఁడు. ఈతఁడే గంగా గౌరీవిలాస కృతికర్త.

బెంగుళూరు పట్టణము కట్టబడుటకు పూర్వ మీప్రాంతమునకు 'శివసముద్రము' అనిపేరు. తనరాజ్యము విస్తరించిన తరువాత రాజ ధానికొఱకై, శివసముద్ర గ్రామమునుండి బయలుదేరి, స్థలములు పరీ క్షించుచుండఁగా పదిమైళ్లు వెళ్ళిన వెనుక నొక స్థలమున నొకకుందేలు తనకుక్కను నడ్డగించుటచూచి. అదియే రాజధానికి తగిన స్థలమని యెంచి, కోటను నిర్మించెను. ఈ కోటకు నాలుగు బురుజులు కలవు. నాలుగు బురుజులు కోట పూర్తియై, సింహద్వారము కట్ట ప్రారంభిం పగా, నది సాయంకాలమువఱకు నిలిచియుండి, తెల్లవారినతోడనే పడిపోవుచుండెడిది. ఇట్లెన్నియో దినములు జరుగగా, కెంపరాయఁడు నిరుత్సాహుఁడై యుండఁగా, నొకనాఁడు, స్వప్నములో నాతనికి నరబలియిచ్చిన నిలుచునని యొక మహనీయుఁడు చెప్పెను. కెంప రాయఁడీ వృత్తాంతము తనవారితో తెలుపగా. నాతని కోడలు "లక్ష్మమ్మ" అను నామె తాను బలియగుదునని చెప్పెనట. కాని కెంపరాయఁ డందుల కంగీకరింపలేదు. తుద కామెయే, ఎవ్వరికి తెలియ కుండ, సింహద్వారమువద్దకుఁ బోయి, కంఠము నుత్తరించుకొని, యా రక్తముచే నాద్వారమును తడిపివైచినది. మఱునాఁడు సింహద్వారము నిలిచినది. కెంపరాయఁ డామెకు బెంగళూరుకు తూర్పున కోరమంగల మనుచోట దేవాలయమును కట్టించెను. అందునేటికిని నీమెపూజల నందుచున్నది.

తెనుఁగున 'లక్ష్మమ్మకథ' యని యొక పాట ప్రచారములో నున్నది. అది ముద్రితమైనది. దానిని చూడగా నందు పేర్కొనబడిన లక్ష్మమ్మ, చిరుమామిళ్ళవారి యాఁడుబడుచని కలదు. కావున నామె యీ లక్ష్మమ్మ కాదు.

ఈతఁడు బెంగుళూరు పట్టణము కట్టించి దాని నభివృద్ధిపఱచు టయే గాక, అనేకదేవాలయములను నగ్రహారములను కట్టించినవాఁడు.

గవిపురమున గంగాధీశ్వరాలయము కట్టించినవాఁడు. అందొక పెద్ద చెఱువు త్రవ్వించినాఁడు. దానికి తన కులదేవతయగు కెంపమ్మపేర "కెంపాంబుధి" అని పేరు పెట్టినాఁడు. నేటి బసవనగుడియందలి బసవేశ్వరుని ప్రతిష్ఠించి యాగుడి కట్టించిన బసవభక్తుఁడు కెంపరాయఁడే. ఆ గుడిచుట్టునున్న దొడ్డ విఘ్నేశ్వర, నందీశ్వర, ఆంజనేయ, మల్లికార్జున దేవాలయములన్నియు నీతఁడే కట్టించెను. అన్నింటికన్న ముఖ్యముగా పేర్కొనదగినది హల్సూరునందలి సోమేశ్వరాలయము.

హల్సూరునందలి దేవాలయ నిర్మాణమునుగూర్చిన కథ యిట్లు. అచ్చటనున్న సోమేశ్వరస్వామి కెంపరాయనికి కలలో కనబడి, యొక స్థలము త్రవ్వినచో నక్కడ ననేక సంఖ్యాకమైన ద్రవ్యము లభించుననియు దానితో నొక దేవాలయము కట్టింపుమనియుఁ జెప్పెను. తెల్లవాఱినతోడనే యచ్చట త్రవ్వింపఁగా, త్రవ్వ తండములుగా ధనమును, నొక లింగమును కాన్పించెను. ఆ ధనముతోడ నా దేవాలయమును కట్టించి, అందు సోమేశ్వరస్వామిని ప్రతిష్ఠించి కెంపరాయఁడాతని సేవించుచుండెను.

ఈ సోమేశ్వరునికే కెంపరాయఁడు తన గంగాగౌరీ విలాస యక్షగానము కృతి నిచ్చెను. గ్రంథాదిని.

శా. "శ్రీ గౌరీపతి చంద్రశేఖర సతీ చిత్తాబ్జగోలంబ స
న్నాగాధీశ్వరహార మారమథనా నాకేశసంసేవితా
యోగీంద్రార్చిత పాదపద్మ యుగళా యోషామయార్థాంగ...
......హిరియ కెంప నృపతిన్ రక్షించు సోమేశ్వరా!

క. సుకవులకు సారమై బహు
కుకవుల కెద శూలమై యకుంఠితధారై
చకిత చకిత వాద్యములై
వికసించును పెద్ద కెంప విభుసత్కృతుల్ !

క. గంగా గౌరి విలాసము
సంగతి పదపద్యములకు సరసతమీాఱన్
రంగద్భావములు చెలఁ
గంగా పెదకెంపరాయ ఘనుఁడొనరించున్.

క. తన ప్రాణేశుని వెదకుచు
వనితామణి గంగవచ్చు వైఖరియేలా
గన నెల్లనాఁడు నేఁడనఁ
గనుఁగొనవలె సకలజనులు కాంక్షరహింపన్

ఈ యక్షగానము పూర్తిగ లభింపలేదు. గ్రంథాంతమున నీ కంద పద్యమున్నది :

" అంగజుకేళిని మదియు
ప్పొంగగ రతికేలి సోలి బోఁటిరహిల్లన్
బంగారు గిండిపట్టుక
ముంగిటికిని వెడలె చాల మురిపెంబలరన్ "

ఇందలి కవితారచన తెలుపుటకు రెండు పద్యములను రెండు పదములను నిం దుదాహరించుచున్నాను.

" ఏనుమోములవాఁడు యిగురుపాయమువాఁడు
నెలబాసికమువాఁడు వలపుకాఁడు
చిలువ సొమ్ములవాఁడు తెలిమేను గలవాఁడు
నీలకంఠమువాఁడు నీటుకాఁడు
వేడికన్గలవాఁడు లేడిఁబట్టినవాఁడు
జగములేలెడువాఁడు జాలకాఁడు
జడలుమోసినవాఁడు వెడవిల్తు పగవాఁడు
చుట్టాలుగలవాఁడు సొగసుకాఁడు

మింటిసిగవాఁడు పెనుగొండ వింటివాఁడు
లీలహాసమువాఁడు నామేలువాఁడు
అలరునీ గుబ్బలకు నలువైనవాఁడు
అనిన గౌరితో చెలి వ్యంగ్యమనుచు బలికె”

“ పాయమందున పతినెడఁబాయుకన్న
పురుష దారిద్ర్యమున మదిఁ బొగులుకన్న
విరహవేదనచేఁ జిక్కి బొరలుకన్న
నీ శరీరము తృణముగా నెంచమేలు.”

గుమ్మ కాంభోది - ఏకతాళము.

కేల ముమ్మొన వాలు నీ
కేలనే వానిమీఁద మేలు
పూనెను తలపై నొకయన్న యట్టి
వానిపై నేలనేకన్ను
జడలలోన నెలవంక వాని
కడియాసలేలనె యింక
తెలిమేనిపైని విభూతి వాని
చెలువము నీకేమి బ్రాతి
అన్నింట కొఱగానివాఁడు ఓ
కన్నెరో నీ కీడుగాఁడు

కాంభోది - ఏకతాళము.

జాలిమాలి బొందితినె వాని
పాయజాలక కుందితినె
చాలుచాలు ఆడబుట్టు యిట్లైనమీఁద
బాలనా కేటి గుట్టు
గడియ యేడాదియైన గదవే వానిమా
విడిదికి తేగదవే
తలకెక్కె దానిమంచునే
నెంత పిలిచినరాఁడేమందు.

పెద కెంపరాయని పుత్రుఁడగు ఇమ్మడి కెంపరాయఁడు[1] బెంగుళూరున బల్లాపురపు పేటలోనున్న రంగనాథ దేవాలయమున వేయించిన యీ క్రింది తెలుఁగు శాసనమునుబట్టి వీరు తెలుఁగు వారని తెలియనగును.

స్వస్తి: శ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౫౪౮ అగు అనిమెడి ప్రభవ సంవత్సరముగను ౧౫ ఆలు శ్రీ మద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీరరామ దేవ రాయ మహారాయలయ్యవారు రత్నసింహాసనారూఢులై పృథివీ సామ్రాజ్యం జేయుచుండగాను ఆ సంన్నవకులైన ఎలహంకనాడు ప్రభువులైన కెంప నంజయగౌని[2]వారి పౌత్రులైన కెంప గౌనివారి పుత్రులైన యిమ్మడి కెంప గౌనయ్యవారు సద్ధర్మ ప్రతిపాలకులై సుఖరాజ్యం జేయుచుండగాను బెంగుళూరిపేటయందు సమస్తులు యొక్క రూపాంతరము.

సమయం తీర్చుకొనివచ్చిన స్వస్తి సమస్త నిజమహంకాళికా ప్రశస్త సమస్తులైన శ్రీ మద్గణేశ్వర గౌరీశ్వర వీరనారాయణదివ్య శ్రీపాదపద్మారాధకులైన అయ్యావళి ముఖ్యులైన స్వదేశ, పరదేశ ఉభయ నానాదేశం చాలు మూల సమస్త పెక్కండ్రు పెనుగొండ బెంగళూరు, చిక్కనాయనిపల్లె బల్లాపురం తాటిపర్తి అవలె, చంద్ర గిరి, కోలారు, కొత్తకోట, కావేరీపట్నం రాయకోటి శ్రీరంగపట్నం నరసీపురం బేలూరు హాబురు నాగమంగలం ఇక్కేరి బస్తిహాళ్ళి మొదలైన స్థల పరస్థల ఉభయ నానాదేశ చాలుమూల సమస్తలున్నూ బెంగుళూరు ముఖ్యలపేట రంగనాథస్వామి పడితరనై వేద్య తిరుతిరు నాళ్లు మొదలైన ధర్మాలకు కెంపగౌనయ్యవారికి మెఱుకచేసి యిచ్చిన మగముంపడి కన ౧ టెప ౧ టి అరవీసం లెఖను విడిచేస్తిమి. ఆచం ద్రార్క స్థాయిగా స్వామిపడితర నైవేద్య తిరుతిరునాళ్లు మొదలైన ధర్మాలు త్రికరణశుద్ధిగా సమర్పించిన దానపత్రశిలాశాసనం. తరు వాత "స్వదత్తాద్విగుణ పుణ్య"...ఇత్యాది శ్లోకములు.

1. Epigraphica Carnatica Vol. 9. Bangalore 1 Page. 179.

2. గౌని అనునది 'గౌడిని' అను శబ్దభవము.

దీని తరువాతిది తెలుగుదే 8 పంక్తులు మాత్రమున్నది. "యిమ్మడి కెంప గౌనయ్యవారికి ఆ చంద్రార్కము పుత్రపౌత్ర పారంపర్యము ధర్మం" అని కలదు.

ఈ కెంప గౌడి వంశీయులు క్రీ. శ. 1728 వఱకు బెంగుళూరి ప్రాంతమును పరిపాలించిరి. మైసూరి దొడ్డకృష్ణరాజు దళవాయి, దేవరాజయ్య వీరిలో చివరివాడగు ముమ్మడి కెంప వీరప్పను జయించి యీ రాజ్యములో నీనిని చేర్చెను.

ఈ వంశీయుల వృత్తాంతమును దెలుపు నొక తాళపత్ర పుస్తకమిటీవల లభించినది. అందులో మొదటి యాఱు పుటలు తెలుగు. తక్కినది కన్నడము (?) దీనినిబట్టి వీరు తెలుగువారనియు, రాజ్య వ్యవహారములు కన్నడ భాషలో చేయుచుండెడివారనియు తెలియఁ గలదు. వీరి వంశ వృత్తాంతము నాంగ్లేయ[1] భాషలోను, కన్నడములోను విపులముగా గలదు. వానినిబట్టియే నీ చరిత్ర వ్రాసితిని. గంగాగౌరీ శిలాసకర్త బెంగుళూరి నిర్మాతయగు కెంపరాయఁడే యిపట తెలుగువారికి ముదావహము.

## —: కళువె వీరరాజు :—

మైసూరిరాజులయొద్ద దళవాయులుగానుండి కవులై సంస్కృతాంధ్ర భాషాపోషకులైన వారిలో కళువె వీరరాజు కుటుంబ మొకటి. వీరు యాదవకులస్థులు. మైసూరిజిల్లాలో నంజనగూడు గ్రామమునకు నాలుగుమైళ్ల దూరముననున్న "కళులె" అను గ్రామము వీరి నివాస స్థానము. అందుచేతనే వీరి యింటిపేరు 'కళులె' వారైనది. కళులె యనునది సరియగుపేరు. జనవ్యవహారమున కళువె అయినది. వీరు

1. The Quarterly journal of the Mythic Society, Vol. XII. No. 4. July 1923.

The Kempa Gowda Chiefs by B. Puttaiya Esq, B. A. (Pages 723-741).

ఋగ్వేదులు, ఆశ్వలాయనసూత్రులు, భారద్వాజసగోత్రులు. ఈ వంశమున మొదట దొడ్డరాజు జన్మించెను. వీరి వంశవృక్షము.




పై వారిలో మొదట దొడ్డరాజు చిక్కదేవరాయల (1671-1704) దళవాయి యయ్యెను. ఆతని వెనుక నాతని కుమారుడును, కవియు గ్రంథకర్తయునగు వీరరాజు సైన్యాధికారి యయ్యెను. ఈతడు మహాపరాక్రమవంతుడై మహారాష్ట్రవీరులను పాఱద్రోలి యనేక దుర్గములనుగొని, చిక్కదేవరాయల వెనుక రాజులకాలములో క్రీ. శ. 1724 వఱకు నుండెను. ఈతని వెనుక మొదటి కుమారుడగు దేవరాజు సైన్యాధిపత్యము వహించి క్రీ. శ. 1732 వఱకు నిర్వహించెను. ఆతని వెనుక ప్రసిద్ధ గ్రంథకర్తయగు నంజరాజు క్రీ. 1759 వఱకును సర్వాధికారియై విలసిల్లెను.

వీరరాజు రచించిన కృతులలో వచనభారతములో ఆది, సభా, భీష్మపర్వములు మనకు లభ్యము లగుచున్నవి. వీనిలో ఆదిపర్వమున నూటనలువది మూడవ యధ్యాయము తరువాతిభాగము లభ్యము కాలేదు. సభాపర్వముపూర్తిగా లభ్యమైనది. అందు 120 యధ్యాయములు గలవు. భీష్మపర్వముకూడ సంపూర్ణముగ 117 యధ్యాయములలో మనకు లభించినది. అందు 'భగవద్గీత'కూడ గలదు. దీనినిబట్టి చూడగా వీరరాజ కవి మహాభారత గ్రంథమునంతటికి వచనానువాదము చేయ సంకల్పించినట్లు కానవచ్చుచున్నది. ఈతడు తనకుతోడుగా తుపాకుల యనంత భూపాలుడను చెంజిదుర్గపరిపాలకుని చేకొని యీ రచనను నిర్వహించినట్లుగా సభాపర్వాధ్యాయాంతముల యందలి గద్యలు

తెలుపుచున్నవి. ఇది క్రీ. శ. 1730 లో రచితమైనట్లుగ నాగద్యలపై నుండు నీక్రింది పద్యమువలన తెలియనగును.

సీ. వెయ్యిన్నియేఁబ్భైన్నాట వెలయు యేంబది రెంటి
మీఁదటి శకవర్ష మెలమినడుచు
వరుస సాధారణవత్సరంబున మాఘ
శుద్ధపంచమియందు శుభదినంబు
వరుసందనర దళవాయి దొడ్డేంద్రుని
సుతుండు వీరేంద్రుండు సుకవినుతుండు
వచనభారతమందు వైఖరినీ సభా
పర్వంబు రచియించె (ప్రతిభ) మీఱ

గీ. ధరణిమీఁదను చంద్రార్క తారకముగ
నలరుంగావుత లోకవిఖ్యాతిగాను
సరసులెల్లను వేడుకం జదువువేళం
దప్పులున్నను దిద్దండి దయనుమీఱ.

మ. .........వివిధ క్రీడానిరూఢాల............
.........సన్మానసపద్మ; పద్మహితవేణీ హల్లకేంద్రాది ది
క్పతిచూడామణి జాలజాల పదరాడ్గంధర్వ...సం
స్తుత మీనాద్యవతారతారక విధుర్ధ్యోరశ్న నేత్రద్వయీ.

క. సందకుమారక మునిరాట్
బృందారక వినుతహృదయ పీఠ? వాసా
నందధురందర వాసవ
నందన సారథ్య కల్పనాసిశరధ్యా.

స్రగ్విణి. మిత్ర విందాకుచా మేయ కస్తూరికా
పత్రచిహ్న ద్విరేఫస్ఫురత్కౌస్తుభా
కృత్తి మాంభోరుహాక్ష ప్తిభాభాగుర
శ్చిత్ర శాసారకా సేవకోద్ధారకా.

వీరరాజుగద్యః ఇది శ్రీరామచంద్ర చరణారవింద సేవాభినందన వరప్రసా
దాసాదిత గీర్వాణాంధ్ర కర్ణాటకాది నానాభాషా కావ్యరచనా
చతుర, శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వరరాజ మార్తాండ
ప్రౌఢ ప్రతాప ప్రతిమ వీరనరపతి బిరుదెంతెంబరగండ
బిరుదాంకిత శంఖచక్రమకర మత్స్యహనూమద్గరుడ గండ
భేరుండ సింహశరభసాళ్వాది నానావిధ దేవార్హ ధ్వజాంకిత,
యాదవవంశాబ్ధితిలక, అంగ వంగ కళింగ కాశ్మీర లాటమరాట
ద్రావిడాది నానాదేశాధీశ్వర కిరీటకోటి సంఘటన ప్రస్తరత్న
పరాగపరాగిత నిజభవనద్వారా సక్తానేక భూపాలఫాలతలఘటి
తాంజలి పుంజ రంజితారవిందాంక రామాయణ సభాస్థానస్థ రత్న
సింహాసనాధిరూఢ నానావిద్వదభీష్ట వరప్రదానరాజ చికదేవ
రాజ కరుణాప్రాప్త కర్ణాటరాజ్యలక్ష్మీ నృత్యరంగాయమాన,
శ్రీరంగపట్టణ పరిపాలనార్థాదృత సైన్యానిపత్య నిర్వాహక,
మహారాష్ట్రీమదేభపంచానన, కెళదివంశదావాహన, మధురా
నాథమర్దన, జయజయఘాటీశిరః కందుకక్రీడన, వసంతరాయ
నాసాకృంతన, నిమ్మాజీవ మూలోన్మూలన, దాదోజీదండన
ప్రతాపశిలవిరల పాలెరాయవిదళన, అంతర్బాహ్యాది శత్రు
సంఘస్య మేఘజంఝానిల, పరరాజాంధకారవిదళన, దినరాజ
దళవాయిదొడ్డ రాజతనూజ, యాచకసురభూజ, భుజబలాటోప
పరాజితతాతి రాజన్య సమర్పితానేక రత్నరాశీకృత ధన
కనక వస్తువాహన సంతోషితాఖిల భూసురాశీర్వాదానువర్ధిత
పుత్రపౌత్రాది వంశాభివృద్ధి, విరాజమాన కళువె వంశాబ్ధిరాకా
నిశాకరాశ్వలాయన సూత్రపరమపవిత్ర భారద్వాజగోత్ర పరి
పాలన ఆసేతుశీతాచల మధ్యవర్తికాశీప్రభృతి పుణ్యక్షేత్ర
నిత్యాన్నదాన వినోదదాన క్షేత్రాధీశ్వర విభిన్న క్షేత్రగ్రహ
రామాది సంతోషిత కవిరాజ వీరరాజ ప్రణీతంబైన శ్రీమన్మహా
భారతవచన కావ్యంబునందు సభాపర్వము సంపూర్ణము.

అనంతభూపాలునిగద్య : ఇది శ్రీనందనందన చరణారవింద సేవానుభావ భావితసారసారస్వత శాశ్వతైశ్వర్యధుర్య, మేరునగ సమాన ధైర్య, సమాసాదిత నిమతవాహినీ సమాక్రాంత దక్షిణసింహాసన సముద్ధారణాధురంధర, విరోధినృపతి రాజధానీ సమానీత గంధసింధుర, గోసహస్ర కనకతులాదిమహాదాన, నానావిధసంతాన నిస్తంద్రకీర్తి చంద్రికాధవళిత దిశాంతరాళ గడిమన్నియవిభాళ సేతుశీతాచలమధ్య భూతలాయాంతక, విబుధచాతక వ్రాత కౌతుకహేతు కనకధారాభిషేక, వినతపర్జన్య వినుత సౌజన్య నిఖిలపురాణేతిహాసకథాను సంధాన సంవిధాన నిరుపమాన విజ్ఞాన, సాంద్రవచన మాధురీగరిమాధరీకృతసమాన, కవేర కన్యానదీతీర, ప్రతిష్ఠాపిత, నిస్తులవస్తు సమగ్రానేకాగ్రహార సంతోషిత, మనీషి జనసంతతాశీర్వాద ముదిత సముదగ్ర వైభవ, చంద్రగిరి కృష్ణ నృపతనూభవ, హనుమద్ధ్వజ బిరుద ప్రకాశిత, నిజభుజాబల భాగమాంబాగర్భశుక్తి ముక్తాఫల సౌందర్య నిర్జిత నలకూబర నలజయంత, తుపాకుల యనంతసుమతీకాంత ప్రణీతంబైన శ్రీమహాభారతవచనకావ్యంబునందు సభాపర్వము.

—— :సభాపర్వమునుండి యుదాహృతము :——

“ఇంతటి మహానుభావులగు రాజులుండ రాజార్హంబులగు పూజలకు రాజభావరహితుండగు గోవిందుండెవ్విధంబున నర్హుండగు? మైత్రి వాటించి గదా యాదవునికిం గావించితిరి ఇది పాండుపుత్రులగు మీకు నుచితంబగు. మీరు బాలురుగావున ధర్మసూక్ష్మం బెఱుంగరైతిరి. ఈశాంతనవుండు నల్పబుద్ధియును, వృద్ధుండును నగుటం జేసి కృష్ణుండు మీకుం జెలికాండనియును నతని నర్చించుట మీకుం బ్రియంబనియును వివరించెంగాని రాజధర్మం బెఱింగి తెలుపలేండయ్యె. ఇతండు వయోవృద్ధుండని పూజించితిరేని, వసుదేవుండుండ నతని పుత్రుండగు నితండెట్లు పూజార్హుండగు? కాక మిత్రమహత్వంబువలన నితండు

పూజ్యుండని తలంచితివేని, నిఖిల గుణగరిష్ఠుండగు ద్రుపదునిం బూజింపరాదే? గురువని తలంచితివేని యాచార్యుండగు ద్రోణుం డుండ కృష్ణుండు పూజనీయుండగు టెట్లు? లేక ఋత్విజుండని విచారించితివేని, బ్రహ్మనిష్ఠుండగు సాత్యవతేయుండు లేండయ్యెనె? స్వచ్ఛందమరణుండును, వృద్ధుండును గురుశ్రేష్ఠుండునునగు శంతనునందనుండుండ నితని నెవ్విధంబున నర్చించితివి? మఱియును భరతవంశంబునకుం జాపవిద్యాగురుండగు కృపాచార్యుండును, నిఖిల శస్త్రాస్త్ర విశారదుండగు నశ్వత్థామయును, గింపురుషాచార్యుండగు ద్రుముండును, ధనుర్విద్యాకౌశలంబున బరాక్రమంబున ధనంజయ సమానుండునునగు నేకలవ్యుండును, బటుశౌర్యధుర్యుండగు కృపాచార్యుండును, భగదత్తుండును, రాజ్యాధీశ్వరుండగు జయత్సేనుండును, గిరిధురంధరుండగు కాళింగుండును, బూర్వకోసలేశ్వరుండగు బృహద్బలుండును, మహావీరుండగు విరాటుండును, శూరాగ్రేసరుండగు దరదుండును, వైరినుస్సహుండగు భీష్మకుండును, బాండ్యభూవల్లభుండగు కృతధన్వుండును, రాజశ్రేష్ఠుండగు రుక్మియును, మహారాజేశ్వరుండగు దంతవక్రుండును, మద్రదేశాధ్యక్షుండగు శల్యుండును, వీరుండగు సురాష్ట్రాధిపతియును, గంధర్వసమానుండగు మాళవుండును, సుజ్ఞానశీలుండగు వైదేహుండును నను మహాత్ములగు వీరలిందఱు నిటుండ నీ గోపాలబాలుండు నీకునర్చనీయుండయ్యెనె? మఱియును పరశురామ ప్రియశిష్యుండును, భుజాబలశాలియును, వినిర్జితజరాసంధుండును నగు కర్ణుండును, నవంతి దేశాధీశ్వరులగు విందానువిందులును, గాంభోజపతియగు సుదక్షుణుండును, రాజేంద్రుండగు సాల్వుండును, నర్జునసఖుండగు గంధర్వనాయకుండును నగు చిత్రరథుండును, నతిరథశ్రేష్ఠులును, కురువంశ దీపకులునునగు బాహ్లీక సోమదత్త భూరిశ్రవులును, సుబలనందనుండగు శకునియును, మహాబలుండగు సైంధవుండును, నిజతేజో విజృంభణంబునం బ్రకాశింపుచునుండ వీరల నిరాకరించి కృష్ణుని పూజించితివేమిటికి? లోకంబున ఋత్విజుండును, నాచార్యుండును, మూర్ధాభిషిక్తుండును, స్నాతకుండును, జామాతయును

వీరలలో నొక్కరుండునుగాని యితని నెవ్విధంబునం బూజించితివి? లేక మైత్రివలన బూజించితినంటివేని మహానుభావులగు నీరాజవర్యుల రప్పించి యవమానంబు గావించుట యుక్తంబగునె! ఇట్టి నీవు కప్పం బేటికి నొసంగితని యడిగితేని జెప్పెద. ధర్మప్రధానుండగు నీధర్మ నందనునగుం బార్థివత్వంబు గలుగవలయునని యిచ్చితిమి గాని భయంబునకేనియు, లోభంబునకేనియు, నిచ్ఛకంబునకేనియు నిచ్చిన వారము కాము. అట్లయ్యును మమ్ముంగణింపక యవమానించెదవు. పూజార్హలక్షణంబులలో నొక్కటియును లేని హీనునికి సపర్య గావిం చుటంజేసి మాకు నింతకంటె వేఱ యవమానంబునుం గలదె? కట కటా! ధర్మపుత్రుండు ధర్మాత్ముండనియెడి వచనంబు నిష్కారణంబుగా జనియె. తాను వృష్టికులంబునంజనించి మూర్ధాభిషిక్తుండగు కంసుని జంపె. ఇట్టి దురాత్ముని లోకంబున నెవ్వండేనియుం బూజించునె? ఈ యాదవునిం బూజించుటవలన నీకంటె సధర్మ పురుషుండునుం గలండె? అని పలికి మాధవునుద్దేశించి, పాండవులు దీనులును, భీతులును నగుటంజేసి నిన్నుం బూజించిన మహాకులసంభవులగు రాజుల మధ్యంబున నీకునర్హంబుగాని పూజ నెవ్విధంబున గైకొంటివి? అగ్ర పూజం గైకొంటినని యింత మాత్రంబున గర్వింపకుము. నిర్జనంబగు స్థానంబుననున్న దేవార్హంబగు నన్నంబు శునకంబు గైకొనిన దానికి నది ప్రతిష్ఠాకరంబగునె? ధర్మనందనుండు రాజుల నవమానించి నిన్నుం బూజించెనని తలంపకుము. ఇతనికిం బూజకునెంతో దూరంబని కౌరవు లెల్లను నిన్నే పరిహసించెదరు. మహారాజయోగ్యంబగు పూజ రాజ రాజకులసంభవుండవుగాని నీకు నొసంగుట నపుంసకునికిం గన్య నొసం గిన తెఱంగును, నంధకునికిం జిత్తరువుచూపిన మార్గంబును నయ్యెనని రాజలోకంబు నవలోకించి, యిట్టి వివేకసంపన్నులగు గాంగేయ కాంతేయ యాదవులం గనుగొంటిమి. ఇంతియ చాలు, పదివేలని పరమాసనంబుననుండి దిగ్గన లేచి నిజబంధు సమేతంబుగ సభాస్థానంబు వెలువడియె.''

ఈభాగమును నన్నయభట్ట భారతానువాదముతోఁ బోల్చిన వీరరాజకవి సంస్కృతమునే సరిగా ననుసరించెనని తెలియఁగలదు.

## —:భీష్మపర్వము :—

కళువె వీరరాజకృతమగు నీ భీష్మపర్వమునందు 117 అధ్యాయములు గలవు. ఇందలి విశేషమేమనగా సంస్కృతాంధ్రములలో మూలమందుకూడ కన్పట్టని భగవద్గీత యిందు 23–40 అధ్యాయములలో కన్పట్టుచున్నది. పదునెనిమిది యధ్యాయములకు సరియగు వచనముగలదు. ఈభీష్మపర్వ గద్యలయందు వీరరాజుగద్యలతో భారతమున గన్పట్టుచున్న తుపాకుల యనంతభూపాలుని గద్య కానవచ్చుటలేదు. భగవద్గీత పారాయణగ్రంథము కాబట్టి దానిని వేఱుగా ప్రతులావశ్యకములయ్యెను. అట్లు వేఱుగా లభ్యములైన ప్రతులయందు వీరరాజుగద్యకు మాఱుగా తుపాకుల యనంత భూపాలుని గద్యయే కలదు.

1 ఇది శ్రీమదుభయభాషాకవిత్వఫణీంద్ర చంద్రగిరి కృష్ణనరేంద్ర తపఃఫలసంజాత కుమారచంద్ర విమల యశోవిశాల తుపాకుల యనంతభూపాలప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతా వచనంబునందు సర్వంబు నేకాశ్వాసము.

ఈగద్య వెనుక క్రిందింది రెండుపద్యములు గన్పట్టుచున్నవి :

ఉ. నీలద నీరగాత్ర రజనీచరగర్వ విభేదనక్రియా
ధార చతుర్భుజాన్విత సుదర్శనశంఖగదాబ్జ సర్వబృం
దారక బృందవందిత పదద్వయ దివ్యకిరీటహారకే
యూర విభూషితాంగ సుగుణోన్నత సన్ముని జాలసన్నుతా.

1. ఈ భగవద్గీత వచనము క్రీ. శ. 1907 లో మదరాసులో ముద్రితమైనది. దీనిని తిరిగి క్రీ. శ. 1934 లో ఎలమంచిలి గీతాసమాజమువారి పక్షమున ప్రసిద్ధ వైజ్ఞానికులు శ్రీ గొబ్బూరి వేంకటానంద రాఘవరావుగారు ముద్రించి, ప్రకటించిరి ముద్రితగ్రంథములలో పై గద్యగలదు.

క. వారిధి కన్యాకుచకుం
భోరుపరీరంభ జృంభణోజ్జ్వలముక్తా
హారాంచిత వక్షస్థల
శ్రీరమ్య కృపాలవాల శ్రీగోపాలా !

ఈరెండుపద్యములు చూడగా నీ భగవద్గీతయు తక్కిన పర్వములవలె, వీరరాజును, అనంతభూపాలుఁడును కలిసియే రచించినట్లేర్పడుచున్నది. ఏలయనగా వీరరాజ కృతులన్నియు శ్రీగోపాలాంకితములు. వీరరాజకృత భీష్మపర్వ ప్రతియందలి భగవద్గీతకు ముందుగాను వెనుకను గోపాలాంకితముగా నీక్రింది పద్యములు గలవు:

క. శ్రీరమణీ హృదయప్రియ
సారసపత్రాయతాక్ష సకలాధ్యక్షా
భూరికరుణా విలాసా
శ్రీరాజితసుగుణజాల శ్రీగోపాలా.

మాలిని. దివిజనగరపాలా ! దివ్యకౌశేయచేలా
సవనభరణదక్షా ! సాధితారాతి పక్షా
ప్రవిమలగుణధుర్యా ! పావనామేయచర్యా
నవజలధరనీలా ! నందగోపాలబాలా !

దీనినిబట్టి భగవద్గీత ప్రత్యేకముగ వేఱుపఱచి వ్రాసినలేఖకులు తుపాకుల యనంతభూపాలుని గద్య మాత్రమే వ్రాసిరనియు, నదియే ముద్రణముల కెక్కినదనియు, ప్రస్తుతము ముద్రితమైన భగవద్గీత యిరువురి కృతమనియు నిశ్చయముగ చెప్పనొప్పను.

ఈ భీష్మపర్వశైలి, సభాపర్వశైలికన్న మిన్నగనున్నది. వీరరాజు మహావీరుడగుటవలన, భీష్మపర్వశైలి విశిష్టమై వెలయుచున్నది. భగవద్గీత వేదాంతగ్రంథము గావున నందలి గంభీరవిషయములు ప్రజలకు సుగ్రాహ్యమగురీతిని వీరరాజు రచియించియున్నాఁడు. ఉదాహరణముకొఱకు రెండు గ్రంథభాగములనుండి కొన్ని పంక్తులు నిచ్చుచున్నాను.

భగవద్గీత :—ఎవ్వరు సర్వజ్ఞత్వాదిగుణంబులు గలిగి యీశ్వరుండైన నాయందు మనంబు నిలిపి నిత్యధ్యానయుక్తులై శ్రద్ధావంతులైన న న్నుపాసింపుదురు వారలు యోగిశ్రేష్ఠులు. ఎవ్వరేనియు నింద్రియంబుల నిగ్రహించి శత్రుమిత్ర మధ్యస్థులయెడ, సర్వభూతహితులై, అక్షరంబును ననిర్దేశంబును, అవ్యక్తంబును, సర్వగతంబును, నచలంబును, ధ్రువుండగు పరబ్రహ్మంబు నుపాసింపుదురు వారు నన్నె జెందుదురు.

—పండ్రెండవ యధ్యాయము.

1భీష్మపర్వము:-అంత నారాత్రి ధర్మజుండు, తమ్ములుం దానును, నాప్తులగు మహీపాలకులతోడం గూడి, జనార్దనుని పాలికిం జని, పరాక్రమంబును, తమ పరాజయంబును దలంచి పొగులుచు నతనిం జూచి రాజీవాక్ష ! నేడు సురనదీనందనుండు రణంబున విజృంభించుట గనుగొంటివె. ఆతండు గ్రీష్మసమయంబునం బేరడవి నేర్చు కార్చిచ్చు విధంబున విజృంభించి మన బలంబులనెల్ల నిశితవిశిఖంబులచే సమయింపం దొడంగె. చాపంబనియెడి వక్త్రంబుచే భయంకరంబగు నా భీష్మశార్దూలమునుం గనుగొనిన యంతనే మనసైన్యంబులెల్ల దిక్కులు బట్టి బఱచుచున్నయది. వజ్రపాణియగు మహేంద్రుడునైనం బాశహస్తుండగు వరుణుడునైనం గదాదండధారులగు వైశ్రవణ వైవస్వతులనైనం గెలువం దరంబగు నింతియకాని మహాబలుండగు నతని గెలువం దరంబు గాదు.

—45 అధ్యాయము.

—: ఆదిపర్వము వచనము :—

ఈ పర్వమునందలి వచనరచన మచ్చునకు నీ క్రింది భాగము నుదాహరించుచున్నాడను. ఇది ముద్రితము కాలేదు.

---

1. మహాభారతము, భీష్మపర్వము. సాధనముద్రాశాల. అనంతపురము 1936 శ్రీ యస్. కె. వెంకటేశమూర్తులుగారు సంపాదకులు పుటలు. 374.

"కుమారకా! యేను జాత్యంధుండయినను పాండుభూపాలుండు నన్ను మిగులం బూజించె. అది యెట్లంటేని లోచనంబులు లేమిం జేసి పరదళంబుల మొగ్గరంబులు పన్ని యగ్గలికమెఱయ గెలువంజాల; స్వరాష్ట్ర పరిపాలనంబున కసమర్థుండ; సాంగంబులుగ వేదంబులును రాజనీతి శాస్త్రంబులు నధికరించితి. ఎంత యతికరించిన నేమి ప్రయోజనంబు? క్షత్రియుండగువాండు ధర్మమార్గంబు దప్పక సమరంబు గావించి హతుండయ్యేనేని స్వర్గంబునకరుగు జయించినం గీర్తియును భూమియుంబడయుం గావున నా యుద్ధోపజీవుల కాయోధనంబవశ్య కర్తవ్యంబు. అట్లు గెలిచి పుత్రులయెడ నైశ్వర్యంబు నిలిపి వనవాసంబున కరుగవలయు. ధర్మపౌరుష ప్రభావంబుల వారలధికులై యున్నయెడ వారల నెట్లునగరంబు వెలువరింపించి వారణావతంబున కుంబనుపువాండ నట్లుపనిచినను లోకంబునం గల జనులు నిందింపకుందురె?

(ఆదిపర్వము 139 అధ్యాయము. K 4-2 పుట 421.)

ఇందలి రచనలలో, నేను, శబ్దమునకు తాను, పలుకరించు మొదలగు క్రియలు. తత్సన క్రియలకు శత్రర్థకమున నింపుగాగమము, అహమదర్థకమగు తచ్ఛబ్దమునకు 'వాటిని' ప్రయోగము, మొదలు ప్రయోగసరళి గలదు.

చూడుండు. ప్రాచీనాంధ్ర వచనకావ్యములు. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. 2 సంచిక. మీంగడతఱకలు (పుట 49-78.)
కీ. శే. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు.

పై నుదాహరించిన వానినిబట్టి వీరరాజకవి రచనయందలి గుణములను గ్రహింపనగును.

(1) వీరరాజు వ్యాసభారతము నే యనుసరించి, యందలి యధ్యాయములకు సరిగా తెనుంగున నాధ్యాయములుగానే విభాగించి రచించెను. కావున కవిత్రయభారతము ననుసరింపలేదు.

(2) ఇందలి వచనశైలియు, గంభీరమై, మాతంగగమనము గలిగియున్నది.

(3) శైలి చాలవఱకు సంస్కృతపద జటిలమైనను, తెనుఁగు భాషాసంప్రదాయము లెఱిగినవాడగుటచే కవి వ్రాసినది తెనుగు వచన మనిపింపఁ జేసెను.

(4) వీరరాజువర్ణనలు చేయుటయందు మిగుల నైపుణ్యము గలవాఁడు. అందును యుద్ధవర్ణనల కీతఁడు పెట్టినదిపేరు. తాను స్వయముగా మహాపరాక్రమవంతుఁడై, సైన్యాధిపత్యము వహించి, యనేక యుద్ధములయందనుభవముగలవాడగుటచేత, యుద్ధవర్ణనయం దీతడు విసువుపుట్టింపక యుద్ధము కన్నులకు కట్టినట్లు వర్ణించును.

(5) ఈతఁడు తన మాతృదేశమైన మైసూరి సీమయందు మహాభిమానము గలవాఁడు. సభాపర్వములో మూలమున రెండుచోట్ల 'మాహిష్మతి' అనగా మైసూరిప్రదేశముయొక్క సూచన మాత్రమేయుండగా నాస్థలమున తెనుగులో తన కాలములో మైసూరిసీమ యెట్లున్నదో యతి విపులముగా వర్ణించినాఁడు.

(6) ఈతఁడు వచన రచయితయేకాక, కవియునైనట్లుగా నాశ్వాసాద్యంతముల నీతఁడు రచించిన పద్యములే తెలుపుచున్నవి.

తెనుగున వచన రచయితలలో వీరరాజునకు విశిష్టస్థానము గలదు.

---

1. సభాపర్వమును తొలుత క్రీ. శ. 1928 లో ముద్రించి, కీ. శే. యస్. కె. వెంకటేశముపంతులుగారు విపులమగు నాంగ్లపీఠికతో వెలయించిరి. నేఁడాంధ్ర వచనవాఙ్మయమున వీరరాజుయొక్క విశిష్టస్థానము నెఱుకపఱచుటకు వేంకటేశము పంతులుగారి యమోఘకృషియే కారణము. వీరి కాంధ్రవిద్వల్లోక మెంతయు కృతజ్ఞతాబద్ధమై యున్నది.

## —: నంజరాజు :—

వీరరాజ పుత్రుఁడగు నంజరాజు తండ్రినిమించిన కుమారుఁడు. ఈతఁడు సర్వాధికారియై రెండుదశాబ్దులు మైసూరినేలెనని చెప్పవచ్చును ఇతఁడు సంస్కృత కర్ణాటాంధ్ర భాషలలో కవి, పండితుఁడు. కృతికర్త, కృతిభర్త. ఆలూరి నరసింహకవి విరచితమైన నంజరాజ యశోభూషణ మను సంస్కృతాలంకార శాస్త్రమున కీతఁడు నాయకుఁడు. ఆ గ్రంథ మున నీతఁడు గీర్వాణాంధ్రకర్ణాటకాది నానాభాషావిశేష కావ్యరచనా చాతురీధురీణుఁడనియు, నవభోజరాజనియు ప్రశంసింపబడినాఁడు. ఈతని తెనుఁగు గ్రంథములు రెండు మనకు లభ్యమగుచున్నవి. రెండును నముద్రితములే.

## —: హాలాస్య మాహాత్మ్యము :—

ఇది మధురయందలి మీనాక్షీసుందరేశ్వరుల లీలలను దెల్పు డెబ్బదిరెండధ్యాయముల గ్రంథము. తండ్రి వీరరాజువలెనే కృత్యాది యందును నాధ్యాయాద్యంతంబుల యందును పద్యములు గలవు. ఇందలి శైలికి కొన్నిపంక్తు లుదాహరించుచున్నాను.

వ॥ రూపలావణ్య భాగ్యమువల్లనో, యనువైన గోత్రంబుగల వాండనియో విద్యంజూచియో, సుందరేశ్వరుండను బుద్ధిచేతనో, పెక భ్రాంతిచేతనో నేండు నేను బిడ్డనిచ్చుట యనుచుంబలికి, యాబ్రహ్మ చారిం గులగోత్రంబుల నడుగ నతండు తనగోత్రంబును సూత్రంబును నక్షత్రంబును నూర్ధ్వపుండ్రంబును గ్రమంబుగా విస్మితుండై యెఱిం గించుటయు నబ్బాంధవులు కులగోత్ర వ్యత్యాసంబులు లేకుండుటకు సంతసించి, యూర్ధ్వపుండ్రధారణంబున కొక్కింత భేదంబుండెంది యనేకమ్ములగు గుణమ్ముల యందొక దోషంబు గలిగి యుండినంగాని యడంగునని నిశ్చయించినవారై వివాహంబు లొనరింప నవ్విరూపాక్షుం డైశ్వర్యయుక్తుండగుటంజేసి పుత్రికకధికంబుగా ద్రవ్యం బొసంగ నయ్యుర్వీసురనందనుండు సంతుష్టుండై యాధనంబంతయుం గైకొని

పత్నీసమేతంబుగా పెక్కండ్రు బంధువులతోడం గూడికొనియున్న తల్లి దండ్రుల సమీపంబునకుం జనుదేర దేశాంతరంబున కరిగి వివాహంబుచేసికొని భార్యతోడం జనుదెంచిన కుమారునిం గాంచి తండ్రియుం బాంధవులు నత్యంత సంతోషంబునం బెనగిరి.

—29 అధ్యాయమునుండి.

ఇందలి రచన సలక్షణమై నాతి కఠినముగానున్నదని వీరేశలింగముపంతులుగారి యభిప్రాయము. (చూ. ఆంధ్ర కవులచరిత్ర మూఁడవభాగము. పుట 93.

## —: కాశీ మహిమార్థదర్పణము :—

ఇది స్కాందపురాణముననున్న కాశీఖండమునకు వచనానువాదము. దీని నింతకుముందే శ్రీనాథమహాకవి ప్రౌఢతరమగు పద్యకావ్యముగా రచించియున్నాఁడు. నంజరాజు వచనరచన మూలానుసరణముగ నాధ్యాయక్రమము ననుసరించినది. గద్య ననుసరించి చూడగా నంజరాజు దీనిని తొలుత కర్ణాటభాషలో ననువదించి యందుండి తెనుగునకుఁ దార్చెనని తెలియుచున్నది. "ఇది కర్ణాట భాషావిరచితంబుగా మహాశూరసేనాధిప దొడ్డరాజపౌత్ర వీరరాజ పుత్ర, దళపతి దేవరాజానుజ కళులె నంజరాజభూపాలుండు స్కాంద పురాణోక్త కాశీమహిమార్థదర్పణమునందు మణికర్ణికోత్పత్తిం జెప్పిన యిరవైయారో అధ్యాయమునకు మంగళము.

కాశీఖండము పురాణము కావున యిందలి శైలి కొంచెము వ్యవహారికమై యున్నది.

ప్రారంభము :—

ఒకానొక కాశీపట్టణము భూమియందున్నదైనా గానీ అక్కడ వాసంచేసుకొని యుండేవారికి పునర్భవాదులు లేవు గనుక తాను భూమి గదా ? అయినాగాని స్వర్గమందుండేవారికి పునరావృత్తిగదు. తన

యందుండేవారికి పునరావృత్తిలేదు. కనుక తాను స్వర్గమునకంటె క్రిందుగా ఉండేటిదైనా, మీఁదనైననుగాని తాను కోటకోత్తళముల చేత కట్టుబడిన దైనాభవబంధములను విడిపించును.

చివఱ:—

గంగామహిమ చెప్పేటివారికి సకల పాపపరిహారము. మాయా మోహితులైన వారికి గంగ యొక్క నదిమాత్రమై కనిపించును. జన్మాంతర సంస్కారముచేత గంగయొక్క భక్తి దొరకును. ఆభక్తి గలిగినవారికి బ్రహ్మ అమరావతిపట్టణము మొదలైన వాటియందు విడిది చేసికొనియుండును.

ఈతని కవితాశైలిని తెలియుటకు హాలాస్యమాహాత్మ్య కృత్యన తరణికనుండి యొకపద్య ముదాహరించుచున్నాను.

**శా.** ధీరత్రాణపరాయణుండగుచు నంతే విశ్రుతుండయిన యా
నేనాధీశ్వర దేవభూవిభుడు కాశింఖానమాద్యన్మలా
ఖానాద్యుద్భట యానవానైపుల సంగ్రామంబునం గూల్చి ఢి
ల్లీ నాథాదుల కెల్ల నచ్చెరవు గొల్పెంధారుణీ మండలిన్.

వ్రాతప్రతులసంఖ్య. 1405, 1406 – కాశీమహిమార్థదర్పణము.
1465, 1466 - హాలస్యమహాత్మ్యము.

—: మైసూరు చెన్నపట్టణనిర్మాత ఇమ్మడి జగదేవరాయఁడు :—

మైసూరి రాజ్యమున విజయనగర సామ్రాజ్యాధీశులవలన నాయంకర వృత్తులను బడిసి యా వెనుక స్వతంత్రులైన వారిలో రాణావంశీయులొకరు. వీరు తెలుఁగువారు. చతుర్థ కులజులు—విష్ణువర్ధనగోత్రులు. ఆ రాజ్యమున చెన్నపట్టణసీమను పాలించుచుండెడివారు. సంస్కృతాంధ్రభాషలను పోషించి రణరంగమునకూడ ప్రఖ్యాతి వహించిన

వారు. వీరిలో ప్రసిద్ధుడగు ఇమ్మడి జగదేవరాయడు 1 చెన్నపట్టణమున కోటను గట్టించినాడు. ఈతనికే పొన్నికోట బొబ్బకవి 2 'వామన పురాణము' అను గ్రంథమును కృతి నొసగియున్నాఁడు. అందీతని వంశ క్రమ మిట్లు వర్ణితము.




1. చెన్నపట్టణము - ఇది మన (మద్రాసు) చెన్నపట్టణము కాదు. ఈ చెన్న పట్టణము మైసూరిరాష్ట్రములోని బెంగుళూరునకు 37 మైళ్ళదూరమున నున్నది. ఆపేరి తాలూకా ముఖ్యపట్టణము. ఇమ్మడి జగదేవరాయడీ పట్టణమున కోటగట్టి, దానిని విస్తరింపజేసి, రాజధానిగా చేసికొనెను. "The fort appears to have been built abont 1580 by Jagadevaraya, who made Chennapatna the Capital of the territory, bestowed upon him for his gallant defence of Penugonda"

Mysore. Lewis Rice Vol. 2, Bangalore Dist, Page 62.

| | | |
|---|---|---|
| Immadi Jagadevaraya | 15 | years |
| Mummadi | 8 | ,, |
| Kumara Jagadeva | 7 | ,, |
| Ankusa | 16 | ,, |

In 1630, It was captured by Chamaraja Vodayar of Mysore.

2. అముద్రితము. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము త్రైవార్షిక సూచికా సంపుటము. 1919-22. నాల్గవ సంపుటము సంఖ్య 607. పుట 1534-39.

—: ఇమ్మడి జగదేవరాయఁడు :—

1అసమబాహాశక్తి నలరారి మృత్యుజా
ఖాను చిత్తాఖాను కఠినఖావ
ఖునినూరు ఖానుని ఖండించె వెసఁదదీ
యాను చరావళి నాక్రమించి
చెండాడె బలసమంచితముగ విక్రమ క్రమ
లీలనెంతయు గ్రసుముమీఱ.

ఇట్లు మహమ్మదీయ సేనానాయకులను జయించుటయేగాక, వీరవేంకటపతిరాయలు పట్టాభిషిక్తుఁడగుటకు తోడ్పడెను. ఈ మహా వీరునివలననే రాణావంశము కీర్తి విస్తరిలినది.

పై వంశవృక్షములోని జగదేవని తమ్ముఁడగు అంకుశేంద్రుని కుమారుడు యిమ్మడి అంకుశభూపతికి రేపూరి ఏకామ్రనాథుఁడను కవి సంస్కృతమున "జాంబవతీకల్యాణము"[2] "సత్యాపరిణయము,"[3] అను రెండు కావ్యములను రచియించి యంకిత మొనర్చియున్నాఁడు. ఈ రెండింటి యవతారికలయందును రాణావంశవృత్తాంతము వివరింపబడినది. ఇందలి చారిత్రికాంశము లన్నియు, వామనపురాణావతారికతో సంవాదము నందుచున్నవి. వామనపురాణమునకుఁ దరువాత రచితములగు

1. Further sources of Vijayanagar History. Dr. N. Venkata Ramanayya.

Vol. II- Page 205. Also Vol. I. Page 311-315.

"Headed by famous Jagadevaraya, the ruler of Chennapattana they chose Venkata II as their emperor" Jagadevaraow appears to have made a sally from the fort and attacked the Kutubshahi Army.

2. Descriptive Catalogue of Sanskrit Manuscripts Vol. XX. No. 11535, 11816. (P. 7732-42, 7889-97.)

3. Sources of Vijayanagar History 70.71. P. 227-230.

టచే, నీ కావ్యములలో అంకుశభూపతి భార్యలు, సంతానము కొంత వివరణగా దెలుపబడినది. జగదేవరాయని విజయములనుగూర్చి సత్యాపరిణయములో—

"యోఽరక్షీ ద్దుర్గవర్యే ఘనగిరిమహితౌ
మూర్తిజాఖాన నూరూ
ఖానే జిత్వాచ శూరే మహితవలయుతం
చిత్తఖానంచ యుద్ధే
జీవగ్రాహం త్వ గృష్ణోద్భవాహుబలమపి
నిర్భిద్య సౌజాతఖానం
యోఽరక్షీ చ్చేన్నముల్కుం సజయతి
జగదేకావనీనాథశౌరే"

వామన పురాణములో నీవటి కుదాహృతమైన దాని నిది దృఢ పఱచుచున్నది.

ఈతని శాసనములు రెండింటి నిం దుదాహరించుచున్నాను. ఒకటి కన్నడము. ఒకటి తెలుఁగు.

1

[1]మైసూరిరాజ్యమున చెన్నపట్టణము తాలూకాయందలి దశవారగ్రామముననున్న శాసనము.

శుభమస్తు. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వరుషంగళు 1545 అగుననియ రుధిరోద్గారి సంవత్సరద వైశాఖ బహుళ 12 నేను శ్రీమద్రాజాధిరాజమరసరాజన పరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరరామదేవరాయలయ్య వడబస్క గొండరమ్మ నెయ్యానేన శ్రీమతు పృథ్వీ సామ్రాజ్యముచేయుచుండి యుండంగయు వింగ

1. Epigraphica Carnatica Vol IX. Channapatna Taluq. No 182, Page 349.

జిగారుచలరు. ప్ర...రుగ బసేన నిగద స్వామికిచ్చి ధారాదానసహి
ద్యలు అంగరంగ వైభవలు మొదలుగాగల అన్నిన్ని సంగంగాను...
విష్ణువర్ధన గోత్రపవిత్ర రాణా పెద జగదేవరాయనింగారికి అమాత్యు
లైన జగదేవరాయనింగారి పుత్రులు రాజశ్రీ కుమార యిమ్మడి జగ
దేవరాయనింగారు సమర్పించిన భూదాన ఆయధర్మ శాసనక్రమ మెట్ల
న్నను...అమరనాయక తనకు నడిచే చెన్నపట్నం సముతు చెల్లమం
మాగి కిలశైన దసవరం గ్రామానకు చెల్లే కుప్పకిళువలి సహగాను
చెల్లే చతుస్సీమ తండ్రి జగదేవరాయనింగారికి పుణ్యంగాను స హిర
ణ్యోదకధారా పూర్వకంగాను సమర్పించిన రంగను అగ్రామానకు
చెల్లే ఆ చతుస్సీమలో నిధి నిక్షేప జలపాషాణ అక్షీణ ఆగామిసిద్ధ
సాధ్యంబులు అనియెడు అష్ట భోగ తేజస్స్వామ్యములున్నూ మార్గై వడం
గంగాను, త్రివాచకంగాను ఆచంద్రార్క స్థాయిగాను నడచేలాగున
సమర్పించిన దానశాసనము.

దానపాలనయోర్మధ్యే
దానాచ్ఛ్రేయోను పాలనం,
దానాత్ స్వర్గమవాప్నోతి
పాలనాదచ్యుతం పదం.

**2**

[1]కంకణహళ్ళి తాలూకా అల్లాస సంద్ర గ్రామమునసున్న శాస
నము. శ్రీ దుర్ముఖ సంవత్సరద జ్యేష్ఠబహుళ 2 రాజశ్రీ కొమరయిమ్మడి
జగదేవరాయ అయనవరు 1 బసవపళి ఆళాడవానరు ప్రతిష్ఠమాడిదీ
కాశీవిశ్వనాథస్వామిగె కనుక నలిసీమాళుగిన అహళసముద్ర గ్రామ
వన్ను సర్వమాన్య అగ్రహార వగికొట్టి ప్రయుక్తమక్కె సల్లువ..... ...
అలిగె దానవాగి కొటివుయందు బరసికొట్టి శిలాశాసన శ్రీ విశ్వేశ్వర
దేవరు.

1. E. C. Vol, 9 Kankanahalli Taluq. No 108 Page 296.

(ఈ ఎపిగ్రాఫికా కర్ణాటికా సంపుటములలోను, మైసూరి ఆర్క శాఖానివేదికలలోను తెలుగుశాసనములు చాల గలవు. 10 వ సంపుటములోనే 211 శాసనములున్నవి. ఇవి కొంతమంది కవుల కాలనిర్ణయముచేయుట కనుకూలించును. వీని లిపి కన్నడము.)

ఇందు మొదటిది క్రీ. శ. 1623 నాటిది. రెండవది. క్రీ. శ. 1621 నాటిది. దీనినిబట్టి యీతడు, 17-వ శతాబ్ది ప్రథమదశకముల లోనివాడన వచ్చును. ఈతనికి గృతినిచ్చిన పొన్నతోట ఓబళకవియు క్రీ. శ. 1620 ప్రాంతమువాడని చెప్పనగును.

ఇమ్మడి జగదేవరాయఁడు సంగీత సాహిత్య విద్యాచతురుఁడు. ఈతఁడు ప్రత్యేకముగా వీణ వాయించుటయందు నేర్పరియని కృత్యాది నున్న యీ క్రింది పద్యమువలన తెలియుచున్నది.

ప్రోదియగునతని వీణా
వాదన మప్రతిమ, మతులవైభవము శుభా
పాదకము వితరణంబతి
మోదకరం బౌర; మఱియమోఘం బెందున్.

మఱియు నీతఁడు తెనుఁగున స్వయముగా కవి. కవిరాజని కీర్తి గాంచినవాఁడు. ఓబళకవియే యిట్లు చెప్పుచున్నాఁడు.

అమిత మధ్యాత్మరామాయణము తెనుంగు
కబ్బముగ గూర్చినట్టి యక్కబ్బితేఁడు
ఫరులకవితా ప్రవీణత లరయనేర్చు
నని వచింపగవలయునే యద్భుతముగ.

కాని జగదేవరాయని కృతి యధ్యాత్మరామాయణము నేఁడు లభ్యము కాలేదు. "కబ్బితేఁడు" అనునది 'కవిరాజ' శబ్దమునకు తెనుఁగుసేత.

ఈతడు సంస్కృతమున చండికాదేవీ నవరత్నములను రచియించెననియు, వానిని వీణపై వాయించుచుండెడి వాఁడనియు, అష్టమాశ్వాసాద్యంతములలోని పద్యములబట్టి తెలియుచున్నది.

"నిరత ప్రచండదేవీ
విరచిత నవరత్న ఖచిత వీణానాద
స్ఫురణార్ద్రిత మణిగృహసంచరణా..."

"దీవి భవ ఘన ప్రచండ దేవీభరత
ప్రావీణ్య......................"

మఱియు నీతఁడు పెక్కుగీత ప్రబంధములు రచించి యవి వీణపై వాయించుచుండినట్లు పంచమాశ్వాసాంతమున నిట్లు చెప్పబడి యున్నది.

"వరవైణికాద్భుతాపహ
నిరుపమగీత ప్రబంధ నిర్మాణకళా
దరణీయ చాతురీకృత
పరభాగ విశాల సుకృత భరణ సుశీలా!"

ఈ గీతములకొఱకు కింకను పరిశోధన నెఱపఁదగియున్నది.

జగదేవరాయనిగూర్చి యీ క్రింది చాటుపద్యము చాటుపద్య రత్నాకరము 148 పుటలో నుదాహరింప బడియున్నది.

జగలోభుల్ మలభాండ విగ్రహులు గం
జాతిండి లండీలు మొం
డి గులాముల్ మగలంజ లాగడపు టె
డ్డెల్ ఘోర క్రూరాధముల్
ధగిడీలుండగ నేమి యర్థుల కృతా
ర్థత్వంబు నొందింతురే
జగదేవక్షితి పాలరాజకుల తే
జా! దీన కల్పద్రుమా!

—: పొన్నతోట ఓబళకవి - వామనపురాణము :—

వామనపురాణమున పది యాశ్వాసములు గలవు. కాని వానిలో సప్తమాష్టమాశ్వాసములు మాత్రము ఈవని వేంకటేశకవి ప్రణీతమై నట్లుగా నా యాశ్వాసాంత గద్యలు తెలుపుచున్నవి.

ఓబళకవిగద్య :—ఇది శ్రీమద్వేంకటరమణ పరిచరణ ధురంధర హృదయ నిఖిల కవిరాజ వర్ణనీయవరాంధ్ర కవితా విశేష సర్వంకష భాషానిరాఘాట పొన్న తోటకుల పాథోనిధి రాకానిశాకర రాజరాజ దాబళార్యతనూభవ వోబళకవి ప్రణీతంబైన వామనపురాణంబునందు సర్వంబును దశమాశ్వాసము.

వెంకటేశకవి గద్య :—ఇది శ్రీమీనాక్షీ కటాక్షవీక్షణానుక్షణ సంవర్ధిత చతుర్విధ కవిత్వవైభవ యీవని యెల్లనార్యతనూభవ సరససంస్కృతాంధ్ర భాషావిశేష బోధాకర, శాండిల్యగోత్ర సుధాకర నిరంతరారాధిత సోమసౌందర్యేశ వేంకటేశకవి ప్రణీతంబైన వామనపురాణమున నోబళకవివిరచిత శేషంబున సప్తమాశ్వాసము—ఇట్లే అష్టమాశ్వాసము. కాని, నవమ దశమాశ్వాసములలో నోబళకవిగద్య యుండుటచేత నోబళ కవియే యిది పెద్ద గ్రంథమని, శేషభాగమును వేంకటేశకవిని పూరింపుమని నియమించియుండును. తిరిగి తనకు తీరిక గలుగుటచే చివర రెండింటిని రచియించి యుండును. వీ రిరువురును సమకాలికులే గదా !

ఓబళకవిని గూర్చిన యితర విషయములు తెలియరాలేదు. ఆతఁడు కందాళ భావనాచార్యుని తనయుడైన శ్రీరంగాచార్యుని శిష్యుడైనట్లు చెప్పుకొనియున్నాఁడు. క్రీ. శ. 1614-30 వఱకు పాలించిన రామదేవరాయల కాలమున కృతిభర్తకర్త లిరువురు నున్నట్లు 'అసమానోదయ రామరాయ ఘనకార్యాయోగ నిర్వాహ' అను పంచమాశ్వాసాంత పద్యపాదము తెలుపుచున్నది.

వామనపురాణమునకు వేఱొకచోట ప్రత్యంతరమున్నట్లు కన్పట్టదు. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున గల యీ ప్రతిమూలమును సంపాదించినది శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారే!

ఔబలకవి రచన కుదాహరణములుగా వామన పురాణమునుండి యుద్ధృతములు :

మ. కృతకైవల్యధునీకమై, మదవృషక్రీడా సమాభోగ ని
ర్మితసంప్రాపితమై, సరోజసుమమోహోన్మేష క్రియాదక్షమై
పతగానేకవిజృంభ సంఘటితమై, పంకాపనోదప్రథా
శ్రితమై యంతట శారదాగమముమించెన్ సర్వసౌఖ్యంబుగన్. ౧

చ. క్షమయును బ్రహ్మచర్యమును శౌచసమగ్రనతయున్ జితేంద్రియ
త్వమును, వివేకమున్ దయయు దానము యజ్ఞముసీశ్వరాంబికా
హిమకర భక్తియుక్తియు నహింసయు శాంతిదమానుభూతియున్
క్రమమున మర్త్యధర్మములు గావచియింతురు నీతికోవిదుల్. ౨

క. లలిత మణిమేఖలాంచిత
జలజాక్షికి జఘనమధిప సాలంకృతమై
వెలయు నలమదన భూవరు
నలఘూకృద్దుర్గ నగరమనఁగానమరున్.

క. వారాహియువద నాగ్రన
వారాహిసమాన తుండమరుదారగదు
ర్వారాహిత తతిపై సుర
వారాహిత వినుతులడరవడిగా దొడరెన్.

వేంకటేశకవి రచన,

అనుకీర్తిధ్వజమై, సమస్తబుధసేవ్యంబై, జగత్పావనో
న్మనసంబై శుభదాయియై సకలధర్మ శ్రీ జయాపాదియై
జనిసాఫల్యకరంబునై వెలయు నీసద్వృత్త మంచున్ మహా
న్మనివీక్షించి పులస్త్యమౌని పలికెన్ మోదంబుసంధిల్లగన్.

## —: సుగుటూరి ముమ్మడి తమ్మభూపతి :—

మైసూరి పాలకుల క్రింద సామంతరాజులలో సుగుటూరి వారొకరు. వీరి శాసనములు కోలారు, మూల్‌బాగలు జిల్లాలలో గలవు. వీరు శైవులు. సంస్కృతకర్ణాటాంధ్ర భాషాపోషకులు. వీరి వంశ వృక్షమిది. వీరికి చిక్కరాయలనునది వంశపారంపర్యముగా వచ్చెడి బిరుదము.




వీరిలో కడపటి ముమ్మడి తమ్మభూపాలుఁడు గొప్పవిద్వాంసుఁడు, కవి. భాషాత్రయ విశారదుఁడు. ఈతని రచనలు.

సంస్కృతము.
1. శివదర్పణము.
2. రసికమనోరంజనము.
3. కౌముదీవ్యాఖ్య.

కర్ణాటము.
1. శంకరసంహిత.
2. యక్షగానము.

తెలుఁగు.
1. రాజేంద్ర చోళచరిత్ర.
2. కుమారార్జునీయము.
3. సౌందరేశ చరిత్ర.

ఈతఁడు శైశవముననే రాజేంద్ర చోళచరిత్రను, నూనూగుమీఁస కట్టు వచ్చినతోడనే కుమారార్జునీయమును, ప్రౌఢవయస్కుఁడైన వెనుక సౌందరేశ చరిత్రమును రచియించెనని వీరివంశ వృత్తాంతము దెలుపు గ్రంథము1నుండి తెలియుచున్నది. కాని యీ తెలుఁగు గ్రంథము లేవియును లభ్యముకాలేదు. సంస్కృత గ్రంథములలో మొదటి గ్రంథము శివదర్పణము. శివాగమములు, శివమతోత్కర్ష దెలుపు గ్రంథ సంకలన గ్రంథము. ఇందీతఁడు భాషాత్రయ ప్రబంధనిర్మాణ ధురీణుఁడని పేర్కొనఁబడినవాఁడు. ఇతనికాలమున విలసిల్లినకవి,

—: బద్దెపీటి దత్తప్పకవి :—

ఈతఁడు సుగుటూరి చిక్కరాయ మహేంద్రుని యానతిని గణిత దీపికయను గణితశాస్త్రమును రచించెను. ఇది పద్యకృతి. వ్యాఖ్యానము కూడ కలదు.

ప్రారంభము.

> శ్రీమద్విలాస పరికల్పిత జీవరూప
> మానందరూపమణు రూపమమేయరూపమ్
> చిత్రీకృతోరుపరమేశ నరేశరూప
> మద్వైతనామ జగదీశ్వర నామధేయ.

> క. అని యీశ్రీయ జగదీశ్వరు
> వినుతింగావించి సకల విద్వజ్జనతా
> జనితాదరితా యోగ్యుం
> డనినను జనులెంచ ధరణినలరినవాఁడన్.

1. Epigraphica Ca.natica Vol. IX B Page 255-256, Lewis Rice.

ఉ. భోజసమానమానిత విభూతియు విద్వదభీష్టసత్కృతి
భ్రాజితపుణ్యవర్తనము భవ్యయశంబును గల్గిధాత్రిపై
రాజిలు సుగ్గుటూరి చికరాయమహేంద్రుఁడు గారవింపఁద
ద్యోజిత సర్వవైభవ సమున్నతిఁగాంచినవాఁడ నెంతయున్.

ఉ. శ్రీతరుణీకటాక్షమున చెల్వువహించినవాఁడు, లోక వి
ఖ్యాతుఁడు బద్దెపీటికులగణ్యుఁడు గౌతమగోత్రుఁడన్య కాం
తాతతి సోదరుండు కడుధన్యుఁడు పుల్లయమంత్రి పుంగవుం
డాతని కూర్మిపుత్రుఁడ మహానయశీలుఁడ దత్తనాఖ్యుఁడన్.

గద్య :—ఇది శ్రీరామపద సేవక బద్దెపీటిపుల్లయామాత్య పుత్రదత్తయ నామధేయ ప్రణీతంబైన గణితశాస్త్రదీపికయందు వర్గసూత్రము సమాప్తము.

గ్రంథమడయూరు గ్రంథాలయమున గలదు. అముద్రితము.

## భైరవకూరి ముళువాగళు ప్రభువు

### —: కోడూరి వేంకటాచలకవి :—

కవుల చరిత్రమున కీవఱకే పరిచితుఁడగు కోడూరి వేంకటాచల కవి, దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయమునకుఁ జెందినకవి. ఈతఁడు రచించిన శివరహస్యఖండ కృతిపతి ముళువాగళు ప్రభువు, సుగుటూరి వారితో సంబంధముగలవాఁడు. ముళువాగళు భైరవకూరిలో నివాసముగా నాప్రాంతములకు పాలకుడగుటచే నీతని భైరవకూరి లేక భైరకూరి ముళువాగళు రాజనియందురు. వేంకటాచల కవి తన గ్రంథావతారికలో నీ వంశీయులనుగూర్చి విపులముగాఁ దెలిపియున్నాఁడు. అందునుండి వారి వంశవృక్షము నీ క్రింద నొసగుచున్నాను. ఈ వంశీయులందఱు శైవులు.




శివరహస్యఖండ కృతిపతియగు ముళువాగుళు ప్రభునకును, వేంకటపతిరాయలచే చికరాయపట్టమును బొందిన ముళువాగళు ప్రభునకును నడుమ మూఁడు తరములు గలవు. క్రీ. శ. 1584-1616 వఱకు వేంకటపతి రాయలకాలముగుటచే నాతని వెనుక మూఁడు తరములకనగా క్రీ. శ. 1690 ప్రాంతములలో కృతిపతి ముళువాగళుప్రభువును నుండ

వచ్చును. మఱియు సీతని మేనల్లుఁడగు నిమ్మడి చిక్కరాయని శాసనము క్రీ. శ. 1693 లో కానవచ్చుచుండుటచేత, ముళువాగళు ప్రభువును నాతని యాస్థానియగు వేంకటాచల కవియు క్రీ. శ. 1650-1700 ప్రాంతమువారని నిశ్చయింపవచ్చును.

## —: వేంకటాచల కవి :—

ఈతఁడు కోడూరిపుర నివాసి. కాశ్యపగోత్రుఁడు. శివపాద భక్తుఁడు. తాత ఎల్లార్యుఁడు. తండ్రి శంకరమంత్రి. తల్లి లక్ష్మమ్మ. అభిరామవాసుదేవాది కావ్యములు రచియించిన యెడవల్లి వెంకటకవి యీతని విద్యాగురువు. నలయాదవ రాఘవపాండవీయాది మహాప్రబంధ నిర్మాతయై, శ్లేషకవితా పితామహుండని ప్రఖ్యాతి కెక్కిన గునుగుటూరి వేంకటకృష్ణ కవి యీతని మేనమామ. వేంకటాచల కవి 'బాలసరస్వతి' అను బిరుదముచే ప్రసిద్ధినందెను. పై వారిలో విద్యాగురు విషయమును, మేనమామ విషయమును గ్రంథావతారికయందును, మిగిలిన విషయము లీ క్రింది యాశ్వాసాంత గద్యవలనను తెలియుచున్నవి.

"ఇది శ్రీమత్సకలసుకవిజనానుగ్రహపాత్ర, కాశ్యపగోత్ర, కోడూరి ఎల్లనార్యపౌత్ర, శంకరామాత్యపుత్ర, లక్ష్మాంబికాతనయ, వినయవిధేయ బాలసరస్వతీ నామాంక వెంకటాచల కవి ప్రణీతంబైన శ్రీ స్కాందంబను మహాపురాణంబున శంకరసంహితయను శివరహస్య ఖండంబునం దుపదేశకాండమునందు సర్వంబును దశమాశ్వాసము."

వెంకటాచల కవి గ్రంథ మిదియొక్కటే మనకు చిక్కుచున్నది. ఈ శివరహస్య ఖండమున నేడు కాండములు గలవు. ఆయా కాండములలో నెన్నెన్ని యాశ్వాసములు గలవో, వాని వివరణమును గ్రంథాంతమున కవియే యిట్లు చెప్పియున్నాఁడు

సీ. సంభవంబైదు నాశ్వాసముల్సర్గంబు
నాసురకాండ రెండభినుతింప
నాశ్వాసమొక్కటి యలరు వీరమహేంద్ర
కాండకునుతి యుద్ధకాండ నాల్గు
నాశ్వాసములు రెండు నమరును దేవకాం
డకునాల్గు దక్షకాండకును దగును
ఒనరఁగఁ బదియొప్పనుపదేశకాండకు
నిరువదియెనిమిదానివియు నిట్లు

గీ. సప్తకాండంబులకును నాశ్వాసనిర్ణ
యంబుగాగను శివరహస్యాఖ్యఖండ
స్కాందమును నాంధ్రభాషచే సకలసుకవి
నుతుఁడు బాలసరస్వతి కృతియొనర్చె.

దీని వివరణము :—

| | | | | |
|---|---|---|---|---|
| 1. సంభవ | కాండము | 5 | ఆశ్వాసములు | (సమగ్రము) |
| 2. ఆసుర | ,, | 2 | ,, | ,, |
| 3. వీరమహేంద్ర | ,, | 1 | ,, | ,, |
| 4. యుద్ధ | ,, | 4 | ,, | (లభ్యముకాలేదు) |
| 5. దేవ | ,, | 2 | ,, | ప్రథమాశ్వాసము |
| 6. దక్ష | ,, | 4 | ,, | మాత్రము గలదు). |
| 7. ఉపదేశ | ,, | 10 | ,, | |
| | | 28 | | |

పై భాగములలో సంభవ కాండమును, వీరమాహేంద్ర కాండమును, వరంగలులో శ్రీ కోడిమేల రాజలింగారాధ్యులవారిచే, శ్రీ రామలింగేశ్వర శివధర్మవర్ధనీ ముద్రాక్షరశాలలో క్రీ. శ. 1913 వ సంవత్సరమున ముద్రితమైనవి.

[1]ఈ మహాగ్రంథమున నేఁడు కాండములును నిరువది యెనిమిది యాశ్వాసములు గలవు. వీనిలో 15 ఆశ్వాసముల గ్రంథము మాత్రమే మనకు లభించినది. వెంకటాచల కవి కవనము ప్రౌఢమైన ధారాశుద్ధి గలదియై యుండును. [2]కవితాశైలినిఁ దెలియుటకుఁ గొన్ని పద్యముల నుదాహరించుచున్నాను.

ఉ. లింగనృపాల పుత్రుఁడగు లింగనృపాలుని శుభ్రకీర్తిశా
లింగని, శారదాభ్రపటలింగని, నాకధునీతరంగపా
ళింగని, నీలచేలునిహాలింగని, మానసరస్ఫురన్మరా
ళింగని, పద్మగర్భునిచెలింగని సారెహసించు నెంతయున్
అవతారిక.

ఉ. తేనియవాఁకయిచ్చటను తిన్నఁగరాగదవే, మృగీమదం
బీనెలతాలబోదె లిడునిచ్చట జాతెదుసుమ్ము, కోకిలో
ద్గానములిందు వింటెకలకంఠి యటంచుసఖీజనావళుల్
మానుగహెచ్చరింప నసమాన మహామహిమాభిరామమై.

మ. పలితస్వచ్ఛ శిరోజముల్ తనరగా బల్జీర్ణమామేనునన్
వళులున్ ప్రేలఁగఁ గంపమంద శిరమున్ వక్రంబు, నిర్దంతమై
వెలయన్ భూరిజరాతి భారమున గర్వీభూతుఁడై పోలె ప్ర
స్ఖలదంఘ్రిద్వయి మొప్పగద్గదికమించన్ వృద్ధవిప్రాకృతిన్.

—: దక్షిణదేశాంధ్ర కవులు :—

దక్షిణదేశమున నాయకరాజులకు, సామంతులకు సంబంధము లేకుండ నాయాప్రదేశముల నివసించుచు, దక్షిణాంధ్ర వాఙ్మయమున చేరఁదగిన కవులం గూర్చి యిందు ప్రస్తావించెదను.

---

1. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము. మద్రాసు ప్రతి 322-323.

2. వీరేశలింగము పంతులవారి ఆంధ్ర కవులచరిత్ర. మూఁడవభాగము పుట 73-76.

## —: బడగలనాటి నరసకవి :—

ఈతఁడు నింబజామాహాత్మ్యమును నామాంతరముగల 'ఏకావీరా మాహాత్మ్యము' అను ద్విపదకృతిని, ధేనువాళము గరిడీలోని రఘు రాముని పేర రచియించియున్నాఁడు. ఈకృతి ప్రేరకుఁడు తొక్కడపు మన్నారుజెట్టి. దేవమల్లు కులమునకు సంబంధించినవాఁడు. ఈ మల్లులకును శాఖలును సూత్రములును గలవు. వీరు విశ్వామిత్రుని వంశీయులట. మన్నారుజెట్టి వంశమున మొదటివాఁడు,




ఈ మన్నారుజెట్టి నరసకవీంద్రుని పిలిపించి,

"దేవమల్లునికథ దేవిమహాత్మ్యవి
మీావిధంబున శాఖలేర్పాటుగాఁగ
రమణబ్రహ్మాండపురాణ సంహితల
విమలమౌద్గలగోత్ర విధములేర్పడఁగ
తెలుఁగున తేటగా ద్విపదకావ్యంబు
నొనరించి రఘుపతి కొప్పించు"మని యానతిచ్చెను.

కవియు,

లలినొప్పు ధేనువాళము గరిడీలోన
వెలసిన శ్రీరఘువీరుని పేర
మన్నారు కృష్ణమాంబా మనోహరు
సన్నుతమతి నేలు సర్వజ్ఞుపేర

కరమర్థివిధుశైల కన్నడనరస
వరమంత్రితనయుండు వసుధపూజ్యుండు
వరుసబడగలనాటి వంశదీపకుఁడు
నరసకవీంద్రుఁడు నయగుణోన్నతుఁడు
కవులనుగ్రహమున గావించినట్టి
రమణమౌనేక వీరాముహాత్మ్యమున
హావణుమీఱిన పంచమాశ్వాసమయ్యె.

ప్రథమాశ్వాస గద్యయందు,

శ్రవణభూషగు నింబజామహాత్మ్యమున
హావణుమీఱఁగఁ బ్రథమాశ్వాసమయ్యె

అని యతిస్థానమున నుండుటచే 'నింబజామహాత్మ్యము'కూడ దీనికి పేరున్నది. గ్రంథాంతమున విజయ సంవత్సర భాద్రపద శుద్ధ దశమి నాటికి నెల్లూరి వీరరాఘవపెరుమాళ్ల కుమారుడు కనకాజెట్టి వ్రాయించినది అని కలదు. కవి తంజావూరి మహారాష్ట్ర రాజులకాలమున క్రీ. శ. 1740 ప్రాంతమువాఁడు కాదగును.

కృతిపతియగు మన్నారుజెట్టి సోదరుఁడు
తోక్కడము రామాజెట్టి

ఈతఁడు కవియై యొక శతకము రచియించియున్నాఁడు. అది వేమనను గూర్చినది. 'బాలచక్రవేమ భవ్యనామ' అని దానిమకుటము. వేమన పద్యములవలె నింకాట వెలఁదులే గలవు.

మచ్చునకు,

"కదిరితూర్పుదిక్కు ఘనతశోభిల్లగా
పరగవరకటారు పల్లియనఁగ
యచటనునికిచేసి యమరియుండుదురయా
బాలచక్రవేమ భవ్యనామ"

"తల్లిదండ్రి యన్నదమ్ము లాత్మసఖుల
ఎలమిబంధులాది యెల్లజనులు
కలిగివర్ధిలూరు ఘనతనుమీఱును
బాలచక్రవేమ భవ్యనామ"

శతక కవులచరిత్ర 492 పుట.

—: చల్లానూరయకవి :—

ఈతఁడు తంజాపుర ప్రాంతమందలి పొందవాక గ్రామ నివాసి వెలనాటివైదికి. ఆపస్తంబసూత్రుఁడు. కౌండిన్యగోత్రుఁడు. సూరభట్టునకు పాపమ్మకు కొమారుఁడగు నూరయపుత్రుఁడు. తల్లి లక్ష్మమ. ఈతఁడు వేదాధ్యయనశాలి. మన్నారుగుడియందలి రాజగోపాలస్వామి యితని యిష్టదైవము.

ఈతని కృతి "వివేకవిజయము" అను నాటకము. ఇది సంస్కృతమున ప్రబోధ చంద్రోదయమువంటికృతి. ఈ తెలుఁగు కృతిలో వివేకేంద్రుఁడు ఉపనిషత్కాంతగూడి ప్రమోదమునందుట ముఖ్యాంశము. అద్వైతసార్వభౌముండైన జీవేశ్వరుండు ముక్తికాంతంగూడి యమందానంద కందళితుండై యుండుట యిందు ప్రతిపాదితము.

శైలి మచ్చునకు—

ద్వి. ముదమున జీవేశ మూర్తియు ముక్తి
గదిసి భేదము మాని కలయిక బొంది
కడలేని వేడుక కనరాని చెలిమి
యుడివోని మోదము నుజ్జ్వలానంద
మును బొంది సుఖనుండి ముల్లోకములను
తనదు తేజము కీర్తి దట్టమై నిగుడ
తనసాటి లేదని తను దానె తెలిసి
వినుత వైభవముల వెలయుచునుండె.

గద్య. అనుచు శ్రీరాజ మన్నారైన స్వామి
ఘన కృపా వర్ధిత కవితాశయుండు
... ... ... ...
కవిసూరయాఖ్యుండు ఘన తత్త్వ విదుఁడు
వివరింపఁగ వివేక విజయనాటకము
... ... ... ...
దక్షిణ ద్వారకా ధాముని పేర
నా చంద్ర తారార్క మై వెలయ" రచించెను

నాటకాంతమున ఫలశ్రుతి:—

చ. ఆలరఁగ నీ వివేక విజయాభిధ నాటక మెవ్వరేని ని
శ్చలమగు భక్తిచేఁ జదువఁజాలి తదీయ పదార్థ భావమున్
గలలిత చిత్తవృత్తి నవిశంబును చింతన చేసిరేని వా
రలఘుతరాత్మ తత్త్వపరమంది సుఖస్థితిఁ గాంతు రెప్పుడున్.

తంజావూరి పుస్తకశాల సంఖ్య 604-605 (M 477, 682)

—: శ్రీనారాయణ తీర్థులు :—

గీతగోవిందకర్తయగు జయదేవుని యపరావతారమై, కృష్ణలీలా తరంగిణిచే, భారతదేశమును, గీర్వాణాంధ్రవాఙ్మయములను భక్త హృదయములను పునీతమొనర్చిన నారాయణ తీర్థులవారు దక్షిణాంధ్ర వాఙ్మయమునకు సంబంధించిన మహనీయులు. వీరు తెనుఁగుభాషలో 'పారిజాతాపహరణము' అను ప్రశస్త యక్షగానకృతిని రచియించినారు. ఈ గ్రంథమున 'శివనారాయణతీర్థ సేవితాధిపుఁడు' అను వాక్యమే తీర్థుల వారి రచనమును నిర్ధారణచేయుచున్నది. మఱియు నీ యక్షగానకృతిలో అచ్యుతాబ్ధివరదప్రభో అని యుండుటచేతను, తంజావూరికి సమీపము ననున్న మెలత్తూరుపు అచ్యుతప్పనాయకుఁడు, అచ్యుతాబ్ధియని నామకర ణము చేయుటచేతను, తీర్థులవారు అచ్యుతప్పనాయకుని కాలమున ననగా క్రీ. శ. 1561-1614 ప్రాంతముల విలసిల్లియుందురు.

శ్రీనారాయణ తీర్థులవారిగురించి తొలుత వ్రాసినవారు శ్రీ. శే. ప్రభాకరశాస్త్రిలవారు. వారు భారతి ద్వితీయసంపుటములో క్రీ. శ. 1925 లో తీర్థులవారి పటముతోడ నీ ప్రశస్తవ్యాసము ప్రకటించిరి. తరువాత నింగ్లీషులో సంగీత విద్వాంసుల చరిత్రలలో తీర్థులవారి చరిత్ర యుల్లేఖింపఁబడినది. పిదప వెనుక స్వామిశ్రీ శివశంకరశాస్త్రిగారు శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రిగారి షష్టిపూర్త్యుత్సవ సంపుటమున శ్రీ నారాయణ తీర్థులవారినిగూర్చి వ్రాసియున్నారు. (పుటలు 66- ) తీర్థులవారినిఁగూర్చిన వ్యాసములలో నీ రెండును ప్రామాణికములై వెలయుచున్నవి.

.: పరమానంద తీర్థుఁడు :-

ఈతఁడు తంజావూరి మండలమున చంపకారణ్య క్షేత్రవాసి. పరమహంస పరివ్రాజకాచార్యుఁడగు యతీశ్వరుఁడు. ఈతఁడు దత్తాత్రేయ గురుపరంపరలోనివాఁడై, తెనుఁగుభాషలో నద్వైత వేదాంత ప్రతిపాదకములైన గ్రంథము లనేకములు రచించియున్నాఁడు. ఆంధ్ర భాషయం దద్వైత వేదాంత ప్రవర్తకులలో నీతఁ డగ్రస్థానము వహింపఁ దగినవాఁడు. ఈతఁడు సులభశైలిలో గంభీరమగు వేదాంత విషయములను, శతక, ద్విపద, యక్షగాన, వచనరూపమున దెలిపియున్నాఁడు. ఈతఁడు క్రీ. శ. 1590 ప్రాంతముల నుండెనని శతక కవులచరిత్ర తెలుపుచున్నది.

శతకములు : 1. సంపగిమన్న శతకము. దీనికే మన్నారు శతకమని పేరు.

కందపద్యములు ప్రారంభము :

క. శ్రీమానినీమనోహర
సోమార్కవిశాలనేత్ర సురనుతచరణా
దామోదర నీలగుణి
శ్యామా నను బ్రోవవన్న సంపగిమన్నా !

మధ్య. క. తత్త్వం బెఱుఁగక యా బ్ర
హ్మత్వమున చరించువారిమాటలు ఘృతకో
శత్వములవి మఱచిన ని
స్సత్త్వముఁలగు నన్నవిన్న సంపఁగిమన్నా!

చివఱ. క. పరమానంద యతీంద్రుఁడు
పరిపూర్ణుండైన నీదుభక్తుండెలమిన్.
విరచించెను నొకశతకము
శరణాగత సుప్రసన్న సంపఁగిమన్నా!

చంపకారణ్య క్షేత్రమున వెలసిన మన్నారుదేవుఁడే సంపగి మన్నఁడు. ఈతఁడే రాజగోపాలస్వామి. ఈ యాలయమున్నయూరు పేరే మన్నారుగుడి.

## 2. శివముకుంద పరమానంద శతకము

ఇదియును వేదాంత ప్రతిపాదకమైన కందపద్య శతకము. ఇందుండి రెండు పద్యములు :

క. సుజ్ఞానిమహిమ యెప్పఁడు
సుజ్ఞానియె యెఱుఁగనేర్చు సుస్థిరమతివై
యజ్ఞాని తెలియ నేర్చునె
ప్రాజ్ఞునిగతి శివముకుంద పరమానందా

క. హరిహర గిరిధర పురహర
గురుడధ్వజ నీలకంఠ కనకాంబర శం
కరగౌరీధన మాధవ
పరమాత్మా శివముకుంద పరమానందా!

## 3. దత్తాత్రేయ శతకము

ఇదియును కందపద్య శతకము. ప్రారంభము :

క. శ్రీవిలసిత వరసంయమి
సేవితపాదారవింద చింతితఫలదా
కావుమునను నెల్లప్పుడు
దావరముగ గుణవిధేయ దత్తాత్రేయా

చివఱ. క. పరమార్థ ప్రతిపాదన
మరుదంరగ యోగివరుల కానందముగా
పరమానంద యతీంద్రుఁడు
ధరనాచంద్రార్కముగను తగరచియించెన్.

మ. శ్రీవిఖ్యాతిగ నాత్మతత్త్వరచనా సిద్ధాంతవాక్యార్థముల్
ఠీవిన్మీఱఁగఁ గందపద్యముల ప్రౌఢిం జెప్పి యర్పించితిన్
దేవా! నీవును భక్తవత్సలత ప్రీతిన్నన్ను మన్నించు ప్ర
జ్ఞావిఖ్యాత వినోదచిత్తమున దత్తాత్రేయ నిత్యోదయా.

ఈ శతకము తెనుఁగుదేశమున నాల ప్రచారములో నున్నది. ఈ శతకములోని,

క. ఎంతదయో దాసులపై
పంతంబున మకరిఁబట్టి బాధింపఁగ శ్రీ
కాంతుండు చక్రమంపెను
దంతావళరాజుగాయ దత్తాత్రేయా.

అను పద్యమును పల్లెటూరి బడులలో నొరవడికుదుర్చుటకై వ్రాయింతురు.

ద్విపదలు. అనుభవదర్పణము.

ఇది యద్వైత వేదాంత గ్రంథము. నాల్గాశ్వాసముల కృతి. దత్తాత్రేయ గురునకంకితము.

ద్వి. శ్రీగురువరచంద్రు సిద్ధమౌనీంద్రు
యోగివైభవసాంద్రు యుకినిస్తంద్రు
తెలివిదత్తాత్రేయ దేశికస్వామిఁ
దలఁచి సేవించి కీర్తనలొప్పఁజేసి
యానందమున పరమానందతీర్థ
మౌనీంద్రుఁడను మహామహిమదీపింప
ననుభవదర్పణంబను మహాగ్రంథ
మనుపమవాక్ప్రౌఢి యలరరచింతు

గద్య. శ్రీమదానంద విస్తీర్ణసుధాబ్ధి
సోమపరంధామ సుగుణాభిరామ
యమిసార్వభౌమ దత్తాత్రేయపాద
కమలరజఃపుంజ కలితలలాట

శ్రీమత్పరమహంస శ్రీపరివ్రాజ
కాచార్య శ్రీపరమానందతీర్థ
వాచాసుధారస వర్ణితంబైన
యనుభవ దర్పణమ్మను కృతియందు
ననుపమంబుగఁ జతుర్థాశ్వాసమయ్యె.

తంజావూరి పుస్తకపట్టిక 85 పుటలో నీ గద్య వచనమువలె ముద్రించుట సరికాదు.

—: శివజ్ఞానమంజరి :—

ఇది యొక వేదాంతగ్రంథము.

ద్విపదకృతి ప్రారంభము :

శ్రీగురువరమూర్తి శివయోగవర్తి
భోగమోక్షస్ఫూర్తి భూరిసత్కీర్తి
అతిముదంబున పరమానందతీర్థ

యతినామధేయుండ నింపుదలిర్ప
మహితశివజ్ఞాన మంజరియనగ
మహిలోనప్రాజ్ఞ సమ్మతముగానిపుడు
రచియించెదను లోకరక్షార్థముగను.

గ్రంథాంతము :

కరమొప్పజగతి ప్రఖ్యాతిగాననుచు
ననువుమీరంగ దత్తాత్రేయగురుని
యనుగుశిష్యుఁడు పరమానందతీర్థుఁ
డొనరించెనీకృతి యుత్సాహలీల.

తంజావూరి పుస్తకశాల 359-61 మూఁడు ప్రతులు.

— : ముక్తికాంతాపరిణయము :—

యక్షగానము. ఇదియును వేదాంతగ్రంథము. వివేకజీవుఁడు ముక్తికాంతను పొందుట యిందలి కథ.

శ్రీమచ్చిదాకారు శివయోగసారు
... ... ... ...
పరగదత్తాత్రేయ భక్తవిధేయుఁ
దలచికీర్తించి వందనమాచరించి
యలరుచుఁదగ పరమానందతీర్థ
యతినామధేయుఁ డాయతమోదముననను
చతురతప్రౌఢిచే సజ్జనుల్ పొగడ
కరమొప్పగాముక్తి కాంతావివాహ
మరుదారపదచాలి కమరఁ జెప్పెదను

దరువు. గురుతరమహాద్రి కూటాగ్రమున
పరిగొను మందిర ప్రకటస్థలమున
నాడిత్రయవ్యయ నాసికాగ్రమున
జోడుగరవిచేసి జోతులువెలుగ
చెలువొందుచువివేక జీవుఁడుముక్తి

లలనామణిని గూడి లక్ష్యంబమర్చ
తన్నుఁదానెఱుఁగక తనువును మఱచి
చిన్మయస్థితిఁ గాంచ శీఘ్రమునపుడు.

తంజావూరి పుస్తకశాల 557-558 (M. 637-638)

<u>వచనకావ్యములు :</u>

1. బ్రహ్మవిద్యాసుధార్ణవము

ఇది యొక వేదాంతగ్రంథము. అనుభవపూర్వముగ రచితమైనది. పదమూఁడు ప్రకరణములుగలది. ప్రతి ప్రకరణాంతముననునీ క్రింది విధముగ గద్యగలదు.

"ఇతి శ్రీ పరమహంస పరివ్రాజకాచార్యవర్య పరమానంద యతికృతౌ బ్రహ్మవిద్యాసుధార్ణవే యోగశాస్త్రే పంచమ ప్రయోజన నిరూపణం నామత్రయోదశ ప్రకరణం సమాప్తమ్.

ఇది మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము వారిచే ముద్రితమైనది.

—: వివేకచింతామణి :—

ఇది మూఁడు పరిచ్ఛేదములుగల తెనుఁగువచన వేదాంతగ్రంథము. ప్రారంభమున :

'జగదంకురకందాయ సచ్చిదానందమూర్తయే
గళితాఖిలభేదాయ నమశ్శాంతాయ తేజసే' యని కలదు

ఇందు ప్రతిపాదితములైన విషయములు.

ప్రథమపరిచ్ఛేదము. ప్రథమఖండము : చతుర్వేద మహావాక్యార్థ తాత్పర్యంబగు నుపనిషదర్థ ప్రతిపాదకంబనంబరగు వేదాంత సిద్ధాంతము.

ద్వితీయపరిచ్ఛేదము : శైవసిద్ధాంతము.

తృతీయపరిచ్ఛేదము : బ్రహ్మాండ ప్రపంచభువనకోశ రచనావిచిత్ర సిద్ధాంతము. వర్ణనము.

గ్రంథాంతమున నీ క్రింది పద్యము గలదు.

ఉ. శ్రీమెఱయంగ యోగివరసిద్ధ మనోహరమై వివేకచిం
తామణినాగనీ కృతినిధానుణి మానవులెవ్వరేని సత్
ప్రేమదలిర్ప విన్నమఁ పేర్చి దురంతములైన సంశయ
స్తోమములెల్లఁబాసి కడుసొంపునఁ గాంతురు భోగమోక్షముల్.

ఈ పద్యము నిజగుణ శివయోగి విరచిత కన్నడ వివేకచూడా మణియందిట్లున్నది.

ఉ. శ్రీమదనంతసూరిజన సన్మనదిండనవేవివేక చిం
తామణియం బసత్కృతియ................న
త్ప్రేమదొళుక్కు మిష్టఫలసిద్ధినమున్నతి శంభులింగదిం

నిజగుణశివయోగి క్రీ. శ. 16 వ శతాబ్దివాఁడని కన్నడకవిచరిత్ర తెలుపుచున్నది.

గద్య : ఇతిశ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య పరమానందతీర్థ యతికృతౌ వివేకచింతామణౌ బ్రహ్మాండప్రపంచ భువనకోశ విస్తారవర్ణనం నామ తృతీయపరిచ్ఛేదః

ఉపదేశక్రమము

—: ఉత్తరగీతా వ్యాఖ్యానము :—

ఇది భారతాశ్వమేధ పర్వమునందలి యుత్తరగీతకు తెలుఁగు వాఖ్య. భాష వ్యావహారికము.

తెనుఁగువాఙ్మయమున దత్తాత్రేయ సంప్రదాయ ప్రవర్తకులలో నీతఁ డగ్రగణ్యుఁడు.

## —: రేవూరి-అనంతయజ్వ రేవూరి కవికుటుంబము :—

మధురనాయక రాజుల కాలములో దక్షిణదేశమునకు వెడలి యచట స్థిరపడియశస్సునించిన యాంధ్ర విద్వత్కవి కుటుంబములలో రేవూరివారి వంశమొకటి. వీరు వెలనాటి వైదికులు, ఆపస్తంబ సూత్రులు, కౌండిన్యగోత్రులు. వీరి వంశవృక్షము.




1. కాళహస్తికవి : వంశమునకు మూలపురుషుఁడు.

2. కాళహస్తికవి : శ్రీమదప్పయ దీక్షితులవారి శిష్యుఁడు. కంచి కామాక్షీదేవి భక్తుఁడు. వసుచరిత్రను సంస్కృత భాషలో రచించిన కవి. కుందుర్తి వేంకటాచల కవి గురువు. చూడుఁడు మిత్రవిందాపరిణయావతారిక.

3. అనంతయ్య : బాలకవి యనంతయ్య. మైసూరి చెంజిరాజులచే సన్మానితుఁడు. గాథేయోపాఖ్యానమును వృద్ధాచల మహాత్మ్యమును శేషార్యోదాహరణమును నితని కృతులు.

4. ఏకామ్రకవి. ఈతఁడు సంస్కృత భాషలో గొప్పకవి. క్రీ. శ. 1620 ప్రాంతమునయున్న ఇమ్మడి జగదేవరాయని కనిష్ఠ సోదరుఁడగు నంకుశేంద్రుని కొమారుఁడు ఇమ్మడి అంకుశేంద్రునికి నంకితముగా సత్యాపరిణయము, జాంబవతీ పరిణయము నను రెండు కావ్యములు రచియించినాఁడు.

5. శ్రీముష్ణమహాత్మ్య, శివరహస్య ఖండకృతికర్త.

ఈ కవులందఱును క్రీ. శ. 1600 నుండి 1750 ప్రాంతముల నుం డును విలసిల్లినవారు. పై వారిలో తెలుగు కవులనుగూర్చి చెప్పుచున్నాను.

—: రేవూరి అనంతయ్య :—

గాధేయోపాఖ్యము

ఇది మైదాశ్వాసముల పద్యప్రబంధము. [1]వీరేశలింగము పంతులుగారి కవులచరిత్ర మీ కవి కాలమును దెల్పకపోవుటయేకాక యీతని యింటిపేరు తాళ్ళపవారని మార్చి యీగ్రంథ మేకాశ్వాస శృంగార ప్రబంధమని చెప్పుచున్నది. ఇందుకుఁ గారణ మిప్పటికీ కృతి పూర్తిగా లభింపకపోవుటయేయని యూహింపఁబడియున్నది. ఈ కావ్యము కృతినందిన బదిర కృష్ణభూపాలుఁడు తన్నుఁగూర్చి చెప్పినట్లుగాఁ గవి గ్రంథావతారికలో నిట్లు వ్రాసికొనెను.

సీ. ఘనమౌనికులమాన్య కౌండిన్యగోత్రప
 విత్రుఁడాపస్తంబ సూత్రమహిత
గతిహరి రేవూరి కాళహస్తికవీంద్రు
 పుత్రు లింగకవీంద్రు పుత్రుఁగాళ
హస్తిమహాకవియనుజన్ము నేకాగ్ర్యము
 కవిశిఖామణిగుర్వ కవితిలక శి
వానందసుకవుల కగ్రజన్ముని ఘటి
 కాశతగ్రంథ సంఘటకులే;

గీ. సీశతకకన్య కవితాప్రకాశకుని ది
 వ్యప్రబంధ నిబంధనునను ననంతుఁ......

దీనింబట్టి “యీకవి యింటిపేరు రేవూరివారు. ఇతఁడు వైదిక బ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కాళహస్తి

1. వీరేశలింగము పం॥ లుగారి కవులచరిత్ర 3-వ భాగము. సంఖ్య 96. పుట 269, 270. ముద్రణము 1949.

కవికిఁ బౌత్రుఁడు. లింగకవికిం బుత్రుఁడు. కాళహస్తి మహాకవికిఁ దమ్ముఁడు. ఏకామ్రకవి గుర్వకవి శివానందకవులకు నన్న, ఘటికాశత గ్రంథకర్త, దినైక ప్రబంధకర్త' యని తెలియుచున్నది. మఱియు నీతని పౌత్రుఁడగు ననంతయజ్వ తన శ్రీముష్ణమాహాత్మ్యమున నీతని నిట్లు వర్ణించెను.

సీ. ఐదేండ్లనాఁడె వేదాదివిద్యలు నేర్చి
విభులమెప్పించె గర్వితులనణఁచి
యట్టిప్రాయమునాఁడె యష్టభాషలఁ జతు
ర్విధకృతుల్ ధరవినిర్మించినిలిపె
ఘటికాశతదినైక ప్రబంధములమై
సూరిచెంజిండ్ల మెచ్చులుఘటించె
నూఱుఘంటములకై నోరారఁగఘునాఘు
నంబనఁగవిత మిన్నందబఁలికె

గీ. నేకసంధావధృతధృతానేకవిబుధ
దుర్గ్రహగ్రంథ సాహస్రతూర్ణతుష్ట
మండలాధీశ దత్తసన్మానబాల
కవియనంతేంద్రు నెనత్రిలోకములఁగలరె.

పితామహునియందలి గౌరవముచే నతఁడిందు కొంతయతిశయోక్తి చెప్పెనని యూహించినను నీతని వైదుష్యకవిత్వ సామర్థ్యము గొప్పవి యని మాత్రమేకాక, యీతని కాలముకూడ తెలుసుకొనుటకు నిది యాధారమని చెప్పనగును.

ఈ కావ్యముఁ గృతినందిన యాతఁడు బదిర కృష్ణభూపాలుఁడు. శూద్రజాతియందలి 'కంపళ'మనునది యీతని కులమైనట్లు క్రిందిపద్యము చెప్పుచున్నది.

వంశవర్ణన ప్రారంభమున తొలిపద్యము.

సీ. ముల్లోకములయందు కల్లోలవతినాన
యందుసముత్పన్నమై చెలంగి
ఆదిత్యమండలం బహరహంబును తన
సన్నిధానంబునె సారెకోర
దోషాకరప్రభాస్తోమంబు తనచేత
నవనీతమగుచుండు నగిగమింప
నాశ్రితాళులఁజేర నరిగెడునెడల భ
వ్యాసక్తి తనకు నవ్యాహతముగఁ

గీ. జిత్రచారిత్రమైన లక్ష్మీకళత్ర
చరణశతపత్రమునఁ దూర్యజాతికుశలు
ధుర్యరీతిజనించె నందునుతిఁగాంచె
కంబళంబనుకులము సత్కర్మఫలము.

గాథేయోపాఖ్యాన కృతిభర్తయగు కృష్ణభూపాలుఁడు,

గీ. ... ... ...
... ... ..., కవిననంతుఁ
దనరుచిరభోధయుతమనోవనరుహమున
దనరునెనరునఁ గనుఁగొని - యనియెనిట్లు,

క. ఆలింతురొ లాలింతురొ
పాలింతురొ మూఢజానపదులకుఁబరస
శ్రీలాలితమోహనపాం
చాలీలాలిత్యనిత్య చంచత్కవితన్.

మ. తనరన్ మజ్జనకుండు ద్విజనకుఁడున్ తారావళీదండకా
ద్యనవద్యోద్భవదీయ చాటుకృతులందారావళీ దండకాం
చనకీర్తుల్ గని కాంచనాంబరగిరిశ్రీరామభూపాదులం
దనియన్నిన్ను బహూకరించిరిగదా తాత్పర్యసుర్యాత్ములై.

చ. సుమతులకెక్కు నీదుమృదుసూక్తులయందు మరందకందళం
బమరుటయెంతవింత వినుమానిను మాబిరుదంచునెంచుమా
కమితరసాను సారసముదార భవత్కృతి కన్యకాపతి
త్వముసమకూర్పుమా! మతిపితామహతా మహనీయవర్తనా!

క. ముఖ్యాదృ్యర్థరతిశ్రుతి
సౌఖ్యావహ సంస్కృతాంధ్ర సందర్భోద్య
ద్విఖ్యాతిగ గాధేయో
పాఖ్యానము కృతియొనర్పుమా మాకెనయన్.

అని గాధేయోపాఖ్యానము ప్రబంధరూపమున రచింపుమని యానతిచ్చెను.

గద్య : ఇది శ్రీమద్వామదేవ సేవాహేవాకప్రభావాకలితలలితకవితా వైభవ, లింగకవితనూభవ నిరంతరతత్త్వ చింతనానంతార్య ప్రణీతంబైన గాధేయోపాఖ్యానంబను మహాప్రబంధమున పంచమాశ్వాసము.

గాధేయోపాఖ్యానమునకు చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నాలుగు ప్రతులు గలవు. అందు 482, 483 సంఖ్య గలవి సంపూర్ణప్రతులు. 434, R 186 అసంపూర్ణప్రతులు. ఈ గ్రంథము పూర్తిగా ముద్రణము కాలేదు. ఇందులోని పంచమాశ్వాసమునకు మాత్రము, పూర్వ ముద్రణమొకటియు, శృంగార గ్రంథ మాలలోని రమణీయ ముద్రణమొకటియు గలవు.

గాధేయోపాఖ్యానము నైదాశ్వాసముల ప్రతి సంపూర్ణముగా పరిషత్తులోనున్నది. ఇందు విశ్వామిత్రుండు రాజ్యముచేయుట, వసిష్ఠుని యావునడుగుట, మొదలుగా ఘోరతపస్సుచేసి యాతనిచే బ్రహ్మర్షి యనిపించుకొనుట యను నంతవఱకునుగల కథాభాగ మతి ప్రౌఢముగా సరసశైలిని వర్ణింపబడినది. శైలి తెలుపుటకు నీ కావ్యములనుండి రెండు పద్యము లుదాహరించెదను.

శా. ఏకాలంబున దీనిఁగట్టవిడ నీకెవ్వారలున్నారయో
మాకీలారమునందు దీనినిడినన్ మాకింపుసంధిల్లగో
నీకున్ వేడిన వేళనిచ్చెమగుడం దెప్పించుకోమోవృథా
మాకున్ గోపము లేఁచితింపఁ దరమే మిమ్ముర్తిన్ని వారింపఁగన్.

ఉ. ఏమనవచ్చునీమహిమ యీమహిమాద్రిగిలాతలానిప
గ్రామణికిట్టిగోమణి యొకండును గల్గదమేల్గదాఘనుం
డీమునిదీనినింబడసె నిమ్మైయినిమ్మైయి నింతకంటెమే
లేమొదవున్ మహాత్మునకు నేమొదవున్ మతిదీనిఁ గొలుసే-గాథే

—: వృద్ధాచల మాహాత్మ్యము :—

ఇది కవులచరిత్రలోఁ జేర్పఁబడలేదు. ఇది లింగారెడ్డి కంకితమీయఁబడినది. ఈతని యింటిపేరు పంటవారు. వీరు శూద్రులు. ఈతని తండ్రి యల్లారెడ్డి. ఈతని రాజధాని వెంగనూరు. ఇతనిభార్య యెల్లాంబికకు వృద్ధాచలేశ్వరుఁడు ప్రత్యక్షమై తనకు వెంగనూరిలో నాలయము కట్టింపుమని కోరినట్లామెవలన విని యాతనికి యాలయము కట్టించినట్లిందు వర్ణింపఁబడినది.

ఈ వెంగునూరు వెంగళమునకు సమీపమున ‘ పెరంబలూరు ’ తాలూకాలోనున్నదని తెలియుచున్నది. ఈ వెంగళము తిరుచినాపల్లి మండలములోనిది. కవి యీ కృతినాయకుని “బల్లహోల్ శాసనుఁడు. జగదగోపాళ, రాయవేశ్యాభుజంగుఁడు. పాండ్యగజకేసరి విశుద్ధపంట వంశపావనుఁడు” మొదలుగాఁగల విశేషణములతో వర్ణించియుండుటచే నితఁడుగూడ పాండ్యభూపాలుని సామంతులలో నొకఁడు. ఈతనిఁగూర్చి పుట 348 లో చూడనగును. శైలివర్ణకపద్యము.

శా. ఆరూపంబుఁ గనుంగొనన్వెఱచి నేత్రాంభోజముల్ మూసియా
శౌరిన్ బ్రహ్మముఖామరుల్ ప్రణతులై స్వామీ కటాక్షింపవే
యీరూపంబుఁ గనుంగొనంగఁ గలమే యేమెల్ల మాగృధ్రగ
జారాధ్యంబగురూపుఁ జూపఁగదవే యర్ధేందుచూడామణీ!

## —: శేషాఖ్యోదాహరణము :—

నల్లందిగళ్ వంశజుఁడగు శేషార్యుని ప్రశస్తిని వర్ణించు నీ లఘు కృతిని బాలకవియనంతయ రచించినట్లుగా గ్రంథాంతమున నిట్లుగలదు.

క. చెలఁగు నుదాహరణంబిది
నలసన్నిభ బాలకవి యనంతయనీకై
వెలయించి దీనిఁగైకొను
నలఘురసమున్మేష! తిరుమలాచార్యుని శేషా!

ఈ యుదాహరణమును గూర్చి నేను రచించిన యుదాహరణ వాఙ్మయచరిత్ర పుటలు 157 నుండి 167 వఱకుఁ జూడనగును. అందీ యుదాహరణము నాచేత పూర్తిగ ప్రకటితమైనది. దీని విషయ మంతయు నందు గాననగును.

## —: రేవూరి అనంతయజ్వ - బాలకవి :—

## శ్రీముష్ణమహాత్మ్యము

ఇది యైదాశ్వాసముల పద్య ప్రబంధము. దీని రచించిన యతఁడు, రేవూరి అనంతయజ్వ. ఇతఁడాపస్తంబసూత్రుఁడు. కౌండిన్య గోత్రుఁడు. వైదిక బ్రాహ్మణుఁడు. బాలకవి బిరుదాంకితుఁడు. బాలకవి బిరుదాంకితుఁడును మహాపండితుఁడునగు ప్రైయునంతార్యునకుఁ బౌత్రుఁడు. కాళహస్తికవికిఁ బుత్రుఁడు. ఇతఁ డీగ్రంథమును వెంగళము కృష్ణ మహీంద్రుని యానతిచే దెనిఁగించి యాతనికే యంకితమొనర్చెను. ఈ విషయమంతయు గ్రంథావతారికలోని యీ క్రింది పద్యమువలనఁ దేటపడఁగలదు.

మ. అనఘున్ధీనిధి బాలకవ్యుదిత పూర్వానంత పౌత్రున్ జగ
జ్జనగేయోదయ కాళహస్తికవి భాస్వత్సూనుఁ గౌండిన్యపా
వనగోత్రాంకు ననంత నామునను నాపస్తంబసూత్రున్ బ్రియం
బునరావించిసుధారసౌఘముల సొంపుల్ గుల్కఁబల్కెన్ దయన్.

---

1. ఈ గ్రంథమునుగూర్చి తొలుత పుట 327 లో చూడనగును.

సీ. ఏవీటనిరవొందు నేఁ బ్రొద్దు ధారాపు
రీశ్వరనాముఁడై విశ్వవిభుఁడు
ఏపురంబుననుండుఁ గాపురంబుగ గౌరి
సౌందరనాయికా సముచితాఖ్య
నేఁ బోలుపాలించు నెలిమిఁబెట్టనికోట
యగుచుఁ గూత్తాండారు జగమెఱుంగ
నేనగరంబున నింపునింపు ననంత
విద్వత్కవిస్తోమ విశదఫణితి

గీ. నట్టివెంగుళ మాత్రేయ మైనరాజ
ధానిగా మీరు నాచంద్రతారకముగ
భరితజగనొబ్బ గండాది బిరుదశాలి
వరదరాజేంద్రు కృష్ణభూపాలమౌళి.

క. శ్రీముష్ణ మహాత్త్వం బభి
రామంబది తెనుఁగు నేసి రహిఁ కెక్క జగత్
క్షేమంకర కృతి మచ్ఛుభ
నామాంకితముగ నొనర్చి నైపుణిఁ గనుమా.

ఆంధ్ర సాహిత్యలో పరిషత్తున దీని కొక్క ప్రతి మాత్రమే గలదు. అది మిక్కలి చక్కని వ్రాతలో సంపూర్ణముగా నున్నది. కవిత్వ శైలి యెంతయుఁ బ్రౌఢమై మనోహరముగా నున్నది. స్వయంవ్యక్తంబులై ప్రసిద్ధిఁగాంచిన వేంకటాచల శ్రీరంగ శ్రీకాకుళ కుంభకోణ బ్రహ్మపురాది క్షేత్రంబులలో నొకటి యగు శ్రీముష్ణం బను పుణ్యక్షేత్రము యొక్క మహాత్త్వ మిందు వర్ణింపఁబడినది.

శైలికి నుదాహృతులు.

శా. నానా నారదమౌని కిట్టులనియెన్ నానాన నారాజు నా
నానా నారత భోగయోగములఁ గానంబూన మూధాత్ముఁడన్
గానన్ లౌకిక వైదికోచితగతుల్ గానన్ ననున్ నీవదే
వా! నీ వానిగ నెంచి మంచి గతి యెల్లా నట్టు శిక్షింపవే.

సీ. అతివేల రతిశీల గతిమేల ననఁజాల
ఖల కాండముల దండ నిలువకుండ
వరమాన హారమైన సురయానక యమాన
నలతాపసులతాప కలనఁ బాప
ధన దానమున దీన జనమాననముఁ బూన
బలుకల్ల పలుకల్ల పలుకనొల్ల
వెరవారఁ బరదార హరనార భటి జేరఁ
గులవృత్తముల నుత్తములను హత్త

గీ. మందమానస మజ్ఞాన బృందమాన
మాన దీమాన దీక్షైథమాన మదము
శరము యో లేఁడు నీపాటి పరమయోగి
కావు నను గావు నను ముక్తి గలుగఁజేసి.

—శ్రీముష్ణమా.

—:శివ రహస్య ఖండము:—

అనుశైవాంధ్ర పురాణ మీతఁడు రచించినదొకటి పరిషత్తులోఁ గలదు. ఇందుఁ దొమ్మిదవ యాశ్వాసమునఁ దుదిపత్రములు గొన్ని లేవు గాని యిది తొమ్మిది యాశ్వాసముల గ్రంథమని నిర్ణయింపనగును. మిగిలియున్న భాగము మంచి స్థితిలోనే యున్నది. ఇది కోడూరి వేంకటాచలకవి రచించిన శివరహస్య ఖండముకంటె వేఱయి యాతనికిఁ బిదప రచియింపఁబడినది. మహాస్కాంద పురాణాంతర్గత మగు నీ భాగమును దెలిఁగించి తీర్థపుర (తుఱైయూరు) నందీశ్వరున కంకిత మొనర్చెను. దీనింబట్టి యితఁడు తిరుచనాపల్లికి సమీపమునన్న "తుఱైయూరు" అను గ్రామమున నున్నవాఁడని యూహింపఁదగి యున్నది.

ఇందు సంభవము, అసురము, వీరమహేంద్రము, యుద్ధము నని నాలుగు కాండములు గలవు. సంభవ కాండమున నాలుగాశ్వాస

ములు, ఆసురవీరమాహేశ్వర కాండముల నొక్కొక్క యాశ్వాసమును, యుద్ధకాండమున మూఁడాశ్వాసములుఁ గనఁబడుచున్నవి. ఈ రెండును శివక్షేత్ర మహాత్మ్యములు దెల్పునవియేయైనను వీని యందుఁ బెక్కులు చక్కని యుపాఖ్యానములును ప్రబంధోచిత వర్ణనములును ప్రౌఢముగా సంతరింపఁబడినవి. శైలి దెలుపుటకు రెండు పద్యములుదాహరించెదను.

ఉ. అమ్మక చెల్ల! యంచ లివి యడ్డము నిల్పెఁ జనంగ నీకుఱా
నెమ్మియుఁ బింఛమున్ నిబిడ నిర్వృతి విప్పుచు నోల మాసస్పై
సొమ్మసిలంగఁ జేసె నిది సొంపునఁ బెంచిన నాకె విఘ్నతన్
గ్రుమ్మఱగాఁ దొడంగెనని కొమ్మ యొకర్తు చనన్ నిసింగనన్.

ఉ. బొమ్మల పెండ్లి సేయు చొకబోటి గిరీంద్ర సుతా కళత్రుఁడా
యిమ్ముల రాజవీథిఁ జను తేర్పడఁ గాంచి వినిద్ర రోమయై
సొమ్ములు పెట్టు చొప్పు సఖిఁ జూచి విపర్యసనంబు గల్గఁ బొ
పొమ్మని పంచి తాను మది పొందక వచ్చె గవాక్ష రేఖకున్.

—శివ రహస్య ఖండము.

—:భాస్కర వేంకటాచల కవి:—

సేతు మాహాత్మ్యము అను నాలు గాశ్వాసముల పద్య ప్రబంధము రచించిన యతఁడు భాస్కర వేంకటాచల కవి. ఇతఁడు నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు. వసిష్ఠ గోత్రుఁడు. ఆశ్వలాయన సూత్రుఁడు. ఈతని పితామహుఁడు వెంకనార్యుఁడు. ఇతఁడు నందవరమునకుఁ బ్రభువై యొప్పినట్లుగాఁ గవి యవతారికలో వర్ణించెను. దీనింబట్టియే యితఁడు నందవరీకుఁడని యూహింపఁబడినది. ఇతని తండ్రి సూరయామాత్యుఁడు. తల్లి వెంగాంబ. సోదరుఁడు శేషాచల కవి. ఇతఁడు నాంచారు పరిణయ మను యక్షగాన కావ్యమును రచియించిన ట్లవతారిక తెల్పుచున్నది. గ్రంథావతారికాదులంబట్టి పైని దెల్పిన విషయము మాత్రమే దెలియుచున్నవి.

ఇందు శ్రీరామ కథయు సేతు వృత్తాంతము రామేశ్వరక్షేత్ర మహాత్త్వమును సమగ్రముగా వర్ణింపఁబడినవి. ఈ గ్రంథముయొక్క సమగ్రమైన ప్రతి యాంధ్ర సాహిత్య పరిషత్తులో గలదు.

ఇందలి కవిత్వ మంత ప్రౌఢమైనదియు నిర్దుష్టమైనదియుఁ గాదు. గాని సులభశైలి నొప్పుచున్నది. ఇందచ్చటచ్చటఁ గొన్ని వృత్తములు వ్రాయఁబడినవి గాని మొత్తముమీఁద గీత కంద పద్యములే యమితముగా నున్నవి.

చ. అన విని గౌతముం డతిపరాక్రమధుర్యులఁ బాండవేయులన్
మనము వధింపగాఁ గలమె మానిత శౌర్య ధురీణు చేఁకు రా
జున కెతిఁగించి వాని మన సొప్పిన యట్టుల చేత మన్న నా
ఘన భుజుఁడైన ద్రోణి విన కప్పుడె తా వెడలెన్ ధ్రువంబుగన్.

గీ. (తివిరి) సన్నుతి సేసి తత్తీరమున స
మగ్రరామ షడక్షర మంత్రజపము
చేయుచుండినఁ దన్మంత్ర సిద్ధి మహిమ
నిశ్చలం బగు భక్తిచే నెగడె జగతి.

ఈ భాస్కర వేంకటాచల కవిని సీతని వెనుక నున్న సీనయ కవిని, దక్షిణాంధ్రదేశమున వెలసిన వాఙ్మయమునకు సంబంధించిన వారినిగా, శ్రీహరి సేతురామయ్యగారు తాము రచించిన 'చోళ పాండ్య దేశాంధ్ర ప్రాబల్యము' అను వ్యాసమునందుఁ దెలిపినారు. వీరు క్రీ. శ. 1731–1767 ప్రాంతముల నున్నట్లు వారి యభిప్రాయము. చూ. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక. సం. 7. పుటలు 84–92.

—: సీనయ కవి :—

షణ్ముఖ సహస్రము అను నపూర్వమైన తెలుఁగు పద్య కావ్యము రచించిన కవివర్యుఁడు సీనయ్య. కృత్యాది పద్యముల లోనివగు

మ. సరస శ్రీనిధి తిర్మలార్య సుతుఁడన్ సాహిత్య విద్యా ఘన
స్థిరమోదావహ చాతురీలలితసంధిగ్రామ ధారాఘనాం
ధరుఁడన్ సీనయ నామధేయుఁడ జగత్సాకల్యమై ధీ శోభా
కర మా నీతి సహస్ర పద్యకృతి నీ కర్పింతునో షణ్ముఖా.

శా. నానా దేశిక చిత్త భూషణములై నాళీక జాతాంగనా
పీనోత్తుంగ పయోధరాగ్ర పదవీ ప్రేంఖన్మిలద్భూషణ
నానా నీతి విచిత్ర వాక్య రుచులై నాకెంబు దీపింపఁగా
నేనీ పేర రచింతు, బద్యములు వేయిన్నెన్మిదో షణ్ముఖా.

అను పద్యములంబట్టి యితఁడు తిరుమలార్యుని సుతుఁడనియు సెందిగ్రామవాసి యనియుఁ జక్కని సాహిత్యము గలవాఁడనియు వేయు నెనిమిది పద్యములు శ్రీ పార్వతీ పరమేశ్వరుల పుత్రుఁడగు కుమారస్వామి కంకితముగా రచించినవాఁ డనియుఁ దెలియుచున్నది. సంది = సెంది × గ్రామము. ఇది యిపుడు తిరుసెందూ రను పేరఁ దిరునల్వేలి మండలములో నున్నది.

ఈగ్రంథ మాంధ్రసాహిత్య పరిషత్తునందు గలదు. ప్రతి పరిశుద్ధ [illegible] ముగా సంపూర్ణముగానున్నది. ఇందు నూరేసి పద్యములు లొక్కొక్క భాగముగా విభజింపబడినవి. ఇది లక్ష్మీ సహస్రాదులవలెఁ గేవలము కృతినాయక వర్ణనాపరముగాదు. ఇందు వివిధములయిన లోకనీతులు పురాణ గాథలు శాస్త్రచర్చలును విశదింపఁబడినవి. మఱియు నిందు లోకమున వ్యవహరింపఁబడుచుండెడి పెక్కుసంస్కృత శ్లోకములు సరిగా నాంధ్రీకరింపఁబడియున్నవి. కవిత్వ మంత నిర్దుష్టమును ప్రౌఢమును గాకపోయినను గొంచెము మించుమించుగా నిది నూఱేండ్లనాఁటిది యగుటచేతను నీతి కావ్య మగుటచేతను నాంధ్ర లోకమున నాదరము నొందఁదగినది. శైలి తెలియుటకై యొక పద్య ముదాహరించెదను.

ఇందు శ్రీరామ కథయు సేతు వృత్తాంతము రామేశ్వరక్షేత్ర మహాత్త్వమును సమగ్రముగా వర్ణింపఁబడినవి. ఈ గ్రంథముయొక్క సమగ్రమైన ప్రతి యాంధ్ర సాహిత్య పరిషత్తులో గలదు.

ఇందలి కవిత్వ మంత ప్రౌఢమైనదియు నిర్దుష్టమైనదియుఁ గాదు. గాని సులభశైలి నొప్పుచున్నది. ఇందచ్చటచ్చటఁ గొన్ని వృత్తములు వ్రాయఁబడినవి గాని మొత్తముమీఁద గీత కంద పద్యములే యమితముగా నున్నవి.

చ. అన విని గౌతముం డతిపరాక్రమధుర్యులఁ బాండవేయులన్
మనము వధింపగాఁ గలమె మానిత శౌర్య ధురీణు చేఁకు రా
జున కెఱిఁగించి వాని మన సొప్పిన యట్టుల చేత మన్న నా
ఘన భుజుఁడైన ద్రౌణి విన కప్పుడె తా వెడలెన్ ధ్రువంబుగన్.

గీ. (తివిరి) సన్నుతి సేసి త త్తీరమున స
మగ్రరామ షడక్షర మంత్రజపము
చేయుచుండినఁ దన్మంత్ర సిద్ధి మహిమ
నిశ్చలం బగు భక్తిచే నెగడె జగతి.

ఈ భాస్కర వేంకటాచల కవిని సీతని వెనుక నున్న సీనయ కవిని, దక్షిణాంధ్రదేశమున వెలసిన వాఙ్మయమునకు సంబంధించిన వారినిగా, శ్రీహరి సేతురామయ్యగారు తాము రచించిన 'చోళ పాండ్య దేశాంధ్ర ప్రాబల్యము' అను వ్యాసమునందుఁ దెలిపినారు. వీరు క్రీ. శ. 1731-1767 ప్రాంతముల నున్నట్లు వారి యభిప్రాయము. చూ. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక. సం. 7. పుటలు 84-92.

—: సీనయ కవి :—

షణ్ముఖ సహస్రము అను నపూర్వమైన తెలుఁగు పద్య కావ్యము రచించిన కవివర్యుఁడు సీనయ్య. కృత్యాది పద్యముల లోనివగు

మ. సరస శ్రీనిధి తిర్మలార్య సుతుఁడన్ సాహిత్య విద్యా ఘన
స్థిరమోదావహ చాతురీలలితసంధి గ్రామ ధారాధురం
ధరుఁడన్ సీనయ నామధేయుఁడ జగత్సాకల్యమై ధీ శుభా
కర మా నీతి సహస్ర పద్యకృతి నీ కర్పింతునో షణ్ముఖా.

శా. నానా దేశిక చిత్త భూమణములై నాళీక జాతాంగనా
పీనోత్తుంగ పయోధరాగ్ర పదవీ ప్రేంఖ న్మిలన్మౌక్తికా
నానా నీతి విచిత్ర వాక్య రుచులై నాణెంబు దీపింపఁగా
నే నీ పేర రచింతు, బద్యములు వేయిన్నెన్మి దో షణ్ముఖా.

అను పద్యములంబట్టి యితఁడు తిరుమలార్యుని సుతుఁడనియు సెందిగ్రామవాసి యనియుఁ జక్కని సాహిత్యము గలవాఁడనియు వేయు నెనిమిది పద్యములు శ్రీ పార్వతీ పరమేశ్వరుల పుత్రుఁడగు కుమారస్వామి కంకితముగా రచించినవాఁ డనియుఁ దెలియుచున్నది. సంది = సెంది × గ్రామము. ఇది యిపుడు తిరుసెందూ రనుపేరఁ దిరునల్వేలి మండలములో నున్నది.

ఈగ్రంథ మాంధ్రసాహిత్య పరిషత్తునందు గలదు. ప్రతి పరిశుద్ధముగా సంపూర్ణముగానున్నది. ఇందు నూరేసి పద్యములు లొక్కొక్క భాగముగా విభజింపబడినవి. ఇది లక్ష్మీ సహస్రాదులవలెఁ గేవలము కృతినాయక వర్ణనాపరముగాదు. ఇందు వివిధములయిన లోకనీతులు పురాణ గాథలు శాస్త్రచర్చలుకూడ వివరింపబడినవి. మఱియు నిందు లోకమున వ్యవహరింపఁబడుచుండెడి పెక్కుసంస్కృత శ్లోకములు సరిగా నాంధ్రీకరింపఁబడియున్నవి. కవిత్వ మంత నిర్దుష్టమును బ్రౌఢమును గాకపోయినను గొంచె మించుమించుగా నిది నూఱేండ్లనాఁటిది యగుటచేతను నీతి కావ్య మగుటచేతను నాంధ్రలోకమున నాదరము నొంద దగినది. శైలి తెలుపుట కిం కొక పద్య ముదాహరించెదను.

మ. కరవాలాగ్రమునం మెలంగుట భుజంగస్ఫీతరంగత్ఫణో
దర సచ్ఛాయ వసించు భాతి గజమేదశ్చర్వణోన్మత్త కే
సరికంఠం బవలంబనంబు గొను నోజన్ రాజ సేవా మహ
త్వరమల్ సేవక కోటి కల్ప సుఖముల్ ధాత్రీస్థలిన్ షణ్ముఖా.

—:ధూర్జటి వేంకటరాయకవి - రత్నావళీ పరిణయము:—

సుప్రసిద్ధుఁడగు ధూర్జటి కవి వంశీయుఁడగు వేంకటరాయకవి రత్నావళీ పరిణయ మను ప్రబంధమును రచించి చేకూరి రామస్వామి మంత్రికి కృతి నిచ్చియున్నాఁడు. అవతారికలో కృతిపతి వంశమును గూర్చి యీ క్రింది వివరములు దెలిపియున్నాఁడు.




పై వారిలో కృతిపతి తాత గూర్చి యిట్లు చెప్పబడినది :

"ధరణి నమ్మోటి చెలువొందె గరుడ సింధు
దక్షిణ పినాకినీ నదీ తట నిరూఢ
పాటల పురాధి వాసియై ప్రజలు పొగడ
మనసిజనిభుండు రామయామాత్య విభుఁడు."

కృతిపతికూడ
"గరుడ సింధు దక్షిణ పినాకినీ తటస్థాన పూర్వ
శరధిసంగమ పాటలపుర నివాసుఁడని వర్ణితుఁడైనాఁడు."

ఈ గరుడ తీర్థమునకు 'గడిలము' అని పేరు. ఇది నేడు దక్షిణార్కాటు మండలములో దక్షిణ పినాకినీ నదీ తీరమున పాటలీపురము లేక తిరుప్పళయూరను పేరఁ బరగుచున్నది. కావున రత్నా పరిణయము దక్షిణాంధ్ర వాఙ్మయమునకు సంబంధించిన కావ్యమేయని చెప్పవచ్చును।

—:ఎల్లయ - చంద్రతారా విలాసము:—

చంద్రతారా విలాస మను పేర తారాశశాంకుల ప్రేమ గాథను యక్షగాన రూపమున రచించిన యెల్లయకవి సేలమువద్ద నుద్దండ మల్లసముద్ర గ్రామ నివాసి యని యీ క్రింది పద్యములవలన తెలియు చున్నది.

క. శ్రీకరు నగజ ముఖాబ్జ ప్ర
భాకరు విఘ్నౌఘహరు శుభాకరు సద్వి
ద్యాకరు మునిజన హృదయ వ
శీకరు గణనాథుఁ గొల్చి సేవింతు నెదన్.

సీ. శ్రీ రహిమించిన చేర దేశంబులోఁ
జెలువొంది వెలయును సేలపురము
దాని చేరువను నుద్దండ మల్ల సముద్ర
మను గ్రామమున నుండు నాంధ్ర విప్రుఁ
డాత్రేయ గోత్రజుం డమల తేజస్కుఁడౌ
రామ భక్తుండైన రామభద్రుఁ
డాతని తనయులు ననఘులు నిద్దఱు
నం దగ్రజుఁడు మల్లనార్యుఁ డనఁగ

గీ. నతని కనుజుండు విశ్వనాథాఖ్యుఁ డనయ
వినుతి కెక్కిన కులసతి వేంకటాంబ
గర్భ కలశాబ్ధి చంద్రుండు కవి వరేణ్యు
లకును శిష్యుండు 'ఎల్లయ' సుకవిహితుఁడు.

గీ. రాజితంబుగఁ గల్యాణ రాము కృపను
చంద్ర తారా విలాసంబు సరస యక్ష
గానముగ నేను బల్కెద గారవమున
వినుఁడు జనులార వీనుల విందుగాను.

—:గ్రంథాంతము శోభనము:—

ఘనులు మునులు కవి గాయకులు
వినుతి సేయ భట వీరులతో
జనని జనక గురుజనులు ముద మలర
దనరిన సీతా రామునకును. శోభానమే.

ఈ మెల్లయ కవి ఈరోడు పట్టణంబున క్రీ. శ. 1846 లో నున్నట్లుగా నా సంవత్సరముననే 'నీలగిరి యాత్ర' అను వచన కావ్యము రచియించిన కోలా శేషాచలకవి తన గ్రంథమున నిట్లు వ్రాసి యున్నాఁడు.

పుట: 51—ప్రాచ్య లిఖిత భాండాగార గ్రంథసంఖ్య 14-2-5

"ఈ మెల్లయ కావేరీ తీరంబున నీరోడునకు ముక్కాలుకోసెడు దవ్వున నొక సత్రంబు గట్టించెను.

ఈరోడనునది కోటయుం బేటయుం గలయది. కావేరి యావలి తీరంబున సత్రంబును గట్టించిన మెల్లయ యను జన్నిగట్టి చోట నున్నవాఁడు. సేలంబునందు పెట్లుప్ప ప్రత్తి లోనగు సరకుల వ్యాపారంబు సేయు 'ఫిషర్' అను దొర కతండు నొక్క యేజంటను కార్యకర్త గావున నక్కోటలో నుండు నా దొర పెట్లుప్ప గిడ్డంగి యాతని యధికారమునకు లోనై యుండు.

అయ్యుర్వీగీర్వాణుండు సంగీత సాహిత్య విద్యా ప్రవీణుండు గావునఁ దారాశశాంక ప్రభృతి కతిపయ నాటక ప్రబంధంబులు శృంగారాది రసానుబంధములుగా రచియించి యున్నాఁడు.

పుట : 51

## —:ఎట్టియాపురము సంస్థానము:—

దక్షిణదేశమున ఎట్టియాపుర సంస్థానాధీశులు సంగీతసాహిత్య విద్యలను పోషించినవారు. వీరిలో చాల ప్రసిద్ధుఁడు

### జగదీశ్వర రామకుమార ఎట్టప్ప మహారాజు 1839.

ఈతని తండ్రి వెంకటేశ్వర ఎట్టప్ప మహారాజు క్రీ. శ. 1816 మొదలు క్రీ. శ. 1839 వఱకు పాలించెను. వెంకటేశ్వర ఎట్టప్ప సంగీత విద్యా సంపన్నుఁడగుటయేగాక సంస్కృతాంధ్ర ద్రవిడభాషా విశారదుఁడు. జగదీశ్వరుఁడును తండ్రివలె సంస్కృతమున కావ్యనాటకాలంకారాది విద్యల గ్రహించెను. మఱియు షట్శాస్త్ర మర్యాదలను నెఱింగెను. సంగీతమున లక్ష్యలక్షణ సంప్రదాయముల నెఱిఁగి వైణికోత్తముఁ డని పేరందెను. ఆంధ్ర ద్రావిడ భాషలలో నతిసమర్థుఁడు. సంస్కృతమున దేవతాస్తుతు లగు శ్లోకములును, సంగీతమున 'శ్రీకార్తికేయ' ముద్రతో చూర్ణికలు రక్తి రాగకల్పనలతో గేయ రచనలు నీతఁడు గావించెను. ఈతని యాస్థానమున నలంకరించిన కవి పండిత బృందమును పరిశీలించిన నీతఁడు సంగీత సాహిత్యములను శాస్త్రమును నెట్లు పోషించినాఁడో తెలియఁగలదు. తెనుగుభాషలో కవులును,పండితులును భట్రాజులును కూడ నీతని యాస్థాన మలంకరించుటచేత తెనుఁగు భాషయొక్క ప్రాధాన్యమును మనము గుర్తింపవచ్చును.

చతుశ్శాస్త్ర పండితులు:—శ్రీరంగం కుప్పనయ్యంగారు
తిరువలంగాడు విశ్వేపురి దీక్షితులు - వీరు అప్పయ దీక్షితుని వంశీయులు

మీమాంసా శాస్త్రవేత్త:—తిరుక్కోడికావల్ కోదండరామ శాస్త్రి

వైయాకరణ పండితుఁడు:—విల్లిపుత్తూరు వీరరాఘవ తాతాచార్యులు.

తార్కిక శిరోమణి:—విట్లాపురం మన్నారయ్యంగారు.

అష్టాదశాగమవేత్త - ఆంధ్ర సంస్కృత పండితుఁడు:—
గుడుగుముల అహోబలశాస్త్రి.

ఆంధ్ర వైయాకరణి:—విశాత్తియం కృష్ణయామాత్యులు.

ఆంధ్ర ద్రావిడ మహాకవి:—ఆవల్ నత్తం రామలింగయ్య

ఆంధ్ర పండితులు:—బాలయ్య, గోపాలయ్య

ఆంధ్ర కవీంద్రుఁడు:—కేశవరాజు భట్రాజు

ద్రావిడ కవీంద్రులు:—కడిక్కై ప్పులవర్, ముద్దుకుమార ప్పులవర్, మున్నగు నాలుగురు.

సంగీత విద్వాంసులు:—బాలస్వామి దీక్షితులు,
వీణ మీనాక్షీ సుందరమయ్య,

ఈ మహారాజు ప్రతిదినము సంగీత సాహిత్య విద్యాగోష్ఠి నెఱపు చుండెడివాఁడట. ఈ కవి పండిత బృందమును వంశ పారంపర్యముగా పోషించు నేర్పాటు గావించినాఁడట. ఈ జగదీశ్వర ఎట్టప్ప మహారాజు కాలమున బాల్యదశలో నున్న మహనీయులు.

—: సుబ్బరామ దీక్షితులు :—

దాక్షిణాత్య సంగీతప్రపంచమున మూర్తిత్రయమని ప్రఖ్యాతి గాంచిన వారిలో ప్రథములగు శ్రీముద్దుస్వామి దీక్షితుల కనిష్ఠసోదరులైన బాలస్వామి దీక్షితుల పెంపుడుకొడుకు సుబ్బరామ దీక్షితులు. ఈతఁడు క్రీ. శ. 1839 లో జన్మించెను. జగదీశ్వర ఎట్టప్ప యీతని జాతకముచూచి గొప్పవిద్వాంసుఁడు కాఁగలఁడని తలంచి యపుత్రకుఁడును మాతామహుఁడునునైన బాలస్వామి దీక్షితులను పుత్రునిగా స్వీకరింపఁ గోరెను. ఆతఁడట్లే కావించెను. బాలస్వామి దీక్షితులు పుత్రునికి బ్రహ్మోపదేశము, శ్రీవిద్యోపదేశము చేసెను. సంస్కృతమున కావ్య నాటకాలంకారాదులేకాక సంస్థానపండితులైన విశాత్తియం కృష్ణయామాత్యుల వారియొద్ద మనుచరిత్ర, వసుచరిత్రాది మహాకావ్య

ములును, నాంధ్ర వ్యాకరణచ్ఛందస్సులును నేర్చెను. వంశ పారం పర్యముగవచ్చు సంగీత విద్య యీతనికి నుగ్గుబాలతో నలవడినది. ఈతఁడు తన పదియవ యేటనే శ్రీకార్తికేయస్వామిపై నొక తాన వర్ణము రచించెనట. క్రమక్రమముగా సంగీతసాహిత్య విద్యలయందు పరిణతుఁడై వాగ్గేయకారాగ్రణియై, ముద్దుస్వామి దీక్షిత సంప్రదాయ ప్రవర్తకుఁడై, ఎట్టియాపురసంస్థాన విద్వాంసుఁడై ప్రసిద్ధినందెను.

సుబ్బరామదీక్షితులు సంగీతవాఙ్మయమునకు చేసిన సేవ యపార మైనది. సంగీతప్రపంచమునకు శిరోభూషణమని చెప్పఁదగిన,

' సంగీత సంప్రదాయ ప్రదర్శిని '

అను మహాగ్రంథమును నీతఁడు క్రీ. శ. 1904 లో ఎట్టియాపుర సంస్థానాధిపతుల యాదరముచే వెలువరించెను. అందు ప్రసిద్ధ వాగ్గేయ కారుల కృతు లనేకములు స్వరయుక్తముగ ప్రకటితములైనవి. సంగీత విద్వాంసులకు, సంగీతశాస్త్ర పరిశోధకుల కీ గ్రంథము పెన్నిధి. ఇందులో తొలుత తెలుఁగుభాషలో పీఠికయు, నావెనుక 44 పుటలలో

' వాగ్గేయకారకుల చరిత్ర '

గలదు. మొట్టమొదట సంప్రదాయసిద్ధముగ, చారిత్రకాంశముల వివ రించుచు వాగ్గేయకారుల చరిత్ర తెలిపినది సుబ్బరామదీక్షితులవారే. ద్రవిడ వాగ్గేయకారుల గూర్చియేగాక, తెలుఁగువాగ్గేయకారులగూర్చి తెలిపెడి యీ యుద్గ్రంథము, తరువాతి పరిశోధకుల కందఱకు నుపజీవ్య మైనది. ఇందలి తెలుగు వచనరచనయు సులభమైయుండును. ఆవెనుక సంగీతశాస్త్రమును గుఱించి యీ క్రింది రెండు వచనరచనలు గలవు.

1. సంగీతలక్షణ ప్రాచీనమార్గము.
2. సంగీతలక్షణ సంగ్రహము.

ఈ రెండింటియందును, సంగీతశాస్త్ర సంప్రదాయములు, లక్షణ ములు సరిగా నిర్వచింపబడినవి. ఇందు 34 విషయములగూర్చి విపుల ముగా గలదు.

## —: కవిత్రయ మహాభారతము :—

## ద్రావిడానువాదము

సుబ్బరామదీక్షితు లాంధ్రభాషకు గావించిన సేవ యపూర్వమైనది. ఈతఁడు కవిత్రయ రచితమైన తెనుఁగు మహాభారతము నంతటిని ద్రవిడభాషలోనికి వచనరూపముగా ననువదించియున్నాఁడు. ఈ రచన జగదీశ్వర రామకుమార ఎట్టప్పమహారాజుగారి ప్రోత్సాహమున జరిగినది. పై సంగీతసంప్రదాయ ప్రదర్శినిలోనే 89 పుటలో సుబ్బరామదీక్షితు లిట్లు వ్రాసియున్నారు :

"జగదీశ్వర రామకుమార ఎట్టప్పమహారాజు హూణాంధ్ర ద్రవిడభాషలలో నతిసమర్థులు. శ్రీ మహాభారతమందు బద్ధస్పృహులు, కవిత్రయము వారిచే తెనుగింపబడిన శ్రీ ఆంధ్ర మహాభారతము నీ మహారాజు అనుమతివలన నాచే ద్రవిడీకరింపబడి యచ్చొత్తబడినది."

పై రచనలనుబట్టి దాక్షిణాత్య వాఙ్మయమున సుబ్బరామ దీక్షితులస్థానము నెఱుఁగఁదగును.

## —: తి. సు. మురుగేశము పిళ్ల :—

తెనుఁగుభాషలోను ద్రవిడభాషలోను సమాన పాండిత్యముగల విద్వాంసులలో తి. సు. మురుగేశము పిళ్లను మించినవారు లేరని చెప్పవచ్చును. ఈతఁడు ఎట్టియాపుర సంస్థానపండితుఁడు. తెనుఁగు భాషలో విద్వత్కవి. ప్రశస్త వచనరచయిత, ఈతఁడు 'త్రిశిరపురము' అను నిజనామముగల నేఁటి తిరిచినాపల్లి వాస్తవ్యుఁడు. క్రీ. శ. 1904లో ప్రకటితమై, మున్ను పేర్కొనఁబడిన 'సంగీత సంప్రదాయప్రదర్శిని' ప్రకటనకాలమునం దాగ్రంథమును ప్రశంసించుచు నీతఁడు వ్రాసిన శ్లాఘాపద్యములనిందు పొందుపఱచుచున్నాను.

క. శ్రీ వెంకటేశ రెట్ట
యాహ్వవరుఁడిల కార్తికేయ చరణద్వయప
ద్మావేశిత హృదయుఁడు దీ
నావనపావన చరిత్రుఁడై విలసిల్లున్.

మత్త. చంద్రకుంద మృగేంద్రచందన చంద్రవిష్ణుపదీసుధా
సాంద్రహీరతుషార శంకరసామ్య కీర్తిధురంధరుం
డింద్రతుల్యుఁడు వెంకటేశ్వర యెట్టభూమివిభుండు ని
స్తంద్రగ్రంథములు ద్వహించెడి సంతసంబున నుండఁగన్.

సీ. శ్రీపతినిభుఁడగు శ్రీవేంకటేశ్వర
యెట్టేంద్రు భోగదేవేంద్రుఁగాంచి
సన్నుతితో చిన్నసామి మొదలియారు
ననవి సేయఁగ మరమంత్రివోలె
వెలఁగు జగన్నాథశ్రేష్ఠియుఁ బురిగొల్వ
ధరణిపునాజ్ఞ గాంధర్వ విద్య
ఖిలమొందనీయ శాఖల విబుధోపకా
రముగ వేంకటమఖ ప్రముఖఫణితి

గీ. శాస్పదంబును సత్కీర్తికాటపట్టు
నైన సంగీత సాంప్రదాయప్రదర్శి
నీసముద్గ్రంథ నిర్మాణనిపుణ పటిమఁ
జెందె శ్రీ సుబ్బరామదీక్షిత బుధుండు.

తి. సు. మురుగేశుఁడు,
తెలుగు పండితుఁడు, త్రిశిరపురం.

మురుగేశంపిళ్ల క్రీ. శ. 1911 లో నాంధ్ర సాహిత్యపరిషత్తు స్థాపించిన నాటనుండి దానితో సంబంధముగలవాఁడు. క్రీ శ. 1916లో మధురయందు 'ఆంధ్రసాహిత్య పరిషద్వార్షికోత్సవ సభ' జయప్రదముగ జరిగించుటకు నీతడే కారణభూతుఁడు. ఈతని రచనలన్నియు

నాంధ్ర సాహిత్య పరిషత్పత్రికయందే ప్రకటితములైనవి. ఈతని రచనలు

### ద్రవిడాంధ్రభాషల అన్యోన్య సంబంధము

**భాషాతత్వశాస్త్ర** సంబంధియగు నీప్రశస్తవ్యాస మిప్పటికి ముప్పదియేండ్ల క్రిందట ప్రకటితమైనది. ఈ వ్యాసరచన వెనుకనే, కీర్తిశేషులు జయంతిరామయ్య పంతులుగారు సూర్యారాయాంధ్ర నిఘంటు సంపాదకులునుండి, మురుగేశంపిళ్ల పాండిత్యమును గమనించి, నిఘంటువునకు ద్రావిడభాషా సజాతీయపదములను సమీకరించుటకు నియమించిరి. ఆపని నీతఁడతిశ్రద్ధతో నిర్వహించి 7500 సజాతీయ పదములను సేకరించెను. దీనినిబట్టి యీతని భాషాపాండిత్యము గ్రహింపనగును. (చూ. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సంఖ్య 7. పుటలు 108-132.)

### —: కంబమహాకవి జీవితము :—

ద్రావిడభాషా మహాకవియు, రామాయణకర్తయునగు కంబమహాకవి జీవితమును నీతఁడు తెనుఁగు వచనముగా రచియించెను. అదియును పైపత్రికయందే ప్రకటితము. సం. 12. సం. 2-3. పుటలు 76-105.

### కణ్ణకి లేక నూపురమహిమ

ద్రవిడభాషలోని పంచమహాకావ్యములలో మొదటిదగు శిలప్పాదికారము మణిమేఖల అను గ్రంథములలో నాబాలగోపాలమెఱిగిన కోవిలన్ కణ్ణకి వృత్తాంతమును, మురుగేశుఁడు సంగ్రహముగా వచనరూపముగ రచియించియున్నాఁడు. ఇదియును ప్రకటితము.

### —: త్రిశిరగిరీశ శతకము :—

ఇది త్రిశిరగిరీశుపై చెప్పబడిన కందపద్య శతకము మురుగేశుని కవితావైశద్య మిందు గాననగును. పరిషత్ప్రకటితము. సం. 21. సం. 1. పుటలు 14-24. (1932).

పుట 94.

# అనుబంధము

విజయరాఘవ నాయకుఁడు నాగపట్నమునందు డచ్చివారికి (ఒలాందావారికి) నిచ్చిన నమ్మిక శాసనము. (ఇది తెలుఁగు భాషలో వెండి రేకుపైని చెక్కబడియున్నది. ఇండోనేషియా యందు బటేవియాపురా తత్వశాలలో భద్రపఱుపబడినది.)

స్వామిసాక్షి తప్పేదిలేదు శ్రీరామ

1. విళంబిసంవత్సర మార్గశిర శు॥ 15 లు శ్రీమతు అచ్యుతశ్రీ
2. విజయరాఘవ నాయనయ్యవారు వొలాందా రిశులా
3. వ్వంగుసు అమరాల్కు యిచ్చినకౌలునమ్మిక శాసనము
4. తమకుంపినయ్య వర్తకప్రవర్తకం నాగపట్నం రేవునన
5. డిపించుకొనేమనిన్ని అందుకు కౌలుకట్టళ్లు కట్టడశాయ
6. పలెనని చిన్నయశెట్టివారు మాతోచాలామనవి రూపం
7. గా విన్నపంచేసుకొన్నారు కాంబట్టి ఆరీతున్నే తాము నాగ
8. పట్నానకువచ్చి వర్తకప్రవర్తకం నడిపించుకొనేని తమకు
9. పరంగివారి వశానవున్న కోటానుకట్టడచేసి వారియిండ్లు
10. ముంగిళ్లున్ను కట్టడచేసినారము। ఇదిగాక పరంగివారి
11. కాపితానికిన్ని వాయిర్పల్లి గుళ్లకున్ను తోంటపరంగివారికిన్నినడ
12. చినగ్రామాలు వుత్తూరుగ్రామం ముట్టంగ్రామం పోరు
13. వాశ్చేరిగ్రామం అంతోనిపెంట గ్రామం కరువేప్పం
14. గాడెగ్రామం ఆలిండిళమంగళం గ్రామం సంగమం
15. గళంగ్రామం నిరుత్తినమంగళం గ్రామం మంజెకొల్లైగ్రా
16. మం నరియంగుడ్డి గ్రామం అంతుగ్రామాలు 10
17. ఈవగి గ్రామాలున్ను తమకు కట్టడచేసినారంగనక ఆగ్రామా

18. లు ఎంటిపేరింటకనే పుట్రాస్తికి నగరికితాము ఎంటిపేరిట కానుక
19. యిచ్చుక రాగలవారు। ఇదిగాక తాము నాగపట్నంరేవునవి
20. క్కింంచే సరుకుసప్పట్లు కోంకదాకలు దివసధాన్యాదులకున్ను దించే
21. సరుకునప్పట్లకున్ను ఎగుమతి దిగుమతి తీరువ సర్వమాన్యం
22. గాకట్టడచేసినారము। తమ కుంపినీవాడల్కు అడసాలమురిసాలలే
23. కుండా తమదిగానే కట్టడచేసినారము। తమవర్తకులేమిమనుష్యమా
24. త్రులేమి నిలువసాలువలు సొమ్ముసంమ్మంధాలు ఎట్టుకొని
25. నగరి గ్రామాంతరాల పారివచ్చి వున్నట్టాయనా వార్ని నీవార్ని సొ
26. మ్ముస్నా, తమకే వప్పగించగలవారము। మాసీమలో తాము
27. వర్తకప్రవర్తకం తమకుసరిపోయిన దారిని నడిపించుకొనే
28. తండ్లల్లోనగరి చిల్లరళ్లు నడపకుండానున్నా కట్టడనేసినారము। త
29. మకుయిచ్చిన పరంగివారిగ్రామాల్లో వున్మేకాంపులపట్లనేమి
30. నాగపట్నాన తమవర్తకులై వుండే వారిపట్లనేమి నగరనుండి
31. న్నిచిల్లరల్లు నడువకుండానున్నా తమమనుష్యులు నాల్గుదిక్కుల
32. కున్నుకమ్మగాళ్లు కొంచపొయ్యేవార్ని సుంకసూత్రాలు లే
33. కనున్నా కట్టచేసినారము. యీప్రకారం కవులు కట్టడచేసినార
34. ము। గనక యీబద్ధతినాంట పుత్రపౌత్ర పారంపర్యంగానడి
35. చేటట్టు కట్టడచేసినారము। గనక యిందుకు లేశమయినాతప్ప
36. కతమపట్ల నడిపించుకవచ్చేమని చిన్నన్న శెట్టివార్కి నమ్మిక
37. మాటపట్లున్ను యిచ్చినారము। అటుగనుక తామునునగరిప
38. ట్లహిత విశ్వాసముగలిగి కరతోరలున్నా ఋజువుఅయ్యేటట్టు
39. గానడిపించుకొని యీకవులుకునమ్మి ఆచంద్రార్కస్థాయి
40. గావర్తకప్రవర్తకము నడిపించుకునే సుఖానవుండేది
41. శ్రీవిజయరాఘవ.

పై నమ్మికశాసనము చారిత్రకముగనే గాక భాషావిషయమున విలువగలది. ఈ శాసనము తేది 15-9-1658. ఆ కాలమున, ననగా తంజావూరి నాయకరాజుల పాలనలో తెలుగు తమిళములు రెండును

రాజకీయవ్యవహార భాషలుగానుండెనని దీనివలన తెలియుచున్నది. ఇందు పరంగియను పదము 'పోర్చుగీసు'వారికి వాడబడినది. ఈ తరువాత నిది పరాసువారికి వాడబడినది. భాష వర్తకవ్యవహార సరళి నున్నది. కుంపినీపద మిందు ప్రయుక్తమైయున్నది.

(Two Negapatam grants from the Batavia Museum) By K. A. Nilakanta Sastri, M.A. Proceedings of the Indian Historical Records Commission 1937 Vol. XIV 39. Page 42.

పుట 188. తులజాజీ - ఆలూరి కుప్పనకవి
(ఆంధ్ర కాళిదాసు)

ఆలూరి కుప్పనకవి తన యాచార్యవిజయమున నొక చోళేంద్రుఁడు తన 'కాంధ్ర కాళిదాస' బిరుదమునిచ్చి మన్నించినట్లుగా నిట్లు చెప్పుకొనియున్నాఁడు.

క. ఘనుఁడగు చోళేంద్రుఁడు దయ
దనరఁగ నీకాంధ్ర కాళిదాసాభిదమ
న్ననగా నొసంగెనట నీ
యనుపమ సాహిత్యమునకు హా! యనవలదే.

తంజావూరి పుస్తకశాలలో వ్రాతప్రతి1యందిట్లున్నను మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోను,2 ముద్రితప్రతి3 యందును నీ పద్య మిట్లున్నది:

క. ఘనుఁడగు తుళజేంద్రుని దయఁ
దనరఁగ నీవాంధ్ర కాళిదాసాభిద మ
న్ననగా నొసంగెనట నీ
యనుపమ సాహిత్యమునకు హా! యనవలదే.

---

1. A Discriptive Catalogue of Telugu Manuscripts, Tanjore Library No. 130. Page 15.

2. Triennial Catalogue of Manuscripts Part 3. Telugu Vol. II Page 1. No. 138.

3. వేంటూరి సుబ్రహ్మణ్యము గారి విద్యావిలాస ముద్రాక్షరశాల, మదరాసు, 1868.

ఈ తుళజేంద్రుఁడు, శహాజీ రాజకుమారుఁడును శివకామసుందరీ విలాస నాటకకర్తయు, క్రీ. శ. 1729 నుండి క్రీ. శ. 1735 వఱకు తంజావూరిని పాలించిన మొదటి తులజాజీ కాదగును. మఱియు కుప్పనకవి గద్యలో 'శ్రీమద్భోసల తుళజమహారాజకటాక్ష సముల్లసి తాంధ్ర కాళిదాసకవి ప్రణీతంబైన' అనియు చెప్పుకొన్నాఁడు. మఱియు క్రీ. శ. 1740-60 ప్రాంతముల ప్రసిద్ధుఁడైన కస్తూరి రంగకవి కీతఁడు శిష్యుఁడగుటచేత పై కాలము స్థిరపడుచున్నది.

ఆచార్యవిజయ గద్యలో నాంధ్రకాళిదాసను బిరుదనామమే యున్నను, నీతని యసలుపేరు 'కుప్పన'యని యాతని భాగవతదశమ స్కంధ యక్షగానావతారిక1 వలనఁ దెలియుచున్నది.

> " ననునరసింహార్చనాసమున్నతుని
> ఘనసత్కవిత్వలక్షణ విచక్షణుని
> కస్తూరిరంగ సత్కవిశిష్యభూప
> కస్త్యుత్యుఁ గుప్పనకవినిరప్పించి"

> " పరికింప శ్రీమహాభాగవతంబు...
> హరికతి ప్రియమగునందునుజూడ
> నలదశమస్కంధమతి చిత్రమదియ
> గాననమ్మోహనీయ కథమెల్లయక్ష
> గానప్రబంధంబుగా సంఘటించి
> జనసుతంబుగఁ బార్థసారథివిజయ
> మను పేరఁదనర......నొసగుమటంచు"

ఈతఁడు చాల కృతులు రచియించియున్నను, నందు రెండు మాత్రమే లభ్యమగుచున్నవి. తులజేంద్రునకు గూడ ప్రత్యేకముగనే దేనికృతి యొసంగెనేమో తెలియరాదు. పైని చెప్పిన ఆచార్య విజయ మనగా శంకరాచార్య చరిత. ఆనందగిరి రచిత శంకరవిజయమునకు

1. Desciiptive Catalogue of Telugu Manuscripts Vol. VIII. Yakshaganas No. 1907.

తెనుఁగు, ఆ గ్రంథావతారికలో కృతి ప్రోత్సాహకులగు చెన్నపురీ నియోగశిఖామణులు తన్నుగూర్చి యీ విధముగ పలికినట్లు చెప్పి యున్నాఁడు :

క. ననుశ్రీనృసింహ పాదా
ర్చనజనితలసత్కవిత్వచాతుర్య గుణా
ఢ్యుని నాంధ్రకాళిదాసా
ఖ్యునిఁబిల్వఁగఁ బంచిపల్కరున్నత కరుణన్.

సీ. లీలపంచనదీస్థలీ పురాణము తెనుఁ
గించితివారూఢ కీర్తిమెఱయఁ
బరగురామాయణ భాగవతంబులు
యక్షగానము చేసిశ్రుతముగను
గరమొప్పఁ బరమభాగవత చరిత్రయుఁ
గృతిగొనర్చితివి యున్నతిఁదలిర్పఁ
దెలివొందు నిందుమతీపరిణయ నామ
కృతిరచియించితి వతులగరిమ

గీ. గురుతరోజ్జ్వల సరణితో హరికథాసు
ధారసాభిధ కావ్యముదారఫణితి
గారవించితి వెనలేని గద్యపద్య
తతులు లెక్కింపఁ దరమెత్త్వత్కృతులు జగతి.

పై వానిలో పైనుదాహరించిన భాగవతము దశమస్కంధము యక్షగానమును లభించుచున్నది. తక్కినవానిలో పంచనదీస్థలీ పురాణము (తిరువాడి క్షేత్రము) పరమభాగవత చరిత్ర, ఇందుమతీ పరిణయము, హరికథాసుధారసము లభ్యముకాలేదు.

ఆచార్య విజయమునందలి గద్య : ఇది శ్రీలక్ష్మీనృసింహ దేవదయా సంపాదిత సరససాహిత్య విరాజిత శ్రీమదాలూరి వేంకటగిరి సుధీపౌత్ర, వేంకటేశ్వరార్య నరసమాంబికా సుపుత్ర, అప

స్తంబసూత్ర, కాశ్యపగోత్ర పవిత్ర కస్తూరిరంగ సద్గురుపాదార వింద భజనానందిత హృద్విలాస, శ్రీమద్భోసలతులజ మహారాజ కటాక్ష సముల్లసితాంధ్ర కాళిదాస ప్రణీతంబైన శ్రీమదాచార్య విజయంబను మహాపురాణంబునందు......షష్ఠాశ్వాసము.

—: కస్తూరి రంగకవి :—

ఆంధ్రకాళిదాస బిరుదాంకితుఁడగు నాలూరి కుప్పనమంత్రి గురువు కస్తూరిరంగకవియు దాక్షిణాత్య వాఙ్మయమునకుఁ జెందిన కవియే. కస్తూరిరంగకవి లక్షణచూడామణి యను పేరుగల "ఆనంద రంగరాట్ ఛందస్సు"అను గ్రంథముచే నీవఱకే వాఙ్మయలోకమునకు సుపరిచితుఁడు. ఈతని యచ్చతెనుగు నిఘంటువు, సాంబనిఘంటువు, నిఘంటుత్రయములో నొకటి. కృష్ణార్జున చరిత్రమును, పద్మనాయక చరిత్రమును నీతని కృత్యంతరములు.

ఈతఁడు ఫ్రెంచి దొరతనమువారి కాలమున పుదుచ్చేరిలో దుబాసిగానుండిన ఆనందరంగపిళ్ల కంకితము. కావుననే దానికి ఆనంద రంగరాట్ ఛందమను పేరుగలిగినది. రంగకవి యానందరంగపిళ్ల యా స్థాన కవియేగాక, రాజకీయ వ్యవహర్తగాకూడ నున్నవాఁడు. తిరుచినా పల్లిలో ఫ్రెంచివారి కాతఁడు వకీలుగానుండెడివాఁడు. రంగకవి వృత్తాంత మానందరంగ పిళ్లగారి దినచర్య గ్రంథమునుండి చక్కఁగాఁ దెలియు చున్నవి. [1]ఈ రంగకవినిఁగూర్చి కీర్తిశేషులు వంగోలు వేంకటరంగయ్య పంతులుగా రిట్లు వ్రాసియున్నారు:

"మఱియు నీ కవియు తెలుఁగు దేశస్థుఁడుగాఁడు. తిరుచినాపల్లిలో సేనానాయకులలో నొక చిన్న యధికారిగానుండెను. అటులుండియు తెనుగున లక్షణ గ్రంథము వ్రాయునంతటి పాండిత్యము భాషాభి మానము గలిగియుండెను. ఈ కవి ఆరువేల కమ్మనియోగి తెగవాఁ డయినందున ఆంధ్రుఁడేయగును"

---

1. భారతి. అంగీరస - ఫాల్గుణము. ఆనందరంగపిళ్ల దూప్లేద్విభాషి. పుటలు 460-465.

కస్తూరిరంగకవినిగూర్చి యీ క్రింది వ్యాసములు గలవు :

1. వీరేశలింగకవి కవులచరిత్ర మూఁడవభాగము. 170-171 పుటలు. (1950 ముద్రణము.)

2. ఆనందరంగపిళ్లె రంగరాట్ ఛందస్సు కృత్యవతరణిక. కీ. శే. వంగోలు వేంకటరంగయ్య పంతులుగారు. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. 8 సం. సం. 1.

3. శతక కవులచరిత్ర. కీ. శే. వంగూరి సుబ్బారావుగారు. పుట 486.

4. ఆనందరంగపిళ్లె డూప్లేద్విభాషి. యీ వఱ కుదాహృతము.

5. కస్తూరిరంగయ్య. డాక్టరు రాఘవన్‌గారు. భారతి 1942.

6. Kasturi Rangaih. Article in English by Dr. V. Raghavan. B. C. Law Commemoration Volume.

పుట 254.

సముఖము వేంకటకృష్ణప్ప నాయకుని జైమినీభారతము - అవతారికాభాగము.

క. బాగైన తత్కులంబున
సాగరవలయాంకధరణి చక్రముఁబూనన్
నాగమహీధర శౌరి
నాగమనాయకుఁడు బుధజనాగమనిధియై.

క. ఆనాగమ నాయకునకు
దానామరశాఖ సమరదర్పితరిపురాట్
సేనావన శిఖనృప స
న్మానితుఁడగు విశ్వనాథనాయుఁడు బుట్టెన్.

1సీ. అచ్యుతరాయలే యవనీశమౌళికి
నరుదుకాపలువగ బిరుదులిచ్చి
దక్షిణసింహాసనాక్షీణసామ్రాజ్య
ధౌరేయుఁడయ్యెనే ధరణివిభుఁడు
ఘనముగావిజయదుర్గను మహాలక్ష్మినే
ధీరుండు తెచ్చి ప్రతిష్ఠజేసె
మధురాపురంబున మహనీయపాండ్య భూ
మండలంబేలెనే మహిపమౌళి

గీ. అతఁడునృపమాత్రుఁడే మహాహవజయాంక
భువనవివరాది బిరుదసంభూతకీర్తి
కార్తికీశచంద్ర ధవళితగగన వాటి
యలఘుఁడగు విశ్వనాథనాయక కిరీటి.

క. ఆయవనీశ్వర మౌళికి
నాయత బాహాకృపాణ హతవైరిచమూ
నాయకుఁడగు పెదకృష్ణప
నాయఁడు జనియించె సజ్జనావనపరుఁడై.

చ. గజమున నంకుశ స్థితులుగావుగిరుల్ సరియేని పద్ధతిన్
భుజగవరుండుడాఁగు కిటిముఖ్యుఁడు చూడఁగనొంటికాఁడు త
ద్భజనమవర్ణమంచు వసుధారమణీమణి కృష్ణపెద్దభూ
భుజుని భుజాగ్రపీఠమునఁ బొందికఁజెందునమందవైఖరిన్.

క. అతనికి సుతుఁడయ్యె మహో
న్నతచరితుఁడు పాదపద్మనమితారిమహీ
పతి, పెదవీరధరిత్రీ
పతి, సంపదలను నిలింప పతిచెలువలరన్.

1. This verse is quoted in Further Sources of Vijayanagar History Vol. II. by Dr. N. Venkata Ramanayya, M. A., Ph. D.

ఉ. నీళ్లమునింగియుండి. నవనీయవరాహము పంటిముంటి యం
దల్లలనూఁదియుండి, పవనాశన వృత్తిగనుండి, కొండలం
దెల్లఫుకుండి, యీధరణియెంత తపంబొనరించెనో, హరి
ద్వేల్లితకీర్తిమైన పెదవీరనృపాలుని చెట్టఁబట్టఁగన్.

క. ఆయన కుమార కృష్ణప
నాయనిఁగనె నతఁడుపూర్ణ......లీలల్
బాయక కువలయసౌఖ్య
శ్రీయుక్తిన్ ఘనకళావిశేషముఁ గాంచెన్.

క. అస్తోక కీర్తిరుచులుద
యాస్తాచల పుష్పవాటియై విలసిల్లన్
ప్రస్తుతగతి యాసుకృతికి
కస్తూరిరంగ నృపతిఘనమతిఁ బుట్టెన్.

గీ. నెమ్మినెలమూఁడు వానలునిండఁ గురియు
సకలభూమండలంబు దున్నకమె పండు
పాండ్యమండలమేలు నప్పార్థివునకుఁ
గృష్ణభూపతి యుదయించెఁ గృష్ణుఁడనఁగ.

క. ఆతనికి నుదయించె మహో
న్నతతిరుమలశౌరి చరణనమితారి జనా
హితహారి సదా......దయు
కృతతపదర్శన విహారిశౌరి యనంగన్.

శా. శ్రీమీనాక్షియు సుందరేశ్వరులుఁ బేర్మిన్ తల్లిదండ్రింబలెన్
ప్రేమంగామితముల్ ఘటింప విభవశ్రీలీల దేవేంద్రుఁడై
భూమీమండలమేలె సర్వచతురంభోరాశి మధ్యక్షమా
భామామాక్తిక భూషణంబగుచుఁబర్వన్ సర్వసంస్తుత్యుఁడై.

క. స్తుతమతి ముదువీరనృపుం
డతనికి సుతుఁడై జనించె యవనీచక్రం
బతులిత బాహాశక్తిన్
ధృతిమీఱ ధరించెవైరి నృపులుఁదలంకన్.

గీ. చొక్కనాథేంద్రుఁ డతనికి సూనుఁడగుచు
నక్కజంబగు కీర్తిచే నతిశయించె
దిక్కులెల్లను గెలిచిధాత్రిని వహించె
మక్కువనుహస్త ముద్రికామరకతముగ.

గీ. అతనికిఁగళ...దోషుఁ డతఁ డయాంకుఁ
డమితసంఖ్య కళాధారి యరివిదారి
నృపతిచంద్రుఁడు శ్రీరంగ కృష్ణముద్దు
వీరభూపతి పుత్రుఁడై వెలసెధరణి.

సీ. తనవీరభటజన ఘనపదాహతులచే
దిగ్గజంబులతలల్ మొగ్గతిలఁగఁ
దనరణభేరికా ధణధణత్కారంబు
రిపువధూగర్భ నిర్భేదనముగఁ
దన తేజి సంగరోద్ధతవైరి రాజవ
క్షస్థలంబులు రవగాలుఁద్రొక్కఁ
దనకత్తిసామంత ధరణీకాంతుల కంఠ
భాగంబులనునిండు పదనుఁజూపఁ

గీ. జెలఁగు నిక్కేరి, మైసూరి, చెంజితంజ
పురి విజాపురిఢిల్లీశ ముఖ్యరాజ
విజయ లక్ష్మీసమాశ్లిష్ట భుజుఁడు రంగ
కృష్ణముదు వీరనృపతి సత్కీర్తిఁగాంచె.

సీ. తనకీర్తిదశదిశా తాటంకవతులకుఁ
జెక్కుముత్యాల చేర్పుక్కగాఁగఁ
దనప్రతాపము మహోత్పల భవాండకటాహ
మునకు బంగారంపుఁ బూఁతఁగాఁగఁ
దనచరిత్ర యశేషధారుణీ పతులకు
ననవద్యమగు నిదర్శనముఁగాఁగఁ
దనదు చక్కదనంబు తరుణీమణులకెల్ల
రతిపతి మోహనాస్త్రంబుఁగాఁగ

సీ. పలికినపలుకెల్ల పద్మగర్భనివ్రాలు
తలఁచినతలఁపెల్ల ధర్మమయము
నడచిననడలెల్ల నయమార్గసారంబు
చూచినచూపెల్ల శుభకరంబు
పనిచినపనులెల్ల పరచమూభయదంబు
కోరుకోరికకెల్ల కొంగుపసిఁడి
ఎన్నునెన్నికలెల్ల హితములోకములకు
మనుమన్కియెల్లను మాననీయ

గీ. మార! యీ మేటికిని సాటియవనిఁ గలరె
నాఁటిరాజుల యందును నేఁటిరాజు
లందునను బాండ్యసింహాసనాధినాథుఁ
డిల విజయరంగ చొక్క నాగేంద్రుఁ డలరు.

చ. బవరమునందు శాహనరపాలుని గర్వమడంచి, దుష్టులా
యవనుల మించనీక తనయాజ్ఞ శిరంబునఁదాల్చి పాళెగా
ర్లవిరళ రత్నకాంచనము లప్పనలియ్య సమస్తభూమినే
లువిజయరంగ చొక్కనృపలోక శిఖామణి రాముకై వడిన్.

సీ. తడకట్టుపాముల దారిగానామన్నె
దొరలిట్టు నటునాడ వెఱచియుందు
రెక్కడెక్కడి వారలక్కడక్కడ పాళ్య
గార్లు చిత్రాకృతిఁ గదలకుండ
పుఁజుమోయుచును వనంబుల సంచరింపుచు
శాత్రవుల్ పశువులసరణి మెలఁగ
శూలాగ్రమున మేను శోషింపఁజేయుచుఁ
జోరకుల్ తపముల తీరుగాంచ

గీ. నవనిపాలించె నారనైకాతపత్ర
సరణిఁ శరణాగతత్రాణ బిరుదధారి
పంచతిరువడి రాజసప్తాంగహారి
శ్రీవిజయరంగ చొక్కధాత్రీ బలారి.

సీ. ఎందాఁక నిందిరాధీశు వక్షంబునఁ
  గౌస్తుభరత్నంబు కాంతిమెఱయు
నెందాఁక చిత్తజాహితజటాజూటికఁ
  గ్రొన్నెలరాకళ్కు వన్నెమీఱు
నెందాఁక లోకత్రయీసృష్టికర్తనె
  మ్మోమున వాగ్దేవి మోద మొందు
నెందాఁక నాది నాగేంద్ర

... ... ...

గీ. నెలయునందాఁక వంశాభివృద్ధిగాఁగ
సకలసామ్రాజ్య లక్ష్మీవిశాలభోగ
బహుసుపుత్రాయురారోగ్యభాగ్యగరిమ
శ్రీవిజయరంగ చొక్కధాత్రీశుఁడవని.

గద్య :— వెండియు నఖండమార్తాండ మండలతేజఃప్రకాండ వైశ్వానరజ్వాలికా నిరంతరసంతప్యమాన బ్రహ్మాండ భాండస్ఫుటిత విదీర్ణవిక్షిప్త వీహికర్ణాయ మానవివిధవిరోధి సామంతవసుంధరా నాథయూథుండును, వినిశ్యంప్రబోధుండును, కుంభికుంభీనసకుంభినీ ధీరకూటకఠోరసంరంభ వీరరణప్రారంభక లీలావిజృంభమాణదంభోళిధీర గంభీరవేదికర సంభావ్యమాన విమతకుంభినీవరదురభిమాన స్తంభ దంభప్రతిష్టంభ శరణాగతరక్షా సంభార గంభీర, శుంభద్ధ్వజ స్తంభ సంధృతగరుడస్తంభ సంతోషక్రియాం భావుక, కలమసముదయ ధరాధోనీరాంచ కుంభితాశ్లాష విస్ఫలం భానంభోధి పలయిత విశ్వంభరాంభోజముఖీ మేఖలాసంచరణ శీలుండును, శూరమ్మన్యమన్య రాజన్యజన్యమువని పాలుండును, ఘోటకపాపేతగిరితటకల్పక పటీరవిటపివాటీకృతాటీకన విబుధ శరకోటిచటులచాటూ వచనపరిపాటీసముత్పాదిత నటన శశిమకుటకటక రజతగిరికటక కపటపటుచరణ సరిదురుదర శరసుర కరితురగ వరసితగరుడమల కమలకుముదసముదయ సమిదదన

విస్ఫూర్తిమూర్తికైత వాఙ్మృతఝరీప్రక్షాళిత వేలాశైలచరమ
భాగమేదినీతమఃపంకుండును, మధురాపుర శాసనాంకుండును,
అసాధ్యాసాధ్యసద్గురుధ్యానాధ్వనీన పరిపంథి విధ్వంసనదక్షహను
మత్స్యధ్వజ, గరుడధ్వజ, సింహధ్వజ, నాగధ్వజ, మకరకాద్వయ
చంద్రసూర్య శంఖచక్రభూవరాహధ్వజ, స్వర్ణ... భయచామర
సాంబ్రాణికా వధూవక్త్రప్రముఖ నిఖిలబిరుద సముదీర్ణ తేజోవి
రాజితమానుండును, శ్రీరంగనాథ జంబునాథ మాతృభూతేశ్వర
మీనాక్షీసుందరేశ్వర ప్రముఖ దేవతాపూజన సముదాయుండును,
నిఖిలదిగ్రాజరాజీరాజిత గుణశ్రేణీశ్లాఘనసముల్లంఘన జాంఘికా
నంత కల్యాణగుణైకహారుండును పంచతిరువడి సర్వాంగహరణ
విహారుండును, వలనహాయుధనాభాగసృగ నకులాద్రి ప్రభృతి
నానామహారాజ చర్యుండును, దక్షిణసింహాసన సామ్రాజ్య
లక్ష్మీధురీణుండును, సంగీతసాహిత్య సర్వస్వభోజుండును, సంతత
ప్రశాంత ముఖాంభోజుండును, సకలసుకవినముదయగేయుం
డును, సంగరరంగ గాంగేయుండును, శ్రీవుద్దమాళికాగర్భ
శుక్తిముక్తాఫల శ్రీకరుండును, కామసమన్మథాకారుండును,
కాంచనాచలధీరుండును నగు శ్రీ విజయరంగ చొక్కనాథనాయక
క్షమామండలాఖండలుం జొక్కనాధుడు గలుంపు పరికిల మొటికలు,
నిగ్గులతో నిగ్గులాడుచుం జగ్గుమీరునుగజాల నిగరాల......

Adya. Library 52-E-51 Pandya History)

పుట 206.

మధురమీనాక్షీదేవి శాసనము క్రీ. శ. 1739.

ఈ తెలుఁగు శాసనము తిరునల్వేలి మండలమునందలి నంగునేరి తాలూకాయందలి సేవల్లప్పేరి యను గ్రామమునకు సంబంధించినది. దానికి "ముద్దువేంకట లక్ష్మీపతి భూపాలసముద్రము" అను వేఱొక పేరు గలదు. ఈ గ్రామమునందలి కొన్ని భూములను "ఇమామ్ సాహెబు" అను నొక ఫకీరునకు మీనాక్షీదేవి దానమొసంగిన వివర

ములను తెలుపునది. ఈ శాసనము వ్రాసినది గోవిందప్పయ ప్రధాన కార్యకర్తయగు శివరామయ్య.

శాసనమున 55 పంక్తులు గలవు. అందు సరిహద్దులను దెలుపు భాగము 6 పంక్తులు అరవము. మిగిలినది తెలుగు.

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శాకాబ్దంబులు 1660 ప్రభవాది సంవత్సరంబులు 51 మీాదటనగు నేటి కాళయుక్తనామ సంవత్సరము మాఘ శుద్ధ 12 శుక్రవారమున్ను పునర్వసు నక్షత్రమున్ను శుభయోగ శుభకరణమున్ను కూడిన శుభదినమందు శ్రీమత్కాశ్యప గోత్ర జాతులైన చొక్కనాథ నాయనయ్యవారి పుత్రులైన విజయరంగ చొక్కనాథనాయనయ్యవారి పట్టమహిషి అయిన శ్రీ మీనాక్షమ్మ గారు పకీరిగురువులు యిమామ్ సాయెబుకు యిచ్చిన తామ్రశాసన క్రమము యెట్లన్నను,

శ్రీమన్మహామండలేశ్వర మహారాజమకుటోప లాలితాకుమా దిశ సామ్రాజ్య లక్ష్మీనివాస భూదేవ మహారాజులైన శ్రీరాయలు గేపుకవారు, మాకు పాలించియిచ్చిన తిరుచినాపల్లి మధురసంస్థాన మందు తిరువాడిరాజ్యాన తిన్నవెల్లితో చేరిన శీవల్లప్పేరికి ప్రతినామమైన ముద్దువెంకట లక్ష్మీపతి భూపాలసముద్రములో పెద్దచెఱువు క్రింద తూరుపుమడవ ఉ తూరుపుకట్ల మూన్కణ్ణరులోను కట్లసేఖరముగాను కయ్యలు 9 టికి విస్తీనము కోట 1 న్ని వెల్లి ప్యాతనుంకములో దినము 1కి తెలుపులుకి 2 లెక్క అడిత్తూముడు సాకలున్ను ఈ రెండు మాన్యములున్ను పకీరుగురువులు ఇమామ్ సాయిబుకు శుద్ధసర్వమాన్య ముగా కట్టడచేసి తామ్రశాసనమును వ్రాసియిచ్చినారము. గంగ కోటడు విస్తీనములో కలిగిననిధి నిక్షేపజలతరు పాషాణాక్షీణాగామ్య సిద్ధసాధ్యములనియెడి అష్టభోగ తేజస్వామ్యముల సహితముగాను పుత్ర పౌత్ర పారంపర్యముగాను, శ్రీ మీనాక్షమ్మవ్రాలు. ఆచంద్రార్క స్థాయిగాను, దానాదివినిమయ విక్రయములకున్ను ఈ అడిత్తూముడు

దినము 1కి తెల్పులుకి 2 కిన్ని యిదే తామ్రశాసనముగా కట్టివుంచుకొని సుఖాన అనుభవించుకొనేది. ఈ ధర్మానకు ఎవ్వండైనా నేమి విఘాతం చేస్తే వాండ్లు బ్రహ్మక్షత్రియ వర్ణములలోనివాండ్లైతే కాశిలోను బ్రహ్మ హత్య గోహత్య మాతృపితృహత్య చేసిన పాపాన పోగలవాండ్లు! ఈ క్రమానకు రాయసం గోవిందప్పయ్య కుమారుండ్లు శివరామయ్య వ్రాసిన తామ్రశాసనము.

దానపాలన యోర్మధ్యే దానచ్ఛ్రేయోऽను పాలనమ్
దానాత్ స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతమ్ పదమ్.

తరువాత తమిళభాషలో నున్నది.

(Travancore Archaeological series Vol. VI. Part II. No. 81. A Telugu Copper plate of Queen Minakshi Saka 1660. Pages 229-235.

పై శాసనములో తెలుపులు. అనగా వెంకిశోచేసిన రూకలని యర్థము.

పుట 328.

కృష్ణవిలాస కర్తయగు విశ్వేశ్వరకవి యీ గ్రంథమునకు ముందు పెక్కు సంస్కృతాంధ్ర కృతులు రచియించినట్లుగా నీ క్రింది రీతిని చెప్పియున్నాడు.

సీ. కర్కశంబగునట్టి తర్కశాస్త్రంబున
మిగులశిరోమణి మించినట్లు
రాణదలిర్చు పురాణంబులందెల్ల
భాగవతంబు చొప్పడినపగిది
భవ్యసంస్కృతనవ్య కావ్యంబులందెల్ల
కడునైషధంబొప్పు గాంచినట్లు
భాగైనయాంధ్ర ప్రబంధమ్ములందెల్ల
నాముక్తమాల్యద యలరుకరణి

గీ. నేను రచియించినట్టి సంస్కృతకృతులను
తెలుఁగు కృతులను గూఢార్థకలనఁ గలుగ
సంస్కృతాంధ్రాది లక్ష్యలక్షణములందుఁ
దెలియఁజాలనివారికిఁ దెలియవశమె.

కాని యీతని గ్రంథ్యాంతరములు లభింపలేదు.

కృతిపతియగు రామచంద్ర నాయకుఁడు క్రీ. శ. 1652 లో జన్మించి క్రీ. శ. 1718 లో మరణించినట్లుగా, సేలముజిల్లా గెజటీయరు వలనఁ దెలియుచున్నది. (సం. 1. పుట 69.)

Ramachandra Naika.

Robert D'e Nobili founda Ramachandr a Nayaka established at Shendamangalam in 1623. The Horscope of another of these Ramachandra Nayakas came into the hands of Col. Mackenzie from which it appears he was born in October 1652 & died in 1718. The name is associated with Talai-Amalai, a hill overlooking the Kavery in the south of Namakkal Taluk, and the Namakkal fort is said to have been built by a prince of the line.

Selem District Gazetter Vol. I. Page 69. (History)

పుట 403.

చిక్కదేవరాయ కాలమున వైష్ణవ విద్వాంసులలో చిక్కుపాధ్యాయుని తరువాత రామాయణము తిరుమలాచార్యుఁడు ప్రసిద్ధుఁడు. ఈతఁడు క్రీ. శ. 1674 వ సంవత్సరమున దేవనగిరి శాసనమును రచించినాఁడు. ఈతఁడు కర్ణాటాంధ్ర సంస్కృత కవిత్వములందేగాక గాంధర్వ విద్యయందును ప్రవీణుఁడు.

(History of Mysore. by Hayavadana Rao. Vol. I. Chapter XIV. Page 421. Literary Activity in the time of Chikka Devaraya Wodeyar).

పుట 426.

## —: తుపాకుల అనంతభూపాలుఁడు :—

చంద్రగిరి కృష్ణరాజపుత్రుఁడైన అనంతభూపాలుఁడు చెంజీదుర్గ పాలకుఁడు. ఈతఁడు వచన భారత రచనలలో కళువె వీరరాజునకుఁ దోడ్పడుటయేగాక, విష్ణుపురాణమును రామాయణ సుందరకాండమును వచనముగా రచియించియున్నాఁడు. వీనిలో విష్ణుపురాణము ముద్రితమైనది. సుందరకాండము ముద్రితము కాలేదు. ఇతఁడు తన గద్యలో 'నిఖిలపురాణేతిహాస కథానసంధాన సమేధమానచాతుర్య వచనరచనా వైచక్షణ్య' అని చెప్పుకొన్నాఁడు. ఈతఁడు తెనుఁగు వచనరచయితలలో నొక యగ్రస్థాన మలంకరింపఁదగినవాఁడు. మచ్చున కాయా గ్రంథములనుండు యుదాహరించు చున్నాఁడను,

### విష్ణుపురాణము

"కలియుగంబున వర్ణాశ్రమధర్మంబు లప్రకాశప్రధానంబులై యాచరింపంబడకుండఁగలవు ఋగ్యజుస్సామ వేదమార్గంబునం బ్రవర్తిల్లవు. న్యాయప్రాప్తంబులగు వివాహంబులును ధర్మమర్యాదా కలితంబులగు గురు శిష్యభావంబులును దాంపత్యధర్మంబులు నగ్నిసంతర్పణంబులు దేవపూజా విధానంబులు కలియుగంబున గలుగనేరవు".

### సుందరకాండము

అయిదాశ్వాసముల గ్రంథము.

ఓపురుషపుంగవా! నీవుత్సాహ సంపన్నుఁడవగుటను నన్నుఁ గరుణింపుము. నీవంటి వల్లభుఁడుండియు నేననాథ తెఱంగుననున్నదాన భూకారుణ్యంబు పరమధర్మంబని పూర్వంబున నీవలననే వినియుందును. నీవు మహావీరుండవనియు, మహోత్సాహుండవనియు, మహాబల సమన్వితుండవనియు, నెవ్వరికింగానికార్యంబు నీకు శక్యంబనియు నెఱుంగుదు,

పుట 436.

కళువె వీరరాజుపేర వీరభూపాలీయ మను నొక లక్షణ గ్రంథము గలదు. ఇది 'వీరనఛందస్సు' అను పేర వెలయుచున్నది. "గరళపురిఛందస్సు" అను మఱియొక ఛందోగ్రంథమును నీ వీరన ఛందస్సును సమానముగా నున్నవి. పరిషత్పుస్తక సంఖ్య [illegible]. 10 పత్రములు గలవు.

ప్రారంభము :

క. వీరనయ వరగుణాఢ్యులు
వీరనయ మహత్త్వసత్కృత విద్వత్కవిహా
వీరనయనాంచల కృతికి
వీరనలఘులక్షణంబు విరచించెదఁగన్.

ఉ. ఈలఘులక్షణంబు సులభేచ్ఛ గ్రహించి యనంతరంబు ప
ద్యాలపదాలమర్మము లుదారతఁబూని పరామరించునా
వేళల నెల్లలక్షణము వేయువిధంబుల సంగ్రహింపఁగాఁ
జాలును రెట్టివారును నిజంబిదె యేగద కీలు దీపికిన్.

ఆ. వె. పామరులకుఁ గావ్యభావంబు తెలియదు
చీకటింటిలోని చిత్రమట్లు
కొంత తెలివియున్న కొఱవి వెలుంగగుఁ
బండితులకు దీపభాతియగును.

సీ. ప్రాసమిగునదినాల్గింట వాసిగాంచి
వ్యష్టివిధయతులందున స్పష్టమెసఁగి
సర్వసాధారణంబగు [illegible] జూచి
తేటగను తేటగనునట్టి తెఱఁగొనర్తు

పుట 449.

సుగుటూరి తమ్మభూపతి - శివదర్పణము

గద్య :—ఇది శ్రీప్రమథావతార, సుగుటూరి వంశ కలశాంబుధి సుధాకర, శివదర్శనస్థాపన ధురంధర సకలకవిబుధజన సరసిజ మిత్ర, శివానందభూపాల చిక్కరాయతమ్మప్ప నరేంద్రతమ్మప్ప మహీపతికలితసౌభాత్ర, సహృదయహృదయాహ్లాద భాషాత్రయ ప్రబంధనిర్మాణ, సంగీతసాహిత్యసారస్య సారభాస్వాదచాతురీ ధురీణ, నిజాంధ్రవశంవద నిఖిలసామంతధౌరేయ, దానరాధేయ, తమ్మప్పరూప రామేయ, ముమ్మడి చిక్కరాయ మహీపాల హృదయ కమలకుహర విహరమాణ శ్రీసాంబశివప్రేరితేన వనాన్వయనృసింహసూరి వరసూనునా, బ్రహ్మవిద్యాధ్వరేణ విరచితే, వేదాంతసర్వస్వాపరనామని శివదర్పణే ప్రథమాధ్యాయస్య, ప్రథమః పాదః.

Adyar 8. I. 21,

పుట 454.

మైసూరి ప్రభువగు శ్రీ కృష్ణరాజేంద్రభూపాలుని కంకితముగా నీ క్రింది గ్రంథములు రచితమైనవి.

1. శ్రీకృష్ణభూపాలీయము : చంద్రకవి రచితము (మైసూరి ప్రాచ్య లిఖితగ్రంథ భాండాగారము వారిచే ప్రకటితము. సంగీత సాహిత్య విద్యానిధులు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారిచే సంపాదితము.

2. కీర్తికాంతా స్వయంవరము : మానూరి గోపాలరాయ కవి. రచితము. ముద్రితము.

3. చామరాజేంద్ర చంద్రిక : ఇది చామరాజేంద్ర ఒడయరునకు కృతి. సి. ఆర్. చెల్లయ్యమ్మగారు రచించినది. ముద్రితము.

# కొన్ని విశేషములు

దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయమునకు సంబంధించిన కవులను గూర్చియు, గ్రంథములను గూర్చియు మఱికొన్ని విశేషముల నిందు పొందుపఱచుచున్నాఁడను.

### తంజావూరు – నాయకరాజులు

**ఉషాపరిణయము:** రంగాజమ్మ రచితమైన యీ ప్రబంధము శేఁడాంధ్రసాహిత్య పరిషత్పత్రికయందు ప్రకటితమగుటకు ప్రారంభమైనది. **క్షేత్రయపదములు:** లభ్యమైనంతదనుక 1. శ్రీ విస్సా అప్పారావు పంతులుగారు. 2. శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులవారు. 3. శ్రీ పీఠాపురము మహారాజావారును ప్రకటించిరి. ఈ మూఁడింటియందును విపులపీఠికలు గలవు.

### మహారాష్ట్రరాజులు

ఆంధ్రవాణిని శేషాచలకవియు, సరస్వతీకల్యాణ కృతికర్తయగు శేషాచలపతికవియును నొక్కఁడేయని సరస్వతీకల్యాణమునందలి యీ క్రిందిపంక్తులచే నిర్ధారణచేయవచ్చును.

"ప్రతిష్ఠైకపాత్ర భారద్వాజగోత్ర
పతిసుచారిత్రుఁ డాపస్తంభసూత్రుఁ
డనఘు నిన్మూర్తి సంశ్లాఘ్యవంశమందు
వినయనమ్రశ్రీ వేంకటాంబసుతుండు"

శహాజీ రతికల్యాణనాటకమున నాఁడు మొగలాయిచక్రవర్తియగు నౌరంగజేబును జయించినట్లుగాఁ గలదు.

"అని యిట్లు పార్వతీప్రాణేశు పేర
ననఘుండౌ సకలలోకాధీశు పేర
చంద్రశేఖరు పేర శంకరు పేర
నింద్రసంస్తుత్యుని పేర నీశ్వరు పేర
నంకితంబుగ శ్రీమహాదేవు పాద
పంకజాలంకృత భవ్యమానసుండు
సలలిత భోసల సంతాన ఫలము
కలిత కీర్తిపాండిత్య గాంభీర్య సాంద్రుఁ
డేకరాజకుమారుఁ డెల్ల దేశముల
నేకాతపత్రముగ నేలుచునుండు
నెలమి భోసలకులేంద్రచంద్రుండు
...          ...          ...
నవ్యాగ్రహారిణి నామాదిబిరుద
భవ్య శేషాచలపతి ముఖ్యబుధుల
హార కేయూరాగ్రహార హేమాశ్వ
వారణ శిబికాది వాహనాదులొసగి
నయలీల భావించు నయకీర్తిశాలి

యవనరంగజేగాని యవనసంహారి
మగటిమి మకరంద మకరాంకబిరుదుఁ
డగు శాహభూమండలాఖండలుండు
పరగించు రతిదేవిపరిణయంబనెడు
సరసనాటకము...     ...     ...
...     ...     భాషాదులమర
గావించె భారతుల్ గాయకుల్ మెచ్చ
నాచక్రవాళ చలాచలాచక్ర
మాచంద్రతారార్కమై యొప్పగాక

ఈగ్రంథమున "పరువడి గిరిరాజపదములను, సరసుఁడైనట్టి
శాహేంద్రుని పరిపరివిధములఁ బాడుచును"
అని గిరిరాజకవికృత పదముల ప్రశంసగలదు.

## ద్విపద భారతకర్తలు

శహాజీకాలమున వ్రాయింపఁబడిన ద్విపదభారత రచయితలలో సభాపర్వకృతికర్తయగు బాలసరస్వతి దాక్షిణాత్యుఁడే. ఆది, ఆరణ్య విరాటోద్యోగ భీష్మద్రోణ పర్వకర్తయగు నాచుకూరి తిమ్మయ దాక్షిణాత్యుఁడు కాఁడు. నెల్లూరిమండలమువాఁడు. కర్ణపర్వము నుండి మహాప్రస్థానపర్వమువఱకు గల భాగములు రచించిన సోమనయు నెల్లూరిమండలము వాఁడైనను కొంతకాలము తంజాపురాస్థానమున నివసించి యుండును. వీరినిగూర్చి యీ గ్రంథమునుగూర్చి ప్రత్యేకముగ వ్రాయుదును. ఈ ద్విపదభారతమంతయు పూర్తిగా నాంధ్రవిశ్వకళా పరిషత్తువారిచేత ప్రకటితమైనది,

ఆది, సభాపర్వసంపాదకులు: శ్రీపింగళి లక్ష్మీకాంతముగారు.

అరణ్యపర్వమునుండి చివఱవఱకు: సంపాదకులు శ్రీగంటి జోగి సోమయాజిగారు.

ఈ క్రింది పేర్కొనఁబడినవారును శహాజీమహారాజుకాలమువారు కాఁదగుదురు. వారి వివరములు తెలియుటలేదు.

1. చంద్రశేఖర విలాసరచయిత అష్టావధానికవి.
2. పార్వతీపరిణయ నాటకమున పేర్కొనఁబడిన వాసుదేవకవి.

—: అక్కనామాత్యుఁడు :—

ఈ కాలమువాఁడేయని చెప్పఁదగిన యక్కనామాత్యుఁడు బాలకృష్ణలీలావిలాసము అను యక్షగానము రచించియున్నాఁడు. ఇతఁడు, భారద్వాజగోత్రుఁడనియు, సరభావలింగోజీ పుత్రుఁడనియు గద్యలో గలదు. గ్రంథము తంజాపూరి పుస్తకశాలలోగలదు. సంఖ్య 555.

తులజేంద్రుని తనయుఁడైన ఏకరాజేంద్రుని పేర వెలసిన నీతిపదములు కొన్ని భారతి 1928లో ప్రకటితములైనవి.

## —: నెల్లూరి శివరామకవి :—

ఈతని కృతియగు కామకళానిధి క్రీ. శ. 1926లో ముద్రితమైనది. గ్రంథావతారికకూడ యందుగలదు. "బిరుదుకవుల యుదంతములు" అను వ్యాసములో (ఆంధ్రపత్రిక విజయ సంవత్సరాది సంచిక పుట 111.) నేనవతారిక ముద్రణముకాలేదని వ్రాసితిని. అది పొరపాటు. శివరామకవి తండ్రియగు నెల్లూరి వీరరాఘవకవి, మొదట నెల్లూరివాఁడై యుండి యాతరువాత తంజాపురాస్థానముచేరి యుండందగును.

## —: నెల్లూరి వీరరాఘవకవి :—

ఇతఁడు కామకళానిధిని రచించిన నెల్లూరి శివరామకవియొక్క తండ్రి. ఈతని తెనుఁగు కృతులు రెండు లభ్యమైనవి. ఒకటి యాదవరాఘవ పాండవీయము త్ర్యర్థికావ్యము, రెండు సుగంధరాపరిణయము. ఈ రెండవ గ్రంథమున కవి తన వంశమును వర్ణించియున్నాఁడు, అందు తానురచించిన కృతులనుగూడ పేర్కొనియున్నాఁడు. ఆ వివరములివి :—



సీ. సప్తకాండవ్యాఖ్యలు సప్తవిధ కృతులు
హరికథలు విశేషణాస్తుదనర
రమణ విశేషణరామాయణంబునాఁ
కృతిరచించితి చతుశ్శ్రుతిరహింపఁ
కృష్ణభుజంగంబు కృష్ణలీలామృతము
త్రిపురాదిదండకకృతి రచించి
అలరస్థంభోద్భవం బాదిగాఁ దత్కథ
గద్యకావ్యంబుగా ఘటనఁ జేసి

యెంచ రసమంజరిని వెలిగించి ప్రీతి
సర్వలోకేశ శతకంబు సంఘటించి
మంత్రపాదస్తవంబును మఱియుఁ గృతులు
ఘటనఁ జేసితి వీరరాఘవ కవీంద్ర!

పై వానిలో విశేషణరామాయణము తంజావూరి పుస్తకశాలలో నున్నది. ఇది సంస్కృతమున నున్నది.

3737. విశేషణరామాయణము. నెల్లూరివీరరాఘవకవి :—

శ్రీమత్కాశ్యపగోత్రసూత్ర మహితాపస్తంబ సూత్రస్యచ
శ్రీమన్నెల్లురి రంగమంత్రిసుధియః పౌత్రస్యవిద్యానిధేః
శ్రీమత్పూజిత వేంకటపతేః పుత్రస్యరామాయణం
కావ్యం స్వీయగురు వీరరాఘవకవేః శ్రీరామమేవాఙ్మయమ్
శ్రీరామాంఘ్రిసరోరుహాంకితమిదం శ్రీరాఘవాఖ్యావతా
ప్రోక్తం సాగరసరం విశేషణమహా రామాయణం పావనమ్
శ్రీమచ్చాటుకథాను కావ్యరచనా చాతుర్యవాగ్వైఖరీ
శ్రీనైచిత్ర్యధురంధరేణ కవినా చంద్రార్కతారం వసేత్.

శ్రీ విశేషణరామాయణే వీరరాఘవీయే ఉత్తరకాండే సమాప్తం

సంస్కృత విశేషణరామాయణముతప్ప తక్కిన రెండు తెలుఁగు ప్రబంధములును నెల్లూరియందు ముద్రితగ్రంథచింతామణి పత్రికలో ప్రకటితములైనవి. వానినుండి యీ కవి కవితావైదుష్యము ప్రతిభాదికము గ్రహింపనగును.

## —: పోలూరి గోవిందకవి :—

ఈతఁడు, పర్వతనారదోపాఖ్యానము, తాళదశప్రాణప్రదీపిక, రాగతాళచింతామణి యను మూఁడు తెలుఁగుకావ్యములు రచించెను. వీనిలో సంగీతమునకు సంబంధించిన కడపటిరెండును ముద్రితములైనవి. క్రీ. శ. 1829లో శ్రీ కావలి వేంకటరామస్వామిగారు తమ కవుల చరిత్రలోనీ తఁడు తంజావూరిరాజులయొద్ద సంతెడివాఁడనియు, 'ఇందుమతీపరిణయము' అను ప్రబంధమును రచించెననియు వ్రాసియున్నారు.

ఇది కానవచ్చుటలేదు. పై వానిలో పర్వతనారదోపాఖ్యానము ముద్రితము.

## —: త్యాగరాజు :—

త్యాగరాజు రచించిననాటకములు. నౌకాచరిత్రమును ప్రహ్లాద నాటకమును ముద్రితములైనది. నౌకాచరిత్రమును చెన్నపురి విశ్వ విద్యాలయ సంగీతశాఖవారు ప్రచురించియున్నారు.

## —: మల్లులు భాషాపోషణము :—

తంజావూరి మహారాష్ట్రరాజుల కాలములోను పుదుకోట్టలోను జెట్టిమల్లు కులస్థులు, కవులను పోషించినారు. వీరిలో కొందఱు తంజావూరిలోని ధేనువాళముగరిడి (పెద్దగరిడి)కి సంబంధించినవారు. ఆ జెట్టి మల్లులో నొకడగు తిమ్మాజెట్టి ప్రేరణచే రచితమైనది,

## —: నాసికేతపురాణము :—

దక్షిణదేశీయాంధ్ర సాహిత్యమున వెలసిన ద్విపద కృతులలో నాసికేతపురాణము నొకటి. ఇది శృంగారకవి తిరుమలనాథకవి ప్రణీతము. పెద్దగరిడియందు విలసిల్లిన కృష్ణునికంకితముగా అనంతజెట్టి తిమ్మాజెట్టియను మల్లుకులస్థుని ప్రేరణచే రచితమైనది. ఇందు వంశ క్రమమిట్లు వర్ణితమైనది.

**మల్లుకులము – భారద్వాజగోత్రము.**




పై వారిలో రెండవవాఁడగు తిమ్మాశెట్టి ప్రేరణచే నిది రచిత మైనది.

మల్లులకును బ్రాహ్మణులకువలె సూత్రగోత్రములు కలవు. బ్రహ్మాండపురాణములో నేకవీరామాహాత్మ్యమని, నింబజామాహాత్మ్యమని పేరుగల ఖండమున దేవమల్లుచరిత్రమున వివిధశాఖలును దశవిధ గోత్రములును నేర్పాటుచేయబడినవి. ఈ దేవమల్లుని కథయే మల్లు పురాణము. నుదురుపాటి వెంకనార్యుఁడు రచించిన మల్లుపురాణము నిదియే. అందులో కృతిపతియగు కుప్పాల్ మల్లుఁడు, ఆపస్తంబ సూత్రుఁడు గార్గ్యసగోత్రుఁడుగా వర్ణితుఁడైనాఁడు. శివపారిజాత రచయిత వెంకటకృష్ణాశెట్టి వసిష్ఠగోత్రుఁడు. ద్విపదనింబజామాహాత్మ్య కృతిప్రోత్సాహకుఁడగు మన్నారుశెట్టి ఆశ్వలాయనసూత్రుఁడు.

కృతికర్తయగు తిరుమలనాథకవి తన్నుగూర్చి యిట్లు చెప్పు కొన్నాఁడు.

"ఘనుఁడైన శృంగారకవి తిమ్మకవిని
తనయుఁడ వైష్ణవోత్తమ సేవకుండ
మహనీయగుణుఁడ తిర్మలనాథకవిని
అహిరాజశయనుని నంకితంబుగను
కరమొప్ప పరమభాగవతచరిత్ర
పరమార్థదీపిక, పద్మినీపరిణ
యము మొదలైనకావ్యములు రచించి"

పై దానినిబట్టి యీతఁడు తిమ్మార్యునిపుత్రుఁడనియు, పరమభాగవతచరిత్ర, పరమార్థదీపిక, పద్మినీపరిణయమునను మూఁడు కావ్యములు రచించెననియు తెలియుచున్నది. మఱియు కృతిపతి తన్నుగూర్చి చెప్పు సందర్భములో,

> “లలితోక్తి దేవమల్లుచరిత్ర మాకు
> తొలుతరచించి కీర్తులు దెచ్చినావు”

అని వ్రాసికొనుటచే నీతఁడును నొక మల్లుపురాణము రచించెనని తెలియుచున్నది. కాని నాసికేతపురాణముతప్ప పై గ్రంథము లేవియు కానరాలేదు. ఈతఁడు తనకవనమునుగూర్చి యిట్లు చెప్పుకొని యున్నాఁడు.

> ‘అల మహారాష్ట్ర దేశాంగనామణుల
> కులుకుగుబ్బలరీతి గూఢమైపోక
> మట్టుగా ద్రవిడభామాకుచలీల
> బట్టబయల్ గాక భావజ్ఞులకును
> నఱజాఱుపైటల నాంధ్రభామినుల
> మెఱుఁగుగుబ్బలరీతి మేలిమిదనర
> సకలలక్షణలక్ష్య చాటుకావ్యములు
> ప్రకటించి చెప్పనేర్పరి నాఁగ మించె
> ఘనుఁడైన శృంగారకవి తిమ్మఘనుఁడు”

పై ద్విపద పంక్తులు.

చ. ఘనతరఘూర్జరీకుచ యుగక్రియ గూఢముగాక, ద్రావిడీ
స్తనగతి తేటగాక, యఱచాటగునాంధ్రవధూటి చొక్కపుం
జనుగవలీల గూఢతయుఁ జాటు దనంబును లేకయుండఁ జె
ప్పినయదెపో కవిత్వమనిపించు నగించటు గాక యుండినన్.

అను పద్యమునకు ననువాదము. గ్రంథమముద్రితము. ఇందలి యితివృత్తము నాసికేతూపాఖ్యానమే. కాని యిది దుగ్గనపద్యకావ్యము ననుసరించిన ద్విపదకాదు. గ్రంథమున మూడాశ్వాసములు గలవు.

'దక్షిణదేశమందలి ఆంధ్రవాఙ్మయము' అను వ్యాసమున నిట్లుకలదు.

"రఘునాథరాయలవారి నాటకరచనతో తంజావూరి రచనలలో ప్రశస్తములైనవి. రఘునాథరాయలు, చేమకూర వేంకటకవి, కట్ట వరదరాజు, ముకుందయోగి, కృష్ణాధ్వరి, చెంగల్వ కాళయ, చల్లపల్లి రంగన్న, వెంకటాచల విలాసకర్త మొదలగువారి రచనలు తంజావూరాంధ్రరచనలలో మెచ్చఁదగినవి".

పై వారిలో, రఘునాథరాయలు, చేమకూర వేంకటకవి కృష్ణాధ్వరి, చెంగల్వ కాళయ తంజావూరివారే యనుట ఋజువైనదికదా. మిగిలిన వారినిగూర్చి కొంత వివరణ యావశ్యకము.

—: కట్ట వరదరాజు :—

ద్విపదరామాయణము[1], శ్రీరంగమహాత్మ్యము, పరమభాగవత చరిత్ర గ్రంథకర్తయగు వరదరాజు తంజావూరాస్థానికి సంబంధించినవాఁడు కాఁడు. వరదరాజు తాత కట్ట రంగప్పరాజు తోపూరు యుద్ధమున రఘునాథ రాయనికి తోడ్పడినట్లు తెలియుచున్నది. కాని యంతమాత్రమున వరదరాజు తంజావూరి యాస్థానియనుటకే యాధారములేదు. ఆతని ద్విపద[2] రామాయణప్రతి లిఖింపబడినకాలము మనకు తెలియదు. అది తంజావూరి పుస్తకభాండాగారము నందున్నందున షహాజికాలమున లేఖకులు పెక్కురు వ్రాసియుండుటచేతను ఆ రామాయణము ఆ కాలము ననే వ్రాయబడియుండును.

—: ముకుందయోగి :—

ఈతఁడు ప్రసిద్ధవైష్ణవాచార్యుఁడగు కందాళ అప్పలాచార్యుల వారి శిష్యుఁడు. దాక్షిణాత్యుఁడు కాఁడు.

1. ఈ ద్విపద రామాయణము నాలుగు సంపుటములుగా నిటీవల తంజావూరు సరస్వతీమహాలువారిచే ప్రకటింపఁబడినది. సంపాదకుఁడు ప్రస్తుత గ్రంథకర్త.

2. ఈ ద్విపద రామాయణమునకు నొక సంపూర్ణప్రతి. శేషాద్రిరమణ కవులలో నొకరగు శేషాచార్యులవారియొద్దనున్నట్లు తెలియుచున్నది.

## —: చల్లపల్లిరంగన్న :—

ఈతఁడు చల్లపల్లిరంగన్న కాఁడు. రంగన్న కొడుకు వెంకనార్యుఁడు. ఈతఁడు 'శ్రీకృష్ణవిలాసము' అను నాల్గాశ్వాసముల ప్రబంధము రచించియున్నాఁడు. ఇది వేంకటేశ్వరునికి కృతి. ఈతడు తంజావూరి వాఁడనుటకు నొకటే యాధారము కనుపట్టుచున్నది. ముందు పేర్కొనిన పోలూరి గోవిందకవిని యీతఁడు తన స్నేహితునిగా కృష్ణవిలాసావ తారికలో పేర్కొనినాడు.

వెంకటాచల విలాసకర్త యెవరో మనకు తెలియరాలేదు.

### మథురాపురాంధ్ర వాఙ్మయము

కుందుర్తి వెంకటాచలకవి కార్తికమహాత్మ్యములో తన్నుగూర్చి యిట్లు చెప్పుకొనియున్నాఁడు.

"మ. నను శ్రీవేంకట భూధరాధిపకృపా వాణీయకల్లోలసం
జనితానేక మహాప్రబంధరచనా సంశీలు, విద్వజ్జనా
వనపాండిత్యవిశాలు, పాండ్యధరణీపాల ప్రదత్తాశ్వకాం
చనచంచచ్చతురంత యానమణిభూషాళాలి నెంతేదయన్."

కార్తికమహాత్మ్య కృతిపతి తాతయగునల్లారెడ్డి స్కాందపురాణము నాంధ్రమున రచించెనని యీ పద్యమువలన దెలియుచున్నది.

క. శ్రీవేంకటాచలాధిప
దేవునికిన్ మంటపములు, దివ్యోత్సవముల్
గావించె; స్కాందమాంధ్రము
గావ త్రిలకృతి యొనర్చె ఘనతనహించెన్.

ఈ తెలుగు స్కాందమిప్పుడు గానరాలేదు.

కార్తిక మహాత్మ్యమందలి గద్య: ఇది యలమేలుమంగాసనాథ వేంకటనాథ నయూసమేధమాన చతుర్విధకవితాధురంధర శ్రీ

కరపంటవంశప్రశంసితోజ్జ్వలబల గోలులింగనృపపుంగవ భార త్యావలంబ ధైర్యబికాకర్భయశః పారావార పూర్ణతారానాధ తీర్థపురాధార వేంకటాచలభూపాల ప్రదత్తమహత్తరాంబరాభరణ కల్యాణపల్యంకికాది బహుబహూకరణ విరాజమానాసమాన సంపత్ప్రవర్తి శ్రీమత్తిరుమలయమునీషిపుత్ర ఆపస్తంబసూత్ర శాండిల్యగోత్ర పవిత్రసరసూరాయాపరకవివిధేయ కథాశుకవి వేంకటాచలకవి నామధేయ ప్రణీతంబైన కార్తికమహాత్మ్యంబును, నవరసాస్థప్రబంధంబునందు ప్రథమాశ్వాసము

### మధురమంగాపుంశ్చలీ లీలావిలాసము

మధురవాఙ్మయమునకు సంబంధించిన యీకృతి చినవెంగన్న కృతమని శ్రీ డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు (జూలై భారతి. 1953 పుట 31.) వ్రాసియున్నారు. కాని యిది వికటకవి గోపాలరాయ కృతమని శ్రీచల్లా రాధాకృష్ణ శర్మగారు తాము వ్రాసిన "మధురనేలిన తెనుగురాణి" అను వ్యాసమున వ్రాసినారు (భారతి సం. 30. సం. 10. పుటలు 332-338.)

### నరసభోజనుతి

ఇది మధురాపురాధీశ్వరిణియగు మంగమ్మదళవాయి నరసయామాత్యునిస్తుతి. సీసపద్యములు. యెవ్వకర్తృకమో తెలియదు. తంజావూరి పుస్తకశాలలో నున్నది. నరసయదళవాయి క్రీ. శ. 1702 లో మరవయుద్ధమున కీర్తిశేషుఁడయ్యెను.

### గజారణ్యసంహిత - కవిధాటి బలభద్రకవి.

గజారణ్యక్షేత్ర మనగా జంబుకేశ్వరము. ఇచ్చట శంకరాచార్య మఠమునకు విజయరంగ చొక్కనాథుఁడిచ్చిన దానమును వివరించు నొక తెలుఁగుశాసనము గలదు. ఆంధ్ర సాహిత్యపరిషత్తులో కర్త తెలియని గజారణ్యక్షేత్ర మహాత్మ్యము తెలుఁగువచనము గలదు. గజారణ్య సంహితయను పద్యకృతి నేడులభ్యమగుచున్నది, ఇందు

2 వ యాశ్వాసము మొదలు షష్ఠాశ్వాసము వఱకుగలభాగము పూర్వ ఖండముగా లభ్యమగుచున్నది. ఇది శ్రీగిరిగౌరరాజు బసవనకంకితము.

గ్రంథమందలి గద్యయిది: "ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాద లబ్ధకవితా పాండిత్య రామకవీంద్రపుత్త్ర కవిదాటిబలభద్రద్వినామకకవి ప్రణీతంబైన గుహారణ్యసంహిత పూర్వఖండంబున ద్వితీయాశ్వాసము.

# దక్షిణదేశీయాంధ్రవాఙ్మయము

## ప్రత్యేక వ్యాసములు - సూచికలు

1893. గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు. కవిజీవితములు. సూచన. ప్రౌఢప్రబంధకవులు. పుటలు 588-89.

1900. వీరేశలింగము పంతులుగారు ఆంధ్రకవులచరిత్ర. ద్వితీయ భాగము, తృతీయభాగము. 1950 ముద్రణము.

ఇందు క్రింది కవులను గూర్చి గలదు.

1. చేమకూర వేంకటకవి ద్వితీయభాగము పుట 243-252
2. కామేశ్వరకవి తృతీయ భాగము పుట 14- 23
3. సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు ,, ,, 22- 23
4. వెలగపూడి కృష్ణయ్య ,, ,, 29- 32
5. శేషము వేంకటపతి ,, ,, 32- 38
6. కోడూరి వేంకటాచలకవి ,, ,, 73- 76
7. నెల్లూరి వీరరాఘవకవి ,, ,, 89- 92
8. నంజరాజు ,, ,, 93- 94
9. కోటి వెంకనార్యుడు ,, ,, 94- 95
10. కుందుర్తి వెంకటాచలకవి ,, ,, 123-126
11. ధూర్జటి వెంకటరాయకవి ,, ,, 123-131
12. ముద్దుపళని ,, ,, 142-144

13. కస్తూరి రంగకవి ,, ,, 170-171
14. ఆలూరి కుప్పనకవి ,, ,, 171-174
15. గణపవరపు వెంకటకవి ,, ,, 206-215
16. అనంతార్యుడు ,, ,, 26[illegible]-270

1908. రఘునాథతొండమానుని పార్వతీపరిణయము. సరస్వతీపత్రిక ప్రకటితము. పీఠిక కొచ్చెర్లకోట రామచంద్రవేంకట కృష్ణా రావు.

1910. ఆంధ్ర రాజకవులు మానవల్లి రామకృష్ణకవి. ఆంధ్రపత్రిక ప్రథమ సంవత్సరాది సంచిక.

1912. ప్రాచీనాంధ్ర గద్యకావ్యములు. వేటూరి ప్రభాకర శాస్త్రి ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక. సంపు 2. సం. 1

1914. పరిషత్పుస్తక భాండాగారము. కొత్తపల్లి సూర్యారావు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సంపు. 3. సం 1. 2.

1917. తొండమాన్ వంశావళి. వెంకనకవి - సాంబశివకవి ఆంధ్ర సాహిత్య పరిషత్తు సంపుటము 6. పుట 197-212.

1924. విజయరంగ చొక్కనాథుడు మల్లాది సూర్యనారాయణ శాస్త్రి సారస్వత సర్వస్వము. సంపు. 1. సం. 3.

1925. తంజావూరి సరస్వతీమహాల్. వేమూరి విశ్వనాథశర్మ భారతి సంపు. 2 సం. 1. పు. 137-141.

,, నారాయణతీర్థులు. వేటూరి ప్రభాకరశాస్త్రి సంపు. 2. సం 7. పుటలు 147-148.

,, తంజావూరి రఘునాథరాయలు. వేటూరి ప్రభాకరశాస్త్రి స్వధర్మప్రకాశిని సంపుటము 3.

1927. నేపాళ చోళగశబ్దములు విజయవిలాసము. తాపీ ధర్మారావు భారతి సంపు. 4. సం. 9. పుటలు 1-8.

1928. నేపాళచోళగశబ్దములు – పునర్విమర్శనము. వేటూరి ప్రభాకర శాస్త్రి సంపు. 5. సం. 3. పుటలు 487-489.

,, చేమకూరవారి సారంగధర. తాపీధర్మారావు సంపు. 5. సం. 4. పుటలు 540 543.

,, పునర్విమర్శనమునకు ప్రత్యుత్థానము. తాపీధర్మారావు సం. 5. సం. 5. పుటలు 805-808.

,, దక్షిణాంధ్రవాఙ్మయము సూచన. కవిత్వవేది ఆంధ్రవాఙ్మయ చరిత్రసంగ్రహము. పుట 161.

1931. పరిషత్పుస్తక భాండాగారము – ద్వితీయ భాగము. ఆంధ్ర సాహిత్యపరిషత్తు. కొత్తపల్లి సూర్యారావు.

1933. విజయవిలాస వ్యాఖ్యావిధానము – తాపీధర్మారావు.

| | | | | |
|---|---|---|---|---|
| భారతి | సంపు. 9. | సం. 3. | పు | 405-411 |
| ,, | ,, | ,, | ,, 4. | ,, 548-552 |
| ,, | ,, | ,, | ,, 5. | ,, 753-759 |
| ,, | ,, | ,, | ,, 6. | ,, 925-931 |

1935. మధురవాణి – శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు. భారతి సం. 13. సం. 12. పుటలు 777-789.

1937. రామభద్రాంబ – శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు (గ్రంథచౌర్యము అనువ్యాసము. భారతి సంపు. 14. సం. 1. పు. 1-19.

,, మన్నారుదాస విలాసనాటకము – విమర్శ. శ్రీ. శే. జయంతి రామయ్యపంతులుగారు. అధునికాంధ్రవాఙ్మయ వికాసవైఖరి. 2-వ అధ్యాయము పుటలు 29-40.

1938. కృష్ణాధ్వరినైషధ పారిజాతీయము - శ్రీ వల్లా సత్యనారాయణ గారు. మదరాసు విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనాలయపత్రిక. సం. 2. భాగము 2. పుటలు 17-21.

1941. ముద్దుపళని కవిత్వములోని రసస్యందము - చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారు. భారతి సంపు. 17. సం. 12. పుటలు 707-710.

,, వాల్మీకిచరిత్ర - పీఠిక. నిడదవోలు వేంకటరావు. ఆంధ్రవిజ్ఞాన సమితి ప్రకటితము.

1943. దక్షిణాంధ్రయుగము. క్రీ. శ. 1600-1775. ఆంధ్రవాఙ్మయ చరిత్రము ఆంధ్రసర్వస్వము. పుటలు 295-298. శ్రీ పింగళి లక్ష్మీకాంతము.

1949. నారాయణతీర్థులు - శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి. భారతి రజతోత్సవ సంపుటి. పుటలు 277-280.

1951. ఆంధ్రవైష్ణవ వాఙ్మయము - పోషణ. నిడదవోలు వేంకటరావు రెడ్డిరాజుల ఆంధ్రవాఙ్మయపోషణ. భారతి సం. 27. సం. 12.

1952. దక్షిణదేశము. తంజపురాంధ్ర నాయకరాజు రఘునాథనాయకుడు - నిడదవోలు వేంకటరావు. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి షష్టిపూర్త్యుత్సవ సమ్మాన సంపుటము పుటలు 180-203.

,, శ్రీనారాయణతీర్థులు - స్వామి శివశంకరులు. [illegible] పుటలు 66-72.

,, సభాపతయ్య పదములు - తిమ్మావఝ్ఝుల కోదండరామయ్య భారతి సం. 28. సం. 2. పుటలు 159-169.

,, క్షేత్రయ్య - తిమ్మావఝ్ఝుల కోదండరామయ్య భారతి సం. 28. సం. 8. పుటలు 78-86.

1952. కంఠీరవరాజు యక్షగాన కృతులు - నిడుదవోలు వేంకటరావు.
భారతి సం. 28. సం. 10.
,, ,, ,, ,, 11.

,, బెంగుళూరినిర్మాత పెదకెంపరాయఁడు - నిడుదవోలు వేంకట
రావు. భారతి సం. 28. సం. 2.

1953. మైసూరి చెన్నపట్టణనిర్మాత ఇమ్మడి జగదేవరాయఁడు - నిడుద
వోలు వేంకటరావు భారతి సం. 29. సం. 1.

,, మహోరకపదకవి వంగలసీనయ-తిమ్మావఝ్ఝుల కోదండరామయ్య
భారతి సం. 29. సం.2. పుటలు 107-116.

,, బిరుదుకవుల యుదంతములు - ఆంధ్రపాణిని ని. వేంకటరావు
నందన సంవత్సరాది సంచిక పుటలు 111-113.

1953. దక్షిణాంధ్రయుగము రఘునాథరాయలు - డాక్టరు. కే.వి.ఆర్.
నరసింహము ఎమ్.ఏ. పి.హెచ్.డి. సంస్కృతి. సం. 1 సం. 3
పుటలు 28-32.
,, ,, ,, సం. 1 సం. 6 ,, 18-21.
,, ,, ,, సం. 1 సం. 7 ,, 15-20.

1954. విజయరాఘవుని యాస్థానకవులు ,, 1 సం. 11 ,, 21-23.
,, ,, ,, 1 సం. 12 ,, 16-19.

—: వ్యాసములు - వాఙ్మయము :—

1. అరవదేశమందలి ఆంధ్రవాఙ్మయము - అక్కిరాజు ఉమాకాంతముగారు. ఆంధ్రసాహిత్య పరిషత్తు. సం. 2 పుటలు 72-91. ఇది వేఱెపుస్తక రూపమున ప్రకటితమైనది 1912.

2. ఆంధ్రదేశపు దక్షిణభాగాంధ్ర కవులు - వెన్నెలకంటి అప్పారావుగారు. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక 1913. పుటలు 113-117.

3. చోళదేశాంధ్ర ప్రాబల్యము - హరిసేతు రామయ్యగారు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక. సం. 6 సం. 4 1918.

4. తంజాపూరి మహారాష్ట్ర రాజులు – సంస్కృతాంధ్ర వాఙ్మయ చరిత్ర, నిడుదవోలు వేంకటరావు చంద్రిక 1934-1935. 4 సంచికలు.

5. తంజాపురాంధ్ర వాఙ్మయము – ఆంధ్రనాయకరాజుల పరిపాలనము (1535-1673) ఆంధ్రసాహిత్య పరిషత్తు రజతోత్సవ సంచిక. పుటలు 151-164. 1936.

6. 17–వ శతాబ్దినాటి ఆంధ్రవాఙ్మయ విశేషాలు - డాక్టరు నేలటూరి వేంకటరమణయ్య. భారతి సం. 23 సం. 2 పుటలు 107–116. 1948.

7. దక్షిణదేశమండలి ఆంధ్రవాఙ్మయము - శ్రీ త్రిశేషులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. భారతి రజతోత్సవసంపుటము. పుటలు 346–353. 1949.

1953. మధుర తంజావూరురాజులనాటి దాక్షిణాంధ్ర సాహిత్యము - డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు.
భారతి సం. 30 సం. 7 పుటలు 157–165.
,, ,, ,, 8 ,, 26-32.
,, ,, ,, ,, 9

,, తంజావూరి మహారాష్ట్ర భూపతులు ఆంధ్రసాహిత్యము - శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మ సం. 30 సం. 12 పు 406-504.

1954. ,, ,, 31 ,, 1 పు 32- 41.

,, మధుర తంజావూరు నాయకరాజులనాటి యాంధ్రవాఙ్మయము- డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు,
సం. 31 సం. 2 పు 142–152.
,, ,, ,, ,, ,, 3 పు 229-241.

—: చారిత్రక గ్రంథములు :—

1. తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర - కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారిచే ప్రకటితము. మద్రాసు 1914.

2. తంజావూరాంధ్ర నాయక రాజ చరిత్ర-కురుగంటి సీతారామయ్య గారు ఎమ్. ఏ. ఆంధ్రగ్రంథమాల మద్రాసు 1931.

3. తంజావూరి సరస్వతీమహలు గ్రంథాలయమునందలి తెలుగు పుస్తకముల పట్టిక.

   A descriptive Catalogue of Telugu Manuscripts in the Tanjore Maharajah Serfoji Saraswati Mahal Library Tanjore 1933.

4. సింహాళ విజయము - శ్రీ యన్. యస్. సుందరేశ్వర రావుచే సంపాదితము.

   (Bulletin of the Government Oriental Manuscripts Library Madras) Vol. II Part I Pages 72-91. 1949.

—: వాఙ్మయము :—

1. కొందఱు తంజావూరి కవులు, పండితులు. శ్రీ కురుగంటి సీతారామయ్యగారు. హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్ప్రకటితము. ఇందులో పుటలు 124 నుండి 185 వఱకు తెనుగు వాఙ్మయమును గూర్చి గలదు. 1943.

—: వ్యాసము :—

మధురనేలిన తెలుగు నాయకరాజులు-శ్రీ దిగవల్లి వెంకట శివరావు, భారతి సం. 22 సం. 3 పుటలు 290-296.

,, ,, ,, 4 ,, 362-369. 1947.

## —: ప్రబంధములు :—

అముద్రితగ్రంథ చింతామణి ప్రకటించినవి.

1. మిత్రవిందా పరిణయము - కుందుర్తి వేంకటాచలకవి 1888.
2. ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము - గణపవరపు వేంకటకవి 1892.
3. యాదవరాఘవ పాండవీయము - నెల్లూరి వీరరాఘవకవి 1887.
4. వసుంధరా పరిణయము ,, 1904.

సరస్వతి పత్రిక ప్రకటించినవి

5. పార్వతీపరిణయము - పుదుకోట రాయరఘునాథ తొండమాన్ మహీపాలుడు.
6. వాల్మీకి చరిత్రము - తంజావూరి రఘునాథుడు.

చాటువులు.

శృంగార గ్రంథమాలవారు ప్రకటించినవి. చిన్న పీఠికలతో సర్వాంగసుందరముగా వెలువడినవి.

7. శృంగారసత్యభామాసాంత్వనము - లింగనముఖి కామేశ్వరకవి.
8. శృంగారాహల్యా సంక్రందనము - సముఖము వేంకట కృష్ణప్పనాయకుడు.
9. శృంగారసావిత్రి - రఘునాథుడు.
10. శృంగార గాధేయోపాఖ్యానము - ఒక ఆశ్వాసము మాత్రము. సంఖ్య 6. 1929.
11. కామకళానిధి - నెల్లూరి శివరామకవి. (ఇది యవతారికతో కూడ ముద్రితమైనది, 1926.

శృంగారకావ్య గ్రంథమండలి - బందరువారు ప్రకటించినవి.

(1)

1. రాధికా సాంత్వనము - శ్రీ వెంపటి నాగభూషణముగారు (ముద్దుపళని) పీఠిక 1937.

2. సత్యభామా సాంత్వనము - నిడుదవోలు వేంకటరావు పీఠిక 1938. (2)

3. అహల్యా సంక్రందనము.
ఇందులో (3)
1. రాధికా సాంత్వనము. (సముఖము)
2. సారంగధరచరిత్ర వచన భాగము కొంత
} శ్రీ మల్లాది రామకృష్ణ శాస్త్రి, పీఠిక 1938.

4. శశాంకవిజయము ,, 1941.

ఆంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రకటించినవి.

1. జైమినీ భారతము వచనము - సముఖము వేంకట కృష్ణప్ప నాయకుఁడు.

2. మన్నారుదాస విలాసము యక్షగానము - రంగాజమ్మ, 1926.

3. రాయవాచకము వచనము - విశ్వనాథనాయకుని స్థానాపతి, 1933.

4. రఘునాథరామాయణము ప్రబంధము రఘునాథుఁడు, 1940.

5. కవిజనోజ్జీవని - పుదుక్కోట తొండమాన్ రఘునాథరాజు, 1937.

6. 1950 నుండి మదరాసు ప్రభుత్వమువారును, తంజావూరి సరస్వతీ మహలు గ్రంథాలయమువారును ప్రకటించిన గ్రంథములు.

మదరాసు.

1. ఖడ్గలక్షణ శిరోమణి-నవనప్పరచితము, సంఖ్య 14. ఆంగ్లాంధ్ర పీఠికలు. పీఠికాకర్త, పరిష్కర్త నిడుదవోలు వేంకటరావు, పీఠకలు 28 పుటలు.

2. బ్రహ్మవిద్యా సుధార్ణవము - పరమానందయతి, సంఖ్య 88. పరిష్కర్త శ్రీ వేమరుమూడి కృష్ణారావు, విపుల పీఠిక లేదు.

3. రాగతాళచింతామణి - పోలూరి గోవిందకవి రచితము, సంఖ్య 89. పరిష్కర్త సంగీత కళానిధి - టి. వి. సుబ్బారావుగారు, విపుల పీఠిక లేదు. తొలిపలుకులు మాత్రమే గలవు.

తంజావూరు.

1. రఘునాథనాయకాభ్యుదయము, రఘునాథాభ్యుదయము } విజయరాఘవ నాయకుఁడు, సంఖ్య 32.

పరిష్కర్తలు (1) శ్రీడాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు, ఆంగ్లేయభాషా పీఠిక 37 పుటలు. (2) శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, తెలుఁగుభాష పీఠిక 67 పుటలు.

2. రాజగోపాల విలాసము-చెంగల్వ కాళకవి. సంఖ్య 33. పరిష్కర్త నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ. ఆంగ్లేయభాషా పీఠిక 25 పుటలు. తెలుఁగుభాష పీఠిక 49 పుటలు.

3. ద్విపద రామాయణము - కట్టావరదరాజు, నాలుగు సంపుటములు. } సంఖ్య 56, 57, 58, 59.

పరిష్కర్త నిడుదవోలు వేంకటరావు ఎమ్. ఏ. ఆంగ్లేయ భాషా పీఠిక 11 పుటలు. తెలుగుభాష పీఠిక 92 పుటలు.

4. తాళదశప్రాణదీపిక - పోలూరి గోవిందకవి, సంగీత కళానిధి కే. వాసుదేవశాస్త్రి, వి. సుందరశర్మ గార్లచే పరిష్కృతము. ఆంధ్రాంగ్లపీఠికలు, తాళప్రస్తార వివేచనములు గలది.

5. విప్రనారాయణ చరిత్ర-విజయరాఘవ నాయకుఁడు, సంఖ్య 63. వి. సుందరశర్మ, ఆ. మహాదేవశాస్త్రిగార్లచే పరిష్కృతము. విపుల పీఠిక లేదు.



PRINTED AT THE CAXTON PRESS, MADRAS.